

చెన్నపట్టణము, సెప్టెంబరు ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము భాద్రపదమాసము సంఖ్య ౯

# దండియాత్ర

అల్లంరాజు రంగనాయకులుగారు

అతఁడు యాత్రార్థ మరుదెంచునవసరమున
నలినజాండము నవ్విన నవ్వుఁ గాక!
అతఁడు శ్రీరామచంద్ర దివ్యాంఘ్రి నీర
జాత యుగ్మము మానససరసి నిలిపి
సతము పూజించి యానందసాగరమున
నోలలాడెడు భాగవతోత్తముండు!
అతఁడు శైశిరకంటక మాజగంబు
వంత లుడుపఁగ వచ్చు వసంతమూర్తి;
అతఁడు మూఢాంధ్య జీమూతవితతిఁ జీల్చి
బయలు వెడలిన సుజ్ఞానభాస్కరుండు!
అతఁడు చిరతరక్షామ పీడితజనాళి
తనివిదీరు నన్నంబును తఱుఁగు విఱుగు
గనని వస్త్రనిర్మాణమ్ముఁ గరగతమ్ముఁ
జేయ నేతెంచు ప్రేమార్ద్రశీతకరుఁడు!
అతఁడు తనచుట్టు మూఁగు భారతుల నెల్లఁ
బ్రేమ హర్షమ్ము లాననసీమ వెలుఁగ
నభయహస్తాల లాలించి, యక్షరమగు
నాత్మవిద్యను బోధించి యాదరింప
నుద్భవించిన పరమ గురూత్తముండు!
అతఁ డనాదిగ వచ్చెడు నంటరాని
తనము నణఁపఁగ నరుదెంచు ధర్మమూర్తి;
అతఁ డైకమత్యాది భాగ్యములఁ బ్రజల
కొదవఁ జేయంగఁ దోఁచు లోకోత్తరుండు!

అతఁడు ప్రతిదివసాంతనిశాంతసమయ
రామ నామగానామృతరసములోనఁ
బరవశతఁ జెంది, దరి నున్నవారిఁ గూడ
దద్రసమ్మును ద్రావించి తనియఁ జేయు
మధురపీయూష ప్రహ్లాదమానసుండు!
ఆతఁ డేయుగంబులనేని యరయఁబోని
యాయుధ విసర్జనాంచితోపాయ మరసి,
యసమతమ శాంతిసమరవిద్యావరమ్ము
నీయఁ జనుదెంచు మౌనిరాజేశ్వరుండు!
ఆతఁ డున్నతధీరుఁడు; వీతరాగుఁ;
డాతఁడు గభీర భావోదయాంతరంగుఁ;
డతఁడు పురుషోత్తముండు మహాత్ముఁ; డతఁడు
సర్వ సంగపరిత్యాగి సత్యయోగి!

* * * *

అది మనో విశ్వసౌభాగ్య మాక్రమించు
క్రోధలోభాది శాత్రవ యోధరాజి
దివ్యశాంతపాశాల బంధించివైవఁ
దరలి యేఁతెంచు నాత్మీయ దండయాత్ర!
విశ్వశోభనముగా విజయమ్ము నొంది
స్వాతంత్ర్య భారతసామ్రాజ్య దివ్య
సింహాసనముపైని 'శ్రీ'భారతాంబ
నధివసింపఁగఁ జేసి యతులితా నంద
శరధిని దేలిచ్చి, చిరదాస్యతాప
హాలాహలానల మార్పి వేయంగ,
నా బాలగోపాల మండలిలోని
మాతృదేవీ ప్రేమమహిమను రేపి-,
మానవు పాలి జన్మస్వతంత్రతను
కన్నుల పండువుగాఁ గనఁ జేసి
హృదయహర్షమ్ముగా నొదవఁ జేయంగఁ
దలపోసి, సకలజీవుల మేలుకొలిపి
పరమేశ్వరునిమీఁద భారమ్ము వైచి
ధ్యానించి పూజించి, తన్మయలీల
సృష్టియే తనతోడఁ జేరి యేతేర
నమరులు ప్రేమతో నాశీస్సు లంప
విశ్వదుందుభి మ్రోయ విరివాన కురియ
సత్యాగ్రహోద్యమస్యందనం బెక్కి-,
అరచేత వడుకునూ లలుగులు మెఱయ
కుతుకమ్ముతో నేఁగు కువలయయాత్ర!

* * * *

ఆతఁ డేదెస కరిగిన నచటి జనులు
జయ జయారావములతోడఁ జదలు నింపి
వేలు లక్షలు గుమిగూడి వినతి పత్త్రి
రాసు లర్పించి, కాంచన రత్నభూష
ణావళులు, దివ్యవసనమ్ము, లర్థనిచయ,
మలరు దండలు, కర్పూర హారవార
మమ్మహాత్మున కందించి, యమలనుతుల
హారతు లొసంగుదురు విహాయసము వెలుఁగ!
అతని యాజ్ఞ శీర్షమ్ముల నవధరించి
పవలు రేలును విశ్రాంతిఁ బడయకుండ
నెన్ని కష్ట పరంపరలేని దాల్మిఁ
బ్రమదమున నోర్చి, దేశ సేవనముకొఱకుఁ
బ్రతిఫల మ్మిసుమంత కోరకయె తమకుఁ
గల సమస్తముఁ గూడఁ ద్యాగమ్ము చేసి
జీవములనైన బలినీయ సిద్ధపడుచు
దీక్షఁ బని చేయుదురు ధరిత్రీజనమ్ము!

అతని శిష్య ప్రశిష్యు లాహవములోన
శాంతి జయ కేతనాల హస్తాలఁ బట్టి
స్త్రీపురుష భేదమే లేక తెలివిఁ గాంచు
భరత మాతృకశిసువు లాబాలవృద్ధు
లెదిరి సేనాను లదయులై యేర్పరించు
మర ఫిరంగుల కెదురేఁగి యురము లొడ్డి
యదరు బెదరును లేక ప్రహ్లాద మొలయు
మదులతో నిల్తు రెదిరి విస్మయము చెంద!

అతఁడు పన్ని నవ్యూహమ్ములందుఁ గుందు
వైరికోటు, లా నిఖిల ప్రపంచపూజ్య
రక్షణము వేఁడఁ, గారుణ్యరసము చిందు
సహజమందహాసమ్ముతో శాత్రవులకు
నభయదాన మొ్మసంగి, యత్యంత సుఖము
తోడి సుగుణసమృద్ధియుఁ దోడరఁ జేయు!

అతఁడు నివసించు భూముల నంబుదంబు
లవిరతమ్ముగఁ గురియు; సస్యాళి పండు;
తరుల తాదులు ముదముతోఁ దలల నెత్తి
విరియు నయనాల తావుల వీచుచుండు!

కిసలయమ్ములఁ గడుపార మెసవి మెసవి
పలుకుఁ దేనియ లొలుకు కోయిలలగుంపు;
ప్రణయ సుస్వరగీతాలఁ బాడుకొనుచుఁ
బుష్ప రజముల కేళిలోఁ బ్రొద్దుపుత్తు
రళికుమారులు; శుకశారికాదివిహగు
లరమరలు లేని మనముల నరసి కొనుచు
వెఱ్ఱి కేకల నొండొరుఁ బిలుచుకొనుచు
మధుర ఫలముల విందుల మరగియుంద్రు!

ఆమహత్తర శాద్వల సీమలందు
తర్ణకములకు కంస విధ్వంసిమీఁద
సేవా కతలు వచించుచు గోవితాన
మురుతర క్షీరధారలఁ గురియు చుండు!

స్వర్గవాసులు, తారు పూర్వభవసుకృత
వాసనా తారతమ్య వైభవము లందు
చుందు రే కాని, యాలబిత్తోర్వి నుండు
ప్రజ నితాంత మోదాన సర్వప్రపంచ
సౌఖ్యములుగూడ ననుపమ సమతతోడ
ననుభవించుచు, బ్రహ్మచర్య వ్రతంబు
సర్వకాలంబులందు నిశ్చలత తోడ
సలుపుచుందురు సురలు మచ్చరపడంగ!

అమ్మహాత్ముడు మెట్టిన యడవులందుఁ
గ్రూరమృగములు సయిత మక్రూరమతులఁ
జెలిమితళుకొత్తుభావాలు చివుళు లెత్తఁ
గలిసి మెలఁగుచు నిజవైరములను మఱచు!

ఎన లేని కనఁబోని యీవిచిత్రములఁ
గనుఁగొన మనమునఁ గౌతుక మొదవఁ
దారలే కనులుగాఁ దనతనువెల్లఁ
బులకించు గగనమ్ము మునిమాపువేళ!

సంగతోత్తుంగతరంగ హస్తాల
నాకాశవీథుల నంటఁ బై కెత్తి
యమృత శీకరముల నౌదలఁ జల్లి,
విశ్వమం దెల్లెడ విజయ మొందంగ
శుభయోగ భోగముల్ చూఱకొనంగ
దయ నెప్డు దీవించు దండిసాగరుఁడు!

---

# కటపయశబ్దార్థ శబ్దస్వరూప విచారము

వేదము వేంకటాచలముగారు

## ౩-వ వ్యాసము

ఉపరి (౨ వ వ్యాసమునందు) నిర్దిష్టములైన భాషలనుగుఱించి కొంచెము వివరణము చెప్పవలసియున్నది.

### (మన) సంస్కృతము

ఈ భాషకు ఈ పేరు ఎపుడు కలిగినదనిగాని, ఎట్లు కలిగినదనిగాని తెలియలేదు. ఇయ్యది యన్వర్థ నామము. కృత్రిమము-సంస్కరింపబడినది, గాన సంస్కృతము — ఈ సంస్కరణమును ఎవరు చేసిరి? ఎపుడు చేసిరి? ఒకటి నిశ్చయము. ఈ సంస్కరణమును 'తర్క-వ్యాకరణాధ్యనీనధిషణులే' చేసియుండవలెను. ఇతర భాషల నామములు తఱచుగ నాయా దేశములయు, దేశస్థులయు నామముల ననుసరించి యుండును. ఇంగ్లీషువారు-ఇంగ్లండుదేశము-ఇంగ్లీషుభాష, జర్మనువారు - జర్మనీదేశము - జర్మనుభాష, ఆంధ్రదేశము - ఆంధ్రులు-ఆంధ్రభాష, ఇటువలె ఇతరములును.

సంస్కృత మను పేరు ఇట్టిదికాదు.

దీని యసంస్కృత పూర్వరూప మెట్టిది యని తెలియలేదు. సంస్కృతభాషను గీర్వాణవాణియని వాడుకలో చెప్పుట కలదు. ఈబిరుదు ఈ భాషయొక్క పూర్వరూపమునకా లేక పరరూపమునకా? రెంటికిని కాదని తెలియవలసియున్నది. మానవకోటిలో చేరిన పండితులచే సంస్కరణము నపేక్షించునంత యపరిష్కృత స్థితిలోనుండిన భాషనా గీర్వాణులు వాడుచుండిరి? గీర్వాణవాణి యట్టి దుస్స్థితిలో నుండునా? బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, లక్ష్మీ పార్వతీ దేవతలు, అందఱికన్న నెక్కువ, వాఙ్మయప్రపంచమునకు రాణి యగు సరస్వతీ దేవియును, అప్రశస్తమయిన జఘన్యభాషను వాడుచుందురా? అట్లుండదు. కానిచో, నింకొక విశేషము. ఈపూర్వరూపము మనకుగా సంస్కరింపబడినది. ఊర్ధ్వలోకములో నిప్పటికిని గీర్వాణులు ఆ పూర్వరూపమునే వాడుచునుండవలెను. కాక ఈ 'సంస్కారాపూర్వము' గీర్వాణులు తమ స్వభాషను విడిచి మనభూమిలో చేరి వారాణసియందో, నవద్వీపములయందో గురుకులవాసము చేసి అష్టాధ్యాయిని, మహాభాష్యమును చదివి సంస్కృతమును వాడుకచేసికొని ఊర్ధ్వలోకమునందు వ్యాపింపజేసి సరస్వతీదేవికి పాఠము చెప్పినారా? లేక, పాణిన్యాదులు ఊర్ధ్వలోకమును చేరినపిదప నచ్చట వ్యాకరణపాఠప్రవచనములను జేసినారా? ఇందులకు ప్రమాణ మేమియు కానరాదు. అట్లు జరగియుండినను మనుష్యవాణిని గీర్వాణులు స్వీకరించిరా యనవలయును గాని గీర్వాణవాణి మనుష్యులకు చేరినదని చెప్పుటకు లేదే. కావున నీపరరూపమయిన సంస్కృతముకూడ గీర్వాణభాష కాజాలదు. మఱియు గీర్వాణులే తమభాషను చక్కజేసి మనకు అందజేసినారా? అట్లుండినయెడల గీర్వాణభాషయను నామనిర్దేశముతో మన కిచ్చియుందురు గాని, సంస్కృతమని చెప్పియుండరు. ఇదియును గాక, వారికి వాడుకలో నొక యసంస్కృత మయిన భాష కలిగియుండెగదా వారు దానిని సంస్కరించియుందురు? అట్లుండునా? కావున నీసంస్కృతభాషను గీర్వాణమనుట తప్పు. ఈ వాడుకకు కారణ మొకటి చెప్పతగియున్నది. సంస్కృతవిద్యలకు అధికారులు భూసురులుగా నున్నందున నీదేవతలభాష 'భూగీర్వాణభాష' యనుట సమంజసము. కాలక్రమమున ఈ 'భూ' ఎగిరిపోయినది. తెనాలిరామలింగకవి 'శ్రీభూపుత్రి వివాహవేళ...' అను వాక్యమును చూచి పరిహాసమాడుచు నేలమీద 'శ్రీ' అని వ్రాసి వెంబడిగా 'భూ' అని భూత్కారముచేసి 'నీశ్రీ ఎగిరిపోయినా'దని రామరాజభూషణకవికి చెప్పినట్లు ఇతిహాసము కలదు,

అక్కడ 'శ్రీ' ఎగిరిపోయినది, యిక్కడ 'భూ' పోయి నది. ఈద్వయము మహావిష్ణువును చేరిపోయినది.

ఈసంస్కృతభాష యితరభాషలవలె మనుష్య భాషయే యని చెప్పవలెను.

సంస్కృతములో నితరభాషలతోపాటు అన్య దేశీయములు పెక్కులు గలవని చెప్పియుంటిమి. ఈవిష యమును అంగీకరించుట మనవిద్వాంసులకు దుర్లభము. ఏమనగా, దీనినిగుఱించిన మఱియొకభ్రమ కలదు. ఈ సంస్కృతమును వాడుచుండినవారు సృష్ట్యాదినుంచియు ఈ భరతఖండములో నేయుండిరనియు,-మూడుప్రక్కల అగాధమైన సముద్రము, ఒకవైపు అలంఘ్యమగు పర్వత పరంపర, ఈ సాంస్కృతికు లాకర్మభూమిని విడిచి మ్లేచ్ఛాదులభూములకు పోవువారు కారు, వారికా యాత్రలు చేయువారును కారు. మఱియు వీరికి తెలియని దేమున్నది? ఇట్టిపరిస్థితిలో ఈ భాషకు సాంకర్య మెట్లు కలుగును? అని శంకింతురు. ఇది ప్రాచీన దేశచరిత్రములను (అనగా హిస్టరీ), భూగోళవృత్తాంతము లను తెలియనిదోషము. ఈ విషయమై సవిస్తరముగ యథాస్థితిని ప్రతిపాదించుటకు గ్రంథబాహుళ్య మగును. ఇచ్చట చెప్ప వసతి లేదు. సంగ్రహముగా కొంత చెప్పి విరమింతుము.

ఈ భూగోళసందర్భములను తెలియనివారు ఈ క్రింది విషయములను బోధపఱచుకొనుటకు పాఠశాలల కొఱకు నిర్మితములయిన దేశపటములను శ్రద్ధతో చూచుట అపేక్షణీయము. ప్రాతకాలమందు తెలిసియుం డినభూమి మూడుఖండములుగా విభక్తమయియున్నది. ఆసియాఖండము, పశ్చిమమున గ్రీకుసముద్రతీరములనుండి చీనాదేశపు తూర్పుసముద్రములవఱకు గలదు. భరతఖండ మును, దానికి పడమర పారసీకదేశమును, అంతకు పశ్చి మము అరబ్బీదేశమును, దానికి ఉదఙ్ముఖముగ నుండి తురు ష్కుల ఆసియా అని చెప్పబడు దేశమును, ప్రాచ్యర్ధ మున మధ్యఆసియాభాగమును, దానికి తూర్పు చీనా దేశమును, ఆదేశమునకు దక్షిణమున నుండు భూములును, ఇవన్నియు ఆసియాఖండము. ఈభూభాగమునకు పశ్చి మమున నుండెడు ఖండమునకు 'యూరోపు' అని పేరు. యూరోపునకు దక్షిణముగను, మన పశ్చిమసముద్రము నకు పశ్చిమముగను గల గొప్ప భూభాగమునకు ఆఫ్రికా ఖండ మని పేరు.

ఈఖండములకంతటను పూర్వకాలములో విద్య లను, నాగరికతను నేర్పి మహదైశ్వర్యములో నుండి దీర్ఘ కాలము ప్రఖ్యాతిని గాంచి రూపుమాసిపోయినవి రెండు గొప్పదేశము లుండినవి. ఒకటి ఆఫ్రికాలో జేరిన ఈజిప్టు దేశము. మఱియొకటి పారసీక సంయుక్తాగ్ర గుడము నకు ఉత్తరముగ పర్వతములవఱకు నుండు భూమి. దీనికి గ్రీకులు 'నదీమధ్య'మని పేరు పెట్టిరి. దీనియందలి దక్షిణ భాగమునకు బాబిలోనియా అనియును, కాల్డియా అని యును నామనిర్దేశము. ఇచ్చట క్రీస్తుశకమునకు నాలుగు వేల సంవత్సరములకు ముందునుంచియు రాజ్యము లేర్పడి, దినదినప్రవర్ధమానములయి అపరిమేయమయిన వృద్ధిలో నుండినవి. వీరినాగరికతయు తదనుకూలముగ నుండినది. కాలక్రమమున నీబాబిలోనియములలోనుండి కొందఱు చీలిపోయి ఆదేశములో నీశాన్యభాగమునందు ఒకచిన్న రాజ్యమును ఏర్పఱచిరి. దానికి అస్సీరియా అని పేరు.

ఇది కొంతకాలమునకు కడు వృద్ధి కెంది యితర రాజ్యములను బాబిలోనియను దేశమునుకూడ ఆక్రమించి సామ్రాజ్యమును పొందినది.

ఆఫ్రికాఖండములోని ఉత్తరభాగములో తూర్పు ప్రక్కన జగత్ప్రసిద్ధమయిన ఈజిప్టుదేశము కలదు. ఈ దేశమునకు భరతఖండములో పూర్వసంప్రదాయ నామ ములు మద్రదేశమనియు, మిశ్రదేశమనియు, క్షేమదేశ మనియు కలవు. ఆనామములు ఈదేశమునకు సంబంధిం చినవని ఈవల ఎల్లరును మఱచినారు.

ఒకకాలమందు ఒకపారసీకచక్రవర్తి ఈ మిశ్ర దేశములోని కొంతజనసమూహమును బందీకృతులను జేసి వారి సంతతిని కాశ్మీరప్రాంతములలో నివేశింపజేసి విడిపించినాడు. వారు ఇక్కడ చాల వృద్ధిపొందినారు. క్రమేణ ఈదేశములో అప్పటప్పటికి చేరుచుండు జన ములలో లీనమయి 'హిందువు' లయిపోయినారు. పూర్వచరిత్రము ఇప్పటికిని ఆభాగములోని నామధేయ

ములలో నిలిచియున్నది: మిశ్రబ్రాహ్మణులు - పండిత మిశ్రుడు, కృష్ణమిశ్రుడు, క్షేమరాజు, క్షేమేశ్వరుడు, ఇత్యాదులు.

'ఈజిప్టు' అనునది ఆదేశస్థులు తమకు తాము పెట్టుకొనినపేరు కాదు-గ్రీకులు పెట్టినది. ఆదేశస్థుల సొంతభాషలో తమదేశమునకు 'కెం' అనుపేరు వాడుచుండిరి. ఆమాటకు అర్థము వారిభాషలో నల్ల (రేగడి) భూమి. ఇది భరతఖండములో 'క్షేమ' అని మారినది. మిశ్రశబ్దమును మద్రశబ్దమును హీబ్రూలు పెట్టిన పేళ్లనుండి మారుపు. ఈ యీజిప్టుదేశచరిత్రమును ఇప్పటికి ఏడువేలసంవత్సరములకు ముందుకాలమునుంచి, జరగిన దానిని జరగినట్లు, మహనీయులు యూరోపు విద్వాంసులు అత్యద్భుతముగ బయటతీసియున్నారు. ఈ ప్రాచీనులనాగరికత అపారముగ నుండినది. వీరివృద్ధి ముందా, లేక బాబిలోనియములవృద్ధి ముందా అని యిప్పటికిని నిశ్చితార్థము కాలేదు. ఈ రెండురాజ్యముల జనములకును తత్తత్కాలములయందు భరతఖండములో నుండిన జనములకును పురాతనమయిన వాణిజ్యవ్యాపారములు క్రయవిక్రయములు జరుగుచువచ్చినవి.

ఇట్లు గల దేశములలో ఈజిప్టుదేశమును విహాగా ఆసియాఖండములో పడమటిసముద్రమువఱకు నుండు భూముల నంతయు క్రీస్తుశకమునకు ఆఱునందలసంవత్సరములకు ముందు 'చాయమాన' వంశవర్ధనుడు, అవతార పురుషుడువని చెప్పబడుచుండిన 'కురుష్' అనుచక్రవర్తి యుద్ధములలో జయించి యేలుచుండెను. నాటనుండి ఆభూము లన్నియు పారసీకప్రభుత్వములో కొన్ని శతాబ్దము లుండినవి. ఈకురుష్‌చక్రవర్తికి అనంతరము ఆవంశస్థులు ఇంకను విజయము పొంది, ఆఫ్రికాలోని ఈజిప్టుదేశమును, భరతఖండములోని పాశ్చాత్యభాగమును స్వీకరించి, క్రీస్తు శకమునకు ముందు మున్నూటముప్పది సంవత్సరములవఱకు భరతఖండములోని సింధునదికి పశ్చిమముగానుండిన ఆసియాఖండము నంతయును, ఈజిప్టుదేశమును కూడ నేలుచుండిరి. అప్పుడు ధూమకేతువు తోచినట్లు 'అలెగ్జాండరు' అను ప్రతిభావంతుడు, యవనరాజన్యుడు, ముప్పది సంవత్సరములవయస్సునకు లోబడినవాడు, దండయాత్రల నారంభించి దిగ్విజయము చేసి, పారసీకరాజ్యములో చేరిన అన్నిభూములను యుద్ధములలో జయించి ఆక్రమించి పారసీకనామము లేకుండ జేసినాడు. అతడును, అతనిసైనికులును మన సింధుదేశములో పదిమాసము లుండిరి.

ఈలోకములో సముద్రమునకు మొదట సేతువును నిర్మించినవాడు ఈతడు. నలుడును నీలుడును సిమ్మటు చేసినవారు. తనశాస్త్రధర్మలబ్ధమయిన రాజ్యమును ఏలుట కుపక్రమించుటకు ముందే ఈప్రభువు లేతవయస్సులో చనిపోయినాడు. ఈతడు జయించిన రాజ్యములలో రాజకొమారితలను పాణిగ్రహణము జేయుచువచ్చినాడు. వారిలో నిరువురు మిక్కిలియందకత్తెలని ప్రఖ్యాతి గాంచినవారు. ఒకామె ఈతనిచేత పరాజితుడయి ప్రాణములను కోలుపోయిన పారసీక చక్రవర్తి కూతురు. ఆమెపేరు గ్రీకుచరిత్రములలో 'స్తతీరా' (సత్యా) అని తెలియును. రెండవయామె విదర్భదేశాధీశుని కొమారిత, 'రొఖని' అనిపేరు (రుక్మిణి). ఈవిదర్భదేశము బాక్ట్రియా అనునది. నిజామువారి రాజ్యములోని 'బీడరు' కాదు. అతనికి వంశకర్తలు లేనందున ఆతని సేనానాయకులు, అంగజులును యవనులు, ఈ భూములనంతయు విభాగించుకొన్నారు. ఈజిప్టుదేశము 'టాలెమి' అను నాయకునికి పోయినది. ఆకాలమునుండి ప్రాచీన పారసీక సామ్రాజ్యభూములన్నియు గ్రీకు (యవన) ప్రభువులకు లోబడియుండుటయు, వీరిని అనుసరించి మాతృభూమియైన గ్రీకుదేశము నుండి వేనవేలు గ్రీకులు వచ్చి ఆసియాఖండములోను, ఈజిప్టుదేశములోను పాదుకొనుటయు తటస్థించినది.

గ్రీకు ప్రభుత్వములు ఆసియాఖండమునందునను, ఈజిప్టు సీమయందునను స్థిరపడినపిదపకూడ భరతఖండనివాసులకును, ఇతరదేశస్థులకును యథాప్రకారము వాణిజ్యము జరుగుచునే వచ్చినది. మఱియును ఒక పారసీకచక్రవర్తి అలెగ్జాండరు కన్న నొకశతాబ్దము ప్రాచీనుడు కొందఱు గ్రీకులను పట్టి తెచ్చి పారసీకమునకు పశ్చిమమందు వారిలో నొక భాగమువారిని, తూర్పుప్రక్క పూర్వోక్తమయిన విదర్భదేశములో

కడమవారిని ఉంచినాడు. ఈవిషయము బహుముఖ్యమయినదయ్యును సాధారణముగ చరిత్రకారులు మఱచిపోవుటచేత అలెగ్జాండరునకు ముందు హిందూదేశసామీప్యములో గ్రీకులు ఎవరును ఉండలేదని సామాన్యాభిప్రాయము ఏర్పడినది. ఇది ఘోరపాటు. ఇట్లు విదర్భదేశములో చేరిన గ్రీకులు వృద్ధి పొంది బాక్ట్రియా అని చెప్పబడుచుండు రాజ్యమును స్థాపించుకొనిరి. ఈ వంశమువారే అలెగ్జాండరును ఎదిరించి హతమయిపోయిరి. అప్పటి రాజకొమారితయే 'రోఖని' అను పేరుగలామె అలెగ్జాండరునకు భార్యయయినది.

మఱియు తురుష్కుల ఆసియా అని చెప్పబడిన భాగములో పురాతనకాలములయందు నివసించుచుండిన జనముల సందర్భమునను, రాజవంశముల సందర్భమునను అనేకమార్పులు జరుగుచుండినవి. ఈభూభాగములో పశ్చిమార్ధమునకు ఆసియామైనరు అనగా చిన్నఆసియా అని పేరు. దానిని మూడు ప్రక్కల చుట్టియుండు సముద్రములలో అనేకములు చిన్నచిన్న ద్వీపములు గలవు. యవనదేశమునకు బహుస్వల్పవిస్తీర్ణము. అందలిజనుల సంఖ్య నానాటికి హెచ్చుచునే యుండినది. ఈజనములకు స్వస్థానమున తావు చాలక క్రమక్రమముగ వీరు (గ్రీకులు) ఆసియామయినరు తీరుస్థలములయందును, దీవిగడ్డలయందును చొచ్చుకొని స్థిరపడిపోయి అమితమయిన వృద్ధిని పొందిరి. ఇది పూర్తియగుట క్రీస్తుశకమునకు వేయిసంవత్సరములకు ముందు. మఱియు యవనదేశమునకు ఉత్తరముగను డాన్యూబు మహానదికి దక్షిణముగను గొప్పభూములు గలవు. అక్కడి జనములు అనేకులు అప్పటికప్పటికి నడుమ నుండు అల్పసముద్రమును దాటి ఆసియామయినరులో తండములు తండములుగా వచ్చి చేరి రాజ్యములను స్థాపించుకొనిరి. వీరిలో ముఖ్యులు అంగీరసులు (Ankyra-Angora) ను, భార్గవులును (Phrygians). క్రీస్తుశకమునకు పదునాలుగు శతాబ్దములకు ముందు వీరలు ఆసియామయినరులో స్థిరపడియున్నారు.

ఆసియామయినరులోని సముద్రతీరములలోను తురుష్క-ఆసియాలోని పూర్వార్ధములోను అనేకశతాబ్దములు ఇంకొకజాతివారు - ఖాత్యాయను లనువారు (Khatti - Hittites) ప్రభుత్వములు చేయుచుండి క్రీస్తుశకమునకు ఆఱునూర్ల సంవత్సరములకు ముందు అస్సిరియనులచేత పునఃపునః పరాజితులయి పేరు ఊరు లేకుండునట్లు హతమయిపోయిరి.

మధ్య-ఆసియాఖండములో తూర్పుభాగమున ముఖ్యులని చీనావారు పేర్కొనబడిరి. ఈజనులు కడు ప్రాచీనులు - క్రీస్తుశకమునకు ముందు నాలుగువేల సంవత్సరములనుండియు వీరు రాజ్యములను ఏర్పాటుచేసికొని మంచినాగరికత గలవారయి శిల్పకళలయందు కుశలులని పేరు పొందినవారు.

వీరిభూమి వైశాల్యము భరతఖండముకన్న రెండింతలు గాని అంతకు నధికముగాని గలది. ప్రాచీన పారసీకస్థానమునకును ఈ చీనావారిదేశమునకును మధ్య ఇతరు లనేకు లుండుచువచ్చిరి. వీరిప్రదేశములే భారతాదిగ్రంథములలో చెప్పబడిన ఉత్తరకురుభూములు. టిబెటుదేశమువారు శకులు. శాకద్వీపమునకు సంబంధించినవారు. ఆజాతివాడు బుద్ధదేవుడు - కావున శాక్యమునియని పేరు. అంతకు ఉత్తర ముండినవారు గ్రీకుల వాడుకలో స్కిథియనులని చెప్పబడుచుండిరి. వారి పేళ్లు కొన్ని వారియందలి అంతర్భాగముల ననుసరించి యుండినవి. ముఖ్యనామము వీరికి భారతమునందు చెప్పబడిన 'కుకుస్థాః' అనునది. వీరికి ప్రాచీదిశయందును, ఉత్తరదిశయందును ఉండువారు హూణులని-చీనావారికి సంబంధించినజాతి. వీరిలో పురాతనకాలములో ప్రముఖత్వమును వహించిన శాఖవారు వర్ణములో శ్వేతముగా నుండినందున వారికి తెల్లహూణులని పేరు కలిగినది. ఒకకాలమున వీరు తమనెలవుల విడిచి పశ్చిముజొచ్చి దేశములమీద పడి జయించుచు, బాధించుచు, ఆక్రమించుచు వచ్చిరి. వీరు నాగరికతలో చాల తక్కువవారు. వీరు భరతఖండము వాయవ్యభాగములో కొంతకాలము ప్రభుత్వములో నుండిరి. కాగా వీరు మనవారికి తెలియవచ్చిరి. వీరినే విక్రమాదిత్యుడను మాలవాధీశుడు, ప్రఖ్యాతుడు ఓడగొట్టి పారద్రోలినందున ఇతని పేర నొకశకమును మనవారు స్థాపించిరి.

హూణులనుగుఱించి యీవివరము చెప్పుటకు కారణ మేమన, ఇంగ్లీషువారు ప్రథమములో కలకత్తా ప్రాంతములలో తావులు కల్పించుకొన్నది మొదలు వీరికి మన 'హిందువులు' హూణులని పేరు పెట్టిరి. అదిమొదలు ఇప్పటివఱకు మనభూమిదేవులు వీరిని హూణులనియు, వీరి భాషను హూణభాషయనియు వాడుచుందురు. ఇది కేవలము తప్పు. వీరు ఎవరియైనదియును క్రింద తెలియనగును. ఈ చెప్పబడిన భూములయందలి ప్రాచీనజనులను, చరిత్రజ్ఞులు, శాస్త్రజ్ఞులునను యూరోపువిద్వాంసులు మూడు ముఖ్యములగు తెగలుగ విభజించిరి. ఒకదానికి తురానియను తెగయని పేరు. మిక్కిలి ప్రాచీనము. ఈతెగలోనివారు చీనావారు. హూణులు, శాకులును, తురుష్కులును, తురుష్క-ఆసియాలో ప్రాతకాలములలో నుండినవారని చెప్పబడిన కాత్త్యాయనులున్ను, బాబిలోనియాలో ప్రప్రథమమున నుండిన సుమేరియనులు లేక అక్కడి యనులు అనువారును. రెండవ తెగకు సెమిటిక్ అని పేరు. ఇది అసురగణము. ఇందులో చేరినవారు బాబిలోనియనులు, లేక కాల్డియనులు, అస్సీరియనులు. హీబ్రూలు-అరబులు-ఫణికులు. (Phœniki-Phœnicians) సిరియనులు-ఇత్యాదులు-వీరు ఎక్కువనాగరికతను పొంది మిక్కిలి యుద్ధశూరులుగ నుండిరి. మూడవతెగ కడమ రెంటికన్న మిగుల నవీనము. వీరిని ఆర్యులని యందురు. ఇది సాంకేతికనామము. దీనికి సంస్కృతమునందలి యర్థముచేసి కడమవారు అనార్యులని భావము కాదు. ఈమూడవతెగలో రెండుశాఖలు. ఆసియాసంబంధి యొకటి, యూరోపుసంబంధి మఱియొకటి. ఇందులో చేరిన ఆసియాశాఖవారు పారసీకులును, సాంస్కృతికులును. యూరోపుశాఖవారు ఎవరన గ్రీకులు, రోమనులు, జర్మను, ఫ్రెంచి, ఇంగ్లీషు-ఇత్యాదులు అనగా యూరోపులో చేరిన రష్యా, ఆస్ట్రియా, తుర్కివారు, తప్ప కడమవారనుట.

ఈగణములలో ప్రాచీనపు ఈజిప్టువారు చేర లేదు. వారిని మఱువలేదు. మఱచుటకు లేదు. వారు ఈమూడు గణములలోను చేరక ఆఫ్రికాదేశమునకును యూరోపుదేశమునకును మధ్య, సముద్రములలోని దీవులలోను, ఆసముద్రతీరములయందును మిక్కిలి ప్రాచీనముగ నుండిన యొకగణమువారని చెప్పుచున్నారు. వారు శూరులు, పరాక్రమవంతులు, మిగుల మేధావంతులు. కడమవారికన్న కుఱుచలు, చామనచాయవారు. శరీరములయందు స్థౌల్యము లేనివారు. ఒకవిశేషము: క్రీస్తుశకమునకు పదునేను శతాబ్దములకు ముందు సెమిటిక్ వారి గుంపులు అనేకము పోయి ఈజిప్టులో చేరి స్వదేశస్థులలో ఐక్యమయిపోయినవి. మూడవతెగవారయిన ఆర్యుల సంగతి వివరింతము. వీరివిషయమై అనేకములు తప్పు అభిప్రాయములు కలిగియున్నవి. ఈ యభిప్రాయములు మొదట కొందఱు ఇంగ్లీషువిద్వాంసులకు నూటనుప్పది సంవత్సరములక్రింద కలిగి వారు చేయుచువచ్చిన ప్రచారమువలన దీర్ఘకాలము యథార్థమని భావింపబడుచుండినవి.

ఈవల యూరోపులోని గొప్పవిద్వాంసులు ఈ తెగకు సంబంధించిన భాషలను, అన్యశాఖలవారి ప్రాచీనస్థితిగతులను, పుట్టుకను, పూర్వోత్తరములను, లెస్సగ పరిశీలనచేసి ముఖ్యసారాంశములను ఉద్ధరించియున్నారు. ఈయార్యులందఱును పురాతనమున నొక్కతావున నుండినవారును, ఒక్క కుటుంబము వారును. ఆతావు ఎక్కడ ననునది యిప్పటికిని నిస్సందేహముగ నిశ్చితము కాలేదు. ఏకవంశస్థులనువిషయములో సందేహము లేదు. వీరి ప్రథమనివసనములు మధ్య ఆసియాలోనని కొందఱు; కాదు, ఇప్పటి రష్యాదేశముల ఉత్తరభాగములోనని కొందఱు; కాదు, ఆరష్యాదేశములో దక్షిణభాగములోనని కొందఱు-భిన్నాభిప్రాయులయి యున్నారు. కాని ఇంతమట్టుకు స్థిరపడినది: వీరల మొదటితావునికిపట్టు భరతఖండములో కానే కాదు. ఆర్యశాఖలవారు రష్యాదేశము చేరుటకు ముందు ఎచటనుండిరో తెలిసికొను వసతులు తక్కువ.

ఆర్యగణములోని శాఖలవారందఱును ఏకకుటుంబకు లనుటలో వీరందఱును రక్తబంధువులని యేర్పడును. స్థూలముగా చెప్పుటలో ప్రాచీన పారసీకులును

భరతఖండములో చేరిన సాంస్కృతికులును, పరస్పరము, పితృవ్యపుత్రులని చెప్పదగును. కేవలము సన్నిహితులు. వీరికి కొంచెము దూరస్థులు కిమ్మేరియనులు-అనగా ఫ్రెంచివారితో చేరిన 'గాల్సు' అనుగణమువారు. గ్రీకులును వీరిలోనుంచి చీలిపోయిన రోమనులును ఈ సాంస్కృతికులకును పారసీకులకును సకుల్యులు. జర్మను వారును, వారిలోని అంతశ్శాఖలవారగు ఇంగ్లీషువారు, డేనులు, స్వీడనువారును, సాంస్కృతికులకు సమానోదకులు. ఆర్యశాఖలవారందఱును, [ఇందులో సాంస్కృతికులును పారసీకులును చేరుచున్నారు] ప్రాథమికనివసనములలో నుండినకాలమందు వీరికి నాగరికత అత్యల్పప్రాయమయి యుండినది. వీరికి ఏణాదిమాంసము, గోవులయు, అజాదికములయు, క్షీరము, క్షీరవికారములు, గోవులయు, అజాదికములయు మాంసము, కొన్ని పక్షులును మత్స్యములును, వన్యములగు కందమూలములు, ఫలములు, అకృష్టపచ్యములయి స్వచ్ఛందోత్పత్తిగల నీవారాది క్షుద్రధాన్యములును భోజనము. వీరికి కృషీవలవృత్తి లేదు. వీరు భూమధ్యమున నుండినందున సముద్రమును ఎఱుగరైరి. లవణమును ఎఱుగరు. ఇది వీరికి ఈవల బహుకాలమునకు పరిచితమయినది. వీరికి యిష్టకములతోను,పాషాణములతోను ఇండ్లు కట్టుకొనుట తెలియదు. కొంతకాలము ఇండ్లే లేవు. క్రమేణ దారుకల్పితములగు గోడలను పెట్టుకొని మీద కప్పు వేసి నివసింతురు. నేలమీద దర్భలు, రెల్లు, పఱచి కూర్చుందురు. [కానసే యిప్పటికిని 'దర్భాప్వాసీనః' అని చెప్పి ఒకదర్భపోచను పీటక్రింద త్రోయుట.] వీరికి వాణిజ్య మని చెప్పతగిన దేమియు లేదు. విద్యలు లేవు. అయినను కడుమేధావంతులు. వీరికి నదులమీద పోవు చిన్నదోనెలు, తెప్పలు, తొట్టిపడవలు, తప్ప వేఱునావలు తెలియవు. గృహ్యకములగు మృగములును అల్పము. అశ్వములను ప్రథమములో నెఱుగరు. పట్టణములు లేవు. గ్రామములు, ఇపుడు మనకు తెలిసినట్టివి, లేవు. ఒకచోట కొన్నికుటుంబములు చేరియుండుటయే వీరి గ్రామము. ఈశబ్దమునకు ప్రథమార్థము బృందమని. ఊరు-పల్లి-అనునది రెండవయర్థము. కావుననే శబ్దగ్రామము, గుణగ్రామము, ఇత్యాది. వీరికి ఆయుధములు, కొరముట్లు, బహు తక్కువ. తామ్రముతప్ప వేఱులోహము వీరికి తెలియదు. [కావుననే ఇప్పటికిని శ్రౌతకర్మలయందును హవ్యకవ్యములయందును తామ్రపాత్రల నుపయోగించుట.] చెకుముకిరాతికత్తులును, కాష్ఠకుద్దాలములును, ఒకవిధమయిన కొయ్యకత్తులు, అనగా చర్మాతిబండమీద మొన వాడియగునటుల తోమితోమి సిద్ధముచేయబడునవియు గలవు. [కావుననే యాగములలో నిప్పటికిని మిగుల పవిత్రముగ 'స్ఫ్యము' అను కొయ్యకత్తి వాడబడుట.] వీరికి విల్లు అమ్ములు గలవు. వీరికి కృషీవలవృత్తి లేదు. దున్నుట, పయిరుచేయుటయు లేదు. నాగరికతకు సంబంధించిన శిల్పము లేమియు లేవు. పశుధనమే వీరి రిక్థమయినందున పశువుల మేపుకొఱకు గ్రాసముండు చోట్లకు తఱచుగ మాఱుచుందురు. అట్టి సందర్భములలో నుపకారికలను తాత్కాలికముగ కల్పించుకొందురు.

ఇట్టిపరిస్థితులలో సంతకంతకు జనము వృద్ధి పొందుచుండు కారణమునను,కృషికర్మ లేమింజేసియు, ఒకచోటనే యుండినచో ప్రాణయాత్ర జరుగుట సాధ్యము కానందున, అప్పటప్పటికి కొన్నితండములు జన్మభూమిని విడిచి పరదేశములకు పోవుచుందురు. అట్లు పోయినవారిలో ప్రథములు ఫ్రెంచివారియొక్కయు, ఐర్లండువారియొక్కయు, ఇంగ్లండులో పశ్చిమభాగమున నున్నవారియొక్కయు ప్రాచీనపితరులు. తరువాత కొంతకాలమునకు చీలిపోయినవారు జర్మను గణము వారు. (వీరిలో అంతర్భాగము ఇంగ్లీషువారు) పిమ్మట కుదురునుండి జరగిపోయినవారు డాన్యూబునదికి దక్షిణముగ చేరిరి. తరువాత వలసపోయినవారు గ్రీకులపూర్వులు (వీరిలో రోమనులు ఇమిడియున్నారు) ఈ ప్రకారము అప్పటప్పటికి వలసపోయినవా రందఱును యూరోపులో చేరినారు.

ఇట్లు వీరు పరదేశములలో జొచ్చిపోవుచుండు నపుడు- అప్పటికి ఆయా భూములయందు స్వదేశస్థులు

నానావిధములవారు-నివసించుచుండిరి. మఱియు ముందు పోయినవారు తాము చేరిన ఆయాతావులలో స్వదేశస్థులగుచుండిరి. ఈక్రొత్తవారు వారితో పోరాడి వారిని లోబఱచుకొని గాని, వారితో ఐక్యమయి గాని పోవుచుండిరి. స్వస్థానమును ప్రథమమున విడచినది మొదలు, వీరిభాషలు, వేషములు, గుణములు, చేష్టలు, ఆహారవ్యవహారపద్ధతులును, అన్నియు మాఱుచునే వచ్చినవి. మాతృభాష అయినది యేదో అది యితరభాషలను వాడు వారి సంపర్కముచేతను, అప్పటప్పటికి వర్ణలోపవిపర్యయ వ్యత్యాసములవలనను, మఱియు ననేక సందర్భపరంపరలవలనను, మాఱిపోవుచుండినది. అయినను ఆమాతృభాషకు మూలాధారమయిన ప్రకృతిరూపములమట్టు కొంతకుకొంత యీమార్పు జెందిన భాషలలో నిలబడియుండుచునే వచ్చినది. ముందుపోయినవారు వెనుక వచ్చినవారికి పరాయిజనముగను అహితులుగను నుండుటయు, వీరిభాష వారికిని, వారిభాష వీరికిని తెలియకుండుటయు గలదు. ఉభయులును ఒక జాతియే యని గాని, ఒక కుదురువారే యని గాని ఙ్ఞప్తిగ తెలియుట లేదు.

ఇట్లు కాలక్రమమున చెదరిపోయినవారు పోను శిష్టులు పారసీకులయు సాంస్కృతికులయు పూర్వులు. వీరును పిదప కొంతకాలమునకు ఆసియాఖండమును లోకి దిగినారు. ఇది క్రీస్తుశకమునకు ముందు ఇంచుమించు రెండువేల సంవత్సరముల కాలపరిమితి లోపల జరగినది. ఇట్లు క్రొత్తభూములలో ప్రవేశించినపిదప కొంతకాలము అక్కడిస్వదేశస్థులతో పోరాటము జరుగవలసియున్నందున నిరువురును పరస్పరానుమానులరయియుండిరి. ఆకాలమందు ఆసియాలో సెమిటిక్ అనగా నసురగణమువారయిన బాబిలోనియనులును, అస్సిరియనులును ప్రభవించి యుండిరి. వీరితో పోరాటము కలుగుట సహజముగదా. అప్పట్లో అస్సిరియనుల అధికారము బీజాంకురమున నుండినది. బాబిలోనియనులు అప్పటికి ముందు అనేకశతాబ్దములుగ దేదీప్యమానమైన వృద్ధిలో నుండి ఐశ్వర్యమును వెంబడించు అవలక్షణములు పెరుగుచుండి తత్కాలమున క్షయపక్షమున నుండిరి. క్రొత్తగా వచ్చినవారికి వీరు సహజశత్రువు లయినందున నీపారసీకగణమును సాంస్కృతికగణమును అన్యోన్యసహాయముతో వీరిని ఎదుర్కొని బాబిలోనియను రాజ్యమును 'నదీమధ్యమును' లోబఱచుకొని అక్కడ తమరాజులను సింహాసనాధిష్ఠితులను చేసిరి. ఇది క్రీస్తుశకమునకు ముందు దాదాపు పదునేడునందల సంవత్సరములకాల మగును. బాబిలనులో అధికృతులయినవారు కాశికులుగ నున్నారు. వీరిప్రభుత్వము భరతఖండములో నింగ్లీషువారి ప్రభుత్వమువలె నుండినది. అనగా ప్రభువులశాఖవారు కొలదిమందిగను వారి మనుష్యులే విశేషించి అధికారములలో నుండుట, సైన్యములు వారిజనముగ నుండుట, జనసామాన్య మంతయు మం దుండినవారుగనే వారివారికి అనూచానమయిన ఆచారవ్యవహారములు కలిగియుండుట.

ఈవంశములో దాదాపు నాలుగుశతాబ్దములు రాజ్యశ్రీ నిలిచినది. పిదప అస్సిరియనులు బలపడి దిగ్విజయములను ఆరంభించిరి. వారిదెబ్బకు నిలువలేక యీఆర్యులు చెల్లచెదరిపోయిరి. పురాణగ్రంథములలోని దేవాసురయుద్ధములు ఈకాలములోనివి. దేవతలు మనవారు. వీరలు చెదరిపోవుటలో పారసీకులు వారిచేరబరసు పారసీకస్థానమందు నిలబడిపోయిరి. సాంస్కృతికులు కొంతకాలము పారసీకములోని పశ్చిమోత్తరభాగమైన మధ్యదేశమున (Media) నుండిరి. పురాణములలోని ఇంద్రుడును అతనికి అప్తురాండ్రయిన రంభ, ఊర్వశి, ఘృతాచి, తిలోత్తమ, ఇత్యాదులును ఇక్కడివారు. పిమ్మట అసురులదాడికి నిలువజాలక వారిలో ననేకులు ప్రాఙ్ముఖులయి వలసపోవుచు చిరేణ భరతఖండమును నాయవ్యాంతరముల ద్వారమున చొచ్చి నిలిచిరి.

వీరు భరతఖండమును చేరినపుడు ఇక్కడ స్వదేశస్థులు అప్పటికి వీరికన్న తక్కువనాగరికతలో నుండువారు అనేకు లుండిరి. వారితో పోరాడి క్రమక్రమముగ నీ సాంస్కృతికులు గంగానదివఱకు గల భూమిని ఆక్రమించి వృద్ధిపొందుచువచ్చిరి. వీరు భరతఖండమును

చొచ్చుటకు బహుకాలము ముందు బాబిలోనియా దేశమునందలి ప్రాథమికులని చెప్పబడిన సుమేరియను శాఖవారు కొందఱు, మనము సింధుదేశమని చెప్పుచుండు మండలములో చేరియుండి, గొప్ప పట్టణములను వర్తకపుకాణాచితావులను నెలకొల్పియుండి కడకు అంతరించి పోయిరి. సాంస్కృతికులు భరతఖండమున చేరినపిదప కొంతకాలమునకు పారసీకచక్రవర్తుల ప్రభుత్వమునకు లోనయిరి. పిమ్మట పారసీక ప్రభుత్వమును మాపివేసిన గ్రీకులకు (యవనులకు) లోనయిరి. పిదప మధ్య-ఆసియానుండి పునఃపునః పైకొని వచ్చుచుండు - హూణులు - కుశస్థులు-ఈజకులు - శాకులు ఇట్టివారితో పోరుచు వారికి లొంగుచు నుండిరి.

ఈ భరతఖండమునందలి విచిత్రవిషయ మొకటి కలదు. ఏదేశమువారుగాని, ఏజాతివారుగాని, ఇక్కడి జనసామాన్యమునకు గల దేశభావములను ఆచారములను అనుసరించినయెడల వారు 'హిందువు'లయి వారివారి వృత్తికి ఉచితమైన కులములో చేరిపోవుదురు. ఈప్రకారము వేనవేలు బ్రాహ్మణులును, ఇతరవర్ణములవారు నేర్పడియున్నారు. అందుచేతనే ఇన్నివందల (లేక వేల) కులములు ఈభూమియం దుండుట. అందుచేతనే ఒక సంఘమునకును, ఇంకొకసంఘమునకును ఇచ్చిపుచ్చుకోలు లేక యుండుట. ఇట్లు ఈజిప్టువారు, యవనులను గ్రీకులు, ఆభీరులు- కాశ్యాయనులు, ప్రాచీన పారసీకులు, [బొంబయిలోని పార్సీలు అనువారు కాదు] మధ్యఆసియాలోని పార్థివులు, జాట్సు అనువారు, హూణులు, కుశస్థులు, ఈజకులు, శాకులు, ఇత్యాదు లనేకులును పురాతనమున నీభూమిలో చేరి చాతుర్వర్ణ్యములో లీనమయిపోయినారు.

ఈసాంస్కృతికుల పూర్వులు తమ ప్రాథమిక ములను కాణాచి తావులయం దుండినపుడు వీరి నాగరికత అత్యల్పముగ నుండినదని చెప్పియుంటిమి. వీరు పిదప అసురుల మధ్యమున నుండిన కాలములో అసురుల విద్యల నన్నిటిని, అర్థశాస్త్రములను, శిల్పములను, కళలను, సేద్యమును, వాణిజ్యమును, నాగరికతకు కావలసిన విద్యల నన్నిటిని వారివలన నేర్చినవారయిరి.

ఇదియును గాక అసురుల మతవిశేషములను, దేవతలను, దేవాలయనిర్మాణమును, ఆగమవిధానములను స్వీకరించినారు. ప్రథమమున వీరికి (ఆర్యులకు) రుద్రుడు, ఇంద్రుడు (ఋగ్వేదములోనివాడు), మిత్రుడు, అగ్ని, వరుణుడు, వాయువు, భూమి, ఆకాశము, అంతరిక్షము — ఇట్టి పృథివ్యప్తేజోవాయ్వాకాశములే దేవతలుగ నుండినవి. అసుర విద్యలు నేర్చిన పిదప పౌరాణికదేవతలు, త్రిమూర్తులు, వారికి భార్యలు ఇంకను లెక్కలేని దేవతలును ఏర్పడిరి. ఈవల గ్రీకులతోడను కలిసిన పిదప ఇంకను ఈ పౌరాణికదేవతల చిద్విలాసములు అధికమయినవి. వీనిలో ముఖ్యమైనది. పార్వతీదేవికి సంబంధించిన వివరము. ఈగ్రీకులును, తమ మతవిషయములను, దేవతలను, ప్రథమమున ఈజిప్టువారివలనను, అసురగణములయందు ప్రముఖులుగా నుండిన ఫణికులవలనను గ్రహించినవారే.

మఱియును కొన్నివిషయములు ఈవ్యాసములోనే చెప్పవలసి యున్నవి. బుద్ధదేవుడు అవతరించినది క్రీస్తుశకమునకు ముందు ఆఱవశతాబ్దమున. ఆమతప్రచారకులగు బౌద్ధులు ఈజిప్టు మొదలగు పరదేశములకు పోయి అక్కడి విశేషములు తెలిసికొనినవారయి తిరుగ స్వదేశమునకు వచ్చుచుండిరి. ఇంకొకవిషయము: 'భరతఖండమునకు పశ్చిమము' అని యుండినా లక్షణము మహమ్మదీయమని యర్థము చేసికొనుట మనవారికి సామాన్యముగ నున్నది. ఇది గొప్ప పొరపాటు. పయిగాంబరు మహమ్మదుగారు అవతరించినది క్రీస్తుశకము ఏడవశతాబ్దములో- వారి అనంతరము రెండువందల సంవత్సరముల లోపల భరతఖండమునకు పశ్చిమమున నుండు ఆసియాదేశముల వారందఱును వారిమతమును స్వీకరించినారు. అట్లు స్వీకరించినవారిలో అసురుల గణములవా రందఱును, పారసీకులును చేరిపోయినారు. మహనీయులు ఏసు క్రీస్తుగారు అవతరించి యిప్పటికి దాదాపు రెండువేల సంవత్సరము లయినది. అప్పటినుండియు వీరిమతము క్రమక్రమమున వ్యాపించుచువచ్చినది. మనప్రాచీన సాంస్కృతికులయు పారసీకులయు పూర్వపరిస్థితులను గుఱించి చెప్పబడిన గ్రంథమంతయు క్రీస్తుశకమునకు

అనేకవందల సంవత్సరములకు ముందర సంగతు లని తెలియవలెను. క్రీస్తుశకమునకు ముందు యూరోపులో నేమి, పశ్చిమ ఆసియా, అరాబియా, ఈజిప్టు-ఈదేశము లం దంతయు నేమి, నామభేదములతో ఒకేదేవతలు - ఆరాధనలు - ఆగమములు మతవిషయములు - నడుచు చుండినవి. క్రైస్తవమతము వ్యాపకమయినకొలది ఆ పద్ధతులు మాసిపోవుచుండినవి. క్రీస్తుశకమునకు ఈవలను, పయిగాంబరు మహమ్మదుగారిమతము వ్యాపించుటకు ముందును, పశ్చిమ ఆసియాఖండమున క్రైస్తవమతమును అవలంబించని భూములలో నంతయు ప్రాచీనపద్ధతులే జరగుచువచ్చినవి. అనగా మనదేవతల మనపూజలవంటివే నడుచుచుండినవి. పైచెప్పినరీతిని పశ్చిమఆసియాలోను, ఈజిప్టులోను మహమ్మదుగారిమతము వ్యాపించినపిదప ఆతావుల నంతయు ఆపురాణదేవతలు అంతర్ధానమయి పోయిరి గాని భరతఖండములో నిప్పటికిని ప్రభుత్వము చేయుచున్నారు. గ్రీకులును, యూరోపులోనివారును మహమ్మదుగారి అవతారమునకు చాలకాలము ముందే క్రైస్తవు లయినారు.

వాణిజ్యము నుద్దేశించి కొంచెము ప్రస్తావము చేయవలసియున్నది. ఈభరతఖండమునందు అయ్యాయి కాలములయందు నివసించుచుండిన జనములకును, ఇతర దేశములవారికిని అనాదిగ వాణిజ్యవ్యాపారములు జరగుచునే యుండినవి. ఉత్తరభాగమున చీనాదేశము నుండియు మధ్య-ఆసియాభాగములనుండియు నాటు మార్గముల వర్తకము నడచుచుండినది. యూరోపునుండి వర్తకము పశ్చిమఆసియామార్గములమీదుగ రాకపోకలు కలిగియుండినది, ఇట్లు హిమాలయోత్తరవాణిజ్యము, పూర్వభాగమునుండి కాశ్మీరద్వారములను, పశ్చిమభాగమునుండి ఆఫ్గానిస్థానము అని వాడుక పేరు గల దేశము మీదుగా పాంచాలద్వారములను ప్రవేశించుచుండినది.

మఱియు సముద్రములమీదకూడ నెక్కువగా సాంయాత్రికుల వ్యాపారములు జరుగుచుండినవి. చీనాదేశపు దక్షిణభాగముల నుండియు, తూర్పు సముద్రములలోని దీవి గడ్డల నుండియు, సయాం బర్మాదేశములనుండియు, వచ్చెడివర్తకము సముద్రము మీదవచ్చి కొంత లంకాదీవియందును ఎక్కువ మలయాళ దేశపు రేవులయందును దిగుమతి యగుచుండినది. ఈజిప్టు, అరాబియా, కొంత యూరోపు, దక్షిణపారసీకము, ఈరాజ్యములవర్తకము పశ్చిమసముద్రము మీదుగ నడుచుచుండినది. ఆకాలమందు నడిసముద్రమున నావికాయాత్రలు చేయుటకు తగిన కౌశల్యము పోతవణిక్కులకు లేదు. కావున నీనావలు సముద్రతీరముననే పోవుచుండును. ఆయారేవులయందు ఎగుమతి, దిగుమతి చేయుచుందురు. ఇట్టిరేవులు భరతఖండమున గలవి సింధునదీ ముఖద్వారములయొద్దను, భరుకచ్ఛమున, ఘూర్జరములోను, కొంకణమున, మలయాళమునను ఉండినవి. ఈరేవులు ఎక్కువ సంఖ్యవి గావు. పశ్చిమసముద్రపు వర్తకము కేవలము ఫణిక్కులయు, అరబులయు స్వాధీనములో నుండినది.

కొంతకాలము జరుగుచువచ్చిన పద్ధతి - ఈజిప్టు, అరాబియావర్తకమును పారసీకపు రేవులలో దిగవిడిచి అక్కడ చేరియుండెడు భరతఖండపువస్తువులను తిరుగా ఎక్కించుకొని, వచ్చినవారు వచ్చినదారిని పోవుచుందురు. పారసీకపు రేవులనుండి భరుకచ్ఛమువఱకు భరతఖండపు వర్తకులు ఈవాణిజ్యమును నడపుచుందురు. అట్లే భరుకచ్ఛమునకు, మలయాళమునకు నడుమ, ఇట్లు జరుగుచువచ్చుటలో క్రీస్తుశకము ఆరంభమున దైవికముగా నొకవిషయమును కనిపెట్టిరి. అదియే మన పశ్చిమ సముద్రములో వాయుచలనములో నొకపద్ధతి యున్నట్టు తెలియవచ్చినది. సంవత్సరములో కొంతకాలము వాయువు వాయవ్యమునుండి ఆగ్నేయమునకు వీచుచుండును. మఱి కొంతకాలము ఆగ్నేయమునుండి వాయవ్యమునకు చలించును. ఇట్టి సన్నివేశములో అరాబియాదక్షిణభాగమున ఆఫ్రికాపెంబడి నుండు జలసంధులయొద్ద విడువబడిన నావ రేఖ గీచినట్టు పోయి మలయాళము చేరుచువచ్చినది. ఇది తెలిసినపిదప అట్లే రాకపోకలు ఏర్పడి ఎక్కువ వర్తకము ఇటు తిరిగినది.

తూర్పుసముద్రముమీది వర్తకము చీనానావికుల స్వాధీనములో నుండినది. వారు మలయాళసీమరేవుల

వఱకు వచ్చి వెనుకకు తిరిగిపోవుచురు. అక్కడనుండి పశ్చిమమునకు పైజెప్పినవిధమున వర్తకము జరుగుచుండును. ఒకవిశేషమును చెప్పవలసియున్నది. సరకులను ఒకచోవులో దించువారు ఆసరకుల ఉత్పత్తి యెక్కడ అని చెప్పరు. ఉన్నది యున్నట్లు చెప్పినయెడల అందఱును ప్రథమస్థానమునకే పోయి తెచ్చుకొని అధికలాభమునకు విక్రయించుకొందురు. మొదటివారు తమకు చిక్కదు తరపణ్యమును, క్రయవిక్రయ లాభములను పోగొట్టుకొందురు. కావున ముఖ్యాంశములను చెప్పరు. ఇంకొకసందర్భము సరకుల స్వస్థానము ఏదియని తెలియరాకయుండుటలో ఆసరకు విదేశము దైవయెడల, అంతికతమమయిన ఏరేవునుండి వచ్చినదో ఆపేరు పెట్టుకొని వాడుట కలదు. మఱియు ఉత్పత్తిస్థానము ప్రసిద్ధముగా తెలిసియుండినయెడల ఆస్థానము పేరునే వాడుచుందురు. ఇట్లు లోకమంతయు కలదు.

అలెగ్జాండరుకు ఈవల ఈజిప్టుదేశమును తురుష్కఆసియాభూములును గ్రీకులవశమై యుండినవని చెప్పితిమి. పిమ్మట క్రీస్తుశకము ఆరంభమున రోమనులు ప్రభవించి ఈజిప్టుదేశమును ఆక్రమించిరి. పిదప, రెండుశతాబ్దములలోపల, తురుష్క ఆసియా సీమలను కూడ వశపఱచుకొనిరి. ఇట్లు పయిగాంబరు మహమ్మదుగారి నిర్యాణమువఱకు జరగినది. పిమ్మట రోమనులపరిపాలనలోని భూములన్నియు, ఈజిప్టు మొదలయినవి, మహమ్మదీయప్రభువుల వశమయినవి. ఇట్లు గ్రీకుల కాలములో నేమి, రోమనులకాలములో నేమి, ఈవల నేమి, పశ్చిమసముద్ర వర్తకవాహిని నిరంతరము జరుగుచునే వచ్చినది.

ఈజిప్టు అరాబియారాజ్యములు మహమ్మదీయ ప్రభుత్వములో చేరినపిదప, పశ్చిమసముద్రవర్తకము విశేషముగా అరబుల స్వాధీనములో నుండినది. ఈవల క్రీస్తుశకము పదునేనవ శతాబ్దమునుండి యూరోపువారయిన బుడతగీసులు, ఉలందులు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు ఈవర్తకములో జొచ్చుకొనిరి.

ఈవివరములు వ్రాయుటకు కారణము వక్ష్యమాణగ్రంథములో తెలియవచ్చును.

సంస్కృత విద్వాంసుల కొకవిన్నపము :

స్వామినః, మీయట్టి మహాత్ముల పాదధూళి మాశిరమున నంటజాలు. మీపాండిత్యము అఖండమైనది. దానినితక్కువగా చెప్పుట బుద్ధితక్కువ - మాది పండితవంశము, నేను పండితునిపుత్రుడను. కావున నట్టియవజ్ఞతను చేయజాలను.

అయినను 'బాలాదపి శుకాదపి' అనున్యాయము ననుసరించి నమస్కారపూర్వకముగ నొకమనవి చేయుచున్నాను. మీకు సముద్రమంత విద్య యుండినను అది రాణించుటలేదు. మీవలన సంస్కృతవిద్యలవృద్ధికి సహాయము అల్పప్రాయమై యున్నది. మీవిద్యకన్న తక్కువపడిన సంస్కృతవిద్యతో యూరోపియనులు సంస్కృత విద్యలవిషయమయి శోధనలుచేసి అమేయమయిన యుపకృతిగల గ్రంథములను వ్రాసియున్నారు. వారు విద్యలను లభ్యపఱచుకొనుటయందును, ప్రచురపఱచుటయందును గల పద్ధతులకును మీపద్ధతులకును అంతభేదమున్నది. ఆవిద్వాంసులును మనవలెనే పేదలు, వారిభాష కాదు. వారిదేశముకాదు. వారు రచించు గ్రంథములవలన ద్రవ్యలబ్ధియు నుండదు. ఇట్లుండ, వారు ఇట్టి పరిశ్రమ యేల చేయవలె? విద్యాభివృద్ధికొఱకు. ఈయాస్థ మనకేల కొఱత పడవలె?

ఏమాటకుగాని, హేతువాదములు చేయకూడదు, తర్కవాదములు చేయకూడదు, 'న మీమాంస్యం కథంచన' అని వాగ్బంధనము చేయబూనుట సరికాదు. అవశ్యకర్తవ్యాంశములు - ఈ మీమాంసయును, ఈ వాదములును - అనుదినము యూరోపియనులు చేయుచుండునది యిదియే - కావుననే వారలు అంత పురోవృద్ధిలో నుండుట.

ఇప్పటికి నాలుగువేల సంవత్సరములక్రింద వ్యాపకులుగా నుండినవారు ఎంతమహనీయులయ్యును వారు చేసిన కట్టుబాట్లను రాబోవు మన్వంతరముల వారందఱును మహాప్రళయమువఱకు జవదాటకుండునట్లు వారి

కాలుసేతులు కట్టివేసి, నోటగుడ్డలు దోప్పించి, శవప్రాయులనుగ పాఱవైచునంత యధికారము వారి కెట్లు కలిగినది? ఇట్టి యధికారమును భగవంతుడు కూడ తనపై నిలుపుకొనలేదు.

కాలానుగుణముగ పద్ధతులు మాఱుచునుండును. మీరలు కొంత ఇంగ్లీషు నేర్చుకొనవలయును. ఎక్కువగా పనిలేదు. సంస్కృతమునుగుఱించి ఇంగ్లీషు విద్వాంసులు అప్పటప్పటికి వ్రాయుగ్రంథములను అన్వయించుకొనుశక్తికి వలయు ప్రవేశమున్నయెడల చాలును. ఇంగ్లీషుగ్రంథములు ఒకటిరెండు తాము స్వయముగ జూచి అన్వయించుకొన గలిగినయెడల అపేక్షణీయమయిన పద్ధతులన్నియును మీకే తెలియును. ఇంగ్లీషు విద్యను కొందఱు కర్మఠులు చండాలవిద్యయని చెప్పుట కలదు. చండాలత్వము శ్వాసవాయువునకు లేనట్లే, విద్యలకును లేదు. మఱియు ఇంగ్లీషువారు మనవేదములను 'చూచిన' ఋషులకు దూరపు దాయాదులు. చండాలురు కారు. హూణులును కారు.

ఇదియును గాక మీరు అవెస్తభాషను పరిశ్రమ చేసి పఠించవలెను. ఆభాషాజ్ఞానమువలన సంస్కృత పాండిత్యమునకు మిక్కిలి శోభ కలుగును బంగారమునకు మెఱుగు పెట్టినట్లు. సంస్కృతభాషయొక్కయు, వ్యాకరణముయొక్కయు, పూర్వరూపము దానియందు తెలియును. అదియు నిపుడు మనకు ఇంగ్లీషు, లేక గుజరాతి, ద్వారా సాధ్యమేగాని నాన్యథా. ఈభాషనుగుఱించినవివరముకొంతవక్ష్యమాణవ్యాసములో తెలియును.

మఱియు మీకు కొంత 'హిస్టరీ' తెలియవలసియున్నది. అనగా పురాతనదేశచరిత్రములు. ఆదేశములనుగూర్చియు, ఆకాలప్రజనులు, వారిమతములు, దేవతలు, ఆగమములు, ఆచారపద్ధతులు, ఇవియన్నియు తెలియవలెను. భూగోళవృత్తాంతములు కొంత తెలియవలెను. అనగా పురాతనకాలమున, ఏయేదేశమున ఏపట్టణములు, నదులు, పర్వతములు, కేవులు ఉండినవి? వాటి నామములు అప్పటప్పటికి ఎట్లు మాఱినవి? అక్కడి సస్యము లేమి? ఫలవృక్షము లేమి? అని తెలియవలెను. ఈరెంటిని తెలియక (హిస్టరీ - భూగోళము), పండితులని యుండువారు మన సంస్కృతవిద్వాంసులు తప్ప ఈభూమియం దితరులు లేరు.

మీరు నాగరలిపిని వాడుకపఱచుకొనవలెను. సంస్కృతగ్రంథముల కంతయు నిర్దోషములగు ప్రతులు నాగరలిపియం దుండును. మఱియు అన్యదేశములవారు సంస్కృతమునుగుఱించి వ్రాయుగ్రంథములలో నాగరమే వాడుదురు. గీర్వాణభాషకు దేవనాగరలిపి యుండ పనిలేదా? ఈ పైజెప్పినవిషయములు ఇంగ్లీషులో వ్రాయబడినగ్రంథములలోనే చిక్కును గాని మనకు గల స్వదేశగ్రంథములలో నిపుడు లేవు. కావున నింగ్లీషు నేర్చుట ముఖ్యము. అది కష్టమని పరిహరింపవలదు. పాణినీయమును మహాభాష్యమును సాధించినవారి కిది యొకవిషయము కాదు. వయస్సుకూడ కారణము గాదు. 'అజరామరవత్ప్రాజ్ఞః విద్యామర్థంచ చింతయేత్' అని తమకు తెలిసియేయున్నది. మాతుః శ్రీ విక్టోరియాచక్రవర్తినిగారు - షష్టిబ్దప్రాప్తి అయిన పిదప హిందుస్థానీ భాషను చదువ నారంభించి లెస్సగ నేర్చినారు. ఈ విద్యాసాధనములను కొంత చేర్చుకొనినయెడల మీరలు అద్వితీయుల రగుదురు.

ఆంధ్రవిద్వాంసులకును, భారతిపత్రికను చదువు వారికిని ఒకవిన్నపము: ఆర్యులారా, ఈ వరుస వ్యాసములలో నప్పటప్పటికి అనేకవిషయములు క్రొత్తవి వెలువడుచుండును. వాటిని దీర్ఘకాలపరిశ్రమవలన నేను తెలిసికొని అవి సరియని నమ్ముచున్నాను. అయినను నేను సంస్కృతవిద్వాంసుడను కాను. తెలుగుపండితుడను కాను. అకించనుడను. కావున ననేక సందర్భములలో నోరులు నా యభిప్రాయముల నంగీకరించుట దుర్లభము. ఆవిషయమై నాకు తగవు లేదు. నేను చెప్పనవి యన్నియు సరి కాకపోవచ్చును. అన్నియు తప్పులుగ నుండునని భావించుచున్నాను. మఱియు నేను వ్రాయు విషయములలో ననేకములను తెలిసినవారు నుందురు; తెలియనివారు నుందురు. తెలిసినవారు 'ఇవి వీరు మనకు చెప్పవలెనా, ఎవరికి తెలియదు' అని యనవలదు. అట్టి విషయములు తెలియనివారికొఱకని భావించునది.

## హంససందేశము  శ్రీమన్మహోపాధ్యాయ కీ. శే. కల్లూరి వేంకటరామ శాస్త్రిగారు

ఘనవార్ధిక విహారమం దమరఁ బ్రజ్ఞాహీనులుంబోలె నీ
వును, గైలాసమునందు నుండుతఱి గ్రొవ్వుం గొంచుఁ గేకల్ సెలం
గ ఘటింపం గని వన్యకేకులు శరత్కాలంబునం గన్నవో
యినవై మూకత నొంద మార్గమున నీ కెంతేని సమ్మోదమా.

క్రోలి సరాగపద్మినుల క్రొత్తమధుల్ మెలమెల్ల లీలతోఁ
గాలమునందు మేలుకొను కల్వలపఙ్క్తిఁ బరిభ్రమించి స
ఛ్ఛీల! వనేభదానముల స్విన్నుఁడు గంధవహుండు సేవచే
లాలనఁ జేయు నీకు బరిమళంబుల స్వాతిశయంబుఁ దెల్పుచున్.

సమకాలోదయబంధుజీవములు యుష్మద్బంధు లౌటం బరా
గము లచ్చోఁ బవమానుచేఁ బనిచి నీగాత్రంబుపై సంగరా
గము నెంతో యలఁదన్ శివాచరణలాక్షాసంగతుల్ గాంగఫే
నమహాబింబు గిరీశశేఖరనిశానాథున్ స్మరింపింపవే.

పౌరకరంబు లంతరవు సన్నశలాకల నెన్నఁగా సునా
సీరుని కార్ముకార్థ మను చిత్రపటంబున నంచు మించఁగా
మారుత మానుకూల్యగతిమై వెనువెంట వహింప మింటిపై
శారదవారివాహములు ఛత్రము లయ్యెడు రాజహంసమా!

జనకునియజ్ఞవాటికను సాఁగిన సీత జనించినట్టి నీ
తను సఖఁ జూచె దీగతి ముదంబున నచ్చట కేఁగి మిత్రమా!
తనతను వామె నాకొఱకుఁ దా నెటులో ధరియించుచుండి ధా
త్రిని బరిపూర్తిఁ గాంచిన పతివ్రత యన్నయశంబు నొందెదీన్.

తనలో ఖేదము మోదమూనుఁ గద నీద వ్యంతికం బొందు ప
ద్మిని స్వాదూక్తుల నేఁడె వత్తు నని యూమెన్ మెల్ల లాలింపు మ
వ్వనితామైత్రిని వీణ మించు మధుకృద్వ్యాజ్మాధురి న్నీకు నీ
పనిలో మంచిది యన్న సమ్మతిని దెల్పం జూచునం చెంచెదన్.

అనురక్తిన్ శబరాంగనల్ పతులతో నద్రి న్నికుంజంబులం
దున గూర్చుండి తృణంబు ని న్నసమయోందుంగా వితర్కింప నా

వనజశ్రేణినినుండి నీ వెగురుదిూ ప్రాపింప యామ్యాశ ద
వ్వున నే పక్షబలాతిశాయులు ఖగంబుల్ గన్పడం దొల్గుచున్.
అనుపమలీల నీ వెగిరినప్పుడు శ్రమసుధారసంబుతో
నెనయగు నీదుఛాయ యెయి నీమణిమాల్యవదద్రి మించుచో
మనసుననుండి చందురునిమండలమున్ సృజియించు నాదిదే
వుని సుషమాతిరేకమును బూనెదు నో, రజనీకరాకృతిన్!
పడమర తూర్పు మార్గములు పావని నాకు వచించె వానిలోఁ
బడమరత్రోవచేరువ నపాయము నయ్యెడు నిత్యవృష్టి నో
చెలువుఁడ! మొల్లపీడుల విచిత్రములం గనుచుండి లీనమౌ
నెడ నెటులే మఱల్పు సుమి దృష్టిమదర్థము ప్రాక్పథంబునన్.
నికటం బొందిన నీసుధార్ద్రిరవమున్ విన్నప్డు భ్రూనృత్యశూ
న్యకటాక్షంబుల కృత్రిమాదరణరమ్యంబై ప్రకాశింప స్వీ
యకుటీనిర్గతముగ్ధభామినులు నీవంచున్ మది న్నిశ్చయిం
చి కనన్ దాఁటుమి శైలకాననసరిత్సీమంబు లీదేశముల్.
సుమధన్వాకులముగ్ధభావమున నిక్షుచ్ఛాయలందున్ బ్రవా
శమయిన్ శయ్యను శాలిగోపికలు సల్లాపంబు లేవేవొ సం
భ్రమతోఁ జల్పుచు గీతిభేదములఁ గర్ణాటాంధ్రదేశీయమి
శ్రములం బాడుచు మోహ మొందుతఱి నాస్వాదింపు త న్మాగ్ధ్యమున్.
దనుజద్వేషినివాసమున్, నమణిమూర్ధంబున్, ధరాధారి యా
టను సాక్షాత్కృతశేషుఁడే యిదని చూడ న్మానవుల్, లాఘవం
బున సత్త్రంబులు సంచరింపఁ, గుబునంబున్ వీడుఁ దాఁ దక్షిణాం
బునఁగా ముందట వేంకటాద్రి బహునేత్రానంద మౌఁ బిమ్మటన్.
అలగిరి మర్త్యు లెక్కి త్రిదివౌకసులుం దిగి శుద్ధసాత్త్వికా
త్ములఁ దమ రొండొరుల్ తరతమత్వము వీడుచు సర్వసామ్యస
త్ఫలపరిపాకభూతిమహితం బగు నచ్చట గుంపు గూడి పూ
జలు సలుపన్ యథేచ్ఛముగ శక్తిని మాధవు సత్కరింపుమా.
స్తిమితం బొందుమి యన్నటుల్ పులినవేదిం దీర్చి నీరున్ సువ
ర్ణముఖర్యాపగ గోచరించు నట గోత్రప్రాంతయామ్యాశవ

న్యమహీజంబులు చెంత భాసిలఁ బ్రసూనంబుల్ సపర్యావిమి
త్తమనన్ ధూర్జటి కూర్మిహస్తములచేతం దెచ్చి యర్పించుచో.
నీమంజుధ్వని మాని గూఢముగ దీనిం గూడి తా నీరవ్ర
త్తామోదాతిమృదూధవత్ప్రలినవాతాధూతిచేత న్మహా
వ్యాకూపాకుండవు గాక పొమ్మి యపు డన్యాగమ్యవీథిం దటీ
సీమావాసకిరాతు లెల్లఁ దమ చేఁ జిక్కింపకుండ న్నినున్.

చని తుండీరసుమండలంబునకుఁ బశ్చాత్కాల మీక్షించి యం
దున సత్యవ్రత మన్న క్షేత్రమునకుం బొమ్మా కృతాఘక్షయం
బున కచ్చోఁ బతియజ్ఞహానికి నదీభూతాంగి యా వాణి నో
ర్చెను విశ్వైకనియామనేతు వగు నా శ్రీనాథుఁడే సేతువై.

అచటన్ సంతతగీతనాదబహుళ రత్నాంచద్గుణన్ భూమిదే
వ్యుచితాలంకృతి గాంచి కాంచె దట నేత్రోత్సాహి యాఁ జమ్మిహ
స్త్యచలావాసియు సత్యకాముఁ డల ద్వంద్వాతీతుఁ డౌ పూరుషుం
డచలం బౌ తనదృష్టిఁ గన్గొనినవాఁ డై కాంచి నెల్లప్పుడున్.

ఆపీఠిం బ్రణమిల్లుమీ కృతయుగాద్యన్ బ్రహ్మసంకల్పమా
త్రావిర్భూతను జేరి భక్తివినతంబౌ మూర్ధ మేపారఁ గాం
చీ పీఠీరజముల్ గజాచలపతిశ్రీవాహవేగోత్థముల్
దేవాగ్రేసరులున్ శిరంబులను బొందింతు ర్మహోధన్యులై.

ఒకచో నప్పురిఁ గంపితామ్రవణలీలోద్గామి వై ముందు ద్రవ్యం
బకహాళీందుహిమాంబు వ్రానుకొని కంపానీరనీరేజమా
లికకుం గాముకుఁ డైన గంధవహుఁ డాలింగించు లోకోపకా
రకుఁ డై పిమ్మట నిన్ను నాప్తుఁ డగు దూరాదాప్తమిత్రుం బలెన్.

మిముఁ బోలెం గవులన్ భరించు నల బ్రాహ్మీదేవి, యావీటిమ
ధ్యమునం, బార్శ్వయుగంబునం గొలువ విష్ణ్వాదుల్, శుచిస్వాదునీ
రము వాటన్ బాగ బొందుచుండుఁ, దనవర్ణస్తోమముల్ సప్తభే
దమహాస్రోతము లై జనించి యమరం దా వేగవత్యాఖ్యతోన్.

---

# ద్రౌపదీపాత్రము



మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

సంస్కృతాంధ్రసారస్వతములఁ బ్రసిద్ధిగాంచిన స్త్రీపాత్రములలో ద్రౌపదీపాత్ర మొకటి. పురాణవిఖ్యాతములైన పాత్రముల యౌచిత్యము పరీక్షించునపుడు వాని పూర్వజన్మవృత్తాంతములను, వాని యమానుష మహాత్త్వములను, అసాధారణసందర్భముల గ్రహింపవలసియున్నను, లోకాదర్శప్రాయములు గాఁదగినయట్టి పాత్రములను మానవత్వదృష్టితోఁ బరిశీలించుటయే న్యాయ్యము. కావున ద్రౌపది తొల్లి నాలాయనియైన యింద్రసేన, పాండవరూపమున జన్మించిన పంచేంద్రుల కేకపత్నిగాఁ గోరి యజ్ఞవేదిని బుట్టిన యాజ్ఞసేని, ఆకాశవాణి వినుతిగన్న కృష్ణ, యనెడి భావములను విడిచి, క్షత్రియాంగన, ద్రుపదరాజపుత్రి, పాండవపట్టమహిషి, యనెడి భావములతోఁ బరామర్శించినయెడల నీపాత్ర మెట్లు పోషింపఁబడినదో, దీని యౌచిత్య మెట్టిదో చక్కఁగాఁ దెలియును.

ఈపాత్రమును దొలుతఁ జిత్రించినవాఁడు వ్యాసమహర్షి. దాని ననుసరించియు, స్వతంత్రించియుఁ గూడఁ జిత్రించినవారు కవిత్రయము వారు. వీరు గాక యింక నీపాత్రము ననేకకవు లనేకవిధములుగాఁ బోషించియున్నారు గాని మన కది ప్రకృతాంశము గాదు. సంస్కృతాంధ్రభారతములలోని యీపాత్ర మెక్కవిధముగా నున్నదా యని విచారించుటయే ముఖ్యవిషయము.

పెక్కుచోట్ల సంస్కృతభారతద్రౌపదికిని ఆంధ్రభారతద్రౌపదికిని తారతమ్యము గనవచ్చుటయే కాదు, ఆంధ్రమందే యిది ముత్తెఱఁగులఁ గనవచ్చుచున్నది. అందుచేఁ జెప్పుట కొకటియే యైనను లెక్కకీపాత్రము నాలుగుగా గోచరించుచున్నది. కావున ద్రౌపదీపాత్రపోషణమందలి యౌచిత్యానౌచిత్యములను ప్రాజ్ఞలోకము చర్చించునుగాక యను తలంపుతో ముందుగా సంస్కృతాంధ్రముల యందలి భేదభావములను జూపుచుఁ గొన్ని వ్యాసములు వ్రాయుదును. తరువాత నిర్ణయమునకు వత్తును.

ప్రధానకథ కడ్డంకి గలిగించు గ్రంథవిస్తరమును సంగ్రహించుటయుఁ, బ్రక్షిప్తములని తోఁచిన వానిని విడుచుటయు, నభిరుచి గలిగించు కొన్ని పట్టులఁ బెంచుటయు, మక్కికి మక్కిగాఁ గాక స్వతంత్రించి మూలానుసరణముగాఁ గథావర్ణనము గావించుటయు ననునివి భారత కవుల యాంధ్రీకరణలక్షణములుగాఁ గనవచ్చుచున్నమాట యొకటియే సత్యము కాదు, పాత్ర ధర్మములను బోధించు మూలమందలి చిన్నచిన్న వాక్యములనుగూడ విడుచుటయో,

# గాంధిమహాత్ముని లండను ప్రయాణ చిత్రములు

## ముఖ్యులగు ముగ్గురు ప్రతినిధులు




భారతభూషణ మాలవ్యాగారు — మహాత్ముడు — సరోజినీదేవిగారు

చిత్రము ౧.




చిత్రము ౩. తన్ను సాగనంప వచ్చిన ప్రజలవద్ద మహాత్ముడు సెలవు గైకొనుట

తాఱుమాఱు చేయుటయో, యచ్చటఁ గ్రొత్త భావముల నిముడ్చుటయో యాంధ్ర భారతమున సందందుఁ గనవచ్చు ననుటయు సత్యమే. అందుచే మూలమందలి పాత్ర ముచితమో లేక యాంధ్రీకరణమందలి పాత్ర ముచితమో యని పెక్కు తావులఁ బెక్కండ్రకు సంశయము గలుగుచున్నదనుట విదితము. అదియే యీ వ్యాసరచనకు మొదటి కారణము. కావున నుభయభాషాభిమానులీ విషయములు మనస్సున నుంచుకొని సంస్కృతాంధ్ర భారత కవులలోఁ బ్రకృతమైన ద్రౌపదీపాత్రపోషణ మెవరిది యుచితతరముగా నున్నదో యూహింతురు గాక!

అర్జునుఁడు ద్వారక నుండి యింద్రప్రస్థమునకు సుభద్రను దోడ్కొని వచ్చి యొకయింట నుంచి, తానొక్కఁడు మాత్రము బయలుదేఱి వెడలి ధర్మజునకు మ్రొక్కి బ్రాహ్మణుల నర్చించి ద్రౌపదియింటికి వెళ్లెను. ఆమె యతనిని జూచి, 'సుభద్ర యెక్కడ నున్నదో యక్కడికే వెళ్లుము. మోపెంత గట్టిగా బిగించినను మొదటికట్టు వదులు కాకపోదు' అనుచు బహువిధముల విలపింప, నామెను ధనంజయుఁ డూఱడించి బ్రతిమాలి తిరిగి వచ్చి గోపాలికావేషముతో సుభద్రను ద్రౌపదియింటికిఁ బంపెను. ఆ రూపముతోఁ గూడ మిక్కిలి శోభిల్లుచున్న సుభద్ర సవతి యింటికిఁ జని యామెకు వందన మాచరించి నేను భృత్యురాలనని పల్కెను. అంత ద్రౌపది లేచి వచ్చి యామాధవసోదరిని గౌఁగిలించుకొని, 'నీభర్త నిస్సపత్నుఁడై వెలయుఁగాక' యని దీవించెను.— ఇత్యాదిగా సంస్కృతభారతమున[1] నున్నది.

అర్జునుఁడు సుభద్రతోఁ గలసి వచ్చి యింద్రప్రస్థపురము సమీపించి గొల్లపల్లెలో విశ్రమించి, యిట్లు నగరికిఁ బోయిన ద్రౌపది యేమనుకొనునో యని శంకించి గోపాలబాలికలను దోడిచ్చి సుభద్రను ముందుగా ద్రౌపదికడకుఁ బంపెను. భద్ర పాంచాలిని జూచి నమస్కరించినంతనే, 'నీభర్త నిస్సపత్నుఁ డగుఁ గాక, నీవు వీరమాత వగుదువుగాక' యని యామె

1...అర్చయిత్వ బ్రాహ్మణాన్ పార్థో ద్రౌపదీ మభిజగ్మివాన్,
తం ద్రౌపదీ ప్రత్యువాచ ప్రణయాత్ కురునందనమ్;
తత్రైవ గచ్ఛ కౌంతేయ! యత్ర సా సాత్వతాత్మజా,
సుబద్ధస్యాఽపి భారస్య పూర్వబంధః శ్లథాయతే;
తథా బహువిధం కృష్ణాం విలపంతీం ధనంజయః,
సాంత్వయామాస భూయశ్చ క్షమయామాస చాఽసకృత్;
సుభద్రాం త్వరమాణశ్చ రక్తకౌశేయవాసినీమ్,
పార్థః ప్రస్థాపయామాస కృత్వా గోపాలికావపుః;
సాఽధికం తేన రూపేణ శోభమానా యశస్వినీ,
భవనం శ్రేష్ఠ మాసాద్య వీరపత్నీ వరాంగనా;
వవందే ద్రౌపదీం భద్రా ప్రేష్యాఽహ మితి చాఽబ్రవీత్,
ప్రత్యుత్థాయ తదా కృష్ణా స్వసారం మాధవస్య చ;
పరిష్వజ్యాఽబ్రవీత్ప్రీతా నిస్సపత్నోఽస్తు తే పతిః.
—సంస్కృతభారతము.

దీవించెను..—ఇత్యాదిగా నాంధ్రభారతమున[1] నున్నది.

నన్నయ ద్రౌపదియు వేఱయినట్లు గోచరించుచున్నది గదా! ఇందెవరిపాత్రము

ఈసందర్భమున వ్యాసుని ద్రౌపదియు చితతరము?

---

# శ్రావణప్రకృతి

ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

[కాళిదాసుని భావముల ననుసరించి వ్రాయఁబడినది]

౧

నవనవచ్ఛవులఁ దృణాంకురపాళులు వైడూర్యశకలాలువలె వెలుంగ
ప్రోత్థితకందళీస్ఫురితదళంబులు నీలాల మొత్తంపు సీటుగొల్ప
హృద్యసాంద్రారుణార్ద్రేంద్ర గోపవితతి పద్మరాగంబుల పసలు నించ
నీటుగా నటియించు నీటిబుగ్గల చాలు ముక్తాఫలంబుల ముగవుఁజూప.
మహిత తత్త్వ సౌందర్యసంపద లొనంగు-మణివిరాజితనవ దివ్యమండనములు
దాల్చి హసియించు శ్రీమసుందరివిధానఁ - దనరు నీశ్రావణంబున ధరణికాంత.

౨

బింబాధరమునందు ప్రిక్లి విలోచనేం - దీవరోష్ణాస్రువులు నేల రాల
కటికిచీఁకటిపూఁత కబరీభరము వీడి - యంసభాగమున వ్రేలాడుచుండ
వరకాంతియుతనవ్య బహురత్న రాజిత - మండనశూన్యమై మై చెమర్ప
కస్తూరికాగరు గంధాదిలేపన - శ్రీ లేమి గాత్రంపు జిగి నశింప

---

1. ఆ. ఘనభుజుండు నరుఁడు కపటోద్భటుల
విక్రమించి భువనవిశ్రుతుండు
మతిఁ దలంచి యాత్మహిత మగునట్లుగా
నిష్టమున సుభద్ర కిట్టు లనియె.

౨. మన వివాహంబునఁ జేసినప్పుడు నిన్నుఁజూచి ద్రుపద రాజపుత్రి యప్రియంబులు పలుకునో యప్పరమ పతివ్రత పలుకు నిక్కంబు గావున నీ వేకతంబ గోపాలబాలికలతో మందలు నరిగి యక్కోమలిం గను మని పనిచిన సుభద్రయు నిజేశ్వరు పంచిన మార్గంబున నింద్రప్రస్థపురంబునకుం బోయి...ద్రౌపదికి మ్రొక్కిన—

గీ. పంకజాక్షి నీపతి ప్రతిపక్షవీర
విజయుఁ డగ్గ్యుడు నీవు వీరపుత్ర
జనని వగుమని దీవించె............

—ఆంధ్రభారతము

జిలుఁగువసనంపుఁ బయ్యెద మలినమొందఁ - గమలనేత్రాలఁ గావిరక్తిమలు నిండ
ప్రాణనాథాగమము దుర్లభంబు కాన - కుములుదురు ప్రవాసిప్రియప్రమదలిపుడు

౩

శుభ్రనీలోత్పలస్తోమ విలాసభాగ్యోన్నతిఁ జూపించి యొక్క చక్కి
రేజవరాలి మైలీలల కాటుక నొసరించుచునుండి యొక్క మూల
పసిమిసిలిమసొంపు మిసిమిరేకల చాలు నోడిగిల్లుచునుండి యొక్క దెసను
శక్రచాపపుఁ గళాజాలమధ్యంబున వికచరోచుల నీని యొకపథాన
చాతకహృదంతరంబులఁ బ్రీతి నించి - వింతవేసాలతోడఁ బ్రుబ్బింతలాడి
సొరులను నించు నీరదసమితి నతము - శ్రావణవిలాసలలితవాసరములందు.

౪

సంపూర్ణపూర్ణిమాచంద్రాననమునందు పసిఁడిచాయలు నీను పసపు నలఁది
జఘనవిలాసవిశాలభాగము నంటు వాల్జడ హేమపుష్పములు తురిమి
ఫాలభాగమునందుఁ బ్రవిమలద్యుతు లొల్కు లలితార్ద్రచందనతిలక మునిచి
పన్నీరుతావి గుబాళింపఁజేసెడు జిలుఁగు జల్తారంచు చీరఁగట్టి
కరమునఁ బసిండికుంకుమబరిణె నూని - పేరఁటాండ్రఁ బిలువ నేఁగు ప్రేమవతులు
చెలువమును నేత్రము మాల్లైసీమయందు - శ్రావణపవిత్రశుక్రవాసరమునందు.

౫

తమ్మితెలనాట్యరంగమున కమర్చిన నీలిడేరావోలె నింగి తనర
చిమ్మచీఁకటిరేయి బమ్మరక్కసియులి వట్లు మేఘారవం బతిశయింప
నీటిమబ్బుల యంచ సల్పి కన్నులు మూఁతవడఁ జేయు శంపల ప్రభ లెసంగ
పిలపిలమని పాఱు పిల్లకాల్వల చెంత ఝిల్లీస్వనంబులు చెవులఁ బడఁగ
హృదయమున నించుకేని చలింపఁ బోక - మోహమునఁ బ్రియు సంకేతభూమియందు
సరయుఁగా నభిసారిక త్వరితగతిని - తరలు శ్రావణశర్వరీధ్వాంతవీథి.

---

# నిరూపకనవలలు

దావులూరి భావనారాయణగారు, బి. ఏ.

ఈ రోజుల్లో నిరూపకనవలలు (Detective novels) మాజా స్పీడ్గా తయారవుతున్నాయి. అసలు నవల అనే వస్తువు యీమధ్య బయలుదేరిందే. పూర్వం లేదు మరి. పశ్చిమదేశాల్లోకూడా నవలలు ప్రబలంగా బయలుదేరింది ౧౮-వ శతాబ్దమునుంచే. మనకుకూడా యీనవల అనేది ఆదేశాలనుంచే వచ్చిందంటారు. మనము దాన్ని అవకగానో తవకగానో అనుకరిస్తున్నాము. ఈనవలల్లో చరిత్రసంబంధమని, సాంఘికసంబంధమని, నిరూపకసంబంధమని, మళ్లీ విభజన వుంది. ప్రారంభదశలో చరిత్రసంబంధమైన నవలలు, సాంఘికసంబంధమైన నవలలు ఎక్కువగా వ్రాస్తూవుండేవారు. ప్రస్తుతము మనదేశంలో—కనీసం ఆంధ్రలోకంలోనన్నా—దూమాస్, కానన్‌డాయిలు వంటి రచయితలు బయలుదేరేటప్పటికి నిరూపకనవలలు చీమల్లాగా పుట్టలుపుట్టలు బయలుదేరాయి—అబ్బో! ఎక్కడ చూచినా 'చోరభయంకర్'లే, 'ఘాతగృహా'లే, 'పెనుభూతా'లే, 'రాక్షసు'లే, 'పిశాచు'లే—ఒకటా, ఇందులో కొన్ని అట్టకాకితంతోటే హడల కొడదామని 'జాగ్రత, జాగ్రత, పెనుభూతము, రాక్షసి' అని జడిపిస్తాయి. పిస్టల్ దెబ్బలు బయటనుంచే పడుతూంటే యిక లోపల చెప్పవలసిం దేముంది! అట్టతీసి నది మొదలు హత్యలే, వాక్యవాక్యానికి రక్తధారలే—పేజి కోరివాల్వరు పేల్తూనేవుంటుంది. చదివినంతసేపూ గుండెలు దడదడమని పోవాలని కాబోలు గ్రంథకర్త అభిప్రాయం—పోనీలెండి బ్రెయిన్స్ (brains)కి యేమీ పని లేనప్పుడు హార్టుకన్నా కొంత యివ్వకపోతే బాగావుంటుందా? బ్రెయిన్స్‌కి పని లేకపోవటం ఏమిటి అంటారా? ఏదైనా పుస్తకం చదివేటప్పుడు—అందులో నిరూపకనవల—మనం కొంచెం ఫాలో (follow) కావటం, ఆలోచించటం అంటూ ఉంటుందిగా నిజానికి. డబ్బిచ్చి పుస్తకం కొన్నది కాక యీకష్టం కూడా యెందుకు చదువరికని తేలికగానే పోతారు ఆఖర్ను. ఎట్లాగంటే, సాధారణంగా ప్లాటు (plot) పెద్దదిగాను, క్లిష్టంగాను వుంటే మనము—ఆఖర్ను కూడాను—confuse అవుతామని ఎక్కువప్లాటు అల్లరు. అసలు ప్లాటు వెయ్యనే వెయ్యరు కొంతమంది సెన్సిబిల్ రైటర్సు. కావాలంటే యింకోపదిహత్య లేసుకో లిస్టులో—పత్తేదారు (detective) వున్నాడా యను ఆరా తీయడానికి, మన కేంకష్టం—సరే యింకా దృశ్యా లేమన్నా వుంటే మహాకవులు వాళ్లే వర్ణించేస్తారుకదా, కళ్లెదట కట్టినట్టు—గుహల్లో నేమిటి, చీకట్లో నేమిటి అన్నిట్లో వస్తువులు విశదంగా కనబరుస్తారు మనఎదట—టార్చికూడా అనవసరం, మనకు కష్ట మేముంది. తర్వాత, ముం దేమి జరుగుతుందా కథలో నన్న ఆదుర్దాకూడా అక్కర్లేదు మనకి. కొందరు నవలాకారులు ముందు వచ్చే సంగతులు లోగడనే చెప్పేస్తూంటారు చదువరులకు కోపం రాకుండా—మరి, దొంగ ఎల్లా పట్టుపడతాడు, పడడా అన్న ఆలోచన కూడా అనవసరం మనకి—యేపాట్లో పడి పత్తేదారు పట్టుకుంటాడు, పట్టుకోలేకపోయినా గ్రంథకర్త ఏదో విధంగా హంతకుణ్ణి పట్టిస్తాడు పత్తేదారుకు, మన కెందుకు. ఇల్లాంటి విషయంలో మనకు బ్రెయిన్‌వర్కు (brain work) తగుల్తుందా మీరే చెప్పండి. ఏ షెర్లాక్ హోమ్సు (Sherlock Holmes) చదివి తలకాయ పగలకొట్టుకునేబదులు యిక్కడ పిస్టల్ ధాం ధాంలతోటి గుండే పగలకొట్టుకుంటామంటే సరే.

పైధోరణంతా చూస్తే మన తెలుగునిరూపకనవలలను ఆక్షేపించేస్తూన్నట్టు అవుపడుతుందేమో. నిజానికి యిప్పటి కొన్ని నిరూపకనవలల్లోను, అవి వ్రాసే విధంలోనూ, వ్రాసేవారి conception; లోను కొన్ని గొప్పలోపా లుండడంచేత అవి చెప్పడం ధర్మం అనుకుంటాను.

'పరిశోధన' (detection) అనేది పాశ్చాత్యులు ఒకకళ (art) గా భావిస్తారు. మీదుమిక్కిలి కొన్ని యితరసైన్సుల (sciences) సహాయముచేత యీపరిశోధననికూడా ఒకసైన్సుగా తీసుకుని యూరప్‌లో పోలీసులకు శిక్షణ యిస్తారుట, ఆసైన్సులో. ఒకపత్తేదారుడు ఒక స్వల్పవిషయాన్నైనా సరే సైంటిఫిక్ గా పరిశోధిస్తాడు. ఆస్ట్రియాలోని ఒకకేసు వుదాహరణంగా యిచ్చాడు ఫ్రాన్సిస్ సేయరు (Francis sayre) అనే ఒకరచయిత. అర్ధరాత్రి ఒకహంతకుడు ఒకనిని చంపి పలాయనం కావటంలో తన హ్యాటు (hat) మరిచిపోతాడు. ఓపరిశోధకుడు ఆటోపీలో యిరుక్కున్న రెండువెంట్రుకలను కొన్ని యంత్రాల సహాయంచేత పరీక్షచేసి హంతకుడు మధ్యవయస్కుడని, లావుపాటివాడనీ, తల నెరసినవాడనీ, ఇంకా యెన్నో సంగతులు భోగట్టా తీశాడు. ఆర్టు అంటే అది. ఈపరిశోధన అనే సైన్సుకి యింకా కొన్ని ఇతరశాస్త్రాలు-చిత్తవృత్తిశాస్త్రము (Psychology), ముఖలక్షణ నిరూపణశాస్త్రము (Physiognomy), యిల్లాటివి జోడుచేసి ఎంత భోగట్టా అన్నా లాగుతారు. ఇంకా క్రిమినల్ యాంత్రోపాలజీ (Criminal Anthropology) ప్రకారం వారు-దోషులు-(criminals) ఎన్నిరకాలుగావుంటారో, ఎందువల్ల వాళ్లు నేరంచేస్తారో, ఏనేరస్థుల నెల్లా శిక్షించాలో అంతా కనిపెడ్తారు—అందులో యిప్పటి నేరాలుకూడా చాలా కాంప్లెక్సుగా వుంటాయి కాదండీ—నవీనాచారాలకు, నాగరకతకు తగ్గట్టు—పొద్దస్తమానం హత్యే కాదుగా మరి, కారణం లేని హత్య—అంటుకని యీచిక్కైన సంగతులన్నీ తరచు సైంటిఫిక్ గా శోధన చెయ్యాలిసివస్తుంది—నేరం యింతకన్నా సైంటిఫిక్ గా వుంటుంది కాబట్టి.

కాబట్టి పరిశోధకనవలలు వ్రాశామంటే కొంత ఆర్టు చూపించాలి. ప్రతిపుస్తకానికీ ఏదో వుద్దేశమున్నట్టు పరిశోధకనవలలకుకూడా కొన్ని వుద్దేశాలుండాలి. కేవలం చదువర్లకు interest కల్గించడమే ఉద్దేశ్యంగా వుండకూడదు. ఇప్పుడు న్యాయశాస్త్రం (Law) లో కొన్ని దోషా లున్నాయనుకోండి, ఆ దోషాలవల్ల నేరాలు వృద్ధిఅయ్యేట్టుంటే ఆవిధం చూపించవచ్చు. అమెరికాలో యిప్పుడు అన్ని పాశ్చాత్యదేశాల్లోకన్న నేరాలు ఎక్కువగా జరుగుతున్నాయట. అందులో ముఖ్యంగా హత్యలు—లక్షకు ఎనిమిదిమంది హంతకు లున్నట్టు వార్డెన్ లాస్ (Warden Lawes) అనే అమెరికాదేశీయుడు లెక్క యిస్తున్నాడు. ఇంగ్లండు మొదలైన తక్కినదేశాల్లో చాలాతక్కువసంఖ్య వుంది. కారణం ఏమంటే అమెరికాలో క్రిమినల్ జస్టిసు అతిసందిగ్ధంగాను పాలుమాలికగాను జరుగుతుందట. హంతకుడు బయటపడడు, పడ్డా నూటికి తొంభైపాళ్లు జైలుప్రాప్తి కలగదు. అమెరికావారు యిప్పుడు పరిశోధకశాఖలను (Detective Departments) చాలా నిపుణంగా నడపాలనీ, శిక్షలు చాలాక్రమంగాను చురుకుగాను విధించాలనే ఆలోచనలో పడ్డారు. కాబట్టి యిలాటి న్యాయపాలనలో దోషాలు విమర్శించటం అనేవుద్దేశ్యంతో వ్రాయవచ్చు. లేకపోతే సంఘంలో కొన్ని అనర్థకమైన కట్టుబాట్లవల్ల దురాచారాలు ప్రబలుత వనుకోండి. అప్పుడు లాజికల్ గా ఈ యీసంఘదోషాలవల్ల ఈ యీదురాచారాలు కల్గుతున్నాయని చూపించవచ్చు. ఇంకా యిప్పటి యువకుల్లో చెడుసహవాసాలవల్ల, కృత్రిమ నాగరికతలోని దురభ్యాసాలవల్ల దురాచారా లెల్లా సాగుతయో, సాగుతున్నయో, చూపించవచ్చు. ఏనేరానికైనా కారణం అనేది ఒకటి వుంటుంది గాదండీ—హత్యకోసమే హత్య చేస్తాడా ఎవడన్నా, మతి సరిగా లేకపోతే తప్ప. ఇంతకీ చెప్పే దేమంటే, ఏదో ఓవుద్దేశాన్ని పురస్కరించుకుని మొదలుపెట్టావుండాలి నవల. ఏదో నాలుగుహత్యలు చేయించలేకపోతామా—పత్తేదారుడిచేత పట్టించలేకపోతామా అని మొదలెట్టకూడదు. ఏవుద్దేశమూ లేకపోతే నవల ఆర్టుకోసమన్నా రాయాలి. పరిశోధన అనేఆర్టు ఎల్లా చూపించవచ్చో, దాల్లో నైపుణ్యము ఎంతమట్టుకు ఎల్లా వుపయోగించవచ్చో చూపినా సరసంగానే వుంటుంది. పరిశోధకుడో పరిశోధన చేశాడంటే దానికి కొంత సైంటిఫిక్ వాల్యూ (scientific value) వుండాలి; అతని ఆలో

చనలన్నీ సహేతుకంగాను న్యాయసమ్మతంగాను, వుండాలి. గ్రంథకర్త అందిచ్చిన ట్టుండకూడదు. ఇప్పుడు మన నిరూపకనవలల్లోకూడా యీలాగే పత్తేదారుని ఆలోచనాశక్తి, కార్యనిపుణత, సమయస్ఫూర్తి, యుక్తి అన్నీ చూపిస్తారు. హంతకుడి స్థైర్యసాహసాలు, వాడి చదరంగపు యెత్తులు, వాళ్ళ భూతగృహాలు, ఘోర ప్రతిక్రియలు, భీషణప్రతిజ్ఞలు, ఇవన్నీ చూపుతారు. హంతకుడుకూడా చాలా తెలివైనవాడూ, స్థైర్యంకలవాడూ అయివుంటాడు కాదండీ—అందుకని వాడి స్థైర్యసాహసాలు వర్ణిస్తారు. ఒక్కొక్క హంతకుడు వ్రాసే అల్టిమేటమ్సు (ultimatums)చూస్తే స్తంభించిపోవలసిందే. కొంతమంది కర్తలు హంతకుడి పాత్ర బాగా పోషించడానికి కాబోలు వింతవింత వుత్తరాలు కూ, దూకిం చేస్తారు వాడిచేత. హంతకుడు చేసే పనుల్లోను, ఎత్తుగడల్లోను అవపడా లంటాను ఆతని దేహబలంగాని బుద్ధిబలంగాని—వుత్తరాల్లో యేమీ వుండదు వుత్త గొడ్డు అరుపులు దప్ప. అతను చేసే కార్యాల విచిత్రతలోనూ గూఢత్వములోనూ కర్తయొక్క యోచనాబలం తేలేది. అలాగే అవిచిత్రకార్యాలని ఛేదించడానికి చేసే శాస్త్రీయమైన పరిశోధన (scientific investigation) కూడా కర్తయొక్క aptitu తెలియజేస్తుంది.

పైవిషయాలన్నీ అలా వుంచి మరికొన్ని సంగతులు చూశాం. కొన్ని నవలారాజముల్లో హంతకుడి చాకచక్యముకన్న, పత్తేదారు పనితనముకన్న, గ్రంథకర్తగారి ignorance బయటపడ్తూంటుంది ఎక్కువ. ఒకనవలాకారుడు బొంబాయిపట్టణం రంగస్థలంగా తీసుకుని ఏకో చెప్పుకొస్తూ, ఆమట్టుని 'అర్ధరాత్రి—అందులో అమావాస్య: కళ్లు పొడుచుకున్నా అవపడనం లేదు (కళ్లు పొడుచుకుంటే అసలు అవపడ దనుకోండి, అదివా గ్రీతి). వీథిఅంతా గాఢాంధకారమయం-నిశ్శబ్దం' అని అప్పుడు హంతకు డాదారిని పోతున్నా డనో మరేదో చెబుతాడు. కాని బొంబాయిపట్టణ మేమిటి, వీథి గాఢాంధకార మేమిటి! ప్రతివీథిలోను సాధారణంగా తెల్లవార్లూ విద్యుద్దీపా లుంటయే, అందులో అమావాస్యే కర్తన్నట్టు, పట్టపగలల్లే వుంటయి బజార్లు, ఇదేం కర్మం యిల్లాంటాడు! కొంతమంది యీలోపాలోస్తాయనే తాము బాగా యెరిగిన పల్లెటూళ్లు రంగస్థలాలుగా వేసుకుంటారు. కాని ఓవిషయం చెప్పాలిసి వస్తుంది. హత్యలు మొదలైన దురాచారాలు ఎక్కువగా క్రిక్కిరిసివుండే పెద్దపట్టణాల్లో జరుగుతాయి. అక్కడ ఖూనీలు జరిగినాయంటే తనుకారణా లుంటాయి. వీలూ వుంటుంది. బాగా తెలిసి ఆరితేరిన (చదువుకున్నవారుకూడాను) ఖూనీదార్లూ వుంటారు. కాబట్టి రంగస్థలాలు ఏర్పరచడంలో కొంచెం సబబుగా పోతూండాలి. కొందరు పెద్దపట్టణాలు రంగస్థలంగా తీసుకున్నా వర్ణనప్రియులు, అలంకారప్రియులు కావటంచేత, ఏ బొంబాయినో లంకించుకుని అక్కడే ప్రకృతివర్ణనలు మొదలుపెడ్తారు. ప్రకృతివర్ణనలు చేతకానివారు కొందరు అన్నిగా తమకు నిరూపకనవలల్లోనే స్పెషల్ యాప్టిట్యూడు (special aptitude) ఉన్నట్టు భూతగృహాలు, పాతాళగర్భాలు హాడిలేట్టు వర్ణిస్తారు. వాటిలో వారి చిత్తము వచ్చినన్ని సోపానాలు, రాజమార్గాలు, దొంగఅలమారలు, బొత్తాములు, అనేకరకాలమరలు—గోడలు గోడలు లేచిపోతవి ఆ మరలతోటి—ఇవ్వన్నీ శాంక్షన్ చేస్తారు. మరీ అసంగతంగాను, అశక్యంగాను వుండే యీలాటి పాతాళగృహాలు కట్టేసి మన్ని చిన్నపిల్లలను జడిపించినట్టు జడిపించకపోతే, సహజమైన సంగతులనే చెప్పకూడదా అంటాను. నాలుగు గనిగోతులు తవ్వుకోవాలంటే గవర్నమెంటువారికి కంకగత మవుతుందే, వేలకు వేలు జనాన్ని పెట్టి పగలురాత్రి పనిచేయించినా — యీ చోరబహద్దర్లు యిరుగుకు పొరుగుకు తెలీకుండా భూగర్భంలో ఓచిన్న ప్రపంచాన్ని కట్టేస్తారే, వీరి శక్తి దొరతనంవారికి తెలిస్తే 'చోరబహద్దర్' తీసేసి 'రావుబహద్దర్' యిస్తా రన్నమాటేగా.

ఇల్లాంటి అసందర్భాలన్నీ చదువరులకు తెలుస్తూనేవుంటాయి. వచ్చిన చిక్కేమంటే అప్పుడప్పుడు గ్రంథకర్తలు ఫిలిమ్సు (films)లో కథలు తీసివే స్తూంటారు నవలల్లో. హంతకుడు మేడలమీదినుంచి మేడలమీదికి గుభీక్కీగుభీకీ దూకేస్తాడు — అరుగులమీది

నించి దూకినట్టు; వున్నవా డున్నట్టు అదృశ్యమై పోతాడు: ఇంకా యెన్నో గారడీవిద్యలు జరుగుతాయి. ఇవ్వన్నీ ఫిలిమ్‌లో చూడ్డానికి వినోదంగానే వుంటుంది, అక్కడ దృశ్యంకోసం పాటుపడతారు కాబట్టి. కాని నవల్లో అల్లా ఫిలిమ్ చూపిస్తే ఎల్లాగా— ఫిలింకంపెనీవారికోసం వ్రాసింది కాదుగా. నవల్లో ఫిక్షన్ (fiction) వుండొద్దాఅంటారేమో. ఫిక్షన్ అంటే జరగని సంగతుల్ని కల్పించి చెప్పటం — అంటే కా, నవల్లో వ్రాసేవన్నీ జరుగుతాయా చూసేకోసమని. అయితే జరగని సంగతులని చెప్పటం అంటే అవి జరక్కపోయినా జరగటానికి వీలుండేట్టు చెప్పాలి. ఈ ప్రపంచంలో యిదివర కెన్నడు జరగనివి, యిక ముందెన్నడు జరుగనేరనివి అనికాదు ఫిక్షన్ అంటే. అందుకోసమని, చోరశిఖామణి వున్నాడే, అతను చేసే ప్రతిదాంట్లోను సాధ్యత (possibility) వుండాలి. ఫిలింకథలు మనము ప్లాటుకి తీసుకున్నా అందులో వైరుపక్కసంబంధం, గారడీసంబంధం పనులన్నీ తీసేసి వరుస మార్చుకుని వ్రాసుకోవాలిసివస్తుంది — నవల్లో కథవరుస వేరుగా వుంటుంది గనుక. తర్వాత, నవల్లో ప్లాటుకి యివల్యూషన్ (evolution) వుండాలి. అంటే ఒకవిధమైన క్రమం వుండాలి. కథలో ప్రతిభాగానికి పరస్పరసంబంధం వుండాలి. వీటిని బట్టి తక్కినవి జరుగుతూండాలి. ఇప్పుడు చూడండి, ఒకసంగతి జరిగిందంటే అది యీయీవిధంగా జరిగిందని యెప్పటికైనా పుస్తకం అయ్యేలోపల తెలియాలి—పూరికే జరిగిందనుకోండి అంటేకాదు. పత్తేదారు వేషం మార్చి హంతకుడింటో పనిచేసేవాడిలాగ నాలుగునెల్లున్నాడంటే కాదు, ఎల్లా వేషం మార్చాడో, హంతకుడు కనుక్కోకుండా నాలుగునెల్లుండడానికి వీ లెల్లా కలిగిందో చెప్పాలి. తర్వాత, ప్రతివిషయం సహేతుకం (reasonable)గా వుండాలి, హత్య ఎందుకు చేశాడంటే వాడు హంతకుడు కాబట్టి, హత్య చెయ్యగలడు కాబట్టి, చేశాడంటే లాభం లేదు. ఫిలింకథకు నవలకు ఇక్కడే భేదం అవపడుతుంది. నవలలో ప్రతిసంగతీ సమర్థించాలి, ఫిలింలో అట్టే లుండదు ఏసంగతి చేసినా, అదేం అని ఎవర్ని అడుగుతాం.

కాబట్టి మన మిప్పుడు కూర్చుకోవలసిన అభిప్రాయ మేమంటే, ఈ నవల అనే గ్రంథానికి మనము వాఙ్మయంలో గొప్పస్థానము సంపాదించలేకపోయినా దాని విలువ దాని కుంచాలి—కేవలం వినోదానికి, అమ్ముడుపోవటానికి ఏర్పడ్డ వస్తువల్లే వుంచకూడదు—రైల్వేలిటరేచర్ (railway literature) లో పుస్తకాలమల్లే. నిరూపకనవల అయినంతమాత్రాన ఏవిధమయిన నియమాలు—సాహిత్యసంబంధంగాని, కళాసంబంధంగాని—అవసరం లేదనుకోటం తప్పు. ఇప్పుడు ఆంగ్లంలో నాటకాలు గాని, నవలలు గాని చూడండి: ఏవో కొన్ని సాహిత్యనియమాలు గాని, కళానియమాలు గాని (literary principles or art principles) అనుకరిస్తాయి. అంచేత వాటికి సారస్వతంగా కొంతవిలువ వుంటుంది. ఒక రొమాన్సు (Romance) వుంటుంది అనుకోండి; అందులో ప్రేమయొక్క పుట్టుక, దాని తత్వము, దానిమానసికవృద్ధి (psychological development), దానిపరిణామము అన్నీ కథతోపాటు చూపేస్తారు. కథ నిమిత్తమాత్రంగా వుంటుంది. నియమానుసారంగా ప్రేమ అనే చిత్తవృత్తికి సైంటిఫిక్ స్టడీ (scientific study) యివ్వడం ముఖ్యోద్దేశము. అల్లాగే మన నవలలకుకూడా కొన్ని నియమాలను అనుసరించిపోతూ ఒకవిధమైన లిటరరీవాల్యూ (literary value) తీసుకురావచ్చు. సారస్వతంగా విలువతీసుకురావటం అంటే నవలను శబ్దాలంకారచూడామణిమల్లే తయారుచేయటం కాదు. నవల్లో భాషాగాంభీర్యం అంత పాటింపదగ్గ విషయం కాదు; మీదుమిక్కిలి తగ్గించేయాలిసిన విషయం.

నవలకి ప్రథమంలో కథవిలువ (story value) వుండాలి—అంటే కథఅల్లికలో కొంత ఆర్టు చూపించాలి. నిరూపకనవలలో కథఅల్లికలేక ప్లాటు అనేది ముఖ్యాంశం. ప్లాటులో ఒకవిధమైన క్రమాభివృద్ధి (Orderly development) వుండాలి. కాని చేస్తే

విషయాలు గూఢంగాను చిక్కగాను ఉన్నా, అసంగతంగాను విరుద్ధంగాను వుండకూడదు. తర్వాత నవలల్లో పాత్రపోషణ అనవసరం కాదు. ఇంగ్లీషునవలల్లో చూడండి క్యారక్టర్ డెవలప్మెంటు (character development) అంటే యెంత ప్రాధాన్యత ఇస్తారో. పత్రికల్లోకూడా క్యారక్టర్ స్కెచ్ కొచ్చిన తప్పుతున్నదా మరి. మననిరూపకనవల్లో ఈఅంశం బొత్తిగా గమనించరు. కొన్ని నవల్లో క్యారక్టరు స్కెచెస్ సుష్టాగా వుండవు. మరోసంగతేమంటే, నిరూపకనవల్లో, కథలో యీవెంట్సు (events) చదివేవాడికి ఏవరసగా చెప్పాలో తెలియాలి. ఇదికూడా ఒక ఆర్టే. కథలో చివరదాకా ఓవిధమైన మిస్టరీ (mystery) వుంచుతూవుండాలి. సంగతులన్నీ ఎప్పటికప్పుడు బేబాకీగా చెప్పక్కరలేదు.

ఈనవలల్లో ఒకహాత్యలకే తప్ప మరివేటికి అవకాశంలేదనుకోటం తప్పు: గ్రంథకర్తకథలోనే సాంఘికవిషయాలనుగురించి ఏదైనా ప్రస్తావన చెయ్యవచ్చు; నూతనఅభిప్రాయాలేమన్నా వుంటే వ్రాసి మన్ని ప్రబోధించవచ్చు,—తప్పు కాదు. కాబట్టి నిరూపకనవలనుకూడా తయారుచేసేవిధంలో చేస్తే కొంతవిలువ ఉండకపోదు. నవలకు విలువ నెందుకు అంటారా? రూపాయి అణాలు పైసల విలువ వున్న ప్రతి పుస్తకం లోపల విషయాని కేం విలువక్కర్లేదూ. నవలలు కరెంటు లిటరేచర్ (current literature) అనే భాగంలోకి వస్తయి. ఏరాష్ట్రంవారి విజ్ఞానమన్నా కొలవాలంటే వారి వాఙ్మయ స్థితిగతులేగా మనము చూచేది. కాబట్టి ఆంధ్రరాష్ట్ర విజ్ఞానానికి పేరు తేవాలంటే ఆంధ్రలోకంలోకి మంచి పుస్తకాలు పంపటం మన విధి అంటాను. ఇంతా ఎందుకు చెప్పాలిసివస్తున్నదంటే, ఆంధ్రంలో యిప్పుడు వచ్చేనిరూపక నవలలు ప్లాట్ఫారాలమీద అమ్మబడేవి, కేవలం అందుకే తయారుకాబడ్డట్టు కనుపిస్తున్నాయి. 'రాజమండ్రిదవ్వా', 'గుంటూరుగుంట', 'తెనాలి తమాషాలు' అనే పుస్తకాల లెవెలులో నిరూపకనవలలని ఉంచడం భావ్యంగా లేదనుకుంటాను. అందువల్ల యీగాథ బయల్దేరాలిసి వచ్చింది. ముందు కాబోవు రచయితలన్నా కొంచెం ఉన్న తాళయాలతోటి బయల్దేరి యీ నిరూపకనవల అనే వస్తువుకి విలువ యిస్తారేమో అని నా ఆశ.

---

## నటకునకు

యం. యం. వేంకటాచార్యులుగారు, బి. ఏ.

కరముల్ గంతము వెల్వడన్ మదిని భీకంపంబులం బోవిడి
ల్చి, రహిన్. స్పష్టముగా, సభావముగ నోలిన్, శబ్దముల్ సెప్పుచున్,
స్వరయుక్తంబుగ సుంతి సాహితికి మేల్సంగీతముం గూర్చి, మా
ధురి చేఁషించుచు నాట్యమాడినఁగదా తోఁచున్ మహానందముల్.

---

వ్యాకరణములును, ఛందస్సులును, అలంకారగ్రన్థములును భాషలోని యందములను గ్రహించి యానందించు రసికులును, రమణీయకావ్యస్రష్ట లగు కవులును భూమిపై బయలుదేఱుట కేర్పడినవి.

తమనాఁటి కేర్పడిన భాషాప్రపంచమునఁ దాము గుర్తించిన యందములకు గుర్తులు చూపిన నట్టిగుర్తులు గమనించి రాఁబోవు చదువరులు తాము పొందిన యానందమును జూఱఁగొనుదు రనియు, భవిష్యత్కవు లాలక్షణములు గల్గఁ గబ్బము లల్లి యయ్యందముల నాచంద్రార్కముగ నిల్పఁగల రనియుఁ దలంచి లోకసంగ్రహపరు లగు లక్షణగ్రన్థకర్తలు గ్రంథరచనకుఁ గడఁగియుండిరి.

అభ్యాస మేపనిలో బలపడినను నరునకు రుచి గల్గించి దాని నాతఁడు వీడఁ జాలనట్లు చేయును. కొన్ని తరములనుండి యలవాటు పడిన యాచారములను విడిపింపఁ జేయు సంస్కారప్రియు లొనర్పు భగీరథప్రయత్నములే దీనికిఁ దార్కాణ. కావ్యపరిశీలనాభ్యాసము కూడఁ గావ్యములలోఁ జదువరులకు రుచి గలిగించును. ఆరుచి పరిపక్వమై రసాస్వాదమని చెప్పఁబడును. ఇట్లు రసికతకుఁ గారణమైన సుకావ్యవ్యాసంగము స్వయంకృషిరూపముగ నుంటకంటె, నిరంతరకృషి సల్పి సాహితీపరిణతిం గాంచియున్న ప్రాచీనగ్రన్థకర్తలు చూపిన మార్గమున వారి యనుభవములఁ జేయూఁతగఁ జేసికొనుచుఁ జమత్కారముల ననుసంధానము సేయు రూపమున మాఱిన మేలుకదా! చదువరులకు సుకుమారమతుల కట్లు చేయూఁతలై మార్గదర్శిత నవలంబించుచుండునవి లక్షణగ్రన్థములు. ఇట్లనుటచే సత్కావ్యార్థానుసంధానమునకును, విభావాదులను కావ్యములకు మాత్రమే సంబంధించినవి కాక సహృదయులకు సాధారణము లగుటకును, హృదయసంవాదముతోడి రసాస్వాదమునకును లక్షణగ్రంథములును సహకారులై, లక్ష్యప్రబన్ధసామగ్రితో పాటు, మఱొక విషయము నెఱుఁగఁజాలని తన్మయతను సరసుల కొనఁగూర్పు ననిన ట్లయినది.

కాని యొకటి చెప్పవలసియున్నది. లక్షణగ్రన్థములు లక్ష్యముల వ్యాసంగమునకును, బరిశీలనమునకును దారి చూపునవిగ నుండవలెను గాని లక్షణస్వరూప శోధనము నతివ్యాప్త్యవ్యాప్తివిచారణలతోఁ జేయు టనెడి పూర్వాంగములను విస్తరము సేయుటచే లక్ష్యచమత్కృతులగుట నెడి రసికగమ్యమగు కావ్యానుసంధానఫలముదాఁక పోఁజాలక విసువు గనువారినిగఁ జదువరులఁ జేయునవిగ నుండఁ గూడదు. ఫలమగు రసచర్వణకు సత్కావ్యార్థానుసం

ధానమును, దానికి లక్షణగ్రన్థముల దిక్ప్రదర్శనమును సాధనములు కాన సాధ్యమయినంత లాఘవము లక్షణగ్రన్థములకుఁ గావలసినది. అతివ్యాప్తి, అవ్యాప్తి మున్నగు దోషముల దూషితము గాని శుద్ధస్వరూపము లక్ష్యముల నెల్లప్పుడును బరిశీలించుచుండుటచేఁ బరిశీలకులకు స్వరశ్రుతిలయాదులు సంగీతము పాడనేర్చినవాని కాత్మకు గోచర మయినట్లు గోచరించు. దోషసంస్పర్శ మొక్కింతయు లేనట్లు మాటలు లక్షణములకు గుదురనక్కఱ లేదు. ఔచితినిబట్టి తెలిసికొనెడి కొన్ని విశేషములను మాటలతోనే చెప్పవలె ననుకొనుటచేఁ గొంత లక్షణపరిష్కార బాహుళ్యము పొడమెడి. వహ్ని కొండం గల దనిన, సంయోగసంబంధముతోడనే యుండునని యౌచితింబట్టి శ్రోత తెలిసికొనఁగలఁడు. సమవాయసంబంధముతో నుండునని శ్రోత తెలిసికొనునోయని సంయోగముతో వహ్ని కొండం గలఁ డనవలసి యుండదు. అదిగాక, భేదములు విడఁదీసినకొలఁది పెరుఁగును. ఈ పెరుఁగుట విడఁదీయువారి పరిశీలనబలమునుబట్టి యుండును. తానెక్కువకాలము పరిశ్రమము సల్పి సేకరించిన భేదపరిష్కారప్రపంచము నెల్ల నొక్కమాఱుగఁ జిన్నతరగతి విద్యార్థుల కందిచ్చి వారి కద్భుతము గల్గించుట విమర్శకునకుఁ బరోపకారరసికత గాఁజాలదు. తన ప్రౌఢి నెక్కువగ బడాయికిఁ జూపి తనగ్రంథమున కధికారులౌ వారి కైమోడ్పు లందవలె ననుకొనుట గ్రంథకర్తల స్వార్థపరత. ఏ పెద్దభేదముల నెఱింగినంత, పరిశీలనము హెచ్చినకొలఁది నవాంతరభేదములను విద్యార్థి తనవలెనే కనిపెట్టఁగలఁడో, ఆ మహాభేదములను మాత్రము తాను ప్రతిపాదించి, మిగిలిన యవాంతరభేదములను తన ప్రతిభతో విద్యార్థి యుల్లేఖింపఁగల స్వతంత్రుఁ డగునట్లు మార్గదర్శి యగుట లక్షణగ్రన్థకర్తకు విధి. స్వపాండిత్యప్రకటనమును బ్రధానముగఁ జూచుకోక, చదువరులకు బరిశీలనస్వాతంత్ర్యమును గటాక్షించుమార్గములు చూపుటకన్న లక్షణకర్తకు ముఖ్యకృత్యము లేదు.

"తే చాఽద్యాపి వికల్ప్యంతే
కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి,
కింతు బీజం వికల్పానాం
పూర్వాచార్యైః ప్రదర్శితమ్,
తదేవ పరిసంస్కర్తు
మయ మస్మత్పరిశ్రమః."

అను శ్లోకములతో దండి లక్షణగ్రన్థముల కుండవలసిన పరిమితత్వము నిర్ణయించెను. ఇట్టి లక్షణగ్రంథసాహాయ్యముతోఁ గావ్యనాటకానుసంధానమును దన్మయబుద్ధితోఁ జేసిన యార్ద్రహృదయుఁడు సరసకవి గాని రసజ్ఞుఁ డగు వ్యాఖ్యాత గాని కాఁగలఁడు.

"తదస్తతంద్రై రనిశం సరస్వతీ
శ్రమా దుపాస్యా ఖలు కీర్తి మీప్సుభిః,
కృశే కవిత్వేఽపి జనాః కృతశ్రమాః
విదగ్ధగోష్ఠీషు విహర్తు మీశతే." అనిదండి,

ఇదిగాక ప్రాచీనవాఙ్మయములోని యందములఁ జూపుటన దశరూపములోఁ బంచసంధుల యంగములుసూపినట్లు. ఇక్కడ ‘ తూ ’ ఉండవలెను. ఇక్కడ ‘ చా ’ ఉండవలయును. కాళిదాసుఁడు శాకుంతలము మొదట స్రగ్ధర రచించెను గావున నంద ఆవృత్తముతోనే ప్రారంభింపవలెను—అని యిట్లు గ్రంథప్రణాళికల నెల్లఁ జూపమొదలిడిన విద్యార్థుల లేక చదువరుల స్వాతంత్ర్యమునకుఁ గరావలంబ మొసఁగమియే కాక వారికాళ్లకు బంధాలు వేసినట్లగును.

ప్రతిభ యనునది కొంద అదృష్టవంతుల కలవడు బుద్ధిధర్మము. ఒక్కకాలమున నని కాని,యొక్కచోట నని కాని దానిని నియమించి నిరూపింపలేము. పూర్వులే ప్రతిభాశాలులు, ఇప్పుడట్టివారు పుట్టరు—అనుకొనుట పొరపాటు.

“ పురాణ మిత్యేవ న సాధు సర్వం,
నచాఽపి కావ్యం నవమి త్యవద్యమ్.”
అని కాళిదాస కవి.

ఇప్పటి ప్రతిభాశాలులు వెనుకటివారు గిరిగీచిన చోటనే తమ యూహాప్రవాహముల వంపులతోఁ బొఱుదలచేసిన నవనాగరిక దేశములలో నెల్లెడంబోలెఁ గ్రొత్త మొలకలు వాఙ్మయారామమునఁ బొడగట్టవు. బహూచ్ఛిష్టమై ధూళిధూసరితమగు ప్రాఁతపాకముల రసమే మన కాచంద్రతారార్కముగ నాస్వాద్యము కాఁగలదు. సృష్టిపరిణామస్వాభావికము లైన బహువిధైశ్వర్యవిలాసలాభములకు మనమును మనజాతియు వెలియగుదుము.

కవిబ్రహ్మ యెపుడు స్వతంత్రుఁడు కాఁడో అపుడే నూత్నశిల్పములకు జాతియొక్క మెదడు వెలియగును. నవీనరహస్యములను కల్పనాప్రపంచముద్వారా వాఙ్మయప్రణాళికలలోఁ బ్రవహింపఁజేయు సుకవుల సందేశము లుగ్గుఁబాలుగ నేజాతికి జీర్ణమగుచుండునో వారిదే యభ్యుదయము, వారిదే స్వాతంత్ర్యము, వారిదే విజయము.

కాన లక్షణగ్రంథములు పూర్వుల పోకడలనెల్ల నేకరువుపెట్టి కవుల యవకాశ మపహరించునవి కాక మార్గదర్శకములె కావలెను.

ఒక దృష్టాంతము: మహాకావ్యములలోఁ బదునెనిమిది వర్ణనములు కానవలెనని దండి ౭ వ శతాబ్దములోఁ జెప్పె. ఆ పదునెనిమిది పదార్థములకన్న రమణీయములైన విప్పుడెన్ని మనకన్నుల కగపడుట లేదు? విద్యుద్దీపము లేనా, వాయు విమానములేనా, టెలిగ్రాఫు లేనా, రైల్లేనా, ఫ్యాక్టరీలేనా, ఎన్నో అతివిచిత్రములైనవి మనకుఁ గన్పట్టుచున్నవి. ఈయందములెల్ల వదలుకొని దిక్కుమాలిన మధుపానజలక్రీడాదివర్ణనలతో మనము గాలక్షేపము చేయవలె ననుట యెట్టిన్యాయము? ఇది యూర్ధ్వహృదయుఁడగు స్వతంత్రకవి కెంతటి కష్టము?

ఒక్కొక్కప్పుడొక్కొక్కదేశమున నొక్కొక్కభావమున కుద్రేకము గల్గియుండును.

అప్పు డాయుద్రేక మార్ద్రహృదయుల హృదయప్రణాళికలనుండి యుబుకుచుండు. అట్టిసహజకవితాప్రవాహమే జనుల నాకర్షించు. కావుననే యిప్పుడు స్వదేశాభిమానవాయుపూరితమగు నాంధ్ర దేశమున

"పాడైన పినుకోటగోడల దీర్ఘని
ద్రలు వోవు కాకతిసాభవంబు
నిండారఁ బాఱు నఖండగోదావరి
డాఁగిన చాళుక్యనాగరికత
తనగీతి యఱవజాతిని పాఠకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెలుఁగువాణి—"

అను నిట్టి పోకడలును,

"నాయకురాలి మాయఁకద
నంబున మాపలనాటి పౌరుష
శ్రీయడుగంటె, గడ్డి మొలి
చెఁ బలిచారల గద్దెమీఁద"

అను నిట్టి రచనలును వినువారి కింపు నింపెడిని. శబ్దార్థములయందములను జెప్పుటకు గుణములనియు, వృత్తులనియు, రీతులనియు, నలంకారములనియు నిన్నిటి వేలువేలు సంఖ్యలతోడను, వేలువేలు స్వరూపపరిష్కారములతోడను సంస్కృతలక్షణగ్రన్థకర్తలు వివరించి గ్రంథములను బెంచిరి. వీనిని సంగ్రహముగఁ జెప్పి దిక్ప్రదర్శనముగా వించినఁజాలును. అందమును గనిపెట్టెడి నైపుణ్యము లవడిన కవికయ్యైవిషయములు స్వయముగఁ బాడకట్టు. అట్టి ప్రతిభ లేనినాఁ డీలక్షణశ్లోకము లెల్ల వృథలు. మానసికభావము లెల్ల స్థాయిభావములును, సంచారిభావములు నని చెప్పి యనుభావసాత్త్వికభావములను వ్యంజకచేష్టాదు లనిన, భావము లూహకు రాఁగలవు. సాహిత్యదర్పణాదుల వ్యభిచారిభావాలకును, హావభావాదులకును ప్రత్యేక మొక్కొక్కదాని కొక్కొక్క లక్షణమును, ఒక్కొక్కటో రెండురెండో లక్ష్యములును ఇచ్చి గ్రన్థము పెంచినంత నాకవులు వ్రాసినట్లే యాభావముల నితరుఁడు చిత్రింపఁగలఁడా? చిత్రించినను ఆప్రాఁత శిల్పము లేమనకెందుకు? వారి కేమెద డాకల్పనల ననుగ్రహించెనో ఆమెదడు మనకును గలదుకదా!

"ఆకీట మాకైటభవైరితుల్యా
ఇష్టార్థలాభా త్కృతకృత్యభావః."

అని శ్రీహర్షమహాకవి చెప్పినట్లు, పూర్వసంస్కారము ననుసరించి యొక్కొక్కని కొక్కొక్కదానిలోఁ బ్రీతియుండును. కావ్యనాటకాదులలోన నట్లే కొందఱు రంజిల్లువా రుందురు. వారికిఁ గావ్యార్థానుసంధానమున నానంద మపరిమితముగ, బ్రహ్మానందము మాదిరిగ, నితరవిషయముల నెల్ల మఱచునట్లు, గలుగుటను జూచి అది యేల యెట్లు కల్గునని పరీక్షలకు లాలోచించి సాధారణీభావము, చర్వణ మొదలైనవాని మూలమునఁ గల్గుననియు, నా సాధారణీభావము భావన యనెడి శబ్దములపని వలనఁ గల్గుననియుఁ గొందఱును, కావ్యనాటకాది గుణాలంకారాదివైచిత్ర్యముచేఁ గలుగు నని యభినవగుప్తపాదాచార్యప్రభృతులును రసోత్పత్తిని గుదిర్చిరి. సాధారణ్య మనఁగా

శకుంతల దుష్యంతునకు భోగ్యమైనను జూచువానికి స్త్రీమాత్రముగాఁ దోఁచి భోగ్యగాఁ గన్పట్టి యానంద మొసఁగుట. ముదుసలివారికిని కర్మజడులకును శృంగారానందము గల్గదు గాన ఇప్పటి వాసన రసాస్వాదమున కావశ్యకమనియు, జాతులకుఁగూడఁ గొందఱకు రసానుభావ ముండదు గాన పూర్వవాసన వలయుననియు సాహిత్యదర్పణకర్త చెప్పె.

ఆనందవిషయకసంవిత్తు, లేక సంవిద్విషయానందము రసము. ఇది బ్రహ్మానందసహోదరము. అని యెన్నిమాటలు చెప్పినను ఆనందముకన్న మఱొకటి రస మనునది కన్పట్టదు. ఇది యిష్టార్థలాభమం దెల్లెడలఁ గలదు. ఈ కావ్యముల యానందమును గూర్చి మాత్ర మిది యలౌకికమని, బ్రహ్మానందసమమని యుక్తిశాలులు పెక్కు విమర్శములు శాస్త్రీయముగ వ్రాసియుండిరి. ప్రతిభాశాలి చేతి కేది వచ్చిన నదియిట్లే పెంపుగను నేమో, డబ్బున్నవాని పుస్తకాలు తొందర తొందరగ నచ్చుపడినట్లు. ఈ రసమునుగూర్చి యుత్పత్తివాదులు, అనుమితివాదులు, భుక్తివాదులు, వ్యక్తివాదులు నిన్నితెగలు పరీక్షకు నేర్పడిరి. ఆహా! ఊహాపోహాశక్తి యెంతకు లేదు? లక్షణగ్రన్థముల గట్టిగ వల్లించినవాఁడు తన కబ్బమున రసము చిప్పిలఁజేయఁగలఁడా? అట్లు సేఁత యనుభవదూరముగ నున్నది. ఏ లక్షణముల నెఱుఁగనివాని వాణి రమణీయ మగుటయు, శాస్త్రజ్ఞుల వాణి నీరసముగ నుంటయు గానవచ్చెడిని. కాన సరసకవితకుఁ బూర్వసంస్కార మపేక్షణీయముగఁ దోఁచెడి.

"నైసర్గికీచ ప్రతిభా
శ్రుతంచ బహునిర్మలమ్,
అమందశ్చాఽభియోగోఽస్యాః
కారణం కావ్యసంపదః."

ఇందు మొదటఁ బ్రతిభను జెప్ప దండికిని బై యభిప్రాయ మిష్టమనిపించు.

అలంకారము లగ్నిపురాణకాలమునుండి నేఁటిదాఁక సంఖ్యతోఁ బెరుఁగుచున్నను చమత్కృతిజనకత్వమును గుర్తించుశక్తి చదువరుల కలవడుట ముఖ్యము. అది లేనినాఁడు వైద్యశ్లోకములలోని దృష్టాంతములు నలంకారములు కావలసివచ్చును. చమత్కృతిగ్రహణదక్షులకు నలంకారవిశేషనామము లెఱుఁగమిచే నయ్యెడి లోపము కన్పట్టదు. ఇంగ్లీషులో నిన్ని యలంకారనామములు లేకున్నను అన్యోఽలంకారములు లేవా? వాని చమత్కారములు వారికి లభించుట లేదా? అట్లు చమత్కృతు లగుట పురుషార్థము.

అట్టి చమత్కృతియోగ్యతయే సరసకావ్యనిర్మాణమునకును, కావ్యసారస్యసంగ్రహచాతురికిని బ్రబలహేతువు. అన్వయవ్యతిరేకములచే నట్టి కార్యకారణభావము నిరూపింప శక్యముగ నున్నది.

కాలభేదమున రుచులు మాఱును. వాల్మీకి మున్నగువారి దీర్ఘవర్ణనలు మన కిప్పుడు

నచ్చవు. పింగళిసూరనాదులు గొప్పగాఁ జెప్పఁ గొనిన శ్లేషరచనల నిప్పుఁ డీసడించుచున్నారు. సూరన ఎట్లు చెప్పెనో చూడుఁడు :

"నా, నామహితప్రబంధరచ
నాఘనవిశ్రుతిసేకుఁ గల్గుటకు
నామది దద్వయార్థకృతి
నైపుణియుం గలదంచు నెన్నెదన్."

కాన చమత్కృతి ప్రధానముగఁ జూచు కొనవలెను. దానివలన నెప్పు డెయ్యవి చమత్కారహేతువులో వానిని కవి పాటింపవలెను. అంతియు కాని చమత్కారదృష్టిని విడనాడి, పూర్వుల పోకడ లన్నియు నప్పటి లాక్షణికులచేఁ బేర్లు పెట్టఁబడినవి యలంకారములని మనరచనలలోఁ బ్రవేశపెట్టఁబడిన నవనాగరికలోక మిద్దాని నీసడించుట తప్పా?

---

# పదునేనవశతాబ్దమందలి వాఙ్మయము

యస్. శ్రీకంఠశాస్త్రిగారు, యం.ఏ.

(భారతి విభవ వైశాఖసంచిక తరువాయి)

### తృతీయఘట్టము (౧౪౪౬-౧౪౮౬)

ఇప్పుడి దేవరాయని యనంతరము సాహిత్యలక్ష్మి రాజ్యలక్ష్మి ననుసరించి కించిత్కాశాహీన మైనది. ప్రతాపదేవరాయని భుజాదండాభిఘాతమునకు భీతిల్లిన బహామని గజపతిరాజులు ఆ ప్రతాపసూర్యుఁ డస్తమించిన క్షణమున నంధకారమట్లు విజయనగరము నాక్రమింప ప్రయత్నము చేయుచుండిరని చారిత్రకగ్రంథములనుండి తెలియవచ్చుచున్నది. గంగాదాసుని ప్రతాపవిలాసము "తదాకర్ణ్య దక్షిణసురత్రాణేన గజపతినాచ ......విజయనగర మావృత్య స్థితం గిరికం దతా ద్విజయనగరతః శ్రీమల్లికార్జునరాజో బహిర్నిర్గత్య హయపతి గజపతి సైన్య మశేష మజయత్" అనుటచే మల్లికార్జునుఁడు సింహాసనారోహణము గావించిన తత్క్షణమే స్థానసంరక్షణార్థముగా విజయయాత్రకు బయలుదేఱుట తటస్థించినది. మల్లికార్జునరాయని రాజ్యభారము అంతర్విరోధుల కుహకవ్యాపారములవలనను, బహిశ్శత్రుల బాధచేతను సుఖముగా నడచినది కాదు. సుమారు క్రీ. శ. ౧౪౬౫-వ వర్షమున విరూపాక్షుఁడు మల్లికార్జునుని స్థానభ్రష్టునిగాఁ జేసి బంధువర్గములఁ జంపి రక్తస్రావము గావించి సింహాసనారోహణము చేసెను. అయిన నీదుర్మార్గుఁడు బహుకాలము రాజసుఖము ననుభవింపలేఁడు. సాళ్వవంశజుఁడైన నరసింహుఁ డీకాలమున జనుల సమాధానమును తన కనుకూల మగునట్లు నన్నాహములుచేసి చక్రవర్తి గావలెనని ప్రయత్నించుచుండెను. ప్రజల అసమాధానమువలనను, నరసింహుఁడు ప్రభువునకు సాయము చేయకపోవుటవలనను బహామనీసుల్తానుఁడగు అల్లాఉద్దీన్, రెండవమహమ్మద్‌షహా దొరలు విజయనగరముపై దాడిచేసిరని తెలుచున్నది. మహమ్మద్‌షహా రాజమంద్రి, కొండవీడు, మాహూరు మొదలయిన పట్టణములను దీసుకొని కంచినికూడ ముట్టడించెనని తెలియుచున్నది.

దేవరాయనికాలమునందే రాజమహేంద్రవరము కొండవీడురాజ్యము రెడ్డిరాజుల చేతినుండి గ్రహింపఁబడి కర్ణాటకరాజ్యమునకు చేర్పఁబడెను. కపిలేశ్వరగజపతియు విజయనగరచక్రవర్తికి అధీనుఁడై యుండెను. అయితే అతని అనంతరము ఈ రెండురాజ్యములు కొంతకాలము మహమ్మదీయుల యధీనమై యుండినందున శ్రీనాథునిస్థానమై యుండిన రెడ్డిరాజులసామ్రాజ్యమును వీడి సాహిత్యశ్రీ పద్మనాయకుల నాశ్రయించెను. సర్వజ్ఞసింగముని ప్రోత్సాహమువలనఁ బ్రవర్ధిల్లిన వాఙ్మయమును చర్చించుటకు మొదలు

మల్లికార్జునవిరూపాక్షుల క్రింద ప్రఖ్యాతికి వచ్చినకవుల సాహిత్యసన్నాహములను జూడవలెను.

మల్లికార్జునుఁడే స్వతః గొప్పకవి. న్యూనిజ్ అనుచరిత్రకారుఁడు పినరాయఁడు బహువిద్యావిశారదుఁడనియు, అనేకగ్రంథకారుఁడనియు, అసాధారణజ్యోతిష పాండిత్యము గలవాఁడనియు వ్రాసియున్నాఁడు. ఈతని యాజ్ఞానుసారముగా కన్నడమున "జనవశ్య" మను కామశాస్త్రము రచించిన కల్లరసుఁడు "ధాత్రీశ దేవనృపపుత్ర మూరురాయరగండ వైరినృపగజగండభేరుండ యదువంశవనధివిధు" మల్లికార్జునుఁ డని సంబోధించియున్నాఁడు. ఈకన్నడగ్రంథమునకు మూలము మల్లికార్జునుఁడు విరచించినది "రతిరత్నప్రదీపిక" యని తోఁచుచున్నది. గ్రంథాంతమందుండుగద్యమునందు "ఇతి శ్రీ ప్రౌఢ దేవరాయ మహారాజ విరచితాయాం రతిరత్నప్రదీపికాయాం" అని యుండుటవలనను, మల్లికార్జునమహారాజుకు 'ప్రౌఢ దేవరాయ', 'ఇమ్మడిదేవరాయ' మొదలయిన బిరుదు లుండెనని శాసనములవలనఁ దెలియుటవలనను, మల్లికార్జునుఁడే ఏతద్గ్రంథకర్తయని నిర్ధరింపవచ్చును. శార్ఙ్గదేవకృత సంగీతరత్నాకరమునకు వ్యాఖ్యానమును వ్రాసిన ప్రౌఢదేవుని ఆస్థానవిద్వాంసుఁడైన కల్లయామాత్యుఁడే "జనవశ్య" గ్రంథకర్తయయిన కల్లరసుఁడయి యుండవచ్చును.

మల్లికార్జునరాజుకాలమునందు ఇమ్మడిదేవరాయనిక్రింద ప్రవర్ధిల్లిన వీరశైవమత ప్రాబల్యము తగ్గుచువచ్చెను. తోంటదసిద్ధలింగ, స్వతంత్రసిద్ధలింగ, గుమ్మళాపురదసిద్ధలింగ, నీలకంఠాచార్య, మల్లికార్జునాది వీరశైవులు గ్రంథములను రచించిరి. ఇంతవఱకు శైవవీరశైవమతాభిమానులుగా నుండిన విజయనగరాధీశులు క్రమక్రమముగా వైష్ణవాభిమాను లగుచు వచ్చిరి. తుదకు కృష్ణదేవరాయ రామరాయ వేంకటపతిరాయల కాలమున వైష్ణవసంప్రదాయములే ఆచరణమునకు వచ్చెను. గురుపరంపరా ప్రపన్నామృతాది గ్రంథములు విరూపాక్షుఁడు పిశాచబాధితుఁడై నరసింహాచార్యులచే పురాణములు విని వైష్ణవుఁ డాయెనని తెలుపుచున్నవి.

వ్యాళేన కేన చిద్రాజ్ఞా నిశీథే రాజ్యకాంక్షయా,
విరూపాక్షేణ నిహతా, కుష్ఠినసుతే వయమ్,
తేన ప్రాప్తాః స్మ పైశాచం సర్వే సపరివారకాః,
.................................................
విరూపాక్షస్తతో ధీమాన్ వీరశైవమతోఽశిసః,
.................................................
రామభక్తో విరూపాక్షః కృతకృత్యో ముమోదహ.

విరూపాక్షుఁడు ఘాతుకుఁడయినను నిరక్షరకుక్షి కాదని యాతఁడు రచించిన "నారాయణీవిలాస" మను గ్రంథము దెలుపును. ఆ నాటకము ప్రథమాంకమున "యస్య రాజ్ఞః కర్ణాటతుండీరచోళపాండ్యమండలాధిపతేః సింహళద్వీప జయస్తంభస్య మహాదానదీక్షితస్య సకలకలావిలాసినీస్వయంవర వరపతేః

కృతిషు నారాయణీవిలాసం నామ నాటకం ప్రయుజ్యే" యనుట వలన, విరూపాక్షుఁడు సకలకలాకోవిదుఁడై యుండెను.

ఇమ్మడి దేవరాయని కాలమున కొండవీడు, రాజమంద్రి, రాచకొండ ఇత్యాదుల రెడ్డిరాజు లందరు విజయనగరచక్రాధిపత్యమున కధీనులై యుండిరని సూచింపఁబడినది. పద్మనాయకుఁ డగు సర్వజ్ఞసింగము నాస్థానము సంస్కృతాంధ్రకవుల కావాసస్థానమై యుండెను. సింగముఁడు స్వతః రసార్ణవసుధాకరమును రచించి సర్వజ్ఞాభిధానమును ధరించి యుండెను. విజయనగర రాజాశ్రయమును బొందిన డిండిమవంశీయుఁ డగు రాజనాథకవిని వాదమునం దోడించిన శ్రీనాథుఁడుకూడ సర్వజ్ఞుని ఆస్థానమునకు విజయార్థిగాఁ బోవు మునుపు శారదానుగ్రహమును వేఁడుకొనెను. అమరకోశవ్యాఖ్యానమును రచియించిన బొమ్మలకంటి అప్పలాచార్యుఁడు సింగముని పాండిత్యము నిట్లు శ్లాఘించియున్నాఁడు:—

కుమారసింగభూపేన లక్ష్యలక్షణవేదినా,
శోధితశ్చేదయం గ్రంథః కింశోధ్యశ్శోధకాంతరైః.

సింగముని ఆశ్రయమునందే కాళిదాసాది ప్రభృతుల గ్రంథములకు వ్యాఖ్యానములను రచించి సంస్కృతసాహిత్యమునకు మహదుపకారము నొనరించి మహామహోపాధ్యాయబిరుదాంకితుఁ డయిన కోలచల మల్లినాథుఁడు, నాతనియగ్రజుఁడగు పెద్దభట్టు నుండిరని తెలియుచున్నది. ప్రపంచమునందు ముఖ్యగ్రంథములలో నొకటియని పరిగణింపఁబడిన శాకుంతల నాటకమునకు ప్రధానమయిన రెండువ్యాఖ్యానములు రెడ్డిరాజు లాశ్రయమందే బయలుదేరెను. మల్లినాథుని వ్యాఖ్యానములను పరిశీలించినవారికి అతని పాండిత్యము గోచరమగును. అతఁడు ఈకాలమున నుపలబ్ధములైన వాజిశాస్త్ర, వైద్యశాస్త్ర, జ్యోతిషాద్యనేకగ్రంథములను తన వ్యాఖ్యానములందు ప్రమాణములుగఁ జేర్కొనినాఁడు. అతని పాండిత్యమునకు మెచ్చి సింగముఁడు మహామహోపాధ్యాయ, సూరి యను బిరుదములొసంగి కనకాభిషేకమును జేసె ననియు నారాయణపండితుని చంపూరామాయణము వలనఁ దెలియుచున్నది. కవితానాథుఁ డగు శ్రీనాథుఁడు సింగమరాజు నిట్లు ప్రశంసించినాఁడు:—

సర్వజ్ఞ నామధేయము
శర్వునికే రావుసింగజనపాలునికే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞం డనుట కుక్కసామజ మనుటే.

కవిత్వతత్త్వదృష్టిచేఁ దులనచేసి చూచిన ఆంధ్రభాగవతకర్తయగు బమ్మెరపోతనామాత్యునికే తాత్కాలికకవులందు ముఖ్యస్థానమొసంగవలెను. శ్రీనాథ, రాజనాథ, మల్లినాథాదులు ద్రవ్యార్జనార్థముగా దేశదేశమును దిరిగి రాజద్వారములందుఁ గాచి కాచి వణిక్కులు, జంగములు, చక్రవర్తులు, స్వకీయులు, పరకీయులు, సామంతులు, లుబ్ధులు, మిత్రులు, శత్రులని గణింపక ధనమును గడించి కావ్య

కన్యక నమ్ముచుండఁగ, త్రికరణశుద్ధిగ మను జేశ్వ రాధములకు కావ్యముల సంకితము చేయ నని నిశ్చయించి, "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించి" తన భాగవతమును శ్రీనారాయణునికే యంకితమ్ము చేసెను. శ్రీనాథ, పోతన కవు లిద్దఱు భిన్న భిన్న వంశములకుఁ జేరినవారు శ్రీనాథుని మతము శృంగార రసమే ప్రధానమనియు, దేశములు దిరిగి రాజుల నాశ్రయించి యశోధనముల నార్జన చేయుటయే ధ్యేయమనియు, జీవనమందు భౌతికసుఖమే ఆవశ్యకమనియు, కావ్యములు పండితజనాదరణమునకే పాత్రమనియుఁ దేలు చున్నది. నైషధము విద్వదౌషధమఁట! కాశీ ఖండ మయఃపిండమఁట! పోతన్నను స్మరించిన నాతని జీవన చరిత్రయంతయు శ్రీనాథుని మత మునకు విరుద్ధముగనే యుండెనని తోఁచక మానదు. భక్తియే ముక్తిదాయకము. ఆత్మాభిలాషి. కృషికర్మచేతనైన నుదరపోషణము గావించుట మంచిదే కాని క్షుద్రమానవా ధీశుల నాశ్రయించు చున్నఁడుఁ దగదు. ముక్తి పథమును సుగమము గావించి పామరులుకూడ కావ్యానందము ననుభవించునట్లు చేయుటకు యతిప్రాసవ్యాకరణాది ప్రయోగములను పాటింపక కావ్యరచనము చేసెను. ఈధ్యేయ ముచేతనే కన్నడమందు విద్యారణ్యుల ప్రశిష్యుఁడగు నారాయణకవి బ్రాహ్మణసంప్రదాయములను వీడి, భాగవతమును గద్యరూప ముఁగ వ్రాసెను.

---

# వీథి

సోమంచి అన్నపూర్ణేశ్వరశాస్త్రిగారు, బి. ఏ.

(గీతమాలిక)

సుఖము కష్టము లోకాన చూచుచుండి
తనకు నిష్టము లేనట్లు దనరుచుంట
చూచుచుండియు తుష్టి లేకే చరించి
విధిని దాటెద నందువు వెడగుబోలె,
విధిని దాటగ శక్యంబె విశ్వమందు
మానవుడ! నీకు ధీశక్తి గానబడదు!

సుఖము దుఃఖము ప్రారబ్ధసూచనలుగ
పెద్ద లెన్నుదు రవి లేక యెద్ది గలదు?
హర్మ్యముల వసియించు పుణ్యాత్ములకును,
పాతకొంపల నివసించు పాపులకును
నొకటె ధర్మము గల దద యోటువడకె
యెప్పుడును నిర్ణయించును తప్ప నొప్ప
నదియె విధి యని నిర్ణయ మాను గాదె?
చూచి చూచియు, విధిశక్తి చూచికూడ
విధిని దాటెద నందువు వెడగుబోలె
మానవుడ! నీకు ధీశక్తి గాన రాదు!

అదియె మంచికి జెడ్డకు నగుచునుండు
విధియె సుఖదుఃఖసంయోగవిలసితంబు
చిన్నవానిని పెద్దగ జేయు నదియె
పేదవానిని ధనముతో బెంచు నదియె
లేనివానిని భువినుండి లేపు నదియె
పెద్దవానిని తలక్రిందు బెట్టు నదియె
గొప్పవానికి కష్టముల్ గూర్చు నదియె
పిచ్చివానిని బెద్దగా బిల్చు నదియె
అమితహర్షము చిటికెలో నదియె మార్చు.

దేనిదేనికి భేదం బెదేని యున్న
దానిదానిని జేయుచు దనరుచుండు!
దీనిలో జూడ జేయ నేమేని గలదె?
వెఱ్ఱి యగు గాని, విధినుండి విడువ బడునె?
ఎన్నొ యత్నము లొనరింప నెపుడుగాని
కారణము లేక యెట్టులు కానగును?
కారణము గలదేని శ్రీకాంతు నెంచి
పరమవాత్సల్యనిధియగు వాని జూచి
కర్మ పరిపక్వమును జేసి కనుల తెఱచి
చూచి చూచియు, ఫలితంబు చూచికూడ
విధిని దాటెద నందువు వెడగ వగుచు
మానవుడ! నీకు ధీశక్తి గానబడదు!

హావభావప్రభామూలమైన దదియె
మానవుల లోకమున ద్రిప్ప మార్గ మదియె
ఎంతధీశక్తి యున్న మ రేమి యున్న
నేమి? మానవు డట్టులె యింతలోన
వెఱ్ఱియై విధిచోదితవృత్తితోడ
సకలసంకల్పముల మార్చి సంతసించు
తనకె యన్నిట లాభంబు దలచుచుండు
వికలతాకారణముచేత వెఱ్ఱి యగుచు
నెంచు కొందఱి భావమందే గలదని
యాత్మ నమ్మి విధిని తూలనాడియాడి
తుదకు పని తారుమారైన నదయు డగుచు
విధియె చేసె నంచు నెపుడు వెఱచుచుండి

విధిని దాటగ మార్గము వెదకుచుండు
మానవుడ! నీకు ధీశక్తి గానబడదు!

చిన్నితనమున నెపుడు తా నెన్నొ తలచి
కడగి యాకాశహర్మ్యముల్ గట్టుచుండి
భూమిలో నున్న ధనమంత బొందగోరి
దానధర్మములందు వదాన్యు డగుచు
తృష్ణ లేకయె యెప్డు సంతృప్తు డగుచు
తనకు లేకుండ నిచ్చు యవ్వనుని(?) జూచి
"ఇదిగో తృష్ణ గా దిది నిశ్చయించి చూడు
భూమిలో నున్న దంతయు బొందుటకునె
మానవుడు పుట్టియుండియు మఱచిపోయి
యెపుడు మోక్షము మోక్షమం చేక్షు బుద్ధి
మానరాదె? యింకను వెఱ్ఱివాని గావు"
మనుచు కోరుచుండియు నరు డందజూచు
నాకసంపు బువ్వుల గాని యట్ట క్రింద
బడును; సంచలించెడును భావమ్ము మిగుల
నప్పుడె విధిని మీఱరా దనుచు నెఱుగు!
కాని, మఱునాడె మఱల నాకసమున కెగిచి
జేరదలచు; నిదె జిగీష జీవునకును.

నిశ్చయం బిట్టి దయ్యును నీతి మాలి
మోహమున జీవుడు సుఖింప ముచ్చటించు
విధిని ఎట్టులైన జయింప వేచియుండు
మానవా నీకు ధీశక్తి గానరాదు!

చచ్చుటకు సిద్ధమగు ముదుసలికి భోగ
వాంఛ చచ్చునె యెటులైన? వార్ధకమున
నింక నాకాశహర్మ్యంబు లిచ్చమీఱ
గాంచుచు జయింపజూచు రోగముల నెల్ల;
ఇదియె మాయ ప్రపంచమం దిటుల వచ్చి
మూర్ఖులను జేరి యేడ్పించు మూల మిదియె
"విధి యొకటి యున్నదని" తలపింపజేయు
దారి యున్నను వేఱొండు దారి లేక
నదియె మూఢనమ్మక(?)మని నైయెన తలప
కుండ శశవిషాణము తప్పకుండ దెత్తు
ననెడి మూర్ఖచిత్తుని చలమైన లేక
సతత మొకదాని చుట్టునె సంచరించి
పిచ్చితో గూడి మనమును విచ్చలవిడి
తిరుగనిచ్చి విధివలన తరుమబడుట
చేతనైనట్లు భౌతికభూతికలన
విధిని గెలువంగ జూచెదు వింత గాదె
తెలియజెప్పినప్పటికిని తెలియలేవు
మానవా! నీకు ధీశక్తి గానరాదు!

"పరమపావన చంచలభావజడుడ
జీవితమునందలి ఫలమ్ము చెపుమ నాకు;
ఏపుడు దుఃఖమే! సుఖమన్న నెఱుగ డెవడు
నున్నదానితో సంతస మెన్న సున్న
పరుల సొమ్ముల కాసించి పాపమతులు
ధనము జేకొని దూషింత్రు ఘనుల జనుల
నిట్టి జనమధ్యమున నున్న గిట్ట నేమి?
యడలి మేలంచు దలచెద నమరవినుత!
కనుక నడవినె చరియింతు గాక దేవ!—
కాలము తటిచ్చలనశీలి గాదె చెపుమ
యిప్పుడే గాక నింకెపు డిట్లు సేయ?
కాన నేడె పోయెద నిందు కానలకును.—

చెప్పగలదేమి మానవశీలమందు
నెపుడు నింతె, గాకేమి? నీ న్నెప్పు డాత్మ
నరయుచుండగ మోక్షంబు కరగతంబు"

అనుచు నేడ్చు నిన్నెంతో "నాయనా" యనుచు
నెవడొ "విధి విధించిన దాని నెవరి వశము
దాటగ" ననెడి సత్యము దాని దెలిపి
తేర్చ, మమతమార్గమ్మున నె తేలి, మునిగి,
ధరణి నెల్లపు డవ్విధి దాటుటకును
యత్న మొనరింతు, ఎంత్తైన నౌదు వీవు!
మానవా నీకు ధీశక్తి గానబడదు!

"నలువ! మాయాంధకారము దొలగద్రోయు
కరుణరస మొల్కు జ్ఞానభాస్కరుడ వీవు!
నీదు నిశ్చయు మెఱిగియు నేను నిన్ను
గెలువగల నను భ్రమతోడ గలుగుచుండి
యెత్తు వైచెడి వెడగ నెంతేని సత్య"
మనుచు ననుకొని మఱునాడె అంత మఱచి
పురుషకారంబె ముఖ్యము పురుషున కని
చెప్పుచు విధికి పైయెత్తు నెప్పుచుండి
సారెసారె కభిప్రాయసరణి మార్తు
మానవా నీకు ధీశక్తి గానరాదు!

చిన్నపనిలోన గనుపట్టు చిహ్న మదియె
పెద్దకార్యముపట్టున బెడద యదియె
కార్యము లెపైన నయ్యది కారణంబు
పురుషకారంబు క్షణములో బోవ ద్రోచి
మానవుని శక్తినంతయు మాపుజేసి
భూతశక్తిని పెల్లుగ మూల ద్రోచి
సర్వలోకము నడపించు శక్తి యదియె
చంద్రసూర్యులు దేనిచే సంచరింత్రు
దేనిచే భూమి తనచుట్టు దిరుగుచుండు
మేఘమాలిక కురియు నే మేటిశక్తి
అయఃలౌకికశక్తి నెట్టైన ద్రోచి
యిందు లేదని రూపింప నెవని తరము!—
క్రియకు సిజముగ విధి యలౌకికము సుమ్ము
దాని నమ్మము సౌఖ్యంబు దాన గలదు
పనుల జేయుము యత్నలోపంబు లేక
ఫలిత మెల్లను విధికిని వదలవోయి!
కార్యమైనను గాకున్న గాసి బడకు
మిదియె పరమరహస్యము మదికి జేర్చి
సంతసింపుము మనమున వంతి మాను!

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

# శబరి



చింతాదీక్షితులుగారు

(వెనకటి సంచిక తరువాయి)

## ౨

[పంపాసరస్సుకు దక్షిణముగా ఉన్న ఋష్యాశ్రమము సమీపమున ఉన్న బయలు. పచ్చనిగడ్డి అంతటా మొలిచి ఉన్నది. బయలుకు ఈశాన్యముగా ఋశ్య మూక పర్వతశృంగములు కనబడుతున్నవి. చుట్టూ అడవి దట్టముగా ఉన్నది. బయలుకు వాయవ్యముగా మతంగవనము. పంపాతటముమీద ఉన్న ఆశ్రమములో చాతకముని పూర్ణుని సరస్సులో ఈదే బాతులకేసి చూస్తున్నాడు. రుద్రాక్షమాల తిప్పుతున్నాడు. కాని అతనిధ్యాన మంతా సరస్సుమీదే ఉంది.

బయలులో ఒకసవరకన్య ఆడుకొంటూ ఉంది. పేరు ఇర్రి. పద్దెనిమిది సంవత్సరముల వయస్సు. మెడలో గురివెందగింజలదండ లున్నవి. తలలోనూ చెవులలోనూ అడవిపువ్వులు పెట్టుకొన్నది. ఒకబట్ట మొలకు చుట్ట బెట్టుకొన్నది. ఒకచిన్న ఉత్తరీయము బుజముమీదనుంచి వేళ్లాడుతున్నది. సందెడుజుట్టు పిరుదులు దాటి వేళ్లాడు తున్నది. నల్లనిశరీరపు నిగారింపులు. వసంతకాలపు కానవశోభ ఆమెలో ప్రతిబింబిస్తున్నది. జింకల కున్న చురుకుదనము ఆమెకు కద్దు. ఆమెకళ్లు యౌవనమద మును వెళ్లగక్కుతున్నవి. తీరైన అందమైనశరీరము. సుంద్రమైని నవ్వుమొగము. ఆమెతో హనుమంతుడు ఆడు కొంటున్నాడు. ఇరవై సంవత్సరముల వయస్సు. బల మైన కండలు దేరినశరీరము. సూక్ష్మదృష్టి. ఎర్రనిశరీరము. అందమైన ఎర్రనిముఖము. చిన్నకళ్లు. పెద్దచెక్కిళ్లు. నూనూగు మీసాలు. దట్టీ బిగించినట్లు పంచ కట్టుకొన్నాడు. అర్ధచంద్రాకృతి గల కర్ర ఒకటి వెనకవైపున తగిలించుకొన్నాడు. అది అతనిఆయుధము. తలపైన నల్లనిజుట్టు ముడి వేసుకొన్నాడు.]

ఇర్రి

ఆ! చూశావా, చూశావా, పిక్కిరీలు! పిక్కిరీలాట ఆడుతున్నావు.

[అని అతని చెయ్యి పట్టుకొన్నది.]

హనుమంతుడు

[చులాగ్గా చెయ్యి వదలించుకొని]

నే నేం పిక్కిరీ లాడుతున్నాను?

ఇర్రి

ఎప్పుడూ నువ్వు పిక్కిరీలే. ఇన్నేళ్లబట్టీ చూస్తున్నా గదా!

హనుమంతుడు

నీ వోడిపోతే పిక్కిరీలు, నే నోడిపోతే న్యాయమున్నూ—అవునా?

ఇర్రి

[హనుమంతుని ఒక లెంపకాయ కొట్టి]

కో తీ! [అని పారిపోవును.]

హ ను మం తు డు

[ఆమె వెనుక పరుగెత్తుకు వెళ్ళి ఒక చేత్తో ఎత్తి బుజంమీాద పెట్టుకు వచ్చి]

పెంకెపిల్లవు అయిపోతున్నావు సుమా నువ్వు!

ఇ ర్రి

[పెనుగులాడుతూ]

వదులు, నన్ను వదులు.

హ ను మం తు డు

అల్లరి చెయ్య నంటే వదులుతాను.

ఇ ర్రి

అల్లరి చెయ్యను, వదులు.

హ ను మం తు డు

అబద్ధం ఆడనంటే వదుల్తాను.

ఇ ర్రి

అబద్ధ మంటే ఏమిటి?

హ ను మం తు డు

[ఇర్రిని కిందికి దింపి వేలు ఆడిస్తూ]

అబద్ధం ఆడవు కదా!

ఇ ర్రి

నువ్వు పా డయిపోతున్నావు సుమా హనుమా!

హ ను మం తు డు

నిన్ను ఆ నల్లటి పెద్ద ఏనుగుకు అప్ప చెప్తాను చెప్పినమాట వినకపోతే!

ఇ ర్రి

నీవు చెప్పినట్లల్లా చేస్తే ఆట లేనే లేదు.

హ ను మం తు డు

[నవ్వుతూ]నిన్నుఆకాశంమీాది కెగరేసి....

ఇ ర్రి

నన్ను నీఒళ్ళో కూర్చోనియ్యి. నీకోసం ఒక మంచిపాట చేశాను. అది పాడతాను.

హ ను మం తు డు

కూర్చో నియ్యకపోతే పాడవూ?

ఇ ర్రి

పాడను.

హ ను మం తు డు

[భయపెట్టుతూ]

పాడవూ?

ఇ ర్రి

[భయపడ్డట్లు నటిస్తూ, నవ్వుతూ]

పాడకపోతే........పాడను

[అని పరుగెత్తును.]

హ ను మం తు డు

[ఆమెకేసికదలకుండానిలబడిచూచుచు]

ఇర్రీ! ఇర్రీ! ఇలా రా! ఒకమాట చెప్తాను.

ఇ ర్రి

[తిరిగివచ్చి, 'చెప్పు' అని దక్షిణముగా చూచును. అక్కడ ఒక జింకలమంద చెంగు చెంగున దాటుతూ పరుగెత్తును.]

చూడు, హనుమా చూడు.........

ఆజింక నా కియ్యవూ! మెరుపు మెరిసినట్లు పరిగెత్తే ఆజింకను నా కియ్యవూ!

హ ను మ ం తు డు

[ఆమెను సమీపించి బుజంమీద చెయ్యి వేసి జింక ఉన్నదిక్కుకు చూస్తూ]

ఆజింకను నీ కిస్తే పాడతావా?

ఇ ర్రి

ఇయ్యావు? హనుమా, ఇయ్యావూ? ఈ గురువింద గింజలదండలు నీమెళ్లో వేస్తాను ఇస్తే.

హ ను మ ం తు డు

పాట పాడుతావా?

ఇ ర్రి

ఎన్ని పాటలు పాడినా, ఎప్పుడూ పాట పాటంటావు!

హ ను మ ం తు డు

కొత్తపా టన్నావు!

ఇ ర్రి

పోతోంది, పారిపోతోంది. పాడతా, పాడతా, దాన్ని పోనియ్యకుండా పట్టి నా కియ్యావు హనుమా, హనుమా, నా కియ్యావూ!

హ ను మ ం తు డు

[వెనుక భాగాన తగిలించుకొన్న అర్థ చంద్రాయుధాన్ని తీసి గిర్రున తిప్పి జింకవైపు విసరును. అది వలయాలు తిరుగుతూ రంయి రంయిన పోయి జింకను పడగొట్టి వలయాలు తిరుగుతూ తిరిగివచ్చి హనుమంతుని పాదముల దగ్గిర పడును.]

అదుగో, అదుగో, వెళ్ళింది, కొట్టింది కాళ్లను. వచ్చింది. [అని కర్ర యథాప్రకారం తగిలించుకొనును.]

ఇ ర్రి

[హనుమంతుని మెళ్ళో చేతులు వేసి మొగము మీద ముద్దుపెట్టి గబగబ పరుగెత్తుకు వెళ్ళి జింకను బుజాలమీద మోసుకు వచ్చును.]

హనుమా, ఎంత మంచి జింకో! ఎంత పెద్దదో! దీన్ని నేను పెంచుతాను. పద, వెడదాము, పద, పంపాసరస్సు దగ్గిరికి. దీనికి నీళ్ళూ, గడ్డీ పెడదాము.

హ ను మ ం తు డు

[ఆమెబుజముల మీది జింకను తన బుజాలమీద వేసుకొనును. ఇద్దరూ పంప వైపు వెళ్లుదురు.]

ఇర్రీ! పాట పాడు.

ఇ ర్రి

నన్ను ముద్దెట్టుకుంటే పాట పాడతాను.

హ ను మ ం తు డు

ఈజింకను నే పట్టుకు వెళ్లిపోతున్నా. [అని పోబోవును.]

ఇ ర్రి

వద్దు హనుమా! హాయిగా ఆగట్టుమీద కూచుని బాతులనూ, హంసలనూ చూస్తూ పాడుకొందాము. ఏం, హనుమా, ఏం?

హ ను మ ం తు డు

ఆలాగేలే పోనీ!

ఇ ౦ద్రి

మనం ఎప్పుడూ ఈఅడవుల్లో ఆడుకొం టూంటే ఎంత బా గుంటుంది హనుమా! నీ వెప్పుడో కాని ఆటకు రానే రావు.

హ ను మ ం తు డు

నే రాకపోతే ఇంకోళ్లతో ఆడుకో రాదూ?

ఇ ౦ద్రి

ఇంకోళ్లతోనా! ఇంకోళ్లతో ఆ టేమి టి? నీతో ఆడితేనే ఆట అందంగా ఉంటుంది.

హ ను మ ం తు డు

నేను సుగ్రీవుడిబంటును కదా! ఆయన్ని ఎప్పుడూ కనిపెట్టుకు ఉండాలి.

ఇ ౦ద్రి

సుగ్రీవుడూ, వాలీ నీకంటె గొప్పవాళ్లా?

హ ను మ ం తు డు

కారా మరి?

ఇ ౦ద్రి

కారు. అందరికంటె నువ్వు గొప్పవాడవు. మంచి ఆటలు నాతో ఆడతావు. నిన్ను చూస్తే ఏనుగులూ పెద్దపులులూ పారిపోతవి. నీవే గొప్పవాడవు. నీకంటె గొప్పవా ళ్లెవ్వ రూ లేరు.

హ ను మ ం తు డు

తప్పు తప్పు, ఇంద్రీ, అలాగ అనకూడదు.

ఇ ౦ద్రి

నన్ను చూస్తే నీకు సరదాగా ఉండదూ హనుమా!

హ ను మ ం తు డు

నీవు సవరపిల్లవు.

ఇ ౦ద్రి

అంతేనా?

హ ను మ ం తు డు

చక్కని దానవు.

ఇ ౦ద్రి

అంతేనా?

హ ను మ ం తు డు

మంచి ఆట లాడుతావు.

ఇ ౦ద్రి

అంతేనా?

హ ను మ ం తు డు

నీనాట్యము చూస్తూ నీపాటలు వింటే మతి పోతుంది.

ఇ ౦ద్రి

నేను లేనప్పుడు నీకు తోస్తుందా, హనుమా!

హ ను మ ం తు డు

ఏమో!

ఇ ౦ద్రి

నాదగ్గరికి రావా లని ఉండదూ? నా పాటలు వినాలని ఉండదూ?

హ ను మ ం తు డు

ఇక్కడ ఉన్నప్పుడు నీతోటే ఉండా లని ఉంటుంది. సుగ్రీవుడిదగ్గిరికి వెళ్లినప్పుడు ఆయ న తప్ప ఇం కెవరూ నాకు కనిపించరు.

ఇర్రి

పోనీ గాని హనుమా, రోజూ ఒకమాటు నాతో ఆడుకోడానికి వస్తూ ఉండవూ ?

హనుమంతుడు

స్వామికార్యములున్నా లేనప్పుడు రానులే ఇర్రీ !

ఇర్రి

పోనీ అమ్మా! నీ చెప్పడూ ఇంతే హను మా...... పోనీలే! [అని ఏడ్చును.]

హనుమంతుడు

[కంగారుపడుతూ] అయ్యో వెర్రిపిల్లా! అమాత్రానికే ఏడుస్తారా?

ఇర్రి

పోనీ,పోనీ, నా కక్కర్లేదు, నే నెక్కడికో పోతాను. నే నాచెరువులో పడిపోతాను. నాతో మాట్లాడకు. పో, పో. నా కాజింక అక్కర్లేదు.

[అని దూరముగా పోవును.]

హనుమంతుడు

పవరవాళ్లలో తప్పపుట్టావు నువ్వు. వస్తూంటాలే; రా, ఇలా రా, ఏడవకు.

ఇర్రి

[దగ్గిరకు వచ్చి అతని చేతులతో తన కళ్లు నులుముకొంటూ]

నా కక్కర్లేదు. పోనీలే, రాకపోతే.

[అని అతనిని గబగబ నెత్తిమీద నాలుగు కొట్టి నవ్వి] రాకపోతే ఎరగవూ?

హనుమంతుడు

[నవ్వుతూ] పెంకెపిల్లా !

[ఇద్దరూ పంపాతటము చేరుదురు. దూరముగా గట్టుమీద ఆశ్రమములో చాతకముని దుంపలు కుమ్ములో పెట్టి ఊదుచుండును. శబరి వారికి సమీపములో నీరు ముంచుకొనుచుండును. ఆవిడ మొలకు కృష్ణాజినము చుట్టి ఉన్నది. చేతిలో పెద్దసొరకాయబుర్ర ఉన్నది. దానితో నీళ్లు ముంచుతూ శ్రీరామ, శ్రీరామ, అనుకొనుచుండును.]

ఇర్రి

చూడు, హనుమా, చూడు. ఆముసలి అవ్వ ఎవరో నీ వెరుగుదువా ?

హనుమంతుడు

ఎరగ కేమి? ఆవిడ శబరి. మతంగముని పరిచారిక.

ఇర్రి

పోనిద్దూ, అస్తమానం ఆముసలివాణ్ణి కనిపెట్టుకు కూచుంటుంది. పక్షులు లేవు, పాటలు లేవు, ఆటలు లేవు, ఏమీ లేవు ఆవిడకు.

హనుమంతుడు

ఇస్! తప్పు; వినిపిస్తే?

ఇర్రి

వినిపిస్తే నాకు భయమా యేమిటి ? జింకను దింపవేమి, అలాగ చూస్తావు.

[హనుమంతుడు జింకను దింపును. కాళ్ల మీాద దెబ్బ తగులుటచేత జింక నిలబడలేక పడుక్కొనును. దాని పక్కనే ఇర్రి దువ్వుతూ కూర్చుండును. హనుమంతుడు నిలబడిఉండును.]

ఇ ర్రి

కూర్చో హనుమా!

హ ను మ ం తు డు

శబరిలోనుంచి ఏదో దివ్యతేజం బయటికి వస్తోంది చూడూ!

ఇ ర్రి

పోదూ, నీ చెప్పడూ ఇంతే. [శబరిని పిలుస్తూ] అవ్వోయి, ఓ అవ్వా! ఏమిటి చేస్తున్నావు అక్కడ?

శ బ రి

[నీళ్లు నిండినబుర్ర చేత్తో పట్టుకొని వెనక్కు తిరిగి శ్రీరామస్మరణ చేస్తూ]

ఎవరమ్మా మీారు? [అని వారిని సమీాపించి సొరకాయబుర్ర కింద పెట్టి నిలబడిఉండే మాట్లాడును.] నువ్వటే ఇర్రీ! ఎవరో అనుకున్నాను.—నువ్వు ఎవరు నాయనా?

హ ను మ ం తు డు

నేను హనుమంతుణ్ణి.

శ బ రి

నువ్వటోయి! వాయుదేవుడి కొడుకువా! మీాఅమ్మ అంజనాదేవిని నే నెరుగుదును. మేము చిన్నప్పుడు ఆడుకొనేవాళ్ళము. మీా అమ్మా నాన్నా బాగున్నారా నాయనా?

హ ను మ ం తు డు

బాగున్నా రమ్మా.

ఇ ర్రి

అవ్వా, నా కోపాట చెప్పవూ?

శ బ రి

వెర్రితల్లీ, చెప్పతా! విన్నావా నాయనా, వినవే ఇర్రీ. భగవంతుడు, శ్రీమన్నారాయణమూర్తి, ఇప్పుడు అయోధ్యలో అవతరించాడట. నాయనా, శ్రీమన్నారాయణమూర్తి సుమా, మన కాలంలో అవతరించడంమాట చెప్ప; అదీ నే ననుకొంటూంట. ఎంతపుణ్యమో కాదూ?

హ ను మ ం తు డు

[భక్తిభావముతో వినమ్రతతో]

శ్రీమన్నారాయణమూర్తి అవతారమే అమ్మా!

శ బ రి

అవును నాయనా, అవును. విన్నావే ఇర్రీ! విష్ణుమూర్తి అవతారం సుమా శ్రీరామచంద్రమూర్తి. శ్రీరాముడు.

హ ను మ ం తు డు

శ్రీరామచంద్రుడా?

ఇ ర్రి

నే వెళ్ళుతున్నా, హనుమా! రావూ?

హ ను మ ం తు డు

ఎన్నాళ్లైన దమ్మా పరమాత్మ అవతరించి?

శ బ రి

ఇరవైయెనిమిది సంవత్సరాలు నాయనా, ఇరవైయెనిమిది సంవత్సరాలు. ఆకాశము వంటి శరీరము, సూర్యచంద్రులవంటి కళ్లు, నక్షత్రకాంతివంటి నవ్వొ్వ, శ్రీమన్నారాయణమూర్తి సుమా నాయనా!

ఇ ద్రి

హనుమా, పాట పాడుతాను రావూ?

హ ను మ ం తు డు

శబరీ, శబరీ, శ్రీరామచంద్రమూర్తి చరిత్ర నాకు చెప్పవూ?

ఇ ద్రి

[చాతకముని కుటీరములోనుంచి సొర కాయబుర్ర దీసుకు వచ్చి దానితో నీళ్లు ముంచుకొని నెత్తిమీద పెట్టుకొని జింకను రెండు చేతులతోనూ ఎత్తుకొని వక్షమున కానించి ఒయ్యారముగా వెళ్లుతూ]

హనుమా, నీకు పాటక్కర్లేదు? నే వెళ్లుతున్నాలే, నే వెళ్లుతున్నాలే, పాటపాడుకుంటూ వెళ్లుతాను. నువ్వుకూడా వచ్చి నన్ను దిగబెట్టవూ?

శ బ రి

ఇద్రీ, శ్రీమన్నారాయణమూర్తి అవతారచరిత్ర విన్నావుటే? చెప్పుతా విను.

ఇ ద్రి

నాకు ప నుందమ్మా, నే వెళ్లాలి. [హనుమంతునిజూచి] హనుమా, హనుమా, సరేలే, జ్ఞాపక ముంచుకో [అని ఒయ్యారముగా నడిచి పోవును.]

శ బ రి

శ్రీరామచంద్రుడు నాయనా, ఎంతో చక్కనిమూర్తి; నాబంగారుమూట, నారాముడు నాయనా, విన్నావా; శ్రీరామచంద్రమూర్తి! గురువుగారు నాకు చెప్పారు.

హ ను మ ం తు డు

ఏ మని చెప్పారు అమ్మా?

శ బ రి

అయోధ్యలో నాయనా, అయోధ్యలో అవతరించాడు దశరథునికీ కౌసల్యకీ. నేనే కౌసల్య.........అమ్మో! అంతపుణ్యమే! పితృవాక్య పరిపాలన కోసం పధ్నాలుగేళ్లు వనవాసం చేస్తాడట నాతండ్రి! నా శ్రీరామచంద్రమూర్తి! విన్నావు నాయనా! ఎంతకష్టమో?

హ ను మ ం తు డు

పధ్నాలుగేళ్లే శబరీ?

శ బ రి

[చేతులు తిప్పుకొంటూ] పధ్నాలుగేళ్లు నాయనా [కంట నీరు పెట్టి] నాచిన్నతండ్రి అడవుల్లో తిరగాలిట!

హ ను మ ం తు డు

అమ్మా శబరీ! ఎందు కమ్మా అడవుల్లో తిరగడం?

శ బ రి

పితృవాక్య పరిపాలనకోసం నాయనా! [కన్నీరు చేతితో తుడుచుకొనును.]

హ ను మ ం తు డు

అది ఒకవ్యాజము తల్లీ! అవతారకార్యముయొక్క ఉద్దేశ్యము నెరవేరడానికి అది ఒకవ్యాజము. దుష్టశిక్షణ చెయ్యడానికి వనవాసం అవసర మని తోస్తుంది.

శ బ రి

నీవు బుద్ధిమంతుడివి నాయనా! ఆమాట నిజమే అనుకుంటా; నాకూ అలాగే తోచింది.

హ ను మ ం తు డు

ఇప్పు డెక్కడున్నాడుభగవంతుడు తల్లీ?

శ బ రి

నారాముడు చిత్రకూటంలో ఉన్నాడు నాయనా; నాకన్నతండ్రి.

హ ను మ ం తు డు

చిత్రకూటంనుంచి ఇంక అరణ్యముకు వెళ్లుతారు కాబోలు అవతారపురుషులు.

శ బ రి

ఏమో నాయనా నాకు తెలియదు; విన్నావూ నాయనా; శ్రీరామచంద్రమూర్తి పంపాతీరాన్ని పవిత్రం చేస్తారుట!

హ ను మ ం తు డు

[ఉత్సాహంతో] ఇక్కడికి వస్తారా?

శ బ రి

అవును నాయనా అవును. నా ఆశ్రమానికి వస్తారు. నేను ఆడదాన్ని, ముసలిదాన్ని, ఆయన్ని ఎలాగ ఆరాధించాలో...... నా రామచంద్రమూర్తికి నామీద కోపం రాదుకదా నాయనా.

హ ను మ ం తు డు

నీ వదృష్టవంతురాలవు తల్లీ! భగవంతుడికి నీమీద అనుగ్రహమే; ఆగ్రహ మెప్పుడూ ఉండదు.

[దూరంనుంచి చల్లనిపాట వినబడును.]

శ బ రి

[ఆలకిస్తూ] ఆలాటి పాట వింటే శ్రీరాముడికి సంతోషముగా ఉంటుందా నాయనా?

హ ను మ ం తు డు

అది ఇర్రి పాట. భగవంతుడికి కావలసినవి పాటలూ, పువ్వులూ, పళ్ళూను—భక్తుల హృదయాలతో పాటు.

శ బ రి

అవును నాయనా, ప్రకృతిలో సౌందర్యం అంతా ఆయనకు ధారపొయ్యాలి. మానవ హృదయంలో మాధుర్యం ఆయనకోసం వెచ్చించాలి.

హ ను మ ం తు డు

అవు నమ్మా, అవును.

శ బ రి

ముసలిదాన్ని, నా కాపాటలు వస్తవా నాయనా? నా రామచంద్రుడి ఎదుట పాడతాను.

హ ను మ ం తు డు

ఇర్రికి పాటలు చాలా వచ్చు; చిలకలకూ, గోరువంకలకూ, కోయిలలకూ, నెమళ్ళకూ, హంసలకూ, పాటలు నేర్పడం ఇర్రే. ఆమె నీకు పాటలు నేర్పుతుందిలే.

శ బ రి

ఇర్రికి శ్రీరామచంద్రమూర్తి సంగతి చెప్పు. తప్పకుండా చెప్పు, ఏం?

హ ను మం తు డు

చెప్పతానమ్మా, చెప్పతా. పక్షు లన్నీ కూడా శ్రీరామచంద్రమూర్తిమీద పాటలు నేర్చుకొంటవిలే.

శ బ రి

ఎంత బా గుంటుంది? శ్రీరాములవారికి ఆపాటలు వింటే సంతోషమే కాదు నాయనా; ఆయన ప్రసన్ను లవుతారు కాదూ?

హ ను మం తు డు

అవుతా రమ్మా, అవుతారు. శ్రీరాములవారి చరిత్ర ఇంకా చెప్పనా?

శ బ రి

ఆశ్రమంలో ఉన్న పావురాలను పంపించాను నాయనా, ఎప్పటివార్తలు అప్పుడు తీసుకు రమ్మని. శ్రీరామచంద్రమూర్తివారి వృత్తాంత మంతా అవి తీసుకువస్తవి, ఎప్పటి కప్పుడు.

హ ను మం తు డు

నాకుకూడా చెప్పతూ ఉండు తల్లీ!

శ బ రి

అలాగే నాయనా; నీవు నాఆశ్రమానికి వస్తూఉండు! శ్రీరామచంద్రులను ఏవిధముగా ఆరాధించవలసి ఉంటుందో ఆలోచిద్దాము.

హ ను మం తు డు

తప్పకుండా వస్తాను తల్లీ. నీ వెంతమంచి దానవు! శ్రీరామపూజలో పాల్గొనడముఎంతో పుణ్యవంతులైతేనే గాని సిద్ధించదు.

శ బ రి

నాయనా, శ్రీరామచంద్రులవారికి నేత్రానందం, కర్ణానందం, దేహసౌఖ్యం, మనస్సౌఖ్యం అన్నీ కలగజెయ్య గలమా నాయనా!

హనుమంతుడు

అమ్మా, నీకు తెలియందేమున్నది? భగవంతుడికి భక్తి ముఖ్యము గదా. అదిగోనమ్మా! [ఆకాశమువేపు చూపిస్తూ] తెల్లమబ్బు తునకల్లాగ పావురాలు పల్టీలు కొట్టుకుంటూ వస్తూఉన్నవి.

శ బ రి

[ఆకాశమువేపు చూస్తూ చప్పట్లు కొడుతూ నవ్వుతూ]

వచ్చాయా నా చిన్ని పక్షులు, నా పావురాలు, వచ్చాయా రండి, రండి! నా రామచంద్రుడు క్షేమమా?

పా వు ర ము లు

క్షేమమే తల్లీ! రామచంద్రులవారు చిత్రకూటమునుంచి దండకారణ్యం వెళ్లారు.

శ బ రి

వస్తున్నారా, నాసమీపానికి వస్తున్నారా! తాగండి, పంపాజలము తాగండి. ఇంకా చెప్పండి నా రామచంద్రులమాట.

పా వు ర ము లు

రామచంద్రుడూ, ఆయనతమ్ముడు లక్ష్మణుడూ, ఆయనభార్య సీతాదేవీ అరణ్యంలో సంచారం చేస్తున్నారు.

శ బ రి

నాతల్లి, నాతల్లి సీతాదేవా? నాతల్లి నాతల్లే! [కంట తడిపెట్టుకొని] నాతల్లికికూడా అడవుల్లో కష్టాలే! నేను వెళ్లి ఎత్తుకొని— అమ్మో! గురువుగారు ఆశ్రమం వదల వద్దన్నారు. లక్ష్మణుడా తమ్ముడు?

పా వు ర ము లు

మొదట శ్రీరామమూర్తి పాదములు కడిగి గుహుడు స్వర్నదిని దాటించాడు.

శ బ రి

ఏమి పుణ్యం చేసుకున్నాడో మహాత్ముడు! శ్రీరాములవారి పాదప్రక్షాళనభాగ్యం లబ్బింది.

పా వు ర ము లు

తరువాత భరద్వాజుని సత్కారము పొంది చిత్రకూటము ప్రవేశించి ఉండగా ఆయన సవతితమ్ముడు భరతుడు వచ్చి తిరిగి రమ్మని చెప్పినాడు. రాములవారు రా నన్నారు. తరువాత భరతుడు శ్రీరాములవారి పాదుకలు తీసుకు పోయి వాటికి పట్టాభిషేకము చేసి శ్రీరాములవారిపేర రాజ్యమేలుతున్నాడు.

శ బ రి

నాతండ్రిపాదుకలు తీసుకు వెళ్లాడా? నాతండ్రి రా నన్నాడా? వెళ్లితే ఎలాగ? మాబోంట్లకు ముక్తిసాధన మేదీ? నా దివ్యమూర్తి ఎంత కరుణామయుడో, ఎంత సత్యవంతుడో!

పా వు ర ము లు

అరణ్యములో విరాధుని చంపినారు శ్రీరాములు.

శ బ రి

దుష్టశిక్షణ ప్రారంభించారు నాయనగారు. ఇంక మమ్మలిని రక్షించడానికి వస్తారు. వింటున్నావా హనుమంతుడా!

హ ను మ ం తు డు

వింటున్నా నమ్మా!

పా వు ర ము లు

చిరకాలంనుంచి తపస్సు చేస్తూ ఉన్న మునిపుంగవులకు చాలామందికి దర్శనమిచ్చారు. చాలామంది రాక్షసులను దండిస్తున్నారు.

శ బ రి

అవతారపురుషులు తమకార్యము నిర్వహిస్తున్నారు. ఆయన దక్షిణహస్తములో హాలాహలమూ, అమృతమూను. వస్తున్నారు. నాకేసి వస్తున్నారు. ఏమి చెయ్యడం హనుమా! మనం ఏలాగ ఆరాధించడము?

హ ను మ ం తు డు

భయము లే దమ్మా! నీహృదయము కంటె సౌరభం కలిగిన పూజాపుష్ప మింకొకటి లేదు. దానిని అప్పుడే శ్రీరాములవారి పాదములపైన పెట్టినావు.

పా వు ర ము లు

తరువాత కొన్ని సంవత్సరాలకు పంచవటికి బయలుదేరి వెళ్లుతారట.

శ బ రి

వెళ్లుతారా! నాతండ్రి నాకోసం వస్తారా!

పా వు ర ము లు

అంతే నమ్మా!

శ బ రి

అంతేనా! పోనీలెండి! [వాటిని దువ్వుతూ] వనములో పళ్లూ గింజలూ తిని పంపాజలము తాగి విశ్రమించి మళ్లీ వెళ్లండి. నాతండ్రి వృత్తాంత మంతా నాకు తెచ్చిపెట్టండి.

పా వు ర ము లు

మంచిదమ్మా!

[ఎగిరిపోవును.]

శ బ రి

హనుమా, నీ వింక వెళ్లి ఇర్రితో చెప్పు. శ్రీరామచంద్రులవారి వృత్తాంత మంతా చెప్పు సుమా!

హ ను మ ం తు డు

మంచి దమ్మా! నమస్కారము తల్లీ, వెళ్లుతాను.

[నిష్క్రమిస్తుండగా ఇర్రి ప్రక్కనుంచి వచ్చి హనుమంతునిచేతులు గట్టిగా పట్టుకు లాక్కుపోతుంది.]

శ బ రి

[సొరకాయబుర్ర బుజంమీద పెట్టుకొని చాతకముని కూర్చున్నతావుకు వెళ్లి] చాతక మునీ, నే వెళ్లుతున్నా నాయనా! శ్రీరామచంద్రుణ్ణి మరచిపోకుమా!

చా త కు డు

[కాలినదుంపలు పైకి తీసి వలుస్తూ తీంచును] మరవను తల్లీ!

శ బ రి

నాయనా విన్నావా, హనుమంతుడు నాకు సహాయం చేస్తా నన్నాడు.

చా త కు డు

హనుమంతుడువజ్రపుతునకసుమా శబరీ!

శ బ రి

అలాగా! ఇర్రి నాకు పాటలు నేర్పుతుంది సుమా నాయనా!

చా త కు డు

ఇర్రి ప్రకృతిముద్దుబిడ్డ శబరీ!

శ బ రి

అవు నమ్మా, అవును

శ్రీరాములవారు దండకారణ్యములో ఉన్నారు. శ్రీరాములవారిని ఎలాగ ఆరాధించడం? శ్రీరాములవారికి ఆకలి వేసినప్పుడు ఏమి పెట్టను? శ్రీరాములవారికి నామీద కోపం రాదు కదా? ఏం చెయ్యను. శ్రీరాములవారిపేరు జపించుకో మన్నారు గురువుగారు. అలాగ చేస్తాను.

# పెనుగొండ చిత్రములు



౧. శ్రీకృష్ణదేవరాయల వేసవి మనికి



౨. పారా బురుజు

శ్రీ యం. కే. రంగస్వామి అయ్యంగారు తీసిన ఫోటోలనుండి.



ముగ్గురు నొక్కడే

ఈ వింత ఫోటో శ్రీ సి. జి. జగన్నాథ దాసుగారు తీసినది.
దీనిని వీ రొక్కటే 'నెగటివు' నుండి తయారుచేసిరి. ఇందుగల ముగ్గురు నొక్కరే.



పరీక్షరోజుల్లో

దీనిని శ్రీ సి. జి. జగన్నాథదాసుగారు తీసిరి. వేళ: రాత్రి పదిగంటలు. పెద్దవెలుగు లేదు. నెగటివునకు 33 సెకనుల కాలము వెలుగీయబడెను. కాన మూడు నెగటివులు చెడిపోయినవి. నాల్గవదానినుండి యిది తయారుచేయబడినది.

చాతకుడు

అమ్మా, కుమ్ములో పెట్టినదుంప లున్నవి. తీసుకువెళ్లు.

శబరి

వద్దు నాయనా. మరచిపోకుమా, శ్రీరాములవారికి ఏమి సపర్యలు చెయ్యాలో ఆలోచించి చెప్పు. వెళ్లుతా.

[బుజముమీద నీటిబుఱ్ఱ పెట్టుకొని ఆలోచనలో మునిగి ఉండి శ్రీరామస్మరణ చేస్తూ శబరి వెళ్లును.]

[తెర]

---

## కుటీరపుష్పము

బాలకవి, గోరింట సూర్యనారాయణరాజుగారు

(శ్రీ పురుషోత్తమదాస్ టండన్, యం. ఏ., యల్. యల్. బి. వ్రాసిన హిందీపద్యమున కనువాదము)

భాగ్యవంతుఁడ నేను
పరమ సంతోషమునఁ
గాలంబు గడపెదనురా—యీగుడిసె
కైవల్యముగఁ జూతురా.

మధుపరవమండితం
బగు తోఁటలందుండఁ
గోరికెన్నఁడు లేదురా—యీగుడిసె
సురభితంబుగఁ జేతురా.

అల్పంబు జీవనము
స్వల్పంబు సౌరభము
నాకివియె సరిపోవురా—యీగుడిసె
నాకోరు సీమయ్యెరా.

ఒంటరిగ వసియింతు
నొకమూల పడియుందు
నందంబుగాఁ జేతురా—యీగుడిసె
నానంద పఱచెదను రా.

---

'లీలా! ఏమి టాఅల్లరి? మగవాళ్ల మీద కెగబడ్డం? ఇంకా చిన్నపిల్ల ననుకొన్నావా?'

అని లోపలేదో పని చేసుకొంటూ తటాలున బయటికి వచ్చి చూచిన సుందరమ్మగారు (లీలతల్లి) కేకేసింది. ఆమాటలు వినడంతోటే, అహర్నిశం నాతో యేదో చిల్లికజ్జం పెట్టుకొని అల్లరి చేస్తుండే లీల మహాపరాధం చేసినదానివలె చప్పున వెనక్కి తగ్గి గోడ కానుకొని బెదరిన లేడిలా యెడంగా నిలబడి చూస్తుంది. లీల సౌందర్యోపాసకురాలు. ఇదొకర్ని చూచి నేర్చుకొన్నది కాదు. ఒకరు చెబితే వచ్చిందీ కాదు. సొంత బుట్టింది. అతిశుభ్రం. తానలా వుంటుంది. ఒకరలావుండా లనుకొంటుంది. మేడమీద తట్టలో గులాబీమొక్కలు, బంతిమొక్కలు యింకా యేవేవో రంగురంగుమొక్కలన్నీ పెట్టి రోజు స్వయంగా వాటికి నీళ్లు పోసి పెంచుతూ వుండేది. అవి పూలు బూస్తుంటే ఒక్క రేకైనా యెవర్నీ తుంచనిచ్చేది కాదు. నేనారోజున లీలను యేడిపిద్దామని, రెండు గులాబీపూలను తుంచాను. దానిమీద పట్టరాని కోపం వచ్చింది మాలీలకు నామీద. 'శేఖరం మామా!' అని మీద కెగబడి నాక్రాపునంతా పీకిపెట్టింది. లీలకు నన్ను చూస్తే మొదటినుండీ మహాప్రేమ. నేనేమి యేడిపించినా సరే, అవన్నీ తనమీద గల ప్రేమచేతనే అంటానని తెలుసుకొని, బదులుకుబదు లంటూ మహా సరదాగా మాట్లాడుతూ వుండేది. ఇంతవరకు మగ, ఆడ విచక్షణ గాని, తన పర అనే భేదభావం గాని లీలకు నావిషయమై వుండేదే కాదు. సుందరమ్మగారు ఆరోజు కోపంచేసినది మొదలుకొని కొత్తమనిషైపోయింది మాలీల. ఆరోజు మొదలు నేను కాలేజీనుండి రాగానే గంతేసుకొంటూ వచ్చి, నాజేబులు తడివి చూచేవాళ్లు గాని, పుస్తకాలు లాక్కునేవాళ్లు గాని, యెవరూ వుండేవాళ్లు కారు. నాదగ్గర చదువుకొనేటప్పుడైనా, ఓరగా కూచొని, యెంతవరకవసరమో, అంతవరకే మాట్లాడుతూ వెళ్లిపొయ్యేది. అకాస్త మాటపలుకైనా, తన స్త్రీస్వభావానికి భిన్నంగా నడుస్తున్నానని అనుకొనిపోతానేమో అని భయపడ్డట్టుగా వుండేది. ఇన్నాళ్లూ నేనేదైనా తనకు తెలియని విషయం యొకటి చెబితే, దానిమీ దొక లక్షప్రశ్నలు వేసి, యితరసంగతు లింకా యెన్నో తనకు తెలియనివి నేర్చుకొనేటందు కవకాశం కలిపించుకొనేది. ఇప్పు డా కులానే చచ్చిపోయింది. ఎంతసేపటికి తన స్త్రీస్వభావానికి భంగం వచ్చేటట్టు ప్రవర్తిస్తున్నానా అని ఆలోచించుకొనే గొడవలోనే వుండేది. ఇంతమార్పెందుకు? ఆరోజు సుందరమ్మగారి గదమాయింపుపాఠంతోటే లీల కుండే తెలివితేటలు, ఉత్సాహం సన్నగిలాయి. అంతవరకు నేర్చుకొన్నదే నేర్చుకొన్నట్టయింది కాని, ఆపైన నే చెప్పిందీ కొద్దే, తను నేర్చుకొందీ కొద్దే. దానికి తోడు యింతలో లీల యుక్తవయస్కురా లయింది. ఇప్పుడిహ పురుషముఖావలోకనంకూడ ఆత్మగౌరవానికి లోప మనేభావం గట్టిగా తలకెక్కింది. అటుతరువాత కొన్నిమాసాలవరకు లీల నా కెదురుపడేదే కాదు. ఎప్పుడైనా యేమరుండి యెదురుపడ్డం తటస్థిస్తే, లేడిపిల్లలా చంగున యెగిరి ప్రక్కనున్న గదితలుపుచాటున నక్కేది. తలుపుసందులోనుంచి నే నవతలికి వెళ్లేనో లేదో అనిమాత్రం చూస్తుండేది.

మాధవరావుగారు యింగువ కట్టినగుడ్డ. తండ్రి తాత ముత్తాతలు దివాన్గిరీలు చలాయించి రావుబహదూర్లు, దివాన్బహదూర్లు సంపాదించినవారు. మాధవరావుగారికి తండ్రి చిన్నతనంలోనే పోవడంచేతను, పెద్దవాండ్లు దివాన్గిరీలు చలాయించిన సంస్థానాలు సన్నగిలిపోవడంచేతను, తను చదువుకొన్న విద్య వంశగౌరవానికి తగ్గ ఉద్యోగాన్ని సంపాదించడానికి చాలింది కాకపోవడంచేతను, పెద్దల సంపాదనపైన్నే ఆధారపడే సుఖంగా యింట్లో కూర్చునేవారు. ఇంటిమర్యాదలు,

ఆట్టహాసాలు తగ్గకుండానే పట్టుకొచ్చేవారు. పెద్దతోట. అందులో బంగళా. వాకిటముందు రెప్పుడు ఒక బిళ్ల లేని బంట్రోతు. ఓగుఱ్ఱము. ఓబండి. రెండు మేనాబండ్లు. వీటిని వుపయోగిస్తూవుంటే యివి యేమాత్రే మక్కర కొస్తాయో తెలిసేదే కాని, నే జెరిగింతరువాత వాటి కాఅవస్థ పట్టలేదు. బంగాళాలో వో డ్రాయింగు రూము. దానిమధ్య ఒక రౌండుటేబిలు. చుట్టూత అయిదారు కుర్చీలు. గోడలకు వాలుగువైపుల వాలుగు స్ప్రింగులుచెడ్డ సోఫాలు. ఒక పుస్తకాల అలమైరా ఓప్రక్కన అమర్చివుండేది. టేబిల్ మీద ఓతెలుగు పత్రిక, ఓఇంగ్లీషుపత్రిక, రెండుమూడు మాసపత్రికలు యెప్పుడూ వుండేవి. మాధవరావుగారు తరుచుగా బంధువులనే గాని మిత్రులనే గాని రిసీవ్ చేసేది యీరూములోనే. ఉదయాన్నే లేవడం, కాఫీ పుచ్చుకొన్న తరవే ఈరూములోకి వచ్చి కూర్చొని, ఏదో పేపరు చదువుకోవడం. తనను చూడడాని కెవరైనా వస్తే దర్శనమిచ్చి సందర్భానుసారంగా, తమ వంశగౌరవం, తనగౌరవం, తన కేదో ఊపిరితిరుగనంత కార్యభారంవున్నట్టుమాట్లాడుతూ వుండేవారు. పదిగొట్టగానే లేచి భోజనవ్యవహారాలు చూచుకొని, పన్నెండుగంటలకు పడక వేశేవారు. నాలుగ్గంటలు కాగానే తిరిగి కాఫీ. ఆపైన క్లబ్బుకు బయలు దేరేవారు. బిళ్లగోచి, నల్లని సర్జిలాంగ్‌కోటు, తెల్ల జరీ తలపాగా, నిడివికి మడిచి యిస్త్రీచేసిన జరీఅంచు కండువా పైన, కలకత్తా ఆఫ్‌స్లిప్పర్సు తొడిగి, చేతిలో వెండి పన్ను కర్ర పట్టుకొని బయలుదేరేవారు. ఆనల్లనిమీసాలు, రోజు విడిచి రోజు తప్పకుండా ముఖక్షౌరం చేసికొని యెర్రగా నిగనిగలాడే ముఖం చాలా అందంగానే వుండేది. ఊళ్లో యెక్కడ సభ జరిగినా సరే మాధవరావుగారు హాజరు. తరువాత ఎవరైనా కాస్త మాట్లాడమని అడిగితే సరి, ఏవిషయమైనా తనకు తెలియనిది లేనట్లు, సభలో యేధైర్యమైన కుఱ్ఱవాడో 'చాల్లేవయ్యా సొద, కూర్చో' అన్నంతవరకో, ప్రెసిడెంటుగారు మూడుమాట్లు తన గడియారంవంక, ఆయన ముఖంవంక చూచేవరకో, లేకుండాపోతే సభలో వొకరి వెనకాల వొకరే, సభ పల్చబడేదాకా, లేచిపొయ్యేవరకో దుంప తెగేశా రన్నమాటే. వితంతువివాహాలు, రజస్వలానంతర వివాహాలు, అస్పృశ్యత, యీ, ఆ, విషయ మేమున్న దని, అన్నివిషయాలనుగురించి మాట్లాడేవారు. ఈవైఖరి చూచి ఊళ్లో అందరు లీలకు యే రిఫారం మ్యారేజో చేస్తా రనుకొనేవారు. పైగా లీలచదువువిషయంలో కూడా చాల శ్రద్ధ వహిస్తూవుండేవారు. లీలకు పదిసంవత్సరాలు దాటాయి. థర్డుఫారం చదువుతుండేది. ఇంతలోకే నేను మాధవరావుగా రింట ప్రవేశించడ మయింది.

నాకు చిన్నతనంలోనే తల్లిదండ్రులు గతించి, తన మన అనే ఆప్తులే లేకపోవడంచేత విజయనగరంలో వారాలు చేసికొని, చదువుకొంటూ వుండేవాడిని. నాకు మొదట్లో మాధవరావుగారింట్లో ఒకటే వారం వుండేది. ఉండడంమాత్రము వారింట్లోనే వుండి చదువుకొంటుండేవాడిని. లీల కప్పుడప్పుడు చదువుమాత్రం చెబుతుండేవాడిని. ఆసంవత్సరం నేను యింటర్మీడియట్‌లో ప్రెసిడెంసీఫస్టువచ్చి మెడలు సంపాదించిన తరువాత మాధవరావుగారికి నామీద యెందుచేతనో అపారమైన ప్రేమ కలిగింది. నన్ను తనింటిలోనే వుండమని బలవంతం చేశారు. మొదట్లో నే నొకరిమీదనే ఆధారపడివుండడం యిష్టం లేక వొప్పుకోకపోయినా, మాధవరావుగారు, సుందరమ్మగారు అదేపనిగా బలవంతపెట్ట మొదలుపెట్టినతరువాత వొప్పుకోక తప్పిందికాదు. భార్యాభర్త లిద్దరూ నన్ను క్రమేణ తమపిల్లవాడిలాగానే ప్రేమిస్తూవచ్చేవారు. మాధవరావుగా రిప్పు డెవరైనా క్రొత్తవాండ్లు తనింటికి వస్తే చేశే ప్రసంగాలలో నాప్రస్తావనగూడా వొకటి. ప్రసంగవశాత్ నేను మహా తెలివిగలవాడనని, ప్రెసిడెంసీఫస్టు వచ్చా నని చెప్పడమ, విసుగువిరామం లేకుండా నాప్రెసిడెంసీమెడల్ చూపిస్తూవుండేవారు. ఇదంతా వారి చలవవలనే నని ఆక్రొత్తవా రర్థంచేసుకొనేదాకా దుంప తెగేశా రన్నమాటే!

ఇల్లా వుండగా లీల పెండ్లివొత్తిళ్లు యింట్లో కలిగేయి. 'మాధవా! నీమతి పోయిం దట్రా! వంశనాశ నానికి పుట్టిన్న ట్లున్నావు. అంత్రబతుకు బ్రతికి ఆఖ

రుకు మహబీర్ వారి సంబంధాలు వారపుబ్రాహ్మల తోను, పూటకూటింటివారితోను చెయ్యాల్సి లనుకోడం యిన్నాళ్లకు నీతరంలో మొదలెట్టా లనుకొన్నావట్రా! బ్రతికివుండి ఈ అరాచకాలన్నీ చూడమని కాబోలు ఆ మహారాజు చచ్చిపోయినాడు. నాకు చావైనా రాద యిపోయె.' అను మాధవరావుగారి తల్లి ముసలమ్మ రేడుపుతో లీలను నా కిచ్చి పెండ్లి చెయ్యాల ననుకొనే తలంపు రెుగరేసుకొనిపోయింది. వంశగౌరవాన్ని నిలుపుకోడానికి తగ్గసంబంధానికై మాధవరావుగారు మహా తిప్పలు పడ్డారు. ఎక్కడైనా కాస్త అనుకూలంగా దొరికితే వాండ్లు కోరే కోర్కెలను నెరవేర్చడానికి మాధవరావుగారి తరమయ్యేటట్లు కనిపించ లేదు. ఆఖరకు వెంకోజీవారి సంబంధం నిశ్చయించుకొన్నారు.

ఓరోజు సాయంకాలం నాలుగ్గంటలకు, ఇద్దరు తలనెరసిన పంతుళ్లు, కూడా పట్టెడు సిగ, ముదురు మొగం, బక్కగాపొడుగ్గా వుండే మరోవ్యక్తిని వెంటబెట్టుకొని దిగబడ్డారు. ఆవరకే యెవరో వస్తారని, యేర్పాట్లన్నీ చేసివుండడంచేత, పంతుళ్లు ముగ్గురూ వచ్చి హాలులోని కుర్చీలమీద కూరున్నారు. లీలకు సంబంధం కుదిర్చే పెద్దమనిష్యుల్లా, కనిపించారు. ముసలమ్మ తలుపు కానుకోని కాస్త దూడంగా, తెల్లని మల్లుథోవతి ముసుగుతో, చేతిలో



జపమాల పట్టుకొని, శేమా లడుగుతూ, ఆనందంగా కూర్చుంది. తలుపురెక్క అడ్డంచేసికొని అప్పుడప్పుడు తల బయట పెట్టి చూస్తూ నిలుచుంది సుందరమ్మగారు.

మాధవరావుగారు ముస్తాబా చేసికొని మూడుమాట్లు మేడమీది నిలువుటద్దం ముందర మీసాలను సరిదిద్దుకొని క్రిందికి దిగివచ్చారు. నలుగురు కూర్చొని ఆమాట యీమాట మాట్లాడుకొంటుంటే మన కెందుకని నేను వెళ్లిపోయేను. వచ్చినవాండ్లు వెళ్లేక, "శేఖరం! పెండ్లికొడుకును చూచావా?" అంది సుందరమ్మగారు నవ్వుతూ. పెండ్లికొడు కెవ్వ డొచ్చాడా అని ఆలోచిస్తూ, 'లేదే' అన్నా. "ఆయనే, ఆమధ్యకూర్చున్నా యనే" అని యిక సంబంధం కుదరలే దనేబాధ తప్పిం దనే సంతోషమంతా పుట్టిపడేటట్లంది. నేను దిగ్భ్రమ చెందా ఆమాట వినడంతోటే. ఆవయ సేమిటి! ఆ ఆకార మేమిటి! ఆపురుషునికి తీసికొనివెళ్లి బంగారం వంటి లీలను కట్టిపెట్టటం యేమిటి! ముసలమ్మ చెల్లెలు కూతురుకొడు కట. బాగా ఆస్తి వుందని రెండో పెండ్లి కివ్వా లనుకొన్నారట! ఈవిషయంలో మాధవరావుగారికి మతి పోయిం దనుకొన్నా. ఆరాత్రంతా నా కిదే ఆలోచన. కాస్త కండ్లు మూస్తే సరి, ఆవిగ్రహం కలలో కనిపించేది. ఏమనుకొన్నా సరే, మాధవరావుగారితో యీసంబంధం మానవలసిందని చెప్పేద్దా మనుకొన్నా. కాని తెల్లవారేటప్పటికి నా కాధైర్యం చాలింది కాదు. పైగా యింకోచిక్కుగూడాను. లీలను నా కిచ్చి వివాహం చెయ్యాలనని టూకీగా అనుకొనుండడంచేత, యిందు స్వార్థము, ద్వేషభావం వుందని యెక్కడ దనుకొంటారో అని భయంకూడా వేసింది. లీలతోమాత్రం నీ కీసంబంధం మంచిది కాదు, నేను చేసుకోనని గట్టిగా తల్లిదండ్రులతో చెప్ప మన్నాను. ఇది కేవలం నాపిచ్చి కాని లీల చెప్పగలదా? చెబితే వాండ్లు వింటారా? ఎల్లాగో వివాహం జరిగిపోయింది. కొన్నాళ్లు గడిచింది. పిల్ల పెద్దమనిషి కాలేదు..........................

పిల్లను పంపమని లీల అత్తగారు కబు రంపారు. ......

...............................................

............. మాధవరావుగారి కిప్పుడు వొళ్లు తెలిసింది. దీనితో కొంత వారికి వీరికి మనఃస్పర్థలు కలిగేయి.

"ఇంతకు దాని గ్రహచారాని కెవ రేమి చేయగలరు!" అని అర్థము పర్థము తెలియని లీలను నిందించడాలు యింట్లో ఆడవాండ్లు మొదలుపెట్టేరు. లీల కిప్పుడిప్పుడు కొంత జ్ఞానం తెలుస్తూవచ్చినది. తన్నవసరంగా యిందుకు బాధ్యురాలను చేస్తున్నారని, తనకు తగిన వరుడు కాడని గ్రహించింది. దీనికితోడిప్పుడు లీల యుక్త వయస్కురాలయింది. లీల కిప్పు డావుత్సాహమే లేదు. ఎప్పుడు యింట్లో ఏదో విచారంగా వుండేటట్లుండేది. వేళకు అన్నం తినేదికాదు. తలనొప్పి అనో, కాలు నొప్పి అనో కళ్లనీళ్లు పెట్టుకొంటూ పడుకొనేది. ఎవరైనా దగ్గిర కొస్తే కసురుకొనేది. ఇప్పుడు నన్ను చూచి బెదరి పోవడం, తలుపు చాటు దాక్కోడం క్రమేణ తగ్గిపోయినాయి. కాస్తమాట, పలుకుకూడా వుండేది. కాని చూపులలోమాత్రం నా తనత్వం వచ్చింది. కూర్చొనున్నంతసేపు తలెత్తకుండా వుండి లేచిపోతూపోతూ వోవిధమైన వారచూపు చూచేది. పదిమందిలో వున్నప్పుడు తన చూపు నా కక్కరకురానట్టు మెలిగేది. ఒంటరిపాటున తన రెండుకండ్లు వొక్క నాకొరకే సృష్టింపబడ్డట్టు చూచేది!

ఇల్లా వుండగా మా బి. ఏ. పరీక్షలు సమీపించాయి. ఇంట్లో కూర్చొని చదువుకోడానికి యెవరో వొకరు వచ్చి మాటలు పెడతారని సందడిగా వుంటుందని, మాధవరావుగారి బంగాళా కానుకొనేవుండే తోటలోకి వెళ్లి కూచొని చదువుకొంటుండేవాడిని. ఓరోజు మధ్యాహ్నం మూడుగంటలయింది. మబ్బు చాలా గాఢంగా కమ్ముకొచ్చింది. మెరుపులు మెరుస్తున్నాయి. ఉరుములు వురుముతున్నాయి. ప్రకృతి మహాభయంకరంగా వొక్కక్షణంలో మారిపోయింది. మల్లెపొదలదగ్గిర యెవరో మనిషి కదిలినట్లయింది. ఎవరా అని పరీక్షించి చూచేటప్పటికి, కొర్రాటిచీర, బారెడుజడ—లీల! గుండె జల్లుమన్నది. ఇన్నాళ్లగా నేను మాలీల యిట్లేవ లెప్పుడు వొంటరిగా తటస్థపడలేదు. ఇప్పు డందులోకి యింట్లో వెయ్యికండ్లతో కనిపెట్టివున్నారు. గాలివాన కూడా ప్రారంభించడంచేత కాబోలు గబగబ లీల నేనున్న తోటవసారాలోకి పరుగెత్తుకొంటూ వచ్చింది.

ఇదంతా వోనాటకంలా కనిపించింది. ఎన్నడు స్టేజి అంటే యెరుగనివాడు వేషం వేసికొని స్టేజిమీద నిలబడితే వణికినట్లు వొణికాయి నాకాళ్లు. మాట రాలేదు. వెర్రిచూపు చూచాను లీలకేసి. లీల మాట్లాడకుండా, బ్రహ్మాండమైన వర్షము, ఇటుకరాళ్లంత వడగండ్లు పడుతుంటే, భయపడ్డట్టు చూస్తూ (నాకేసి చూడకుండానే) నిలుచుంది. లోపలిమనిషి బయటికిగాని బయటమనిషి లోపలికిగాని కదలడం ప్రాణాపాయంగా కనిపించింది.

నేను—లీలా! ఏం? ఇలా యెందుకు వచ్చావు?

లీల—నాన్న క్లబ్బుకు వెళ్లేరు. అమ్మ నేరాజుగారింటికి వెళ్లింది. అవ్వ నడిగి తోట్లో మల్లెపూలు కోసుకుందామని వచ్చా.

నేను—నేను తోటలో ఉన్నానని తెలేదు అవ్వకు?

లీల—తెలేదు.

నేను—నీకైనా తెలేదా?

లీల—తెలుసు. అందుకోసరమే వచ్చాను, పూలకని చెప్పి. నీతో మాట్లాడవాలెనని యెన్నిరోజుల నుండో అనుకొంటుండేదాన్ని. ఎప్పుడు యెవరో ఒకరు వుండడంచేత వీలయింది కాదు.

నేను—ఇప్పుడు మన మేమి మాట్లాడి యేం లాభం? ముహూర్తంకూడ నిశ్చయించారు కారూ? ఆఖరుకు మన కింక ఈ కండ్లచూపులైనా లేకుండా పోతాయి.

మరి మాట్లాడలేదు. తల వంచుకొని కండ్ల నీరు గారుస్తూ అల్లాగే నిలుచుంది. నేను దగ్గరకు వెళ్లి మీద చెయి వేసి, 'లీలా! యిప్పు డెవరం యెంతదుఃఖించినా లాభం లేదు. జరిగిపోయిందేదో జరిగిపోయింది.' అని అంటుంటే దగ్గిరకు వచ్చి నాయెదపై తన తల వాల్చి యేడుస్తూ నిలబడింది. నా కేమి తోచిందికాదు. అలాగే వెనక్కు నాలుగడుగులు నడిపించి నేను చదువుకొనే టేబిల్ కానుకొని లీలను కౌగిటిలోనే వుంచుకొని నిలబడ్డాను. ఇంతలోకే మరోవేపునుండి గొడుగు పట్టుకొని

సుందరమ్మగారు లీల నాకౌగిట్లో వుండడం చూచింది. లీల చప్పున జరిగి గోడవేపు ముఖం చేసికొని నిలబడింది.



నాకు ప్రపంచమంతా తిరిగిపోయినట్టుగా, నోంటిలో నుండి ఆవిర్లు బయలుదేరి, కదల మెదలడానికి శక్తి లేక అల్లాగే తలవంచుకొని నిలబడ్డాను. "లీలా పోదాం పా" అని సుందరమ్మగారు మామూలు ధోరణిలోనే అంది. తల్లివైపు ముఖం యెత్తిచూడకుండానే లీల యింటికి నడవడం ప్రారంభించింది. వెనకాల సుందరమ్మగారు గొడుగు వేసికొని బయలుదేరింది. నాముఖంకేసైనా చూడలేదు సుందరమ్మగారు. అప్పటికప్పుడే వర్షం తగ్గి తెరపిచ్చింది. అది నేను గమనించనేలేదు. లీలదుఃఖాన్ని చూచి చెట్లుకూడ పరితపిస్తున్నట్లు పెద్ద పెద్ద కంటినీటి బొట్లను రాలుస్తున్నాయి. బ్రహ్మాండంగా ప్రకృతినంతా ఒక్క గడియలో ముంచివేసేటట్టు మేఘాలు కమ్ముకొని వచ్చి చీకటిమయం చేసివేసిం దల్లా తెరపిచ్చింది. ఇంత హడావుడి యింతకేనా అని కాబోలు ప్రకృతికాంత మందహాసం చేస్తూ వున్నట్టు తెల్లని వెన్నెలలాంటి యెండ చెట్లమీద కనిపిస్తూవచ్చింది. తనాడించే నాటకం అంత మెండిందని కాబోలు, నవ్వుముఖంతో సూర్యుడు చల్లగా జారుకొంటున్నాడు.

నా కేమి తోచిందికాదు. ఏదో మహాపరాధం చేసినట్టు గుండె కొట్టుకోవడం మొదలుపెట్టింది. తిరిగి యేమొహం పెట్టుకొని యింట్లోకి వెళ్ళడం? సుందరమ్మగారు కల్లానో తను చూచిన సంగతల్లా ముసలమ్మతో, మాధవరావుగారితో చెప్పకపోదు. మాధవరావుగారింక నన్ను తనకొడుకులా ప్రేమించడం యెల్లా సాధ్యమవుతుంది? అయినా యిందులో నేను బుద్ధిపూర్వకంగా చేసిన నేర మేమి లేదు. నా నేర మేమి లేదని వాండ్లకు తెలిసే దెల్లా? లీలది తప్పనుకోడానికికూడా పాపం! ఆమెదిమాత్రం తప్పేముంది? తోటలోకి పూలకోసం వచ్చింది. వర్షం వస్తుంటే తప్పనిసరిగా వసారాలోకి పరుగెత్తుకొంటూ వచ్చింది. అయినా యిప్పు డిదంతా విచారించేవాం డ్లెవరు? కొడుకులా ప్రేమిస్తూ, అన్నివిధాలా నాసౌఖ్యమే వాండ్ల సౌఖ్యంలా భావిస్తూ, చిన్న కుటుంబంలోవాడినైనా తమబిడ్డనుకూడా యిచ్చి వివాహం చెయ్యవాలె ననుకొనేటంత ఉదారభావం కలిగినవారిని ద్రోహంచెయ్యడానికి తలపెట్టేనని తలుస్తారా? ఏమి తోచిందికాదు. మరేమి మాట్లాడకా దారి నలాగే పారిపోయి ఎక్కడనైనా దాక్కుందామా అనిపించింది. ఇది మరీ అప్రతిష్ఠకు కారణమవుతుంది. పైగా కట్టుబట్టా నేను వున్నాను. ఇల్లా పరిపరివిధాల ఆలోచనచేస్తూ కుర్చీలో అలాగే నిద్రపొయ్యేను.

రాత్రి యెనిమిదిగంట లయింది. 'శేఖరం! ఏమప్పుడే నిద్రపోతున్నావు? లే, పోదాం భోజనానికి' అని మాధవరావుగారు ప్రత్యేకించి నాకోసరం తోట్లోకి వచ్చి లేపేసరికి నా కాశ్చర్యం వేసింది. లోపల గుండె మాత్రం కొట్టుకుంటూనేవుంది. కాని సుందరమ్మగారు ఈసంగతి ఎవరితోనూ చెప్పలేదనే ధైర్యం మాత్రం కలిగింది. మాధవరావుగారు నన్నెంత ప్రేమిస్తూ వున్నా స్వయంగా వచ్చి పిలవడం తన గౌరవానికి హీననే వుద్దేశంతోనే వుండేవారు. ఎవరిచేతనైనా పిలిపించేవారే కాని యింతవరకు యెప్పుడు స్వయంగా వచ్చి పిలిచింది లేదు. ఈపర్యాయం సుందరమ్మగారే యిందుకు కారకురాలై వుండవలెనని తోచింది. నాటినుండి సుందరమ్మగారి ముఖం చూడడానికే నాకు భయంగా వుండి తలవంచుకొనే వారితో మాట్లాడుచుండేవాడిని. సుందరమ్మగారు నా భయాన్ని గ్రహించి, ఆభయాన్ని తీసివేద్దామని కాబోలు, అతిదయగా మాట్లాడుతూ

నన్నెల్లాగైనా పూర్వంమాదిరే యింట్లో కలసి మెలసి తిరిగేటట్టు చూచేది. కాని లీలనుమాత్రం కడుపులో పెట్టుకొని కాపాడుచుండేది.

ఆరోజు మాధవరావుగారి తండ్రి తద్దినం. మాధవరావుగారు కర్మకాండలో పడివున్నారు. సుందరమ్మగారు, ముసలమ్మ వంటవ్యవహారాలు చూచుకొంటున్నారు. మైలవస్తువు లందిస్తువుంది లీల. నేను మేడపైన కుర్చీలో పడుకొని ఏదోపుస్తకం చూస్తూ అలాగే నిద్రపొయ్యేను. చల్లగా నానుదిటిమీద మెత్తనిచెయ్యి పడేటప్పటికి ఉలికిపడి లేచా. చూస్తే లీల! మరిహ నాకు ముందు వెనకా యోచనే పోలేదు. చట్టున లేచి గట్టిగా చంప నొక్కి ముద్దెట్టుకొని కౌగలించుకొన్నాను. ఇల్లా వొకరికౌగిట్లో వొకరం ప్రపంచాన్ని మరచిపోయి మనసులతో మాట్లాడుకొంటూ చిత్రించిన బొమ్మల్లా అయిపొయ్యేము. ఒకభుజంమీద రెండు తడిపిపిండిన చీరలు, ఇంకోచేత ఒక తడిపిపిండిన ధోవతిని విప్పి కుచ్చెళ్లు పోసికుంటూ, బట్ట లారెయ్యడానికి కాబోలు చప్పుడు గాకుండా మేడమె ట్లెక్కి వచ్చింది సుందరమ్మగారు. నిర్ఘాంతపోయింది. లీల మొహం అటువైపు చేసివుండడంచేత గూడడానికే అవకాశం లేకపోయింది. అయితే సుందరమ్మగారికి లీలకు నాపై యెంత గాఢమైన ప్రేమ వున్నదో తెలియడాని కవకాశం కలిగింది. నేను చూస్తూనే అలాగే నిలబడ్డాను కాని, ఒక్కక్షణం నాకు కండ్లు కనిపించాయి కావు. చక్కగా చూస్తూనే కండ్లు కనిపించని అదో ప్రపంచంలో వుండిపొయ్యేను. వెంటనే వొళ్లు తెలిసింది. 'అమ్మ' అని మెల్లగా లీలచెవిలో వూదుతూ గట్టిగా నన్ను అంటపెట్టి చుట్టివేసికొనిన లీల రెండు చేతులను నా రెండుచేతులతో బట్టి తేవదీశాను. లీల గబక్కని వదిలేసి సుందరమ్మగారి మొహం చూచి తలవంచేసింది. సుందరమ్మగా రల్లాగే నిలబడింది. ఎవరికి యేమి తోచిందికాదు. సుందరమ్మగారు మెల్లిగా నాకు సమీపించి, 'శేఖరం! నీ వెంతో తెలివిగలవాడ వనుకొన్నాను. కన్నకడుపుకన్న పెంచినమమకారం యెక్కువవడంచేత, కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుందని, పోనీ నీకే తెలివి వస్తుందికదా అని చూస్తుంటే, నీతెలివి తెల్లవారినట్లే వుంది! ఇంత చదువుకొన్నావు, యేం లాభం? అదంటే అది పశువు. మాకడుపు చెడబుట్టింది. వంశాన్నంతా అప్రతిష్ఠపాలు చెయ్యడానికే దాపరించింది. నీవుకూడా దాని గొంతు కొయ్యడానికే యిల్లా జేస్తున్నావు. గడపముందర్నే కదా దానత్తా రిల్లు? కాస్త గాలికబురుగా వాండ్లకు తెలుస్తుం దనుకో, యింక దాని కేమైన పుట్టగతు లుంటాయా?' అని తలవాచేటట్లు చీవాట్లు పెట్టి సుందరమ్మగారు తనపనిమీద తాను వెళ్లిపోయింది. లీల అప్పుడే యీమాటలమధ్య చల్లగా జారుకొంది. కాని మా సుందరమ్మగారికి నాపై నెంత ప్రేమో చెప్పలేను. నాకు చిన్నతనంలోనే తల్లి పోవడంచేత, తల్లి ప్రేమైనా యింత గాఢంగా వుంటుందో వుండదో సందేహం. ఆ! అంటే చాలు, ఆగడపైనా త్రొక్కడానికి వీలు లేకుండా చెయ్యడానికి. ఆరోజు మొదలు సుందరమ్మగారిని నాహృదయంలో తల్లిలాగ ప్రేమించుకొనడమే గాకుండా, గురుభావం వుంచుకొని పూజించుకొనేవాడిని.



'లీల గబక్కని ......................తల వంచేసింది.'

ఇంతలోనే మా బి. ఏ. రిజల్టుకూడా వచ్చాయి. బి. ఏ. లో ఫస్టుక్లాసులో రావడమే కాకుండా గవర్న

మెంటు స్కాలర్‌షిప్ మీద నన్ను యింజనీరు పరీక్షకు చదవడానికి ఇంగ్లండు పంపదలచినట్లుకూడ తెలిసింది. ఇప్పు డింక మాధవరావుగారి ఆనందానికి మితిలేదు. ఆరోజంతా, కాస్త పని లేదు ఘడియతీరిక లేదన్నట్లు కనిపించారు మాధవరావుగారు. ఆఖరుకు ఏ బాకీదారుడో పైక మడగడానికి వస్తే, 'పదిరోజులు నిదానించాలి, మా శేఖరం, యింగ్లండు వెళ్లుతున్నాడు' అని చెప్పి పంపేవారు. కొందరు మిత్రులు నన్ను గౌరవిస్తూ టీపార్టీ లిచ్చారు. మాధవరావుగారు వెంటబెట్టుకొని వెళ్లేవారు. తిరిగి వీరందరికీ మాధవరావుగారింట్లోనే విందు చేసి, 'మా శేఖరాన్ని తిరిగి సుఖంగా మన దేశానికి వచ్చేటట్టు దీవించండి' అని పాపం తండ్రిలా ప్రార్థేయపడేవారు. ఆపుకోలేక కండ్లనీళ్లుకూడ పెట్టుకొనేవారు. నాకుకూడ మాధవరావుగారి కుటుంబాన్ని వదిలిపోవడం మహాకష్టంగా వుంటూవచ్చింది. ఇంగ్లండుకు సుఖంగా చేరాను. కొన్నాళ్లు ఉత్తరప్రత్యుత్తరాలద్వారా ఒకరి క్షేమాలు ఒకరికి తెలుస్తూవచ్చాయి. రెండేండ్లు కావచ్చింది. దేశమంతటా ఇన్ఫ్లుయంజా జ్వరాలు చుట్టివేసినట్లు, ఒక్క లీల తప్ప మాధవరావుగారి కుటుంబమంతా అంతరించిందని, ఋణములచేత యిల్లువాకిలికూడా లేకుండా పోయిందని తెలిసింది. నాకీచదువంతా నిరర్థక మనిపించింది. నన్ను, నా చదువును చూచి ఆనందించేవాండ్లు కాని, నా క్షేమం కోరేవాండ్లు కాని, ఈ ప్రపంచంలో మరెవరు లేరు. ఒక్క మాలీల. ఆమైనా అత్తగారింట్లో సుఖంగా వున్నందుకు భగవంతుని వేయివిధాల ప్రార్థిస్తూ, సంతోషపడుతుండేవాడిని. మరి రెండేండ్లదాకా నాకు దేశానికి రావడానికే వీలు లేకపోయింది. ఉత్తరాలు వ్రాసేవాళ్లుకూడ లేకపోయినారు. ఒకటిరెండు పర్యాయములు, లీలకే క్షేమసమాచారాలు తెలుపమని వ్రాయాల నసుకొన్నాను. కాని యిది లీలసౌభాగ్యానికి భంగకర మేమోనని దడిచి మానేశాను. నాకోర్కె పూర్తికావడమునకు అయిదేండ్లయింది. రాగానే, యు. పి. లో ఛార్జీ పుచ్చుకోవలసివచ్చివుండడంచేత, విజయనగరం వెళ్లడానికే వీలయిందికాదు.

కాలవాహిని ఖండభూభాగాలనే మాయింపజేసే శక్తిగలది. అలాంటప్పుడు ఒక్కమానవుని మనోవ్యాకులతను మాయింపజేయడం దానికోలెక్కా? నాఉద్యోగం, నాఅధికారం, నూతనమిత్రబృందముల రాకపోకలు వీటితో జీవితంలో నూతనాశయాలు అంకురించాయి. ఓరోజు సాయంకాలం కొందరిమిత్రులతో కలిసి సినిమాకు వెళ్లాము. ఎనిమిదిగంటలు దాటింది. తిరిగి మిత్రులతో కారులో బయలుదేరి యింటికి వస్తున్నాము. కొంతదూరం వచ్చేసరికి కారుదీపాల వెల్తురులో రోడ్‌ప్రక్కన ఎవతో ఓస్త్రీ వొళ్లు తెలేకుండా పడివుంది. వెంటనే కా రాపి, ఎవతో అనాథస్త్రీ అయివుంటుందని కారులో అలాగే తీసికొవెళ్లి ఆసుపత్రిలో చేరిపించాము. తెల్లవారగానే నాగొడవలో నేనుండి ఆసంగతే మరచిపోయేను. సాయంకాలము నాకకీనుండి యింటికి రాగానే ఆసుపత్రినుండి తక్షణం వచ్చి మాట్లాడివెళ్లవలసినదని, డి. యం. వో. ఒకచీటీ వ్రాసి పంపించారు. చూడగానే రాత్రిసంగతి జ్ఞాపకంవచ్చి తక్షణం కారు వేసుకొని వెళ్లేను. నన్ను చూడగానే డి. యం. వో. నవ్వుతూ షేక్‌హేండిచ్చి తీసికొనివెళ్లి తన ఆఫీసురూములో కూచోబెట్టారు. "నిన్న మీరు ప్రవేశపెట్టిన స్త్రీకి వొళ్లు తెలిసింది. ఏమో మాట్లాడుతున్నది. మా కాభాష తెలియడం లేదు. 'విజయనగరం, శేఖరం, యింజనీరు' అన్న మాటలుమాత్రం తెలుస్తున్నాయి. మీకేమైనా తెలుస్తుందేమో మాట్లాడండి" అన్నారు డి.యం. వో. గారు. నాకు ఆశ్చర్యం వేసింది. విజయనగరంలో నన్నెరిగిన స్త్రీ యెవతై యుండవచ్చు? ఉన్నా యిక్కడికి రాగలిగినవా రెవరు? ఆకాసేపట్లో నే నేదో మహాపరాధం చేసినట్లు గుండె దడదడ కొట్టుకొంది పరిపరివిధాల ఆలోచనలు పోయినాయి. లేచి వెళ్లడానికి కాళ్లు వణికాయి. 'రండి వెళ్లి చూద్దాం' అని డాక్టరు నవ్వుతూ నాచెయ్యి పట్టుకొని యీడ్చారు. లేచేను. నామనస్సు మనుస్సులో లేదు.

ఏమి! లీల! ఇక్కడి కెల్లా వచ్చింది. ఈఆకార మేమిటి? ఇట్లయిపోవడానికి కారణ మేమి? నా



కేమైన మతి చెడిందా? నిద్రపోవడంలేదే కలనకో డానికి!

ఇంతలో డాక్టరుగారు "ఈరోగిని మీ రిదివరలో చూచియుంటిరా? ఈమె హిస్టీరియావ్యాధిచే కుంది పోవుచున్నది. మే మిక్కడీమె నుంచి చేసే చికిత్సేమి వుండదు." అని అన్నారు. "అయితే ఈమెను నే నింటికి తీసికొనివెళ్లి వుంచెదను. అవసరమైన మీ రచటికే వచ్చి చూచి చికిత్స జరుపవచ్చును." అని మేమింగ్లీషులో మాట్లాడుకొంటుంటే, లీల బిక్కమొహం వేసి నావంక చూస్తూ వుంది. "ఇంటికి వెడ్తాము, వస్తా నమ్మా? డాక్టరుగా రక్కడికే వచ్చి చూస్తూ మందిస్తారు" అని లీలతో అన్నాను. ఎందుకనో వెంటనే కండ్లనుండి జలజల నీళ్ల బిందువులు రాలాయి. చట్టున లేచి తయారయింది. కారులో యింటికి వెళ్లాము.

క్రమేణా, నే నింగ్లండుకు వెళ్లినతరువాత తన తల్లిదండ్రులు పోవడం, నెలతిరగకుండానే తనకు వైధవ్యం సంప్రాప్తించడం, తన బావగారు, యీ వ్యాధి మూర్ఛని, తన భార్యాపిల్లలకు యింట్లో వుంటే వస్తుందని, యిప్పటి మున్నప్పుడు వాకిట్లో యింతతిండి పడేయ్యడం, చివరకు ప్రాణం విసిగి, నే నిక్కడున్నట్లెవరో మిత్రులు చెబితే, చేతిమురుగు లుంటే అమ్మేసి బయలుదే రిక్కడికి వచ్చి, ఆఖరుమాపు చూచి యెందులోనైనా పడి ప్రాణం వదలుతా ననుకోడం, మొదలైన సంగతులన్నీ తెలుసుకొన్నాను.

ఆడపడుచు లేకపోయినా నౌకర్లను పెట్టి జాగ్రత్తగా ఉపచారం చేయిస్తూవచ్చాను. మూడుమాసము లయింది. మరెప్పుడు తిరిగి ఆవ్యాధి రాలేదు. డాక్టరుగారు వచ్చి, "ఈమె కింక ఆవ్యాధి వస్తుందనే భయమేమి లేదు. మనోవ్యాకులతే యిందుకు కారణము" అని చెప్పినారు. మూడుమాసాలలో మునుపటి మాధవరావుగారి తోటలో విహరించే 'లీల' అయింది.

మరిప్పుడు................?

---

## గోపికాగీతము

పేరేప విశ్వనాథసిద్ధాన్తిగారు

౧

కన్నులు పైటకొంగున వగర్చ బిగియించి తిదేమి కృష్ణ? నీ
చెన్నగు గజ్జె లందియల చిందులసందడి విందు, నీ వహో!
వెన్నను దొంగిలింప నిటు వేసము లెన్నియొ వేయు, దైన నా
కన్నులవిందుగా నగుమొగ మ్మొకమారి పుడేని జూపవే.

౨

పిల్లనగ్రోవి నూఁది పలువింతల రంతుల గంతులేయుచున్
జల్లగ మచ్చుమందు వెదఁజల్లుచు లోకమునెల్ల మాయలో
నల్లలనాడఁజేసెదవు హాయిరె మోహనకృష్ణ! నైజమై
చెల్లవె జారచోరలకుఁ జీఁకటిచాటున నిట్టిపోకడల్?

౩

హారువుగఁ దమ్మిపూవుపయి నాడెడు తుమ్మెదదిమ్ము మాడ్కి. నీ
ముకువును జిమ్ము మోముపయి ముంగురు లల్లనఁ దూఁగుచుండఁగా
మురళిని మోవిఁ బూని కడు ముద్దుగఁ బాడుచు నేఁగుచుంటివా
హరి! ననుఁ గావ వేమి? మరియాదమె యిట్టు లుపేక్ష సేయుటల్?

౪

సొగసుగఁ జిన్నినవ్వు తెలిసొంపుల పెంపులఁ గూడి నాసికన్
నిగనిగలాడు ముత్తెమును నీలపుఁగ్రొమ్ముడి క్రొమ్మెఱుంగులన్
మిగులఁ దుఱంగలించు నునునెమ్మియ(?)పించెముఁ గాంచి నెమ్మదిన్
వగపున గ్రుక్కు నన్నటులఁ బాలనఁజేసెదవోయి నెచ్చెలీ!

౫

విరులను జేరి తుమ్మెదయు, వెన్నెలరాయనిఁ జూచి కల్వయున్,
దరణినిఁ గాంచి పద్మము ముదమ్మును బొందు విధాన నేను నీ
మురిపెపుమోము గోముఁ గని మోదపయోనిధి నోలలాడుచున్
బిరబిర వచ్చి నాదు మనవిన్ విను కృష్ణ! ప్రసన్నమానసా!

౬

ఆ యమునాతరంగగతహారిపరీమళబంధుకోల్లస
త్తోయజజాతవాతపరితోషితభావుఁడవౌచు నీవు ప్రా
లేయమరీచిచంద్రికల లీలగ గానసుధాప్రసేకమున్
జేయుచు హర్ష వార్ధి ననుఁ జెచ్చెరఁ దేల్చవె యాశ్రితావనా!

---

# పగడము

యలమంచిలి శ్రీరాములుగారు

౧

సుమారుగా ఈకథ జరిగి మూడువందల యేండ్లయింది. కృష్ణాజిల్లాలోనితిరువూరు తాలూకాలో ఒకభాగము సాంద్రారణ్యముగ ఉండేది. ఆ యడవినిండ చిన్నచిన్న గుట్టలు కూడ చాలా ఉండేవి. ఏమాత్రము కూడ మానవసంచార ముండేదికాదు. సింహ శార్దూలాది క్రూరమృగాలు వీరవిహారము చేస్తుండేవి.

సాహసముగల దొమ్మరులు కొందఱు గుడిసెలు వేసికొని ఆఅడవిలో ఒకచోట నివ సించేవాళ్లు. వాళ్ల నాయకుని పేరు వరహాలు. వాళ్లవృత్తి దొమ్మరిఆట. వాళ్లు సంవత్సరాని కెనిమిదినెలలు దేశదేశాలు తిరుగుతూ ఆటఆడి డబ్బు సంపాదించుకొని వానకాలము వచ్చేసరికి ఆఅడవికి చేరుకొనేవాళ్లు.

పొట్టకోసమై దేశసంచారార్థము బయలు దేరిపోవుచున్నప్పుడు కృష్ణానదీతీరమున ఉన్న హేమాంబరపురములో పెత్తనదారు చౌద రయ్యగారి కుమార్తె — సంవత్సరమున్నర యీడు గలది— వాకిట్లో ఆడుకొనుచుండగా ఎత్తుకొనిపాఱిపోయినారు. ఆచీకటిలో విద్యుల్లత వలె ఆపిల్ల మెరయుచుండెను. అంత ముచ్చ టైనబిడ్డను వాళ్లజన్మలో ఏదేశాన చూచి ఉండలేదు.

ఆ పిల్లకు పంజరములోని పక్షి లాగ ఆటలు, పాటలు, నాట్యము బాగా నేర్పినారు. పదునాఱేండ్ల ప్రాయము వచ్చేసరికి ఆపిల్ల దొమ్మరిఆటలో మంచి ప్రావీణ్యము సంపా దించినది. ఆమె సౌందర్యము ఫణిఫణారత్న ములవలె చూపరుల నాకర్షిస్తున్నది. తుమ్మెద రెక్కలవంటి కురులు పాదాలు కప్పుతూఆమె నడిచేటప్పుడు వింతసోయగాన్నిస్తున్నవి. పద హారోవన్నె బంగారములాగ తనూలత మిస మిసలాడుతున్నది. దీప్తులొలికే ఆమె కళ్లు సం ధ్యాతారకలవలె ముద్దు లొలుకుతున్నాయి. ఆమె సోయగమునకు తగిన పేరనియే వర హాలు ఆమెను పగడ మన్నాడు.

ఈమధ్య కొన్నియేండ్లుగా చిత్తూరుజిల్లా మనఆటగాండ్రు పోయియుండలేదు. వర్షాలు పూర్తిగా పోయినతర్వాత మన ఆటగాళ్లు సామానులు గార్దభములమీద కట్టుకొని కథలు, కబుర్లు చెప్పుకుంటూ దేశసంచా రము బయలుదేఱి మధ్యమధ్య మకాములు పెట్టుచు రెండునెలలలో చిత్తూరుజిల్లాలోని మహేశ్వరపురము చేరినారు. పగడమునకు లచ్చి అన్న చాలప్రాణము. లచ్చికి ప్రకృతి చిత్రాలను గుఱించి యేమేమో పగడము దారిలో నూరిపోయుచుండెడిది. దొమ్మరిలచ్చికి అవి బోధపడుతవా ?

మహేశ్వరపురములో మాణిక్యాలు నాయుడనే కమ్మనాయకుడు గొప్ప షాహుకారు. ఆయూరికే గాక ఆప్రాంతాలకు అతడు ప్రభువుగా చూడబడుచుండేవాడు. మాణిక్యాలు దగ్గఱకు స్నేహితుడొకడు వచ్చి, "ఈ మధ్యను ఎప్పుడూ రాని దొమ్మరిముటా ఒకటి వచ్చింది. మిమ్ముల నడిగి ఆట ఆడవలె నను కొంటున్నారు. వాళ్లతో నవయౌవనవతి యొకతె ఉన్నది. ఆమె సుందరవదనము అనదృశమనోహరమై నాకన్నుల కద్దినట్లున్నది. అట్టి లావణ్యవతిని మన మెవ్వరము కూడ ఎక్కడ చూచియుండము" అన్నాడు. ఆటకై ఆతురత హెచ్చింది మాణిక్యాలుకు.

వరహాలు తన బలగముతో ఆటఆడడానికి షాహుకారుగారి ఆవరణలో ప్రవేశించినాడు. డోళ్ల మోత విని ఊరి నాలుగుమూలల నుంచి పిల్లా జల్లా అంతా గుమికూడినారు. పెద్దలు దొమ్మరివాళ్ల చుట్టు కూర్చున్నారు. పిల్లలు ఆవరణములోని వృక్షాగ్రముల కెక్కినారు. షాహుకారు ఒకవైపున చాపమీద కూర్చుండి వింతగావలువైపుల చూస్తున్నాడు. దొమ్మరియువతి రంగముమీదికే వచ్చి వెదురు కఱ్ఱమీదకు ఎక్కేటప్పుడు తదేక దృష్టితో ఆమెకేసి చూడ నారంభించినాడు. ఆమె కఱ్ఱ కొనకు బోయి అక్కడ అత్యద్భుతమైన తన విద్యను ప్రదర్శించేటప్పుడు "అంతయెత్తునుండి ఆయువతి పడి చచ్చిపోతుందేమో" అని అన్నాడు బిగ్గఱగా.

ఆమె ఆ వెదురుకఱ్ఱ తుదను కూర్చుండి చేతులతో కఱ్ఱమీద తాళము వేస్తూ పాట నాలాపము చేసేటప్పుడు, ఆమె కంకణ కింకిణీ రవములు శ్రుతి కలుపుతూ మనోహరధ్వనుల నొసంగి చూపరులకు తన్మయత్వము కలిగించినవి! "నేను నానేర్చినవిద్యను ప్రదర్శించినాను; షాహుకారుగారిని గొప్ప బహుమతి నివ్వమని వేడుకొంటున్నాను" అని ఆ ఉన్నతస్థానమున నుండి చిర్నగవుతో బిగ్గఱగ చెప్పి, తనలో "ఆయన హృదయాన్ని జయింపగల్గితే........." అనుకొన్నది. ఆ షాహుకారు తక్షణము ఇన్నూరురూపాయలవెలగల చీరెను తెప్పించి యిచ్చినాడు.

ఆట ముగిసిన వెనుక షాహుకారుగారిని ఆఊరులో స్థిరనివాసము చేయటానికి వసతి నీయమన్నాడు ముటానాయకుడు. 'అట్లే' అన్నాడు షాహుకారు. సుందర భవనము నొకదాని నిచ్చినాడు; దగ్గఱలోనే కుటీరాలు నిర్మించుకొనినారు మిగిలినవాళ్లు.

పగడము ఆ యింటిలో ప్రవేశించినకొన్ని దినాలకే చిక్కిపోనారంభించినది. ఆ యింటి యావరణలో ఫలపుష్ప వృక్షములన్నూ,లతలను పాతినారు. మల్లెలు మొల్లలు పూస్తున్నవి; కాయగూరలు కాస్తున్నవి ఆవరణగా వేసిన కంచె పెరగనందున పశువులు వచ్చి మేసిపోకుండా పగడము చాల జాగ్రత్త తీసికొంటున్నది. అన్నము సహించుట లేదంటూ తఱచు ఆటకు వెళ్లటము మానివేసియింటివద్దనే ఉండి గొడ్డు

గోధ దొడ్లోకి వచ్చి తినిపోకుండా చూచుచున్నది. ఆమె జబ్బుగా ఉన్నదని మంచి కూరలు, తినుబండారాలు తెచ్చి యిస్తున్నాడు వరహాలు. ఆబిడను సంతోష పెట్టడానికి కాళ్లకు బేడీలు, నెత్తికి చంద్రవంక చేయిస్తానన్నాడు. ఇట్టివా ఆబిడను సంతోష పెట్టునవి?

౨

"నీళ్ల రేవునకు నిత్యము సాయంకాలము నీవేల ఒంటరిగ పోతున్నావు? నిద్రపోకుండా విచారపడుతూ కళ్ల వెంట నీళ్లు కారుస్తున్నావు? నిట్టూర్పులు పుచ్చుచు నాయుడుగారి యింటికేసి తేఱిచూస్తుంటా వేల? నీవు నాయుడుగారి హృదయాన్ని ఆకర్షించినావని వదంతిగా ఉన్నది. ఎంతవఱకు నిజమో? తెలిసినంత వఱకు దాపరికము లేకుండ నాకు చెప్పు. నే నెక్కడ పొక్కనీయనులే" అన్నది చెలికత్తె లచ్చి.

"నాహృదయాన్ని నేనెట్లా శాంతింపజేసికోగల్గుతానో బోధపడకున్నది. శక్తికొలది ప్రయత్నించినా, మనోగమనాన్ని అడ్డుకోలేక పోయినాను. మనస్సెపుడు........"

"మనస్సు గట్టిపఱచుకో. వారమురోజులు యిల్లు బయలు దేరబోకు. నాయుడుగారు అడిగితే 'మా దేశము పంపివేసినారు' అని చెప్పుతాను."

"నేను ఒక్కరోజు అతనిని చూడకపోతే నాచావుకు వేరే కారణ మక్కరలేదు. ఆయన నుడు నాహృదయాధినాథుడు. దొమ్మరివాళ్లు ఎక్కడకు బోతే అక్కడకు నా బొందిని తీసికొని పోతారు గాని హృదయాన్ని తీసికొని పోలేరు."

వరహాలుకు తమ ప్రేమసంవర్ధనము గిట్టినది కాదని పగడము, నాయుడు గ్రహించినారు. అందువలన వారి కేవిధముగా అడ్డు పడతాడో అని వారు భయపడుతున్నారు. అట్టిస్థితిలో వసంతుడు పుష్పరథాన్ని యెక్కి తరలి వచ్చినాడు. ఆమ్రపల్లవములు మెక్కి మత్తెక్కి గండుకోయిలలు కుహూరావములు చేస్తున్నవి. నాయుడుగారు నడురేయి నిద్రమెలకువ రాగా ఏటిరేవునకువచ్చి తన వేణునాదముతో హెచ్చరించినాడు. పగడము చెవిలో అమృతం వర్షించినట్లే! వెంటనే బయలుదేఱి అతని దగ్గరకు పోయి, ఆమెను చూడకుండా ఆవేశముతో పాడుతున్న అతనిని కౌగలించుకొన్నది పుష్పదామమువలె.

"తల్లిని, దేశాన్ని, నాసర్వస్వాన్ని విడిచిపెట్టి నీకోస మెంతదూరమైన వచ్చివేయటానికి సిద్ధముగ ఉన్నా"నన్నాడు నాయుడు.

"పంజరములోని పక్షిలాగ స్వేచ్ఛలేనిదానను. నీవే గనుక పూమొగ్గవై ఉంటే నా కొప్పులో బంధించి దాచుకొని యుండేదానిని. ఏమిలాభము నాకోసము ఆశపెట్టుకొనికష్టాల పాలుకాబోకు" అన్నది పగడము. కర్కశముగా ఉన్న యీమాటలన్నీ చాటుగా ఉండి వరహాలు విన్నాడు.

## 3

"ఒకటి రెండురోజులలో ఊరువిడిచి వెడిపోతున్నాము. ఇక మనము ఒకరినొకరు చూచుకునేభాగ్యం లేదు కాబోలు! ఎంతకఠోర విషయము! నిన్ను చూడకుండా నేనెట్లా బ్రతుకుతాను! నేనేమి చేయగలను! స్వేచ్ఛ యేది నాకు! అబలను" అని తన నివాసస్థానానికి మార్గంమాత్రము చెప్పినది.

మూటముల్లె కట్టుకొని అర్థరాత్రివేళ దొమ్మరవాళ్లు లేచిపోయినారని భోజనము చేస్తున్న నాయుడు విన్నంతనే యెత్తిన ముద్ద క్రిందకు విడిచి అన్నమువద్దనుంచి లేచినాడు

"ఉద్యానవనములో ఏకాంతముగ కూర్చుండి తంతువులేకుండ నాకై పుష్పమాలను గుచ్చుతుండేది! దినాలు గతించినవి; మాసాలు మళ్లిపోయినవి. మళ్ళ కలసికొనే అదృష్టమబ్బినది కాదా" అనుకొన్నాడు నాయుడుగారు. అర్థరాత్రివేళ వెంటనే బంధువులను, సర్వసౌఖ్యములను, ధనధాన్యములను విడిచివేసి బయలు దేరినాడు దొమ్మరిపిల్ల కోసము. త్రోవలో ఉన్న తిరుపతి వేంకటేశ్వరస్వామివారి దర్శనమున్నా చేసికొనకుండా కనబడినవారినెల్లా దొమ్మరిఆటగాళ్ల జాడ నడుగుతూ వస్తుండగా, "రెండువారాలక్రిందట మా ఊరులో ఆడిపోయినా"రని గొల్లపల్లెలో గొడ్లకాపరులు చెప్పినారు. ఆమాటతో అతని అంతరంగాన్నుంచి ఆనందతరంగాలు వెల్లివిరిసినవి. ఉన్మత్తుడై గొడ్లకాపరుల కర్థమగునో కాదో అను విచారణమైన లేకుండ, "నక్షత్రాల్లాగ ప్రకాశించే నయనాలు, వినీలశారదాంబుదములను తిరస్కరించే కేశపాశము, అపరంజిముద్దవలె తళుక్కులీనే తనూలత, కిన్నెరనాదాన్ని మరపించే రాగాలాపము గల పగడము గడకొనకు ఎక్కి ఆటఆడినది కాదూ" అంటాడు. ఊరులోపలికి పోయి పగడము వంటచేసిన ప్రదేశాన్ని తొక్కిచూచుకొన్నాడు. నీళ్లు తెచ్చినదార్ల కనుక్కొన్నాడు. జాడ తెలిసిన సంతోషము కంటె త్వరగా పోయి కలియవలెననే ఆతురత హెచ్చైనది.

చింతచే పగడము యొక్క యౌవన పుష్పము వాడి వత్తలై పోయినది. సుష్ఠుగా తిండి తినటముగాని, సంతోషంగా కబుర్లు చెప్పటము గాని, తన విద్యానైపుణ్యాన్ని ప్రదర్శించి మెప్పుపొందాలనే కాంక్షనుగాని చాలాదినాల క్రిందటనే మానివేసింది. తలనొప్పిఅని, యేమీ తోచటములేదని తనలో తాను కుళ్లిపోతుండటము తప్ప, చీపురుకూడా చేత పట్టడము మానివేసింది.

నేడు తలనొప్పి మటుమాయమయింది అనుకుంటాను. ముఖములో ఆనందము తొణుకుతున్నది; సంభాషణలో తేనె ఒలుకుతున్నది, చైతన్యము వచ్చింది. స్వయముగ నీళ్లు తెచ్చి వండి విందారగింప జేసినది. నిష్కళంక ప్రేమ ముందు కులము నెవరు గణిస్తారు? ఏల గణించాలి? అతని హృదయానికి ఆ విషయమే తట్టిందికాదు. సంతృప్తిగా భోజనము చేసినాడు మాణిక్యాలనాయుడు.

ఆనాడు అమావాస్య. గాఢాంధకారము. దానికి తోడు కారుమేఘాలు కప్పినవి. అతిథి గుడిసెలకు కొంచెముదూరములో నదీ సైకత స్థలిని వటవృక్షముక్రింద శయనించినాడు. పగ డముప్రియునిగురించిన యేవో ఆలోచనలలో మునిగియున్నది. అట్టిస్థితిలో ప్రొద్దుపోయి ఆట నుండి తిరిగివచ్చినవరహాలునకు అతిథి రాకను గురించి చెప్పినారు. అతిథిని ఆబిడచేతనే చం పించుట శ్రేయస్కర మనుకొనినాడు. వెంటనే నిప్పులు గ్రక్కుకుంటూ ఆతడు పగడమువద్దకు వచ్చేసరికి ఆబిడ అదిరిపోయింది. ప్రియుని చంపి పారవేయవలసిన దని నిర్బంధించినాడు, భయపెట్టినాడు, పదనైన ఖడ్గాన్ని యిచ్చి నాడు బలవంతముగ.

తుమ్మెద రెక్కలవంటి దీర్ఘకుంతలాలు పాదాలమీద జీరాడుతున్నాయి. సంతత బాష్పధారలు చెక్కిళ్ల మీదనుంచి వక్షఃస్థల ముమీదికి జారుతున్నాయి. అట్లాగే పడుతూ లేస్తూ ఆయువకుని శయ్యమీదకు వెళ్లి కూ ర్చుండి, "ఇంకా నిద్రయేనా? అబ్బ! నాతండ్రి... కర్కశహృదయుడు — నిర్దయుడు — కృత ఘ్నుడు—మూర్ఖుడు......నిన్ను, నాప్రాణాధి కుడవగు నిన్ను చంపవలెనట! నేనట్టి ఘాతుక కృత్యాన్ని చేస్తానని యెట్లా అనుకోవాలి! నే నట్టి రాక్షసినా! జీవము పోసి పెంచుకొన్న ఆశాంకురాన్ని యెట్లా పెరికివేస్తాను? పెరికి నేనెట్లా బ్రతుకుతాను? నాజన్మ యింకేల! చం పకపోతే నన్ను తుత్తునియలు చేస్తాడట! అతని చేత నేను తుత్తునియ లేల చేయించుకొన వలెను? నీదగ్గఱ నన్ను నేనే చంపుకోవాలని వచ్చినాను" అని ఆత్మహత్య కుద్యుక్తురాలగు చుండగా మాణిక్యాలు మేల్కొని వారించి నాడు. "నాతండ్రివంటివాని బారినుండి బ్రతు కుట దుర్లభము. నీవు నీదేశము పోయి సౌఖ్య ముగ నుండుము. నన్ను చంపుకుంటే యీ చిక్కు తీరుతుంది" అన్నది.

"నీకోసరము నాదేశాన్ని కులాన్ని సమ స్తమూ విసర్జించి యిక్కడకు వచ్చినాను. నీవు వనపుష్పానివి: నీచేత ఆకర్షింపబడ్డ మధుపాన్ని నేను. నీకోసమై యిన్ని దినాలు తిరిగినాను. ఏమి పోయినను నాప్రేమ నిధానమవు నీవు దొరికినావుగదా అనే సంతృప్తి చెందినాను. నిన్ను విడిచి నే నెట్లా బ్రతుకుతాను? నవ యౌవనపుష్పాన్ని సౌందర్యోపాసకుడ నైన నా కర్పించినందుకు కొండ యెక్కినాను..."

ఆదంపతులు రెండు మంచి గుఱ్ఱాలను ఎక్కినారు. వాయువేగముతో పోయి పోయి భద్రాచలమునకు సమీపములో ఒకసాంద్రా రణ్యములో ఆగిపోయినారు. సమస్తము మఱచి పోయినారు; పుష్పసౌరభాలు వెదజల్లే వృక్ష చ్ఛాయల పరుండి, వనఫలాలు తింటూ, సెల యేటి నీరముల గ్రోలుతూ, పుట్టతేనియల జుర్రుతూ, బ్రహ్మానందముతో ఆఅడవిలో సంవ త్సరము ఒకరోజుగా గడుపుతున్నారు.

ఒకనాటి సాయంకాలమున ఆదంపతులు సెలయేటియొడ్డునఒకస్ఫటికపుశిలపై కూర్చుండి విజ్ఞోడ్డై వాపోవుచున్న కపోతికేసి చూస్తున్నా

రు. దగ్గఱలోనే చెంచుపిల్లలు శాద్వలములలో ఆవుల మేపుతున్నారు. చెంచుపిల్లవా డొకడు వచ్చి, "వరహాలు ముటా అట, దొమ్మరాట బాగా ఆడతారట, ఆమడదూరములో నున్న చెంచుగూడెములో ఆడుతున్నారు. చూడ డానికి వచ్చేవా రెవరన్నా ఉన్నారా" అని అడిగినాడు. వాయు కంపితమైన లతవలె పగ డము ప్రియుని హస్తములలో వరిగింది.

"దాహ మవుతున్న దా? నీళ్లు తెచ్చేదా?" అన్నాడు.

"ఇంకా దాహ మేమిటి? ఒకప్రక్కనుండి మన సౌఖ్యసామ్రాజ్యానికి అంత్య సమయము తరుముకొని వస్తున్నది. ఇదియే తుదిరోజు. వరహాలు వస్తున్నాడు మనను చంపుటకై. భయంకరమృత్యు గహ్వారానికి ఎర అవుటకు సిద్ధంగా ఉండాలి" అన్నది. అతడును విచార సముద్రమున మునిగిపోయినాడు.

"నామనోనాథుని చంపి యెట్లా యింటికి రాగల్గుతాను? అతడు నీ కేమి అపకారము చేసినాడు? మాది నిష్కళంక ప్రేమ! మా ప్రేమముందు మానవనిర్మితాలైన సాంఘిక బంధనములు నిలువలేకపోయినవి!! భానుబింబ మువలె ప్రకాశిస్తున్న నాప్రియుని, నాపెన్నిధిని ఎట్లా చంపేది? పెంచిన ప్రేమచేతనన్నా నా స్వాతంత్ర్యరథాన్ని గొలుసులచేత కట్టబోకు ము! కృతజ్ఞులమై ఉంటాము. ఏమందువు? వేఱొక దొమ్మరివానిని పెండ్లి చేసికొనవలె ననియా? ప్రేమ ఒకరికి అర్పించిన తర్వాత తిరిగి రాదు! నాహృదయాన్ని ఆయనకర్పించి నాను. ఈహృదయములో మరొకరికి స్థానము లేదు. నిజమైన ప్రేమ జన్మలో ఒక్కరికే అర్పించుట; అందులకు భిన్నమైనది కామ లాలసత్వము—నాకళ్లతో నా ప్రియుని నీవు చూస్తే ఆతని ప్రతిబింబముచేత నీ కన్నులు నిండిపోతవి" అన్నది దీనంగా.

"పసిబిడ్డను తెచ్చి పెంచి పెద్దదానను చేసినాను. చిన్నప్పటినుంచి ఆమె ముద్దుమా టల కెంతో ముచ్చటపడుతూ ఆమె ఆనందమే నా ఆనందముగ భావించి యుక్తవయస్కు రాలై బిడ్డస్వాతంత్ర్యాన్ని అనుభవించేటప్పుడు అడ్డుకొని, దయ మాలి ప్రేమభావము నెఱు గక ఆదంపతుల ప్రాణాలు తీయించినాను. ఆ నిష్కళంక ప్రేమబలముచేతను కాదా ఆయువ కుడు తన సర్వస్వమును విడిచి వచ్చి యిన్ని యిక్కట్టులపాల్పడెను" అని చింతించినాడు. ఆ దంపతులసమాధిని వనపుష్పాలతో కప్పివేసి కన్నీటిధారలతో కడిగినాడు. ఒక్కొకసారి మతి పోయి, "యింకెంతకాల మీా సమాధిలో ఉంటావు! నీస్వేచ్ఛను అడ్డగింపను లెమ్మిక. నేను వనపుష్పాలు ఏరి తెస్తాను. నీ ప్రియునికి దండ గ్రుచ్చు" అంటాడు వరహాలు !!!

---



కలువ నెలత

—G. S. A.



౮. మేపియరు కౌస్కా

సుందరి యగు రషియను నర్తకి. ఫ్రెంచి నాట్యరంగమున నీమె నాట్యకళాకౌశలమున మిగుల పేరుగన్నది. ఈమె శిరోవేష్టనము గాజుతో చేయబడినది. దీపముల వెలుగున నిది కన్నులు మిరుమిట్లుగొలుపు కాంతుల వెదచల్లుచుండును.

—G. S. A.

౧

ఏయవి పద్మరాగమణు లివ్వి యనందగ సీతదోయిటం,
బోయఁగ మల్లెమొగ్గ లనఁ బొల్చెను దా మెవి రాము నౌదలం,
గాయఁగుచిన్ మసారములకై వడి నే వలరారె జూచుచున్
శ్రీ యిడు మీాకు నారఘువరేణ్యుని పెండ్లిసుపాణి ముత్తెముల్.

౨

వరునకు వేసవే లొసఁగి, వానిచరస్థిరముల్ తనూజకో
సరము క్రయించి, స్వస్వమును సర్వముఁ బుత్రున కిచ్చెఁ; బుత్రకుం
బారయునిదో సమస్తమును బుత్రికె; కావున నేవిధిం గనన్;
గురుఁడు కొమార్తకున్ గోడుకుఁగుఱ్ఱకుఁ గూరుచు నొక్కటీరునన్.

3

పురహరు నర్ధ మార్య, నగముం దనుజారి హరించి; రందుచే
హరుని యభావ మెల్లెకల నల్లుకొనంగను; గంగ చేరె సా
గరమును, నింగిఁ జంద్రకళ, తెమ్మెలమున్ భుజగాధినాథుఁడున్,
దిరిపఫుఁ ద్రిప్పటల్ ననును దేవ, యధీట్సకలజ్ఞతల్ నిన్నున్.

౪

క్రతుభుగ్భర్త వరించె మర్త్యవనితన్, తెమ్మెమండలాఖండలుం
డు తురాషాణ్ణగరీకరీంద్రగమనన్ మోహించె మున్; కాముక
ప్రతతి స్వాంతములందుఁ బ్రాయికముగా రాగంబు సంభూతమౌ
నతిదూరస్థితవస్తువం దసుఖలభ్యంబౌ పదార్థంబునన్.

౫

పిడికిటిలోపల మృగమద-మిడుకొని, నమ్మింప శక్యమే లేదనుచున్
బడకుండినఁ గనుల బయల్-పడఁ గాదే యది తదీయపరిమళలహరిన్.

---

౧

ఘూర్జర దేశాంతర్గత కుసుంభ దేశాధినాథుఁడగు బంధుహితుఁడు మిక్కిలి చక్కఁగా రాజ్య మేలుచుండెను. ఏకపుత్రియగు మధుస్రవవలని సేవాశుశ్రూషలును, సేనానియగు బలాహకుని శత్రుంజయమగు పరాక్రమమును, ఆస్థానకవిచంద్రుఁడగు క్షేమశ్రీయొక్క మధురకవితారసమును నా రాజు నెల్లవిధముల నానందాత్మునిఁగ చేయఁజాలియుండెను.

మధుస్రవతనులత పుష్పించి నవవికసితమగుచుండెను. ఆమె చంచలవిశాలనేత్రములయందు దుగ్ధసమసరళచ్ఛాయ నాట్య మొనర్చుచుండెను. లీలాయుక్తమై, వాతాహతిచే నల్లాడు నామెనీలకేశరాశినడుమ నంధకారమునందలి శంపాలతవలె నామె మిగుల మనోహరమై కన్పట్టుచుండెను.

సువిశాలరాజభవనము సముద్రప్రాంతమున శోభాయమానముగ నుండె. చంద్రకాంతాదిశిలానిర్మితమై, మణిముక్తాఘటితచిత్రాలంకారశోభితమై, రమ్యోద్యానపరివేష్టితమై, యామందిర మత్యంతమనోహరమై చూపట్టును. దక్షిణమున తరంగమాలికాయుతమగు సాగరమును, తూర్పున మందగమనంబున సంద్రమున సంక్రమించుచున్న విశాఖానదియు, ఉత్తరదిక్కున ధూమ్రమఘానరితమై యున్నతమస్తకము దాల్చి, నగరము నంటి నిల్చియున్న ముంజకేశపర్వతమును, పశ్చిమమున నేలకీలతాలింగితములగు వనములును నొప్పాఱుచుండె. సముద్రగర్జనమును, విశాఖాకల్లోలినీకలస్వనమును, ముంజకేశపర్వతవృక్షనవ్యశ్యామలశోభయు, ఉద్యానవనమున క్రీడించు సుగంధవాయుసంతతియు, రాజసభను మాధుర్యమయముగఁ జేయుచుండెను. ఇంతియే కాక మహారాజసామీప్యమున నధివసించి, తన రూపజ్యోతిచే మధుస్రవ యాసభను మఱింత తేజోవంతముగఁ జేయుచుండెను.

మధుస్రవరూపమును, కుసుంభపురప్రాభవమును బహు వీరహృదయముల నాకర్షించుచుండెను. కాని బలాహకుని ఖడ్గభయమున వెనుదిరుగుట తటస్థించుచుండెను. మధుస్రవాస్మరణమాత్రమున బలాహకుని నిశితఖడ్గము తీక్ష్ణతరమగుచుండెను. అట్టులే యామె యాశ్రయమొందిన క్షేమశ్రీకవితయు మృదుమధురమై సకలజనహృదయరంజకమై విలసిల్లుచుండును.

శత్రువు లెత్తివచ్చినపుడు, ప్రమాణసన్నద్ధుఁడై చను బలాహకుఁడు కరుణార్ద్రహృదయమున, ప్రేమవీక్షణముల మధుస్రవ పాదపద్మములయందు ప్రార్థనాపల్లవములతోడను,

ప్రేమకుసుమములతోడను నర్చించి పనివిను చుండు పెల్లరు నెఱింగిన విషయమే. వైరుల నిర్జించినపిదప, ముకుళితకమలము చుట్టును హర్షశోకమిళితఝుంకారములతోఁ బరిభ్రమించు భ్రమరముచందాన, క్షేమశ్రీ తన కవితా రసమును వెదచల్లునెడ నవ్యక్తములును, వ్యాకులములును, ప్రేమ పూరితములునునగు నాతని యుచ్ఛ్వాసములకుఁ గారణము తన్ను లక్ష్యమం దుంచుకొనుటయే యని మధుస్రవ గ్రహింపక పోలేదు.

బలాహకుఁడు గర్వోన్నతమస్తకుఁడై సభాస్థలిని రాజుతో "మహారాజా, భవదీయ స్నేహకవచము నాకు రక్షణ మొనర్చినది. తత్ప్రసాదమున నేఁడు విజయినై తమ సమక్షమున నిలువఁగల్గితిని" అని విన్నవించుకొను చున్నపుడు కంపితకంఠముతో లజ్జావనతశిరస్కుఁడై క్షేమశ్రీ "నేను నీ ప్రేమబద్ధుఁడ" నని యర్థమిచ్చు గీతమును గాన మొనర్చు చుండును.

బలాహకుఁడు విరోధిని బంధించి, రాజ సమ్ముఖమున నిలువఁబెట్టి, "మహారాజా, దుర్జయుఁడగు తమ శత్రువును బంధించి తెచ్చితిని. వీని కెట్టిశిక్ష విధింపవలయునో సెలవిండు" అనునెడ క్షేమశ్రీ కన్నుల నశ్రులు గ్రమ్మ, కరుణార్ద్రకంఠముతో "ప్రేమపాశమున నాతని సదా బంధింపుఁ" డనుచుండును.

ఎట్టి శుభకార్యమునైనను ప్రారంభింపఁ బోవు సమయమున దేవదర్శనము గావించు రీతిని బలాహకుఁ డా లలితలావణ్యవతియు, సంపూర్ణయౌవనశోభితయు నగు మధుస్రవ నేకాగ్రదృష్టితో వీక్షించుటయందే మగ్నుఁ డగుచుండును. అట్టితఱినే క్షేమశ్రీ స్వీయ దృష్టిచే నామెమూర్తి కారతి నిచ్చుచుండును.

ఇట్లు బలాహకుఁడు దర్శించి దర్శించి చిఱునవ్వు నవ్వుచుండ, క్షేమశ్రీ చూచి చూచి కనుల నశ్రువుల నింపుచుండును.

౨

మధుస్రవకు వివాహకాలము ప్రాప్తించె. బలాహకుఁ డామె పాణి గ్రహించుటకై రాజుతో "మహారాజా! నేను నాహృదయ రక్తమును ప్రవహింపఁజేసి దేవరయానలఁ బాలించుచుంటిని. నేఁటికి నా సేవకుఁ దగిన ఫల మనుభవించుకాల మాసన్నమైనది" యనియెను. క్షేమశ్రీ చేతులు జోడించి, "ప్రభూ! నాయీస్వల్పశక్తి ననుసరించి నేను నాజీవితము తమ సేవయందే గడపుచుంటిని. అది స్మరించి కృపతో నత్ప్రసాదము దయ చేయుఁడు" అనియెను.

రాజున కిరువురునుగూడ ప్రియులే. క్షేమశ్రీ కేవలసంతోషమునే యొసఁగెను. కాని బలాహకుఁడన్ననో తన ధనప్రాణముల రక్షించెను. వెంటనే యారాజు కర్తవ్యము నిర్ణయించుకోఁగోరి సంశయనివారణార్థమై మధుస్రవదెస వీక్షించెను. కాని యామె ప్రేమపూర్వకముగ వారి నభినందించుచు మిన్నక చూచుచుండెను.

అంత నారా జిట్లనియె: "ధరణీమణితో. రమణీరత్నమునకు వీరుఁ డగువాఁడే యర్హుఁడు కాన మీయిరువుర బలమును పరీక్షింపవలెను." బలాహకుని వదనము ఆశచే వికసితమయ్యెను. మధుస్రవ చిఱునగవు మోమున చెంగలింప వానివైపు చూచెను. కాని వెంటనే క్షేమశ్రీ మలినముఖముపై దృష్టిసారించినపుడా మందహాసము మటుమాయమయ్యెను.

"మహారాజా? కవి ప్రేమసౌందర్యముల నుపాసించును. స్త్రీ ప్రేమనే కోరుచుండును. కాన మా ప్రేమ యెంత లోతైనదో పరీక్షింపఁ గోరెద" నని క్షేమశ్రీ వచించెను. అంత మధుస్రవమధుర సుందహాసముగాంచి క్షేమశ్రీ సుందరవదనము వికసించెను.

బలాహకుఁడు వ్యాకులభావమున రాజు దెసఁ జూడసాగెను. "బలహీనుఁడగు కవి తన్ను తానే రక్షించుకొనలేనపుడు నాకూఁతు నెట్లు రక్షింపఁగలఁడు?" అని రాజు ప్రశ్నించెను. బలాహకుఁడు ఒఱనుండి ఖడ్గమును పెఱికి మధుస్రవ మందస్మితవదనమువంక దృష్టి సారించెను. క్షేమశ్రీ గానము చేయసాగెను. దాని భావ మిది: "ప్రేమచే శత్రువుల జయింతును. ప్రేమకు బలి యయ్యెదను. వైరజనకమగు రాజ్యపాలనముకంటె, విరోధరహితమగు వృక్షచ్ఛాయను శాంతజీవనము నెఱపుట లెస్స."

ఈవిధమున స్వీయపక్షముల సమర్థించుకొనుచు, సౌభాగ్యకరమగు మధుస్రవసదయదృష్టిని పొందినపుడు వారి వదనముల నుదాసీనతాప్రసన్నతలు క్రమమున గోచరించుచుండెను. తుదకు రాజిట్లనియెను: "మీలో బలవంతుఁ డెవ్వఁడో వానికే నాకన్య నిత్తును." బలాహకుఁడు తన సౌభాగ్యమున కెంతయు గర్వితుఁడై క్షేమశ్రీదెస నీచదృష్టుల ప్రసరింపఁ జేయసాగెను.

క్షేమశ్రీ వినమ్రస్వరమున, "కానిండు, బలపరీక్షయే జరుగనిండు" అనియెను. వెంటనే బలాహకుఁడు కత్తిదూసి క్షేమశ్రీ కెదురనిల్చి ద్వంద్వయుద్ధమున కాతని నాహ్వానించెను. క్షేమశ్రీ వ్యాకులభావమున మధుస్రవదెస చూచెను.

కొన్ని నిముసములకు మధుస్రవ "ఇట్టి బలపరీక్ష యుచితము కాదు. వీరిలో నొకఁ డస్త్రోపజీవి. ద్వితీయుఁ డన్ననో కేవలము శస్త్రవిద్య కపరిచితుఁడు. ఇట్టి పరీక్షణ ముచితము కానేరదు. తెలివితేటలవలనఁ గాని కౌశలమువలనఁ గాని జయము నిర్ధరించుట యుచితము. దీన నేరికిని గోరంతయైన చేటు వాటిల్లదు" అనియెను. ఇది విని, బలాహకుఁడు మధుస్రవవంక దీనముగాఁ దిలకించెను. రాజు వెంటనే బాహుయుద్ధమున కాజ్ఞ యిచ్చెను. కాని యిదియు మధుస్రవకు నచ్చలేదు. తుదకు వారెత్తఁగలిగిన బరువునుబట్టి బలమును పరీక్షింప నిశ్చయింపఁబడెను.

3

శరద్భానుని సువర్ణకిరణజాల మింకను పూర్తిగా రాజసభామందిరముపై ప్రసరింప

లేదు. ఇంతలోనే సభాభవనమంతయు జనాకీర్ణ మయ్యెను. వైతాళికులు మహారాజాగమనమును తెలియఁజేసిరి. వాదుక ప్రకారము క్షేమశ్రీ మహారాజునకు వందన మొనర్చి మృదుమధురస్వరమున నొకరాగ మాలాపించెను. కాని నేఁటిగీతముమాత్ర మతిసంక్షిప్తముగ కరుణరసపూర్ణముగ నుండెను. వాద్యములు చెలఁగినవి. పరీక్ష ప్రారంభ మైనది.

బలాహకుఁడు భారములగు శిలల నెత్తసాగెను. ఒకదానికంటె నొకటి బరువైనది వాని ముందిడిరి. కాని యాతఁడవలీల వాని నెత్తి విసరివేయసాగెను. తుద కొక బండరాతి నాతఁడు వక్షమువఱకు నెత్తి పాఱవైచెను. దాన నాతనిబలము స్పష్టమైనది.

ఇఁక క్షేమశ్రీవంతు వచ్చినది. నిత్యానందకరమగు నాతని వదనమండలము నేఁడు శరత్కాలప్రభాతము వలెనే గంభీరసౌందర్యము దాల్చియున్నది. రాతి నెత్తుట కాతఁడు ముందునకు వచ్చుతఱికి నాతని కల్యాణము నాకాంక్షించు శతసహస్రకాతరనేత్రము లాతనిపైఁ బడెను. క్షేమశ్రీ స్తబ్ధత్వము వహించి, గంభీరరూపధారి యగు సముద్రునిదెస నొకమాఱును, విశాఖానదివైపున నొక పర్యాయమును, సమున్నత మగు ముంజకేశపర్వతముపై నొకతూఱియు, నేలాలతావేష్టిత చందన వృక్షములవైపు నొకమారును, తనదృష్టి నిగిడ్చి తుదకు రాకన్నెవైపునకు దృష్టి ప్రసారము గావించి తన్మయుఁడై తన్నుఁదానే మఱచెను.

వెంటనే తన పాదప్రాంత మందలి బండ నెత్తి శిరమున నుంచుకొనియెను.

క్షేమశ్రీజయమున హర్షధ్వనులు సభాభవనమున చెలరేఁగినవి. సభాసదు లందఱు తన దెస చూడ్కులు బఱపుసపుడు సేనాధిపతికి తన పరాజయదుఃఖము నూఱురెట్లధికము కాసాగెను. లజ్జచే నాతనివదనము చెమర్చెను. గర్వమెల్ల గతించినది. నేత్రములు భూమి వైపునకు మరలినవి. "శహబాష్ క్షేమశ్రీ! శహబాష్ ! నీప్రేమయే జయించినది. బండను పై కెత్త నగత్యము లేదు. విసరి వేయు" మని రాజనియె.

జయోల్లాసియగు క్షేమశ్రీ కర్ణముల రాజువాక్యము లేమియు చొరలేదు. ఆతఁడు మధుస్రవ నేకాగ్రదృష్టిని వీక్షింపసాగెను. బరువెల్ల శిరమున వహించి యొక స్తంభమువలె నిశ్చలుఁడై నిలిచెను. "పాఱవేయుము, బండరాతిని విసరివేయు" మని వినవచ్చు జనకోలాహల మెంతమాత్ర మాతని నిశ్చలత్వమును బాపఁజాలకపోయెను. ఆతని మోమున చిఱునగవు తొలఁకాడుచుండెను. చూపులు మధుస్రవ ముఖపద్మమునందే నెలకొని యుండెను. "కవిచంద్రుని హస్తములనుండి యా బండను తీసివేయుఁ"డని మధుస్రవ పల్కినంతనే రాతిని కవికరములనుండి చాలమంది లాగివైచిరి. వెంటనే ప్రాణరహితమైన క్షేమశ్రీ దేహము శిలాప్రతిమవలె నేలఁబడియె.

విజయోన్మాదియగు నాకవిశ్రేష్ఠుఁ డిట్లా కస్మికముగ నేల కొరగుటచే హర్ష ధ్వనులకు మాఱు విషాదసూచకకరుణానిస్వనములే సభా భవనమున వినవచ్చెను. విజయి యగు తన స్వామి మృత్యుముఖమునఁ బడుటచే మధుస్రవ శోకావేగమున మూర్ఛయందే శాంతిని బడ యఁ గల్గెను.

(హిందీనుండి యనువాదము.)

---

## కోయిల

జనమంచి వేంకటరామయ్యగారు

౧

కావుకావని యఱచు నీపలుగాకి మూఁకల యఱపులో
  భావ మలరఁగ నీవు పాడిన పంచమశ్రుతిగీతముల్
హాయి గొలిపెను నాకు శ్రవణరసాయనములై హృత్కృతా
ప్యాయనములై సరసకవితోపాయనములటు నెచ్చెలీ!
ఏమి రాగరసప్రవాహం! బిద్దరద్దరు లొరసి యీ
భూమియును నాకనము నొకటిగఁ బొంగిపొరలుచు ముంచెదున్!
ఏమి కోమలగాత్రమాధురి! యిక్షురస మెనవచ్చునో
కామధేనువు పాలమీఁగడ తఱకయే యనవచ్చునో!
నిరుపమానము నీదుగానము, నిన్నెదుర్కొని డింభకుల్
వరుస తప్పిన చప్పచప్పని వంకకూఁతలు కూసినన్.

౨

కాకిగూఁటను బుట్టి పెరిఁగితి—కాఱుకోనలఁ బట్టి తిరిగితి—వో
కోకిలమ! యెటు లబ్బె నీ కీకాకలీమృదుకూజితం బీ
శోకమోహవివర్జితాంత శ్శుద్ధ సుకవి సుపూజితం
బెట్టు లబ్బెను? శీతవాతవిజృంభణము దలపోయఁ గా
చట్టుబండలకైననుం గడు బెట్టిదము గద సైఁపఁగా!

రావిచివురుల మెసవితో? క్రొమ్మావియివురుల మేసితో?
జీవనౌషధదివ్యరసనంసేవనంబును జేసితో?
పూఁడిపోయిన గొంతు గ్రోవిని బాడమె రాగరసం బిటుల్
మ్రోడునను గెంజివురుపోఁడిమి కీడుజోడయి నేఁ డహో!

౩

ఎల్లయాశల నడఁచు క్రమమున నిరవుకొను పెనుతమముసం
దిల్లు చీఁకటికోణమైనను; నల్లపూసయి పోయినన్
విశ్వనాథుని వెండికొండయు—విశ్వమంతయు వెదకినన్;
విశదవృత్తగుణాఢ్య మనియెడి వినుతిఁగను సద్గుణమునున్
భృశమునున్ సత్పథమువలనను వికలమై చ్యుతి నొందినన్;
ఇట్టి దయ్యుఁ దమోవిభుత్వం, బిట్టివిషమ విరుద్ధ సం
ఘట్టనముననను నిప్పు సెరసటు లిట్టె పుట్టెడు నేదొ సౌం
దర్యరూపము, శమితతాపము, నవ్యజీవనదీపమై—
ధైర్యబోధము, హృదయచలన స్తబ్ధభావనిరోధమై:
నల్లమబ్బను తెరమఱుఁగును మెల్లఁ జిమ్మి మెఱుంగులా
గుల్ల ముల్లసిలంగఁ జేయుచు నొకట నాట్యము సలిపెనున్.
శూన్య మప్పుడె పూర్ణ మయ్యెను, శుష్క మార్ద్రము, హానమున్
మాన్యతమమగు గానమగు, సామాన్య మిది మన కోసఖా!

౪

సామరస్యము, సౌమనస్యము సఖుఁడ! లే కవి రెండునో
ఏమి హేతువొ నీదుపాటకు నేను ముగ్ధుఁడ నైతిఁగా!
స్వాగతము! సుస్వాగతము! నీ పంచమశ్రుతి గీతికిన్
నీగుణోన్నతసాధురీతికి—నీకుమాత్రము గా దహో!
ఆటకత్తియ యడుగుఁ జూడక పాటకాని మొగంబునుం
బాటిలదు పరితుష్టి యని రసభావవిదు లందురు గదా?
శ్రోత్రపేయము నీదుగేయము, చూడ రాదుగదా జగ
న్మిత్రభావపవిత్రవదనము, నీస్వసద్వదనం బహో!

౫

దుష్టవృత్తి నిశాచరీపరివేష్టితకు భూసుత కాగిం
గష్టములఁ దొలఁగింపఁ బరమోత్కృష్టగతిఁ గలిగింపనున్
శిష్టవినుతుఁడు వాయుజనితుఁ డభీష్టదర్శన మిచ్చెఁగా
దృష్ట వేళకు నెదురుచూచుపయోజమట్టులు స్వీయసహా
హృష్టహృదయము భక్తిభావపరీమళము వెదఁజల్లఁగాఁ!
దవిలి నిదురను దైత్యకామిను లవశలై పడియున్కిచే
నవిహాతస్థితి మఱచి యితరము నాలకింపఁగ నామెయే,
భువనమెల్ల నశోకవనమయి పొలిచి పొంపిరి వోవఁగా
శ్రవణపేయ మొనర్చె ముందుగ రామనామసుధారసం
బవనిజాతకు లోకమాతకు, నవల దర్శన మిచ్చెఁ దా
నవనిజాంతరనిభృతలఘుతనుఁ డయ్యు నీవలెనే సఖా!

౬

ఎన్నఁడను నిను రామదూతఁగఁ గన్నదోయికిఁ గానరా
కున్న; నీమృదుకూజితంబును నెన్నడును శ్రీరామవా
క్యముగ, నందు గణింప శక్యము గాని మాధురి యబ్బుటన్,
సుమహితామోదాంతరంగవినూత్న పవనకిశోరసం
ప్రేరితంబయి వీనుదోయికి విందొనర్చుట వేకువం
దార! నేనును బాడఁదొడఁగితి నందుకొని నీవల్లవిన్
ఊరకుండఁగ నేరకుంటిని నుల్ల ముల్లసిలన్ సఖా!
కోరుకోరిక దీరఁజూమి మన గొంతు లొకటిగఁ గలసినన్.

---




## అత్తగారి బొమ్మ

బసవరాజు వెంకటరాజ్యలక్ష్మమ్మగారు

ఒకత్తగారి కిద్దరు కోడ ళ్లుండేవాళ్లు. పెద్దకోడలికి అత్తగారంటే పడేదికాదు. చిన్న కోడలికి అత్తగారంటే చాలాభక్తి. అత్తగారు కొన్నిరోజులకి చచ్చిపోయింది. అత్త చచ్చిపో గానే కోడళ్లు వేరుపడ్డారు. చిన్న కోడలు అత్త గారు లేనియింట్లో వుండటం కష్టంగా వుండి అత్తగారి ప్రతిబింబం కొయ్యతో చెక్కించి దాని నొకగదిలో పెట్టి రోజూ పూజిస్తూ రక రకాల పిండి వంటలతో రోజూ భోజనం పెట్టేది. విస్తరాగదిలో పెట్టి తలుపేసి వచ్చేది. తోడుకోడలు దీని అమాయకత్వమును గ్రహించి నెమ్మదిగా ఆగదిలోకి వెళ్లి ఆ రకరకాల పిండివంటలతో భోంచేసి పోయేది. పూటపూట ఇలాగే జరుగుతుండేది. ఈ చిన్న కోడలు పాపం! అత్తగారు రోజూ తిం టూందనే నమ్మి రోజూ యిలాగే చేస్తుండేది.

అన్నదమ్ము లిద్దరూ పొరుగూరు వ్యాపారా నికి పోతూ ఎవరిపెళ్లాంచేతికి వాళ్లు చెరొక వందరూపాయ లిచ్చి మేము వచ్చిందాకా వాడుకొండని చెప్పివెళ్లారు. పెద్దవాడి పెళ్లాం దమ్మిడీఅయినా ఖర్చుచేయలేదు. పూటపూట అత్తగారికని పెట్టేది తింటూ వందరూపా యలూ వడ్డీ కిచ్చుకుంది. చిన్నవాడి పెళ్లాం రోజూ యీవిధంగా పిండివంటలు చేయటం మూలకంగా వందరూపాయలు ఖర్చుపెట్టి పైగా ఇంకోవంద అప్పుచేసింది.

కొన్నిరోజులకి అన్నదమ్ములు వూరినుం చొచ్చి నీకిచ్చిన వందరూపాయ లేంజేశావని ఎవళ్లపెళ్లాన్ని వాళ్లడిగారు. పెద్దవాడిపెళ్లాం 'నావందరూపాయలు వడ్డీ కిచ్చాను; తోడుకో డలు అత్తగారికోసం పెట్టే అన్నం తింటున్నా' నని చెప్పింది. చిన్న దాన్నడిగితే, 'నావంద ఖర్చు బెట్టి పైన యింకోవం దప్పుజేశా'నని చెప్పింది. మొగుడు హడిలిపోయి, 'నీదుంప తెగ, చచ్చిన మా అమ్మ అన్నం తింటుందా? ఇ దెదో యివాళ నేను కనిపెడతా'నని చెప్పి పెళ్లాం గదిలో అన్నం పెట్టి యివతలకు రాగా తలుపుకంతలగుండా చూచాడు. వదిన గారు కూచుని తింటూంది. వెంటనే అతను పెళ్లాందగ్గర కొచ్చి, 'పిచ్చిముండా, ఇన్నాళ్ల

దాకా అత్తగారు తింటూందంటూ నాకొంపంతా గుణ్ణంవేశావు. నీఅత్తగారూ నీవూ ఏకిట్టలోనైనా పడి చావం'డని ఆబొమ్మని గిరాటుపెట్టి పెళ్లాన్ని వీథిలోకి గెంటాడు.

అప్పటికిగూడా అత్తగారియందుండే భక్తిచేత ఆబొమ్మని వదలటం ఇష్టంలేక చంకను పెట్టుకుని చిన్నకోడలు వూరుచివర పాడు దేవాలయంలో తెల్లవారేదాకా కూచుంది. అర్ధరాత్రివేళ దొంగలు కొందరు దోచుకున్న సామానంతా పంచుకోటానికి అక్కడవచ్చి ఆదేవికి నగంవంతు అక్కడపడేసి వెళ్లిపోయినారు. తెల్లవారగానే లేచి చిన్నకోడలు యీ నగలన్ని మూటగట్టుకుని అత్తగారి బొమ్మ చంక బెట్టుకుని మళ్లీ యింటి కొచ్చింది. మొగుడు పెళ్లాం తెచ్చిన డబ్బుకు సంతోషపడి యథాప్రకారంగా జరుపుతూంటే వూరుకున్నాడు. ఈసంగతి పెద్దతోడుకోడలు విని 'అత్తగారి బొమ్మ ఒకసారిస్తావా, నేనుకూడా ఆవిడ కన్ని పెడతానని చిన్నదాని నడిగి బొమ్మ దీసుకుని తనుకూడా అర్ధరాత్రివేళ ఆపాడుదేవాలయంముందు చెట్టెక్కి కూర్చుంది. కొంచెంసేపు కూర్చునేటప్పటికి నిద్ర వచ్చింది. ఆదొంగలు యథాప్రకారంగా ఆగుళ్లో పంచుకుంటున్నారు. ఇది చెట్టుమీద నుంచి బొమ్మతోసహా నిద్రకళ్ల గభేలుమని కిందబడ్డది. ఆదొంగలు దీన్ని జూచి 'పాడుముండా, నిన్న నువ్వేనా యీగుళ్లో నగ లెత్తుకుపోయిందానివి?' అని అందరూ కలిసి చావగొట్టారు. చిన్నతోడుకోడలల్లే డబ్బూ నగ లేకపోగా దెబ్బలు తిని ఏడుస్తూ ఇంటికొచ్చింది పెద్దకోడలు. అందరూ నవ్వారు.

కథ కంచి కెళ్లింది,మన మింటి కొచ్చాము.

---

## భూలోక రహస్యం

అనగాఅనగా ఒకరాజు. అతనికి ముసలితనం వచ్చింది. అప్పు డతనికి భూలోకరహస్యం తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది. తక్షణమే పెద్దపెద్ద పండితు లందరినీ పిలిపించి వాళ్లకి తన కోరిక తెలియజేశాడు. రాజుగారివద్ద గొప్ప సంభావన దొరుకుతుంది అనే ఆశతో పండితులందరు ఆరునెలలపాటు కష్టపడి భూలోక రహస్యాన్ని గురించి గొప్పగొప్ప పుస్తకాలు రాసి వాటిని గాడిదలమీద ఎత్తించుకొని రాజుగారివద్దకు వెళ్లారు. రాజుగారు వాటిని చూడగానే పకపక నవ్వి,

"అయ్యో! దేముడా! నేను ఊరికి దూరంగాను కాటికి సమీపంలోను ఉన్నానే? ఇన్ని గ్రంథాలు చదివేవరకు నేను బ్రతుకుతానా?" అన్నాడు. పండితు లందరు సిగ్గుపడి ఇండ్లకు వెళ్లి గాడిదమోతబరువును మనిషిమోతబరువుగా రాసి ముగించి తీసుకొనివెళ్లారు. రాజుగారు ఈసారికూడా ఫక్కున నవ్వి,

"బాబూ! నాస్థితి చూడండి, ఒక్క-పుస్తకం చదివేవరకులయినా నేను బతికి బండ వేసుకుంటానా?" అన్నాడు. పాపం! పండితులు ముఖాలు చిన్నబుచ్చుకొని అంతా ఒకచోట గుమికూడి బాగా ఆలోచించుకొని కొన్ని పేజీల పుస్తకం రాసుకొని రాజుగారివద్దకు బయలుదేరారు. సింహద్వారందగ్గరికి వెళ్లేసరికి మంత్రి ఎదురుగా వచ్చి, "అయ్యా! త్వరగా రండి. రాజుగారి సంగతి తల్లకిందులుగా ఉంది. భూలోకరహస్యం తెలుసుకోవాలనే ఆశ అధికంగా ఉండబట్టి ఆయన ఇంకా జీవించిఉన్నాడు. లేకుంటే ఎప్పుడో ఎగిరేవాడే." అన్నాడు. ఆమాట వినడంతోటి పండితులంతా పరుగుపరుగున రాజుగారి గదిలోకి వెళ్లి తాము రాసితెచ్చిన పుస్తకం చదవడం మొదలెట్టారు. రాజుగారు అది చూసి,

"ఉశ్, అబ్బా! పరలోకప్రయాణసన్నాహంలో ఉన్న నన్ను ఇంకా ఎందుకు విసిగించి చంపుతారు. చాతనైతే ముక్తసరా టల్లో భూలోకరహస్యం చెప్పి ముగించండి." అన్నాడు. పండితులు గాభరాపడి ఒకరిముఖాలు ఒకరు చూసుకోవడం ప్రారంభించారు. అవసానదశలో రాజుగారి కోరిక తీర్చలేకపోతిమే అని అక్కడ ఉన్నవాళ్లంతా విచారపడ్డారు. అది చూసి రాజుగారి మంచంవద్ద కనిపెట్టుకొనిఉన్న ముసలిదాసి,

"అబ్బే! ఇంతమాత్రానికేనా ఇంత గాథ రాపడ్డారు? ఏముంది? గాడిదగ్రుడ్డు. పుట్టు - బ్రతుకు - చావు - ఇంతేకదూ భూలోకరహస్యం?" అన్నది. అది విని పండితులు తలలు నేలకు కొట్టుకున్నారు. రాజుగారు నిశ్చింతగా ప్రాణాలు విడిచారు.

కథ కంచానికీ, మనం మంచానికీ.

—వి. ఆర్. ఆర్.

---

## విధి

"రాజు"

ఓపల్లెటూళ్లో ఒకపూజారి. ఆయనకు ఓహంస ఉంది. రోజూ శివుణ్ణిపూజచేసి ఇంటికి వచ్చేసరికి హంస చక్కా- నాట్యమాడుతూ ఉండేది. ఒకరోజున పూజారి గుడినుండి వచ్చేసరికి అది నాట్యమాడకుండా విచారంతో ఒకమూల పడుకునిఉంది. ఉంటే పూజారి దాన్ని చూచి కారణం అడిగేడు. అది ఏడుస్తూ, తను ఆడుదయాన్నే నాట్యమాడుతూండగాయమభటులు ఆకాశంమీద పోతూ, 'అయ్యో, ఇది ఇంకా పదిఘడియలసేపేకదా ఆడునేది' అని అని పోయారని చెప్పింది.

"అంతేకదా, శివుడు మనవాడే చావుకు భయపడతావేమిటి" అని పూజారి ధైర్యం చెప్పి గుళ్లోకి వెళ్లి శివుని ఓకొంతసేపు ధ్యానించాడుట. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమనగానే పూజారి తనహంసను రక్షించమని వేడుకు

న్నాడు. శివుడు "అది నాచేతులో లేదోయి, పోయి బ్రహ్మ నడుగుదాం రా" అని పూజారిని బ్రహ్మ దగ్గరికి తీసుకొనివెళ్లేడు. అక్కడ బ్రహ్మకు కూడా చెప్పుకొని బ్రతిమాలుకుంటే అది తనచేతులో లేదని, విష్ణువుచేతులో ఉందని చెప్పాడు. అంతే, బ్రహ్మ శివుడు కలసి పూజారితో విష్ణువుదగ్గరకు వెళ్లేరు. విష్ణువు తనచేత కూడా కాదని చింతించి, యమధర్మరాజు దగ్గరకు వెడదాము అన్నాడు. ఆపైని త్రిమూర్తులు ఆపూజారిని తీసుకొని యముడుదగ్గరకు వెళ్లేరు. త్రిమూర్తులు రాకరాక రావడంచేత యముడు ఏమి ముంచుకువచ్చిందో అని భయపడ్డాడు. పూజారికథ చెప్పి సహాయం చేయుమని త్రిమూర్తులు అన్నారు. ఆయుస్సు ఎంత ఉందో నాకుజ్ఞాపకంలేదు. లెక్కలు వెదికించి చూస్తాను అన్నాడు యముడు చిత్రగుప్తుడు లెక్కలు చూచినాడు. అందులో 'పూజారిహంస త్రిమూర్తులు కలిసేక్షణంలో చచ్చిపోతుంది' అని ఉంది. వాళ్లంతా తెల్లపోయారు: 'త్రిమూర్తులము కూడా విధిని తప్పించలేకపోయాముకదా!'

కథ కంచికీ, మనం ఇంటికీ.

---

## పాత పాటలు

గోపరాజు రాజన్నగారు

౧

తాతా తడిపాతా
నీకో చీగుడ్డ చిల్లు
గోడమీద బల్లి
నువు రాసుకొన్న రాత
నే నేమి చేతును తాత.

౨

చిలకపిట్ట చెల్లామన్నాది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టా నన్నాది
మామ తెచ్చిన మల్లెపువ్వులు ముడువ నన్నాది
మొగుడు తెచ్చిన మొగిలి రేకు పెట్ట నన్నాది
మొగుడుచేత మొట్టికాయలు తింటా నన్నాది.

౩

చింతకాయ బొంతకాయ
చిగురుమామిడికాయ
కోనేటి వంకాయ
కొమ్మనిమ్మనిపండు
జీలుగులు తోటలో
వాలుగులు మెయ్యగా
వంటిపూ రాలగా
తాటాకు దబ్బనం
కోట గట్టించగా
కోటలో వున్నాది
తాంబేలు పిల్ల
మహారాజు కూతురు.

---



అద్భుతభావచిత్రణము

ఏయిలీన్ రిగ్గిన్ అను నర్తకి

ఈమె చతుర యువ యువతి. నర్తనమునను, గానమునను మిగుల ఖ్యాతిని గనినది.

—G. S. A.



ప్రణయకులాయము

క్రొత్తపెండ్లాడిన దంపతులు దీని ప్రవేశింప నున్నారు. ఒక మహావృక్షము క్రింద సుందరమయిన చిన్నయిది.

—G. S. A.



# కమ్మిపని

కొ. నరసింహాచారిగారు

## చిన్న ఉట్టిని చేయుట

కమ్ములతో ననేకవిధములగు ఉపయోగకరములైన వస్తువులను చేయవచ్చును. వాటిలో ఉట్టిని చేయువిధము ఇచ్చట చెప్పబడును. కమ్మిపనికి ముఖ్యముగా కావలసిన పనిముట్టు ఒక పట్టుకారు. పట్టుకారు కమ్మిని వంచుటకును, తెంచుటకును ఉపయోగ పడునదిగా నుండిన బాగు. అట్టి కారును cut plier అందురు (చిత్రము ౧.). కమ్మిని వంచవలెనన్న దానిని కారుయొక్క నోటికొనయందు (చిత్రము ౧, క వద్ద) ఉంచి కారుతో వంచుకొనవచ్చును. కమ్మిని తెంచవలెనన్న దానిని కారుయొక్క కీలుకు సమీపమున (చిత్రము ౧, గ వద్ద) ఉంచి కారును అదిమినయెడల కమ్మి తెగిపోవును.

## ఉట్టిని చేయు విధము

మొట్టమొదట కమ్మియొక్క కొనలను వంచుకొనుట తెలిసికొనవలెను. చిత్రము ౨. లోని అ అను కమ్మిని దీసికొని దాని కొనలను ఆ అనుచోట నుండువిధముగ వంచుకొనవలెను. పిమ్మట కారును చిత్రము ౨. ఆ యందు ర వద్ద పట్టుకొని కొంచెము వెనుకకు వంచినయెడల ఇ వద్ద నుండువిధమున ఏర్పడును. ఇ యందలి కొనల వంపులు ఒకే వాటము (plane) న నున్నవి. అట్లు కాక ఒక కొనయందలి వంపును ఉ వద్ద నుండువిధమున నిలువు వాటమునను, రెండవ కొనయందలి వంపును ఊ వద్ద నుండు విధమున అడ్డవాటమునను కూడ వంచుకొనవచ్చును.

ఆరంగుళముల నిడివి గల కమ్మిని తీసికొని దాని కొనలను ఇ వద్ద నుండువిధముగా వంచుకొనవలెను. పిమ్మట కమ్మి నంతయు జ యందువలె వలయముగా వంచుకొని, కొనలయందలి వంపుల నొకదానిలో నొకటి దూర్చి బిగించవలెను. పిమ్మట ఎనిమిది అంగుళముల కమ్ములను ఆరింటిని దీసికొని వాటి కొనల నన్నిటిని ఇ యందువలె వంచుకొనవలెను. తర్వాత ఒక్కొక్క తునుకను చ యందువలె

వంచుకొనవలెను. చ యందలి త ద అను కొనల మధ్యగలదూరము, జ అను వలయములో మూడవభాగము నకు అనగా నన అనుదూరమునకు సమముగా నుండవలెను.




చిత్రము ౨ లో జూపినవిధముగ చ అను కమ్ములను జ అను వలయమునకు బిగించవలెను. ఇట్లు చేయుటలో మొదట మూడు కమ్ములను ఎ, ఏ, ఐ, అనువిధముగ బిగించవలెను, తర్వాత మిగిలిన మూడు కమ్ములను ఒ, ఓ, ఔ, అనుచోటులందు బిగించవలెను. అప్పుడు ల, ల, ల, అను చోటులందు కమ్ములొకదానిపైనొకటిపడును.

జ యందలి వలయము నకన్న కొంచెము పెద్దదగు మరియొక వలయమును చేసికొనవలెను. పిమ్మట చిత్రము ౨ లోని కమ్ములను చిత్రము ౩లోనిరీతిగ పైకి చేరతీసికొని ముందు చేసికొనిన పెద్దవలయమును వంపుకమ్ముల వెలుపల పెట్టుకొని(చిత్రము 3,ప) ల,ల,ల, అనుచోటులందు వంపుకమ్ములను వలయమునకు సన్ననితంతికమ్మితో కట్టవలెను. పిమ్మట చిత్రము౫లో|నుండురీతిగ నొక కమ్మిని వంచుకొని దానికి చిత్రము ౨ లోని ఇ వంటి కమ్ములను మూటిని చిత్రము ౬ నందలి విధముగ బిగించవలెను. ఈమూడుకమ్ములను ఉట్టియందలి ఎ, ఏ, ఐ, అను మూడు వంపులకు గాని, ఒ, ఓ, ఔ, అను కమ్ములకుగాని చిత్రము 3 నందు వ వద్ద చూపినవిధముగ బిగించవలెను. అపుడు ఉట్టి పూర్తియగును.



---

# గురుశిష్యసంవాదము

కూచి నరసింహముగారు

౬

శి—నమస్కారమే.

గు—దీర్ఘాయు రస్తు! కూరుచుండుము.

శి—శ్రీకుమారప్పగారు వ్రాసిన విషయము లయిపోయినవా? ఇంకను నున్నవా?

గు—ఇక లేవు, కాని యింతవఱకును జెప్పిన విషయముల సారమును, కొన్ని హిందూదేశచరిత్రాంశములతోఁ గూర్చి, మనసున కెక్కునట్లు ఆయన మరలఁ జెప్పినారు. కావలయునన్న, ఆసంక్షేపకథనము నా శక్తికొలఁదిఁ దెలుఁగున నీ కిపుడు వినిపించెదను.

శి—"మనసున కెక్కునట్లు" అని మీరే చెప్పుచున్నారు. విషయము ప్రజాసౌఖ్యమున కాయువుపట్టయిన దేశపాలన మయ్యెను. అక్కఱలే దనువాఁ డెవఁ డుండును? కాని, వేదవేత్త యాశీర్వచనపు పనస చెప్పుచుండఁగా సంభావనకు వచ్చిన నిరక్షరకుక్షిగాఁడు చేతియక్షతలు నలుపుకొనుచు మిన్నక యాయనవంక మువైపు చూచుచుండునట్లు, నేఁటి ప్రసంగములో నేను మాటికిఁ దాళము వైచుకొని యూరక వినుచుండ వలసినవాఁడనే కాఁబోలు.

గు—అ ట్లేల జరుగును? సుతిలేని పాట యుండునా? నా శ్రమ కొంత తగ్గించుటకును, విషయములను మఱింత విస్పష్టముగా నాచేఁ జెప్పించుటకును నడుమనడుమ నీనాలుకయును కొంత యాడుచుండ వలయును.

శి—చిత్తము.

గు—ఒక మహారాజ్యము జీర్ణమై శిథిలమై నశింపఁబోవుచున్నప్పుడు, చుట్టుపట్ల వేచుకొనియుండు విత్తకాములును, రాజ్యకాములును సాధ్యమైనంత యధికారబలమును సంపాదించికొనుట కల్లాడుచుందురు—అనుసత్యము దేశచరిత్రలు మనకు బోధించుచున్నవి. తదనుసారముగా, కేవల మర్థకాములై యుండిన ఈస్టిండియా కంపెనీవారు, సమయము కనిపట్టి ఢిల్లీచక్రవర్తిసింహాసనము తాము లాగుకొనిరి. అప్పటి పరిస్థితులనుబట్టి ప్రజలపై వేసిన పన్ను లతిభారవంతములుగా నుండి యుండవచ్చును.

శి—ఆపరిస్థితు లేమైయుండును?

గు—దేశమంతయు నశాంతముగా నుండెను. మొగల్రాజ్యసౌధము కూలుటకు సిద్ధముగా నుండి జవ్వాడుచుండెను. మొగల్చక్రవర్తులలోఁ జివరవాఁడు ప్రజాపీడకమైన పరిపాలనము చేసెను. అతని కాలములో సంభవించిన యుద్ధముల కధికముగా ధనము కావలసియుండెను. అందుచేఁ బ్రభువులకుఁ బ్రజలు బరువైన పన్నులప్పుడు చెల్లించుచుండవచ్చును.

శి—అది ప్రమాణముగాఁ గొని యాంగ్లప్రభువు లట్లే పన్నులు వేసి జనుల బాధించుచున్నారని వెనుకఁ జెప్పినారు.

గు—ఔను; ఆబాధ యిప్పు డధికమైనది. ఏలన:—పన్నులు వసూలుచేయుటలో అసమర్థులగు మొగలులకు పట్టువిడుపు లుండెడివి. ఇక శుల్కగ్రహణవిద్యావిశారదులగు మన యాంగ్లేయప్రభువు లొక్కపైసయైనను చెదరిపోకుండ యథావిధిగాఁ బన్నులు వసూలుచేయుచుండుటచే, ఆయపుమొత్తముతోపాటు ప్రజాకష్టమును హెచ్చుచున్నది.

శి—ప్రజల తృప్తియే మాకుఁ గావలయును, అందే మాయానంద మంతయు నున్నది—అనుమాటలు చెప్పుచు మనకోసమే వారు హిందూదేశపరిపాలన భారము వహించుచున్నట్లు చెప్పుదురే. శిశువుల యాస్తి పుచ్చుకొని, దానిని జాగ్రత్తతోఁ జక్కఁగాఁ గాపాడి యభివృద్ధిచేసి, వారికి యుక్తవయస్సు రాఁగానే వారి యాస్తి వారి కినుమడిగా నప్పగించు పరోపకారపరాయణులవలె వ్రాఁతలు వ్రాయుదురే!

గు—అవన్నియుఁ దరువాత బయలుదేరిన శ్రీరంగనీతులు. తమ రాజ్యమును దృఢముచేసికొనుట కాడిన ప్రౌఢవచనములు. బ్రహ్మాండమంత భారత రాజ్యమును దమ చేతిలో నుంచికొని చప్పరించుచున్న తప్పు బాపుకొనుటకుఁ గల్పించిన కారణములు.

శి—అట్లైన, బ్రిటిసామ్రాజ్యనిర్మాతలని పేరుపడిన క్లైవు మున్నగు మహాపురుషులు మనదేశమున కపకారకులే యని చెప్పవలయును గాఁబోలు.

గు—సందేహ మేమి? మన కపకారకులు గాని, తమ దేశమువారికి మహోపకారకులే.

క్లైవుగారును, వారన్ హేస్టింగ్సుగారును, తదితరులును జేతికందిన దేశధనమంతయుఁ కేఁడిపట్టుకొనిపోయినారు. ఆ యమితధనరాసులు తమవారు ధూమయంత్రాదులు గల్పించుకొని సుఖపడుటకు సాధనభూతము లైనవి. అవియే యింగ్లండుయొక్కయు, యూరప్‌ఖండముయొక్కయు వ్యాపారవ్యాప్తికిని, వర్తకాభివృద్ధికిని బ్రధానకారణము లైనవి. వారి వర్తకవ్యాపారాభివృద్ధితో ఆర్యావర్తవ్యాపారాభ్యుదయమునకు క్షీణదశ ప్రారంభించినది.

అందాశ్చర్య మేమియు లేదు. ఈస్టిండియా కంపెనీవారు వాణిజ్యముచే డబ్బు గడించుకొనుటకు మొదట మనదేశములోఁ గాలు పెట్టినారుగాని, మనకుఁ బ్రభువులై మనల నుద్ధరించుటకు రాలేదు. అదృష్టవశమునఁ బాలకులై నపిమ్మటఁ గూడ, ప్రతివ్యవహారమునందును తాత్కాలికస్వలాభమునే వారు చూచుకొనుచుండిరిగాని హిందూదేశభావికసౌఖ్యమును దృష్టి నిడుకొని ప్రవర్తింపలేదు. ప్రభుత్వబాహ్యలక్షణము లగపఱచుట కప్పుడప్పుడు మనదేశము బాగించుక పరిగణించినను, అది యింగ్లండుయొక్క దినదినాభివృద్ధికిని, దాని సర్వసర్వంసహాపరిపాలనాభిలాషకును అబాధకముగా నుండునట్లు చూచుకొని మఱి వ్యవహరించెడువారు.

శి—బ్రిటిష్‌వారి యైశ్వర్యోత్కర్షసాధనమునకు మన భారతభూమి నిచ్చెనమెట్టైనదన్నమాట. మొగల్రాజ్యాంతమునఁ బ్రారంభించిన దేశాధఃపతన మట్లే యున్నదన్నమాట.

గు—అట్లే యున్నఁ గొంత మేలే. అంతకంత కాచ్యుతి యెక్కువగుచున్నది.

శి—కారణములు?

గు—అనేకము లున్నవి. ఇంగ్లండులో యంత్రకర్మాగారము లెక్కువగుచున్నకొలఁదిని, మనదేశము నుండి వానికై ముడిసరకుల యెగుమతులు హెచ్చ కావలసివచ్చినది. ఆ ఫ్యాక్టొరీల పరిపోషణముకై దిగుమతిసరకులపై వేయు టారిఫ్పుసుంకములు అన్యాయముగా విధింపవలసివచ్చినది. బొంది యొకచోటను డెంద మొకచోటను నుండు పరిపాలనము ప్రజాతృప్తికరముగా నుండఁజాలదు. మనకుఁ బదార్థనష్టియు, వారి కర్థపుష్టియుఁ బ్రస్తుతపరిపాలనఫలములుగాఁ గాన్పించుచున్నవి.

శి—మాకు హిందూదేశమును పాడుచేయవలయునను దురుద్దేశము లేదు. ప్రజాక్షేమమునే గోరియే పన్నులు వేసి యితరదేశములతో వాణిజ్యవ్యవహారములు నడపుచున్నాము. హిందూదేశమునకుఁ గొంచెము నష్టమును లంకాషైరువారి కించుక లాభమును సంభవించుచున్న యెడల, నవి యానుషంగికముగా వచ్చుచున్నవి గాని మేము బుద్ధిపూర్వకముగాఁ దెచ్చుచుండుటచే వచ్చుట లేదు—అని యాంగ్లప్రభువులో వారిపక్షము వారో చెప్పిన నపుడు మీ రేమి చెప్పెదరు?

గు—వారు మీరు చెప్పనక్కఱలేదు—ఈ మాటలు మంత్రి మెగ్డానల్డుగారే చెప్పినారు. కాని యవి విశ్వాసపాత్రములుమాత్రము గావు.

చేనిలోఁ జొచ్చి యొకఁడు గోఁగాకులు గోయుచుండఁగాఁ జూచి భూస్వామి వచ్చి యతనిని బట్టుకొని కొట్టఁబోయినాఁడఁట. అంతట నాదారిఁ బోవుచున్న యొకఁ డడ్డుపడి—పోనిమ్ము, వెఱ్ఱివానివలె నున్నాఁడు, వదలిపెట్టుము—అని పలికినాఁడట. "మతిలేనివాఁడైనఁ జేతులు కంచియాకులమీఁదికిని ఊలవాకులమీఁదికిని

పోక తిన్నగా నోఁగునూరనైకే రేల పోవలేము?" అని పంటకాఁపు ప్రశ్నించినాఁడఁట. కనుక లాభము తమ దేశమువారికే వచ్చుటయును, దానివలని నష్టము తాము ప్రవేశించి పాలించుచున్న దేశమువారికే కలుగుటయును కాకతాళీయములు గాఁజాలవు.

శి—కాకతాళీయములు గావు, కావలయునని చేయుచున్నవానివలెనే కాన్పించుచున్నవి.

గు—ఔను, సుప్రసిద్ధాంగ్లేయవిశ్వవిద్యాలయములలోఁ జదివి, మేధావంతులని పేరుపడి, కఠినములైన పరీక్షలలో నుత్తీర్ణులై వచ్చి, మనదేశములో కలెక్టరులుగాను, గవర్నరులుగాను పనిచేసినవారు వివేకహీనులయి పొరపాటుపడుచున్నారని చెప్పుటకు వీలుపడదు.

శి—పొరపాటొకటేఁడు రావచ్చును రెండేండ్లు రావచ్చును గాని, యెల్లకాల మేకరీతిగా సంభవించుచున్నది ప్రమాదజన్య మెట్లగును?

గు—ఒకసారి ప్రమాదములోఁ బడినవారితరులు చెప్పిన మాటలు విని తరువాతఁ జక్కఁబడుదురు.

అయ్యలారా! దేశావర్ధకారులగు నిమపదారు లమితముగా వేసి ప్రజలకుఁ గూడు లేకుండఁ జేయుచున్నారు పాశ్చికపు రయిలుబాడిగలు వేయుచు స్వదేశ వ్యాపారములఁ జంపుచున్నారు. మాదేశపు వణిజులకు మేలుచేయు తలంపుతో దిగుమతిపన్ను లతిలఘువుగా వేసి స్వచ్ఛందవాణిజ్యము సాగించి దేశీయుల కన్యాయము చేయుచున్నారు—అని దేశనాయకులెల్ల గ్రీష్మముగాఁ జెవి నిల్లుకట్టుకొని చిరకాలమునుండి మొఱలు పెట్టుకొనుచున్నప్పటికిని, "ఇవన్నియు నత్యల్పసంఖ్యాకులగు నసంతుష్టవిద్యావత్ప్రజలయొక్కయు, అనాలోచితముగా వారి పక్షమవలంబించి వాదించు ఇంగ్లండులోని కొంద ఱవివేకులయొక్కయుఁ బ్రలాపము" అని ప్రభువులు నిరసించుచున్నారు గాని యామాటలఁ బాటించుచుండుట లేదు.

శి—మేలుకొని నిద్రించుచున్నవారి నెవరు లేపఁగలరు?

గు—కనుక, ఈపెట్టుబాధలన్నియుఁ బ్రమాదజన్యములని చెప్పి వారి బుద్ధికపకర్షముఁ దెచ్చుటకంటె "ఎంతబుద్ధిశాలులైనను తమవారిని బాగుచేయుటకై యన్యాయమున కొడిగట్టుకొనకమానరు, అది నైసర్గికము" అని చెప్పి యాదౌర్బల్యమంతయు వారి నీతి కారోపించి చెప్పుట యుచితము.

శి—అర్థలోలుపులగు వర్తకుల బృందమునుండి హిందూదేశపాలనము ఐశ్వర్యతృష్ణగల బ్రిటిష్ప్రజలచేతిలోనికి వచ్చినతరువాత, సరసవాక్యసంయుతములైన శాసనములుదక్క నన్యలాభ మేమియు లేదన్నమాట.

గు—అంతే! రాజు దేవాంశసంభూతుఁ డను విశ్వాసముగల అమాయికప్రజచే ఆశాసనము లవిలంఘనీయములైన దైవశాసనములుగాఁ దలఁపఁబడుచున్నవి. "గొప్పవర్తకలాభము గ్రేట్బ్రిటనునకుఁ గూర్చి యిండియా ధన్యయైనది. అధికమూల్యముతో నామె యమోఘమైన సంరక్షణలాభము సంపాదించుకొని ధన్యతరమైనది." అని యొకరు చెప్పినారు.

శి—చారిత్రకవిషయాత్మకమైన యీపునాది చాలును. ముందు ప్రసంగమునకుఁ బోదము.

గు—"బ్రిటిష్ప్రాజ్యప్రయోజనములకై మనము వెచ్చించుచున్న ధన మత్యధికముగా నున్నది; హిందూదేశాభివృద్ధికై చేయు అర్థవ్యయ మత్యల్పముగా నున్నది" అని మెగ్డానల్డుగారు వ్రాసినారు.

రయిల్లమున్నగువానికిఁ పెద్దపెద్ద మొత్తములు వ్యయించుచున్నారు. దేశపుష్టికరములగు పనులు గావించుటకు నలయు ధనము లేకున్నది. పరిపాలకజాతివారు చేయు నుద్యోగములలో నిరాధారులై బాధపడుచుండు పరిపాలితదరిద్రప్రజల నిట్టూర్పులు వినఁబడకున్నవి.

మనదేశమునుండి వసూలుచేసిన శుల్కపుటాదాయములో విశేషభాగము దేశము దాఁటిపోయి విదేశములలో వినియుక్తమై, యచ్చటివారికి ఫలకారి యగుచున్నది. ఈమాట మంత్రిగారే యొప్పుకొని చెప్పుచున్నారు.

ఇంకొక యనర్థము గన్పట్టుచున్నది.

శి—అది యేది?

గు—పన్నుభారము దరిద్రులపై నత్యధికముగాఁ బడుచున్నది; ఇతరులపై—ముఖ్యముగా ధనవంతుల పై—మిక్కిలి తేలికగాఁ బడుచున్నది. కడుపు గట్టుకొని కటికదరిద్రుఁడు చెల్లించు రూపాయ, ధనవంతుల విషయోపభోగముల కాధారభూత మగుచున్నది. "ఇది మన హిందూరాజ్యపరిపాలనములోని మహాకలంకము, అతిశీఘ్రముగాఁ దుడిచివైచుకొనవలయు మచ్చ......" అని సర్ ఏ. కాటన్‌గారు వ్రాసినారు.

శి—బుద్ధిమంతులగు మన ప్రభుత్వమువారు ఈ విషయమున భాగ్యవంతులను చులుకగాఁ బోనిచ్చి బక్కవారగు దరిద్రుల నేల బాధపెట్టుచున్నారో?

గు—దానికి రెండుకారణము లగపడుచున్నవి. ఇండియాలో నుండు బ్రిటిషువా రందఱును ధనిక తోట్టిలోఁ జేరినవారు. కనుక ధనవంతులను పన్నులచే బాధించినయెడల, వారికిఁగూడ ఆబాధ తగులక మానదు.

శి—సరియే, రెండవ హేతువు?

గు—అదియే ప్రధానహేతువు. బ్రిటిష్పరిపాలనము పరపరిపాలనము, విదేశపుయొక్క; అది యింకను బట్టిపాటి లోఁతుగా నాటుకొనలేదు. దాని కవరో కొందఱి పోషణము కావలయును. ధనాధికులును విద్యాధికులును అగు జను లనేకు లేల పైవారలమండిరియే దాని కాతోడ్పాటు రావలయును. వారికి సమ్మతమైన ట్లే పన్నునిర్ణయసూత్రములు చేయవలెను. సాధారణముగా వీరి కనుకూలములగు పద్ధతులే దేశములో నుండు నాంగ్లేయులకును అనుకూలములుగా నుండును; వీరికి బాధకము లైనవే వారికిని బాధకములుగా నుండును. కనుక నీయుభయుల మాటలును పరిపాలకుల చెవి కెక్కి వారి కాదరణపాత్రము లగుచున్నవి.

మఱియుఁ బరపరిపాలనమువలన సేనావ్యయ మత్యధికముగా నుండును.

శి—ఎందుచేత?

గు—విదేశీయప్రభువులు స్వసంరక్షణార్థము భృతకసైనికుల ననేకుల నేర్పఱుచుకొని వారిని యుద్ధావసరములందును శాంతిసమయములందును గూడ భరించుచుండక తప్పదు. స్వదేశీయులే ప్రభువు లగునెడఁ, గొలఁదిమందికే వేతనము లిచ్చి స్థిరసైనికులఁగాఁ బెట్టుకొని, యాపత్సమయములందుఁ గావలసినంతమందిని ఆప్తులగు నాత్మీయప్రజలనుండి తాత్కాలికయోధులఁగా నెన్నుకొని వారివలన రాష్ట్రరక్షాప్రయోజనములు నెఱవేర్చుకొందురు.

శి—రెయిల్వేలుగూడఁ బ్రజోపకారక మగు తటాకాదినిర్మాణమున కడ్డువచ్చుచున్నవని వెనుకఁ జెప్పినారు; కాని పాపము! అవి కఱవుబాధలు కొంత వఱకు తగ్గించుచున్నట్లున్నవి.

గు—దానికిఁ బ్రత్యుత్తరము వెనుకఁ జెప్పితిని, మఱచి వావు కాఁబోలు.

శి—ఏమని?

గు—రోగముఁ దెచ్చుకొని కుదుర్చుకొనుటకంటె, రోగము రాకుండఁ జేసికొనఁ బ్రయత్నించుట మంచిదని.

అదియుఁ గాక, యెప్పుడో కఱవుకాలములం దుపయోగించునని చెప్పి నిత్యపీడాకరములగు నయోమార్గముల నెవఁడు నెత్తిమీఁదఁ బెట్టుకొనఁజూచును? అది, గాలివానలు వచ్చినప్పుడు ప్రాణసంరక్షణార్థ ముపయోగపడునని యతివ్యయాత్మకమైన నౌకాదళము నిర్మించిపెట్టుకొనిన ట్లుండును.

మహానసాధనములుగానైన సర్ ఏ. కాటన్‌గారు ఇండియాలోని రెయిల్వేలను మెచ్చుకొనక—"హిందూదేశమునకు నేఁడు గావలయునవి నీటిబాటలు. వాని ప్రయోజనములు బహుమూల్యసాధ్యములగు రెయిల్వేలు నెఱవేర్పకున్నవి. కాలువలు ద్రవ్వి వానిపైఁ జిన్నపొగపడవలు నడుపునెడల, నవి చౌకగా నెంతసరకైన నతివేగముతో నొకచోటనుండి యొకచోటికిఁ గొనిపోఁ

గలవు. అట్టికాలువలు త్రవ్వుట కనుకున్న, రెయిల్వేలు నిర్మించుటకగు వ్యయములో నెనిమిదవవంతైనఁ గాదు" అని వ్రాసినారు.

"ధనోత్పాదనానుకూలములగా నేర్పాటులు గావింపఁబడుచుండుటలేదు. అదియే హిందూదేశదారిద్ర్యమునకు హేతు వగుచున్నదికీ అని రష్ బ్రూకు విల్యమ్సుగారు సత్యము గనిపట్టి చెప్పినారు.

శి—అట్టి యేర్పాటు లేల చేయకున్నారు?

గు—హాబ్సన్‌గారు సెలవిచ్చినట్లు—నాగరకులగు పాశ్చాత్యప్రపంచమువారు, తమకంటె నిమ్నస్థితిలో నుండు పశ్చేతరప్రపంచమువారిని అడఁగద్రొక్కి యధికారము చలాయించి తాము బాగుపడుటకే పుట్టినా రనియును, తాము ప్రపంచాధిపత్యవైభవముతో నుండఁదగు అగ్రవర్ణమువా రనియును, తమ సుఖముకై తక్కువారందఱు దాసజనమువలెఁ బాటుపడి భోగపదార్థములు సమకూర్పవలయు ననియును భావించుకొని, వారి రాజ్యాంగతంత్రములు, వారి వాణిజ్యపద్ధతి, వారి నీతి, సమస్తము తదనుగుణముగా నమర్చిపెట్టుకొని ప్రవర్తించుచున్నారు—ఇదియే మనదేశమునకు శుభకరములగు నేర్పాటులు వారు చేయకుండుటకు హేతువుగాఁ జూపట్టుచున్నది.

శి—చాతుర్వర్ణ్యసంక్షోభమునకుఁ దోడు గా శ్వేతవర్ణపిడ యొకటి వచ్చినదన్నమాట. ఇట్లు చెప్పిన యాంగ్లేయులలో ఆయన యొకఁడేనా ఆయనవాక్యములకు బలకరముగా మఱియెవరైనఁ జెప్పినారా?

గు—డాక్టర్ రూథర్ఫర్డుగా రిట్లు వ్రాసినారు:— "హిందూదేశమునందుఁ గన్పట్టు బ్రిటిష్వారిపాలనపద్ధతి, యొకజాతి మఱియొకజాతిని పీడించి తా బాగుపడు నధమాధమనీతిబాహ్యపద్ధతి."

శి—ఆయనదృష్టిని హిందూదేశదారిద్ర్యహేతువు లేవి?

గు—ఇవి:— "పామరజనులకు విద్య గఱపకుండుట, గ్రామముల శుచిత్వారోగ్యములను గాపాడుమ వానిని పనిగా నుంచకుండుట, దరిద్రజనులను దగుకుటీరములలోఁ బెట్టకుండుట, కుసీదకుల బాధనుండి కృషీవలుల రక్షింపకుండుట, సేద్యకాండ్ర కనుకూలముగా అప్పులిచ్చుకోశలను స్థాపింపకుండుట, వ్యవసాయమునకుఁ దగు ప్రోత్సాహము గావించి దాని నభివృద్ధిపఱుపకుండుట, దేశీయవృత్తివ్యాపారములను బోషింప నపేక్షించుట, ట్రామ్వేలు విద్యుద్దీపవ్యాపారములు మున్నగు దేశమందలి పెద్దపనులను లాభాపేక్షతో వచ్చి బ్రిటిష్వా రాక్రమించుకొనుట నాఁపకుండుట, లండనువారికి లాభకరముగా నాణకవినిమయప్రచారపు టేర్పాటులు గావించుట మానకుండుట."

శి—పెద్దజాబితా యిచ్చినారే! స్వదేశపత్త్రకపోషణముకై విదేశవస్తువులమీఁద బరువైన దిగుమతి టారిఫ్ఫులు వేయుట మంచి దందురుగదా, అట్లు చేసినమాత్రమున, నిండ్లలోఁ బూర్వము మనవారు చేసికొనుచుండెడు చేతిపనులు — చచ్చిపడిపోయినవి — మరల బ్రతికి తలయెత్తునా?

గు—ఎత్తకేమి? పోనీ, యెత్తవే యనుకొందము. ఎత్తకున్నను, స్వదేశయంత్రకర్మాగారము లభివృద్ధి నొందవా? అందుఁ బనిచేయుటకుఁ బల్లెలనుండి కొందఱు జనులు రారా? అట్లు వచ్చుటవలనఁ బొలములపై జనసమ్మర్దము తగ్గదా? మిగిలినజనులకుఁ బండినపంటవలనఁ బూర్వముకంటె నెక్కువ తిండి దొరకదా?

శి—ఔను, పంటవలనఁ గొందఱకును, కూలివలనఁ గొందఱకును కూడు దొరకఁగలదు.

గు—పరిపాలనదోషములవలనఁ బదార్థోత్పాదనశక్తి ప్రజల[illegible] మున్నప్పటికిని, మనజాతి మడియక యింకను జీవింపఁగలిగియుండుట యత్యాశ్చర్యకరముగా నున్నది. అది కేవలము పరమేశ్వరానుగ్రహసూచకము.

శి—అయ్యో! అట్లనుచున్నారేమి?

గు—నేను గాదు, రమేశచంద్రదత్తుగారే చెప్పుచున్నారు. వినుః—"చేతిపనులు చెడఁగొట్టఁబడినవి; కర్షకులపైఁ బన్ను లమితముగాఁ బడినవి; ఆదాయపు

మొత్తములో మూడవవంతు దేశమునుండి పరదేశమున కుం బంపఁబడుచున్నది—ఇట్టిస్థితిలోఁ బ్రపంచము లోని యేజాతివారికైనను శాశ్వతదారిద్ర్యదశయును,మరల మరలవచ్చు కఱవుల బాధలును సంప్రాప్తింపక మానవు. ఆయన్యాయమైనస్థితిగతులు ఏషియాకును యూరప్పు నకును సమానముగానే యుండును గాని భిన్నముగా నుండఁజాలవు. ఇండియా నేఁడు దరిద్రదేశ మగుటకుఁ అప్రతిహతములైన యాయర్థశాస్త్రనియమములే కారణ ములు. ఇట్టిపరిస్థితులలో ఇండియా యైశ్వర్యవంతమై వర్ధమానమగుచుండు నెడల, అది యతిమానుషమైన యద్భుతదైవసంఘటన మగును."

మఱియు—.

శి—ఇంక నెవరైన నట్లు చెప్పిరాయేమి?

గు—సరిగా నట్లు గాదు, అభావ మిచ్చు మాటలే మంత్రి మెగ్గానల్డుగారిట్లు పలికినారు:—"ఏది యెట్లున్నను, మొత్తముమీఁద, మనపై రెండునేరములు రుజువుపఱచి మోపవచ్చును—1. మన పరిపాలన మమితవ్యయాత్మకము. 2. హిందూదేశమునెడల మనము నీచముగాఁ బ్రవర్తించినాము."

శి—మంత్రిగారి నోటినుండి కడుగాటుమాటలు వచ్చినవే! కాని దారిద్ర్యము! దారిద్ర్యము! అందురు గదా, మనదేశములో మనుష్యుని సగటురాబడి యె ట్లున్నది?

గు—ప్రభుత్వమువారి యాజ్ఞపైఁ దయారు చేయఁబడిన లెక్కలనుబట్టి యిచ్చిన యీ క్రిందియంకె లను గనుము:—

| సంవత్సరము | సాలుసరి మనుష్యునికి వచ్చు సగటురాబడి | వస్తువుల ధరలు | నిసలైన సం॥రపు సగటు రాబడి |
|---|---|---|---|
| 1881 | 27 | 100 | 27 |
| 1901 | 30 | 120 | 25 |
| 1921 | 74 | 378 | 19.7 |

శి—ప్రథమదృష్టిని వచ్చుబడి హెచ్చుచున్న ట్లగపడును గాని, దానిని పదార్థమూల్యముల హెచ్చుతో సంప్రతించి చూడఁగా వంతెకంతకుఁ బడిపోవుచున్నదని చెప్పక తీఱదు.

గు—ప్రజాపరిపాలనము క్రింద నున్న దేశములో నధికపాలనవ్యయ మభివృద్ధికూడకమని చెప్పవచ్చును గాని, ధరకుల వెలలు హెచ్చిన వను హేతువు చెప్పి, యున్నతోద్యోగుల జీతవారుల నెక్కువచేసి వ్యయా ధిక్య మగపఱచు మనదేశములో నట్లనుకొనుటకు వీలు లేదు. సర్విల్యమ్‌హంటరుగారి యీ క్రిందిమాటలు విను ము—"పైరాజాలుదండెత్తి వచ్చి దేశముపైఁ బడుదురను భయమును బాపినాము; అరాజకత్వవిలంఠన విప్లవము లుండుచోట్ల నియమనిబంధనములు చేసి, ప్రజలు నిర్భ యముగా శాంతముగా బ్రతుకునట్టి యేర్పాటులు చేసి నాము; యీవద్దేశమును పాఠశాలలతోను, న్యాయస్థాన ములతోను, రోడ్లతోను, రెయిల్రోడ్లతోను, కాలువల తోను, నింపి ప్రజావర్గమునకును వాణిజ్యమునకును ప్రోత్సాహము గలిగించినాము — అని చెప్పినఁ బ్రయో జనము లేదు. ప్రజలకుఁ దినుటకుఁ జాలిన తిండి లేన ప్పుడును, మన పరిపాలనవ్యయభారము దేశము భరింపఁ జాలనప్పుడును, అవి యన్నియు వ్యర్థప్రలాపనములు."

మఱియొక యన్యాయ మున్నది.

శి—అది యేది?

గు—ప్రజలు చెల్లించు పన్నులనుండి పెద్దపెద్ద జీతనములు పుచ్చుకొని, బుద్ధిమంతులు మంచి లోకజ్ఞ తను వ్యవహారానుభవమును సంపాదించుకొని యుద్యో గములు చాలించుకొనిన పిమ్మట, దేశములోనే యుండి, తమ బుద్ధిబలానుభవబలముల నుపయోగించి తమ తరు వాతివారికి చక్కని యాలోచనలు చెప్పి, దేశపురోభి వృద్ధికిఁ దోడ్పడుట, సర్వలోకసామాన్యసంప్రదాయము.

ఇఁక మనదేశపుఁ బెద్దయుద్యోగులైన దొరలు హిందూదేశము సొమ్ము తిని, దానితోఁ బరిపాలనాను భవము సంపాదించుకొని, యుద్యోగానంతరము తమ్ముఁగనఁ దమ దేశమునకుఁ బోయి, పెన్షను లనుభవించుచు నటఁ

గూరుచుంచి, బుద్ధిని వ్యవహారజ్ఞానమును మన దేశక్షేమమునకై యుపయోగింపక అన్యదేశాభివృద్ధికై యుపయోగించుచున్నారు. ఇది యన్యాయము గాదా?

శి—ఔను, ఘోరాన్యాయమే. మన కీదారిద్ర్యవిముక్తియు ధనప్రాప్తియు నెట్లు సిద్ధించునని పెద్దలగు నర్థశాస్త్రజ్ఞులు చెప్పినారో తెలుపుడు.

గు—బ్లంటుగా రిట్లు చెప్పినారు :—"రైతులను ప్రస్తుతము పీడించుచున్న యనశనబాధను బోఁగొట్టి, వారి స్థితిని బాగుపఱుచుట శాసనములచేతఁ గాదు. కలకత్తాలోను లండనులోను గూడ నిప్పుడు బలవత్తరములై హిందూదేశమునకుఁ బ్రతికూలములై పనిచేయుచున్న స్వహితపరతాదురభిమానములు తొలఁగిపోయినఁగాని, యీప్రయోజనము నెఱవేఱఁజాలదు. అంతయనర్థమునకు మూలకారణ మాయవ్యయనిర్ధారణము నందలిలోపము గాని శాసననిర్మాణసభాదోషము గాదు. ఆవశ్యకమైన యీయవ్యయసంస్కరణము లేని యితరమార్గము లన్నియు నిష్ఫలములు."

శి—మెగ్డానల్డుమంత్రిగా రీవిషయమున నేమైనఁ జెప్పినారా?

గు—ఇట్లు చెప్పినారు :—"బ్రిటిష్రాజ్య మిప్పుడిండియామీఁద వేసి దానికే యంటఁగట్టుచున్న వ్యయభారము న్యాయముగాఁ బంచి సరదునెడల, హిందూదేశపాలకులు గొప్పసంస్కారములు ప్రారంభించి దేశభాగ్య మభివృద్ధి నొందింపఁగలరు. అది చాలును; అంతకంటె నెక్కువ యేమియుఁ జేయ నక్కఱలేదు."

శి—కుమారప్పపండితుఁడుగారి యభిప్రాయ మేమి?

గు—హిందూదేశక్షేమమే హృదయములం దిడుకొని, యధికారులు తదనుగుణములైన సంకల్పములు చేసికొని, పరిపాలనకృత్యములు సాగించుకొనుచున్నఁ దక్క హిందూదేశపు టాదాయము తత్ప్రజోపయోగకరముగా వినియోగింపఁబడనేరదు. పన్నురూపముగా వచ్చు ప్రతిరూపాయయును ప్రజలయొక్క వస్తూత్పాదనశక్తిని, వారి యుత్సాహక్రియాశక్తులను హెచ్చు చేయుచుండవలెను.

శైశవావస్థలో నున్న దేశీయవ్యాపారములు శుల్కములవలనఁ బరిపోషింపఁబడునప్పుడు, శుల్కగ్రహణముచేత ఆయమూలముల కట్టి హానియుఁ దటస్థింపనప్పుడు, తిండిలేక పస్తుండు ప్రజపై నతివ్యయాత్మకమును, భోగపరాయణమును అగు దేశపరిపాలనమును భరించు భారము పడనప్పుడు, హిందూదేశమాత యొసఁగిన యాతిథ్యమువలనఁ గుబేరులైనవారు దేశపరిపాలనభారవహనమునఁ బాల్గొన నిర్బంధింపఁబడునప్పుడు, పూర్ణప్రతిఫలము ప్రజలకు వచ్చునట్లు హిందూదేశపు టాదాయము వ్యయింపఁబడునప్పుడు, ప్రభుత్వమువారు దరిద్రుల యక్కఱలను గనిపట్టి ప్రజాసేవాబుద్ధితో—అది తమ విహితధర్మమని—ఆయక్కఱలను దీర్చునప్పుడు, పాలనప్రవాహపథములు దేశక్షేమమునకుఁ బ్రతికూలముగాఁ బ్రసరింపనప్పుడు, ఇటు పోవుదమా? అటు పోవుదమా? అను సందేహము పొడముపట్లనెల్లఁ బరిపాలకులు హిందూదేశక్షేమకరమైన మార్గమునే యెన్నుకొని యవలంబించిపోవునప్పుడు—అప్పుడే, యీరాష్ట్రావర్తమున కర్థాభివృద్ధి కలుగఁగలదు. ఆయవ్యయనిర్ణయాధికార మంతయుఁ బ్రజల చేతులలోనికి వచ్చినఁగాని యట్టిపనులు జరుగఁజాలవు. ఈమాటలతోఁ గుమారప్పగా రీవిషయమును ముగించినారు. మనముగూడ నేఁటిప్రసంగ మింతటితో విరమింపఁజేయుదము.

శి—చిత్తము! నమస్కారము!

గు—సుఖీ భవ!

---

# గంగగోవు

కె. అన్నమరాజశర్మగారు

ఓయి కఠినాత్మ నన్ను కసాయివాని
ఇంటివాకిట బంధింప నెంచినావె
ఏ నొనర్చిన యపకార మేమి గలదు
కనవుచే నీటిచే మను పశువు నగుట.

ఇంతకాలంబుఁ బ్రీతి పాలించి కడకు
ముసలితనమున నట్టేట ముంపఁ దలఁతొ
మృత్యుముఖమునఁ బడ విచారింపఁ గాని
దయయు, ధర్మంబు నొకయింతఁ దలఁపవలదొ.

కండ లుండిన యన్నాళ్లు కౌతుకమున
క్షీరపీయూషధారాభిషేచనమున
నీదు బొట్టెల పొట్టల నింపినాను
తలఁపులందెల్ల నీమేలె తలఁచినాను.

క్షీరములఁ గ్రోలి స్తనములఁ జెండినట్లు,
పున్నెమని పోవ పాపంబు వొలసినట్లు,
కటికవానికి నన్ను విక్రయమొనర్ప
అర్థలోభంబు నీమది నలమికొనెనొ.

పుట్టినింటనె గిట్టఁగ బుద్ధి పొడమి
బడుగుదేహంబుతో నెట్లొ బ్రతికియుంటి
కాని నీచిత్తవృత్తిని గాంచనైతి
తేనెఁ బూసిన కత్తివై తేరినావు.

కొడుకులకుఁ దోడు నే జత కూర్చినాను
దుక్కిటెడ్లను పొలమును దున్నుకొఱకు,
పాడిఁ గల నాళ్లు దూడలఁ బాఱఁదోలి
పిదికె నీయాలు కాని నే బెంగఁగొనను.

పూల రువ్విన వారల ఱాల రువ్వఁ
గలదె మానవజాతికిఁ గాక జగతి?
బడుగునై గాఁడి బండల బ్రతుకుచుంట
అది యసహ్యంబె నీ కో దయావిహీన.

ముసలి తలిదండ్రులపయిని విసుగుఁ జెంది
అన్నపానంబు లొసఁగుట వ్యర్థమనుచు
దూరముగఁ బాఱఁదోలెడు దుష్టుఁ డొకఁడె
అన్నివిధముల నీసముఁ డైనవాఁడు!

కండలను గోరువెట్టిన కాలమెల్ల
కామధేనువువలె నన్ను గాదినావు
జవము సత్వమ్ము మెలమెల్ల జాఱిపోవ
ద్వారమున నిల్వ కొఱగాని దాన నైతి.

నేఁటితోఁ దీఱె కర్షకా! నీకు నాకు
భాతి కాయాంతఋణకర్మబంధనంబు,
తనువునుం బాసి, నా యపత్యములఁ బాసి
పోవుచున్నాను నీలోభబుద్ధికతన.

హాలికా! హాలికా! నీ గృహాంగణమును
దడుపుచున్నాను దుఃఖాశ్రుధార లడర
అంత్యసందేశ మొక్కింత యాలకింపు
మానవత్వంబు కారుణ్యమయమటంచు.

అన్న! సైరికా, నాదు ప్రాణార్పణమున
నైన ననుతాపదీప్తుండ వగుచు ముద్దు
బిడ్డలను నీదుసుతులట్ల ప్రీతిఁ గనుము
కన్నకడుపోట యింత పల్కంగవలసె.

---

కాలం అతిత్వరితంగా మారిపోతూంది. ఆగర్భశ్రీమంతశబ్దం అనతికాలంలో అంతరించిపోనుంది. బొడ్డున మాణిక్యం, ముక్కున ముత్యం పెట్టుకుని పుట్టే బిడ్డల సంఖ్య మున్ముందు తగ్గిపోయి తుదకు పూర్ణానుస్వారమవుతుంది. ప్రపంచంలోని నాగరక దేశాల్లో వున్న శాసననిర్మాత లందరూ సాంఘికసమస్యలకేసి దృష్టి తిప్పుతున్నారు. చీలికలూ ఎత్తు పల్లములూ వున్న సంఘాన్ని సరిసమానమైన ఒకచట్రంలో అతకడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. స్వాప్నికరాజ్యం (Utopia) అని కొంతకాలం క్రిందటిదాకా తృణీకరించిన లోకసంస్కరణానికే కొంత ఆకృతి కలుగుతూంది. Communism, Socialism మొదలైనవి అర్థముకాని పెనుభూతములు కాక ఆలోచింపవలసిన సమస్య లవుతున్నాయి.

అరాచకం, దార్ఢ్యం, ప్రపంచంలో సంఘం అంతనీ యేలుతుంది అని కాదు: "అందరిదీ సమస్తమున్నూ; ఎవరిదీ యేదీ కాదు" అనే స్వాతంత్ర్యరహితమైన State Control ఎన్నటికీ ఆచరణీయం కాదు. Cempetition కీ ఉన్నతాశయములకీ తా విచ్చని ఆవిధానం చాలా దుర్మార్గమైంది. సాంఘికజీవనంలో ఔన్నత్యం, ప్రజ్ఞకూ ఓరిమికీ కలిగినట్లు సోమరితనానికీ, త్రాగుబోతుదనానికీ యెన్నడూ కలుగనేరదు. "Survival of the fittest" అనగా అర్హతకే అగ్రస్థానం లభించటం సృష్టిలో సహజం.

అయితే ఇప్పుడు రాదగిన సంస్కరణ యెట్లాంటి దంటే: నిర్వ్యాపారులు నిరాఘాటంగా సౌఖ్యజీవనం చేసేటందుకు, పొట్టనిండని పూటబత్తెముతో చావకుండా బ్రతక్కుండా కష్టపడే కూలిజాతిచేత చాకిరీ చేయిస్తూన్న సంఘవిధానం చచ్చిపోవాలి. భూగర్భంలో సజీవంగా పాతుకుపోయి గంటలకొలదీ వెతికిలా పడుక్కుని కష్టించి, జీవిత శేషం అంతా క్షయవ్యాధిపీడితులై, వారు ప్రసాదించే రాక్షసిబొగ్గు యెవర్ని సుఖపెడుతూంది? అది నిజంగా రాక్షసిబొగ్గే! ప్రాణాలకి తిలోదకాలు విడిచి వారు ఆకాశం అంటుతూ నిర్మించే సౌధాల్లో, వారు తెల్లవార్లూ వింజామర్లు పీచితే కాని నిద్రపట్టని సుకుమారులెవరు?——

"ఆగర్భశ్రీమంతులు!"

ఆమాటయే చెపుతూంది, వారు యెంతవరకూ సంఘంలో తమ స్థానాని కర్హులో. పెట్టిపుట్టే దంటారు——వారుపడ్డశ్రమయూవత్తు యేమిటంటే ధనికుల గర్భవాసాన్ని జన్మించటమే! ఆ తల్లిదండ్రుల qualification కూడా అంతే. దినమంతా విలాసగృహాల్లో కాలం వెళ్లబుచ్చలేక ఆవలిస్తూ పేక్లబ్బులోచూచినా, యే గుఱ్ఱపుపందెంవద్దచూచినా హాజరైపోతూ,

కష్టమన్నది యెరగకుండా జీవితం దుర్భరంచేసుకుంటూన్న సోమరితనం ప్రపంచానికీ, సంఘానికీ యేమి వుపకారిగా వుంది?

ఫ్రాన్సు దేశంలోని ప్రజాసంచలనంవల్ల నూటయాభై యేళ్లక్రిందట సంఘుచట్టం అంతా మారిపోయింది. రత్నగర్భ యనబడు భూవసతిలో ప్రతిమానవుడికీ హక్కు వుంది. అంతే కాని యేకొద్దిమందికో—వారి సంఖ్య పెద్ద దేకానీండి—స్వత్వముండి తక్కినవారికి జేనెడు నేలనైన లేదనుట రాక్షసం. ఒక శతాబ్దినుండి ఫ్రాన్సులో ప్రతివారికీ తగుపాటి భూస్థితి వుంటూంది. భూమి యావత్తు nationalise చేసే రష్యాపద్ధతి కేవలము పాశవం. అంతకంటె దార్ఢ్య మేదంటే, భూవసతివల్ల ప్రస్తుతం యేర్పడివుండే మూఁడు తెగలు:— (1) అందునిమిత్తమగు యేకష్టం పడకుండా ఫలానుభవం పొందే నేలరేడు; (2) అతనినిమిత్తమై భూమిమీద అమలుజరుపుతూ భుక్తశేషం భుజించే పాలికాపు; (3) దేహంలోని సర్వశక్తీ ధారపోసి అందుమీదనే పస్తుపడివుండే పాటకజనం. పదిహేడవశతాబ్దపు ఫ్రాన్సులో యిప్పటిఆంగ్ల దేశంలోవలెనే భూవసతి అంతా లెక్కగా కొందరి అధీనమై వుండేది. ఆ భూస్వాముల కానుపూర్విగా ఆవసతులు జన్మస్వత్వమై వుండేవి. వారిపూర్వులు తమ రాజుల కే యుద్ధాలలో చేసిన సహాయానికిగాను ప్రతిఫలంగా ఆవసతులు లభించేయి. వా రొనర్చిన వీరచర్యలే నేటి మన I. P. C. ప్రకారం అయితే ఆజన్మ ద్వీపాంతరవాసశిక్ష గడించివుండును. అట్లా వసతులు పొందినవారికి కొంతకాలం దాకా బహిరపాయములనుండి దేశాన్ని రక్షించే బాధ్యత వుండేది. అందునిమిత్తమై సైనికదళాలను వారి స్వంతఖర్చుతో తయారుచేసి వుంచేవారు. రానురాను నేల అనుభవిస్తూన్న యీ శ్రీమంతు లందర్నీ ధనప్రాణాపాయం లేకుండా కాపాడటానికయే (Defence) ఖర్చు కూడా జనసామాన్యమే భరించవలసి వచ్చింది. అన్నాతురత దుర్భరమైపోయి, తుదకు సంఘమంతా సంక్షుభిత మైపోయింది.

వోల్టేరు (Voltaire) ఫ్రెంచి దేశమున ఆనాటి కింకను ప్రసిద్ధికి రాని రాజకీయవేత్త. పదిహేనవ లూయీ (Louis XV) పరిపాలిస్తూన్నరోజు లవి. వోల్టేరు ఒకనాడు నాటకాని కెళ్లేడు; ముందుకున్న బాక్సు ఒకటి ఆక్రమించేడు. తర్వాత ధనాంశసంభూతుడైన లాజనుభూస్వామి (Duke of Lauzan) వచ్చేసరికి, నాటకశాలయజమాని అతివినయపూర్వకంగా "ముందుసీట్లు అన్నీ అమ్ముడుపోయేయి" అని పసిగేడు. మట్టిపురుగుకన్న జన్మతః ఔన్నత్యం లేని వోల్టేరుమీద ఆ భూస్వామికటాక్షం ప్రసరించింది. "వాణ్ణి అవతలికి గెంటెయ్యండి" అన్నా డతను. అలాగు జరగడం అప్పట్లో వింత లేదు. Bastille (జైలు) లోకి గెంటినకంటె నయమే యీ ప్రయోగమని యెంచి, వోల్టేరు బయటకి వచ్చేసి, లాజనుమీద అభియోగం తెచ్చేడు. కోర్టు విచారణలో లాజనుతరఫులాయరు ఇట్లా

స్తోత్రపాఠం ఆరంభించేడు:—"లాజను అంటే సామాన్యపుగృహస్థులు కారండి. వీరి ముత్తాత లా రోషెల్లు (La Rochelle) కోట ముట్టడిం చేడు. వీరి తాతగారే (Utrecht) యుట్రెక్టు డచ్చివారివి గస్ఖ క్షిరంగులు స్వాధీనపర్చు కున్నది.........అలాంటి ప్రభుకోటిలోవారు" —అంటూ యేకరువుపెడుతూవుండగా అర్థోక్తిలోనే వోల్టేరు అన్నాడు, "కోర్టువారు మన్నించాలి; నావాదం యావత్తు ఆవీరులు మీాద కాదు. ఈనాటికి, నాటకంలో నే డబ్బిచ్చి కొనుక్కున్న బాక్సుతప్ప, జన్మ యెత్తి మరియేదీ ముట్టడించిమెరగని, యీ లాజను మీాదనే!"

సోమరిభూస్వాముల విషయ మంతా వోల్టేరు చెప్పిన మాటల్లో యిమిడివుంది. రివల్యూషనుకి ఒకశతాబ్దం ముందుగానే మేసిలాన్ (Massilon) అను విజ్ఞుడు వారి భావిపతనం జోస్యంచెప్పేడు. వోల్టేరు, రూసో (Rousseau), పుస్తకాలుకూడా వ్రాసేరు. రూసో వ్రాసిన "Social Contract" చూచి, Idealist యొక్క పిచ్చివ్రాతలని నవ్వుకున్నారు భూస్వాములంతా. కార్లయిలు మోటుగా చెప్పినట్టు, "ఆపుస్తకం రెండవకూర్పునకు భూస్వాముల చర్మమే బైండుకి ఉపయోగించింది." జన్మధనికుల కథఃపతనం వచ్చేసింది. రివల్యూషను మహాప్రవాహంలో నిమ్నోన్నతాలన్నీ సమమట్టమైపోయేయి. అదిమొదలు ప్రారంభించి కర్షకకుటుంబానికి కళ వచ్చింది. కర్షకుడు తనొక శ్రీరక్తజన్ముడైన డ్యూక్కులా నటించడు. అతని భార్యకు డచ్చెస్సు లాగుండాలనే ఆశయం లేదు. వారూ, వారి పొలమూ, వారిపిల్లలూ, సమస్తం అతిఆనందమయంగా తృప్తిగా కనిపిస్తుంది.

ఇట్టి శాంతిసంతోషవాతావరణం అభివృద్ధిచేసిన వేత్తలలో ప్రథముడు ఎర్నెస్ట్ రెనన్ (Ernest Renan). ఇతడుకూడా వోల్టేరులాగే జలజల పోవు సెలయేటివంటి వచన కావ్యాలు వ్రాసినవాడు. అయినను వోల్టేరువలె యెత్తిపొడుపుమాటల (Satire)తో హృదయములను గాయపర్చే కఠినశీలుడు కాడు. వోల్టేరువ్రాతలవల్ల ప్రపంచం బాగుపడడం లేదు. సంఘమందు ప్రేమ రేకెత్తించినవాడు రెనన్. ఇద్దర్నీకూడా నాస్తికులే అన్నారు యితరులు. కాని న్యాయంగా యిద్దరూ పరమాస్తికులే. "దేవుడంటూ యిదివర కొకడు లేకపోతే, ఒకణ్ణి కనిపెట్టాలి మనం" అన్నాడు వోల్టేరు. రెనన్‌యొక్క దేవుడు పరమదయాళువు. లోకుల అకృత్యములకై వారిని కనికరించి ప్రేమిస్తాడు కాని దేవుడు శిక్షించ డని అతనివిశ్వాసం. పురుషసదృశ మగుచేత, స్త్రీసదృశమగు హృదయం, అయోనిజసదృశమగు వ్రాత రెనన్‌లో మిళితమైనవి. అతని వాక్కులు లోకమునకు క్రొత్త ఉత్తేజమును కలిగించినవి.

ధన మార్జించుట నీవు స్వాధీనపర్చుకుంటకు; అంతే కాని ధనమే నిన్ను పిశాచమువలె ఆవహించుటకు గాదు. "ధనమూల మిదం జగ"

త్తనుట కర్థము చాలా మితమైనది. ధనముచేత లోకములో తీరని వాంఛలు కోటానకోట్లు. తృప్తిమితముగా ధనము భోగ్యము కాని,తృప్తి చెందినపైని ధనముకలవాడు ధనమునకు పాలి కాపు. మురికికాల్వలో తప్పత్రాగి పడిపోయి జోగుతూన్న ఒకదొరగా రన్నారట:—

(If I was the blooming Dook of Westminister, I could—not—be—more—drunk—than—I—am) "నేను చక్రవర్తినైనా యింత కంటె సంతుష్టిగా త్రాగలే"నని. రేవతీ ఉద్బో ధించిన ఆర్థికసూత్రానికి ముడిమాట తేల్చిన దతను.

మానవమాత్రు డెన్నటికీ సర్వవిధములా సంపూర్ణుడు కాజాలడు. పూర్ణచంద్రుడిలో మచ్చ దాన్ని మరింత ఆకర్షణీయంగా చేస్తూ న్నట్టు మానవులలోపము లేలోకంలో ప్రేమకు కారణం కలిగిస్తాయి. విశ్వసౌభ్రాత్రానికి ఆశించే భావియుగంలో ప్రతిదానికీ moderation అనగా మితి యేర్పడాలి. నిజమైన సుఖజీవు లెవరంటే కొలదిలో తృప్తి చెంది వుండే వారే. కలిగివుండుట ధనికత్వం కాదు. ఏపాటి మనము త్యజించి సుఖించగలమో, మన మాపాటి ధనికుల మన్నమాట. పాల తడి లేని రొమ్ముతో తల్లి, యేడుస్తూన్న బిడ్డను తృప్తి యివ్వని లాలన చేస్తూవుండగా, పొరుగున భవనంలో బల్లచుట్టూ కుర్చీలలో కూర్చుని కాలక్షేపంకోసం కాఫీలు త్రాగే మని, మన మనుమలతోనో మునిమనుమల తోనో కొన్నిదశల అనంతరం మనం ముచ్చ టిస్తే, వారు మనల్ని మానవజాతిగా భావించ రేమో అని నానమ్మకం!

---

## రమ్యసద్గుణపూర! భారతకుమార!

టి. రంగాచార్యులు గారు

మెల్లమెల్ల దరిఁజేరి మేని గుల్లగఁజేసి కదలని వదలని ఘనపిశాచు
లమృతరసంబట్టు లాదినిజవిషూపి తుదవిషంబుగ మాఱు దుష్టవృత్తు
లాలు బిడ్డలఁగూడఁ నాపదపాల్చేసి భీతిల్లఁజేయు దుర్జాతు లమిత
ధనరాశినైననుఁ దండుగవెట్టించి బిచ్చమెత్తించెడి బ్రముచ్చులగుటఁ
గల్లుసారాయము లను రక్కసులపొంత-కైనఁ బోకుము మఱపుననైన నెప్పుడు
పోతివేఁ దెలియుము చేటు మూడు ననుచు-రమ్యసద్గుణపూర! భారతకుమార!

---

# హిమాలయతీర్థములు

నేలాల సుబ్బారావుగారు

౧

## బదరీనాథము

దీనిని తెలుగుదేశమునందు సాధారణముగా బదరీనారాయణమని పిలుచుచుందురు. హిమాలయ పర్వతములయందలి యడుగడుగు భూమియు దర్శనీయ మనుటకు సందియము లేదు. కాని సమస్తభారతవర్ష మందలి హిందూయాత్రికులకు సేవింపదగిన తీర్థరాజము లిందు గొన్ని కలవు. వానిలో అమరనాథము, కేదార నాథము, బదరీనాథము, గంగోత్రి, యమునోత్రి యను క్షేత్రములు ముఖ్యమైనవి. వీని కేగుటయు మిగుల కష్టమే కాని గమనాగమనములకు కొన్ని సౌకర్యము లేర్పడి యుండుటం జేసి యెట్లో ప్రయాసపడి ఈమీద వచించిన తీర్థములకు మాత్రము నిర్భయముగ బోయి రావచ్చును. వీనియందును బదరీనారాయణమున కేగుట తక్కినవాని కంటె సులభము. కారణ మేమనగా నచటకు బోవు మార్గమం దంతట యాత్రికులు మకాములు జేయుటకు వీలగు స్థానములు దగ్గరదగ్గరగ నేర్పడియున్నవి. ఈ మకాము లచట చట్టీలని పిలువబడుచుండును. బదరీనాథ యాత్రావసరమున సామాన్యముగా మార్గగమనమునలన నలసిన తైర్థికుల నోళ్లనుండి "అగలీ చట్టీ కితనీ దూర్ హై" (ముందువచ్చే చట్టి యెంతదూర మున్నది) అను వాక్యము తరచుగ వినబడుచుండును. మరియు మార్గ మధ్యమున యాత్రికు లప్పుడప్పుడు విశేషించి యెవరైన నచ్చుట సంభవించినచో, "శ్రీ బదరీవిశాలలాల్ జీకీ జయ్", "శ్రీ బదరీనాథజీకీ జయ్," "శ్రీ కేదార నాథస్వామిజీకీ జయ్," "పతితపావనీ కలికలుష నశావనీ శ్రీగంగామయ్యాకీ జయ్," అని యిటులే పరమేశ్వర నామోచ్చారణసహితముగ నుచ్చైస్స్వరముతో జయ కారములు సలుపుచుందురు. ఇందువలన మనస్సున కుల్లా సమును, మార్గాయాసమున కించుక విశ్రాంతియు లభించిన ట్లుండును.

ఈబదరీనాథతీర్థము హరిద్వారమునుండి సుమారు నూటయేనుబది మైళ్లదూరమున, గఢవాల్ జిల్లాలో ఏతన్నామకపర్వతపాదతలమున అలకనందానదీతీర మందు వెలసియున్నది. మరియు నాలుగైదుమైళ్ల పొడవును, రెండుమైళ్ల వెడల్పును గల లోయయం దీక్షేత్ర మున్నదని చెప్పవచ్చును. సముద్రజలోపరిభాగమునుండి యీపట్టణముయొక్క యెత్తు ౧౦,౪౦౦ అడుగులు. కాని బదరీనాథపర్వతాగ్రము ౨౩,౨౧౦ అడుగుల యెత్తు గలిగి, ప్రచండగ్రీష్మర్తుమధ్యకాలమందైనను కరగని హిమానీపటలముల కాకరమై విష్ణుగంగా మున్నగు అలకనందయొక్క ఉపనదులకు జన్మస్థానమై చూపరుల హృదయములకు విస్మయానంద ముల గలుగజేయుచుండును. ఈశిఖరమే కాదు, ఈలోయకు ప్రాకారాకృతిగ నేర్పడియున్న పర్వతశృంగము లన్నియు నింతయే యెత్తు గలిగి, యిటులే హిమానీప్రస్తరములకు నిలయములై యున్నవి. చిన్న చిన్న మొక్కలు తప్ప ఈపర్వతము లన్నియు వృక్షవిహీనములు. కైలాసమానససరోవరములకు బోవుటకు నాలుగు ముఖ్యమార్గములు గలవు. వానిలో నొకటి ౧౮,౦౦౦ అడుగుల ఎత్తు గల మానాఘాటి (Mana Pass) గుండ బోవును. హరిద్వారమునుండి గఢవాల్ జిల్లాలోని శ్రీనగరముమీదుగా మానాఘాటి కేగవలయు నవిన బదరీనాథమునుండనే పోవలయును. ప్రస్తుతబదరికాశ్రమమున కెగువ ౧౦, ౧౨ మైళ్లదూరమున అలకాపురి యుండెనని ప్రసిద్ధి. ఇప్పు డీయలక సకలము ఘనీభూతహిమాచ్ఛాదితమై యున్నది. అలకనందానది యీమంచుగడ్డల యడుగుననుండి ప్రవహించుచు గొంత

దూర మీవలకు వచ్చినతరువాత దృష్టిగోచర మగుచుండును. బదరీనారాయణదేవాలయమున కెనుక ఫర్లాంగు దూరమున గంగ నీటి నానుకొని బ్రహ్మకపాలనామకతీర్థ మున్నది. ఇచట పిండదాన మొనరించినయెడల పితరులు ముక్తి నొందుటచే పిండదాతలు పితౄణముననుండియు ముక్తులగుదురనియు జెప్పుదురు. ఇచట పితరులకు పిండము వైచినవారికి మరల మంత్రయుక్తముగ పితృశ్రాద్ధ మొనరింపవలసిన యవసర ముండదు. ఈకారణము లన్నింటిచేత, అనగా బ్రహ్మకపాల, అలకానగర, మానాఘాటీల సన్నికర్షత్వమువలన, నితిహాసగోచరము కాని సమయమందుగూడ నిచట నొక దివ్యస్థాన ముండియుండవచ్చునని యూహించుట కవకాశము కలదు. జోషీమఠస్థాపనానంతరము శ్రీశంకరాచార్యులవారీబదరీనాథమును స్థాపించి సజాతీయుడగు నంబూరిబ్రాహ్మణుడే యచట ప్రధానార్చకుడుగ నుండునియమము నేర్పరచెనని చెప్పుదురు. ఈనియమపాలన మిప్పటికిని జరుగుచునేయున్నది. ఉత్తరమున శంకరాచార్యులవారి పీఠస్థానమగు జోషీమఠమునకును, బదరీనాథమునకును 19 మైళ్లదూర ముండును. చలికాలమున నీ 19 మైళ్లదూరము నీరు గడ్డగట్టుకొనిపోవుటచే గమనాగమనయోగ్యమై యుండదు. ఇప్పుడు బదరీనాథుని దేవాలయ మున్నచోట ప్రాచీనకాలమునుండియు నెన్నియో కట్టబడినవనియు, నవియన్నియు బర్వతోర్ధ్వభాగములనుండి దొరలివచ్చు మంచుబండలవలన నాశనమైపోవ ఈదేవాలయము నూతనముగ నిర్మింపబడినదనియు జెప్పుదురు. ఈదేవాలయము మీది గోపురము కొంచె మించుమించుగ జగన్నాథదేవాలయగోపురాకృతిని గలిగియున్నది. కాని యంత ఎత్తును, వెడల్పును గాదు. పైభాగ మంతయు బంగారు నీటిపూతగల రేకుల తాపటము గలిగి రెండుమైళ్లదూరమునుండియే యాత్రికబృందములకు ఉల్లాసము గొలుపుచుండును. బదరీనాథకందరాహ్వయసరోవరాంతరాళమున అలకనందానదీనామకమృణాలనాళముపై కెన్నొందు సువర్ణసరోజమోయన నీమందిరము భాసిల్లుచుండును.

హరిద్వారమునుండి ఈదివ్యస్థానమున కేగు మార్గమునందలి ప్రాకృతికసౌందర్యమును స్వయముగ జూచి యానందింపవలయునే కాని మరియొకవిధమున దెలిసికొన గోరుట వ్యర్థము. "తలమే బ్రహ్మకునైన నీనగ మహాత్త్వం బెన్న" అని పెద్దన్న యంతటివారి వచించియుండ నిక దక్కినవారలా, ఈప్రదేశముల నిసర్గరామణీయకమును ఉన్నదాని నున్నట్లు పాఠకులకు సాక్షాత్కరింపచేయగలుగుట? ఉత్తమకావ్యములందలి స్వర్గాదుల వర్ణనమును బఠించుతరుణమున మనస్సున కలౌకికానందము కలుగుట వాస్తవము. కాని ఈహిమాలయపర్వతములందలి దివ్యస్థలముల కేగు భాగ్య మబ్బినయెడల సాక్షాత్తు స్వర్గమున చేరినయట్లే యాహ్లాదము కలుగును. నిజమునకు వీనికంటె భిన్నమగు స్వర్గము లేదనియే చెప్పవచ్చును. కావుననే యేభాషాకవులైన గానిండు, వారివారి గ్రంథములందు స్వర్గాదుల వర్ణింపవలసివచ్చినపుడు ఇచటి యీనిసర్గమనోహరములగు పర్వతప్రదేశములనే, యిచటి యీ "యంబరచుంబిశిరస్సరజ్ఝరీపటలముల"నే, ఇచటి యీ కాదంబినీసమలంకృతదేవదారువనాకీర్ణమహీధరోపత్యకలనే, ఇచటి ఈగంధర్వయక్షకిన్నరాది కన్యకానివహ క్రీడాకలాప మంజులసికతాతలంబులనే, ఇచటి ఈసౌరభోపేత నానావర్ణకుసుమసంతానాకీర్యమాణ కావ్యలావృతకందరావళులనే, ఇచటి ఈరవిద్యోతఘనహిమానీగ్రావసమాక్రాంతజలాశయంబులనే, ఇచటి ఈ యంతర్వాహినీసమూహంబులనే తనివి దీర జిత్రించిరి. అత్యంతప్రాచీనకాలమునుండియు ఋషి, మహర్షి, దేవ, దేవాంగనాసంసేవితమైన దీపవిత్రస్థలము. శరీరముతో స్వర్గమున కేగదలచినవారు బదరీనాథదర్శనమున కేగిన జాలును. అటుతరువాత స్వర్గమున కేగితిమా లేదా యనునిష్కర్షను వారు స్వయముగనే చేసికొనవచ్చును. ఈయాత్ర గావింపుచున్నంతకాలము ప్రతిదినము నూతనప్రదేశావలోకనంబునను, అనంతరము తదీయస్మరణప్రభావంబునను మనస్సున కవర్ణనీయమగు ఆనందము కలుగుచునేయుండును. అది యటులుండ, భిన్నభిన్న జలవాయుసేవనంబున దినదినము శరీరమం దొకనూతనవిస్ఫూర్తి కలుగును. వివిధదేశాగతయాత్రికజనసమావేశము లందు స్వకీయస్థితిగతుల నితరుల స్థితిగతులతోడ సరిపోల్చిచూచుకొనుట

కలకాలము లభించును. తన్మూలమున గలుగు శిక్షణము ఇంటికడ గూర్చుండి పదిసంవత్సరము లధ్యయనము చేసినను గలుగజాలదు. మనసు కుదిరినచోట కొన్ని దినములు నివసించి యానంద మనుభవింప వచ్చును. గంగాప్రపాతసాన్నిధ్యంబును, నేత్రానందకర నానావర్ణసుగంధపుష్పసమాకీర్ణంబును, నిర్జనసాంద్రారణ్యసంవృతంబును నగు నేకాంతప్రదేశమున గొన్ని దినము లుండిన జాలును, దేహమనోబుద్ధీంద్రియములు మాలిన్యరహితములై ప్రకాశింపదొడగును. మరియు నట్టిప్రదేశములందు వాసము చేయునతనికి ఎట్టి దుస్స్వాస్థ్యము రోగ ముండినను కొలదిదినములందే నయమగును. అసలే ఆరోగ్యవంతులగు వారికి సాక్షాత్తు అధ్యాత్మవిద్యాప్రాదుర్భావమే కలుగును. కావున మానవజన్మ మెత్తినంగులకు దరిద్రులు గాని ధనాఢ్యులు గాని ఆబాలవృద్ధముగ స్త్రీపురుషలందరు కనీస మొక్కపర్యాయమైన అట్టి రమణీయ స్థానముల దర్శించుట ధర్మమనియు, జీవితమందలి ముఖ్యకర్తవ్యములలో నొకటియనియు దలంపవలయును. ఈక్షేత్రమునకు బోవలయునని యొక్కపర్యాయము సంకల్పించుకొన్న జాలును, దైవానుగ్రహమున నట్టి భాగ్య మెప్పటికైన లభించియేతీరును.

కాని సర్వసాధారణముగా భారతీయు లనేకులు ఈయాత్ర గావించుట చాల కష్టమని భావించుచుందురు. అందులకు గొన్ని కారణములును గలవు. రైలుమార్గముతో సంబంధము లేకపోవుట యొకటి. అగమ్యములగు పర్వతారణ్యములమధ్య ఉనికి. ధారాసంపాతముగ వర్షము కురియుటచే బర్వతపార్శ్వములు విరిగి నెత్తిమీద గూలుననియు, పైనుండి బండలు జారి మీదబడుననియు, మంచుగడ్డలమీదనుండి దొరలి యాత్రికులు గంగలో బడుదురనియు, భరింప శక్యము గాని చలిచలనకే ప్రాణము లెగిరిపోవుననియు జను లాడుకొను కింవదంతులు. ఇట్టివేయగు కారణము లనేకములు గలసి ప్రబలయాత్రాభిలాషులనుగూడ వెనుకంజ వేయించుచుండును. అట్టివారి భ్రమనివారణార్థమే ఈలేఖ వ్రాయుటమైనది. ఇట్టికష్టములు పూర్వకాలమం దెప్పుడైన నుండెనేమో కాని యిప్పు డెంతమాత్రము అట్టివి సంభవించునని యెంచగూడదు. ప్రస్తుతము ప్రభుత్వము వారి పక్షమున పోస్టాఫీసులు, టెలిగ్రాఫ్ఆఫీసులు, ఆస్పత్రులు, పోలీసుస్టేషనులు, నదులమీద సస్పెన్షన్ వంతెనలు, ఇన్స్పెక్షన్ బంగాళాలు మున్నగునవి నిర్మింపబడియున్నవి. జనుల ఆరోగ్యమును, మార్గమందలి పారిశుద్ధ్యమును, వర్తకు లమ్మునట్టి వస్తువుల మంచిచెడుగులను బరీక్షించుటకుగాను యాత్రాకాలమున సానిటరీ ఇన్స్పెక్టర్లు నియోగింపబడుచుందురు. హరిద్వారమునుండి 14 మైళ్ల దూరమున హృషీకేశము మరియొక పవిత్రస్థానము కలదు. అందు కాలీకమలీబాబానామక సాధువు స్థాపించిన మఠ మున్నది. ఈమఠముయొక్క కార్యనిర్వాహకులు ఇందునిమిత్తమే సంగ్రహించిన ధనముతో మార్గము పొడుగునను గొన్ని విశేషస్థానములందు ధర్మశాలలను, చలివేంద్రలను, ఔషధాలయములను, అభ్యాగతులగు సాధువుల నిమిత్తము అన్నక్షేత్రములను స్థాపించియున్నారు. యాత్రికు లీ ధర్మశాలలం దెన్ని దినములైన నుండవచ్చును. కాని యిందులకు గాను ఆ మఠమువా రిచ్చు సాంకేతికపుచీట్లను హృషీకేశమునందే వారినుండి తీసికొనవలయును. ఇందునిమిత్తము ధనమును వెచ్చింప నవసరము లేదు. యాత్రికులు శక్త్యనుసారము మఠమునకు దానరూపముగ నించుక నేమైన నొసంగినజాలును. ఇచ్చినదానికి ఏబదిరెట్లు ఎక్కువ లాభమును వారినుండి పొందవచ్చును. మార్గమధ్యమం దవసరము కలిగిన నుపయోగించుకొనుటకు మందుల సైతము వీరు ఉచితముగ నొసగుదురు. సర్కారువారి యొక్కయు, మఠమువారియొక్కయు నేర్పాటు లిటులుండ రెండుమూడుమైళ్ల యంతరమున పరిశుభ్రముగ నుండు చట్టీలు నిర్మింపబడియున్నవి. చట్టీలనగా దిగుటకు మకాములని యిదివరకే వ్రాయబడినది. వీనికి పడావులనియు పేరు గలదు. ఈచట్టీలయందు ఒక్కొక్క వణిజుడు ఒక్కొక్క శాలను గట్టుకొని యందొకమూల భోజనపదార్థముల యంగడి పెట్టికొనియుండును. యాత్రికు లేశాలయందు మకాము చేయుదురో దాని యజమానియగు వర్తకునివద్దనే తమకు గావలసిన పదార్థములను గొనవలయును. వంటకు గావలసిన పాత్రములు

గూడ వీరినుండియే దొరకును. శుభ్రములగు పాత్రలను దీసికొని భోజనానంతరము వాటిని శుభ్రపరచి యిచ్చి వేయవలయును. ఒకశాలయందు దిగి వేరొక శాలావర్తకునివద్ద నేమియు గొనగూడదు. ఇది యిచటి మర్యాద. ఒకవేళ తెలియక ఎవరైన నట్టిపనిని జేయ నెంచినను ఆ రెండవశాలాధికారి అతని కేమియు నొసంగడు. అంగడులందు సాధారణముగా బియ్యము, గోధుమపిండి, నెయ్యి, పప్పులు, ఉప్పు మిరపకాయలు, బంగాళాదుంపలు దొరకును. శ్రీనగరమువంటి పట్టణములలో నితరశాకములుగూడ గొన్ని దొరకవచ్చును. దాక్షిణాత్యులకు చింతపండు దొరకుట కష్టము. పాలు పెరుగులు కొన్ని చట్టీలయందుమాత్రమే దొరకును. మార్గమంతయు మోదుగు చెట్లతో నిండియుండుటచే మనకు వచ్చినయాకుల గోసికొని యిష్టము వచ్చినన్ని విస్తళ్లను గుట్టికొనవచ్చును. కాని కుట్టుపుల్లలను హరిద్వారమందే సేకరించికొనవలయును. బదరీనాథమందు భూర్జపత్రములే విస్తళ్లు.

ఈపైన వచించిన స్థానములు గాక సజ్జనులగువారు నిర్మించిన ధర్మశాలలు చలివేంద్రలు మొదలగునవి ఆయా చట్టీలయందలి పండాల యధీనములలో నున్నవి. వీనియందును దిగి మకాము జేయవచ్చును కాని పండాలలో మెలగుటయందు కడు జాగరూకులై యుండవలయును. ఇవి కాక సేవాసమితివారు ప్రధానస్థానములందు కేంద్రముల నేర్పరచుకొని యాత్రికులకు సమస్తవిధముల దోడ్పడ ప్రయత్నించుచున్నారు. స్వార్థరహితమై హార్దికమై యున్నట్లు దోచినయెడల వీరినుండి సేవగొనుటయు నుచితమే.

జోషీమఠము మొదలుకొని బదరీనాథమువరకు గల మార్గమంతయు జలికాలమున మంచుగడ్డలచే నిండిపోవుటవలన నప్పుడాత్రోవయంతయు మూయబడియుండును. మరల నిది వైశాఖమాసమున గమనార్హమగును. అప్పటికి దారులందు బడియుండు మంచుగడ్డలు వానియంత నవియే కరగిపోవును. అట్లుగానిచో నా దేవాలయముయొక్క సర్వాధికారియగు రావల్ సొంతవ్యయముతో మార్గమునంతటిని బాగుజేయించును. అప్పటికే జోషీమఠమున వేలకొలది యాత్రికులు సమావేశమై కనిపెట్టికొనియుందురు.

కాలము మంచిదైనచో హరిద్వారమునుండి బదరీనాథమువరకు వచ్చి మరల హరిద్వారము జేర్చుటకు ఒక మణుగుబరువు మోయుకూలీకి రు ౪౦ మొదలు రు ౫౦ వరకు నీయవలసియుండును. నడువలేని యాత్రికులను మోసికొనిపోవుటకు దండీలు, డోలీలను వాహనము లుండును. ఈవాహనములందలి హెచ్చుతగ్గుల ననుసరించి ప్రతిమనుష్యునకు రు ౫౦ మొదలుకొని రు ౨౦౦ ల వరకు సెలవు చేయవలసియుండును. ఈకూలీలు, డోలీలు మొదలగువాని యేర్పాట్లు హృషీకేశముదగ్గరనున్న మునీ కీ రేతీ నామకస్థలమున నగుచుండును. యాత్రికు లిక్కడనుండియో, లేక హరిద్వారమున బాగుగ నమ్మకముగలవారి తోడ్పాటుననో కూలీల నేర్పాటుచేసికొనవలయును. స్వయముగ నెవనినైన నేర్పరచుకొనినచో మార్గమధ్యమున లేనిపోని కష్టముల నొందవలసివచ్చును. ఇట్టి కూలీవాలీలకును, దానధర్మాదులకును గాక ప్రతిమనుజునకు దినమునకు హీనపక్షము పదియణాలు భోజనమున కగును. శక్తి యున్నచో నింత కెక్కువ ఎంతవ్యయము జేసికొనినను చేసికొనవచ్చును.

జోషీమఠము మొదలుకొని యందును ముఖ్యముగ బదరీనాథమందు జలి యెక్కువగ నుండును. అచట ధరించుటకును, శయనించుటకును గావలసిన వస్త్రములతోపాటు రెండుకంబళ్లను దప్పక ఉంచికొనవలయును. జోషీమఠమున కీవల హరిద్వారమువైపునకు వచ్చినకొలది వేడిమి యెక్కువగుచుండును. ఎండ కాయుచుండెనేని మార్గమం దసహ్యముగ నుండును. భోజనపదార్థము లెక్కడబట్టిన నక్కడ దొరకుటంజేసి వ్యర్థముగ భారము మోసికొనిపోవలసిన యవసరము లేదు.

మరియు యాత్రికు లీనిమ్నలిఖితవిషయములను మనసునం దిడుకొని తదనుసారముగ నడచుకొన ప్రయత్నింపవలయును. అందువలన సాధ్యమైనంతవరకు మార్గ

కవకాశము లభించును. తన్మూలమున గలుగు శిక్షణము ఇంటికడ గూర్చుండి ప్రతిసంవత్సరము అధ్యయనము చేసి నను గలుగజాలదు. మనసు కుదిరినచోట కొన్నిదిన ములు నివసించి యానంద మనుభవింప నచ్చును. గంగా ప్రవాహసాన్నిధ్యంబును, నేత్రానందకరనానావర్ణసుగం ధపుష్పసమాకీర్ణంబును, నిర్జనసాంద్రారణ్యసంవృతంబును నగు నేకాంతప్రదేశమున గొన్నిదినము లుండిన జాలును, దేహమనోబుద్ధీంద్రియములు మాలిన్యరహితములై ప్రకా శింపదొడగును. మరియు నట్టిప్రదేశములందు వాసము చేయువానికి ఎట్టి దుస్సాధ్యమగు రోగ ముండినను కొలదిదినములందే నయమగును. అసలే ఆరోగ్యవంతు లగు వారికి సాక్షాత్తు అధ్యాత్మవిద్యాప్రాదుర్భావమే కలుగును. కావున మానవజన్మ మెత్తినవారలకు దరిద్రు లు గాని ధనాఢ్యులు గాని ఆబాలవృద్ధముగ స్త్రీపురుషు లందరు కనీస మొక్కపర్యాయమైన అట్టి రమణీయ స్థానముల దర్శించుట ధర్మమనియు, జీవితమందలి ముఖ్యకర్తవ్యములలో నొకటియనియు దలంపవల యును. ఈక్షేత్రమునకు బోవలయునని యొక్కపర్యా యము సంకల్పించుకొన్న జాలును, దైవానుగ్రహమున నట్టి భాగ్య మెప్పటికైన లభించియే తీరును.

కాని సర్వసాధారణముగా భారతీయు లనేకులు ఈయాత్ర గావించుట చాల కష్టమని భావించుచుందురు. అందులకు గొన్ని కారణములును గలవు. రైలుమార్గ ముతో సంబంధము లేకపోవుట యొకటి. అగమ్యములగు పర్వతారణ్యములమధ్య ఉనికి. ధారాసంపాతముగ వర్షము కురియుటచే పర్వతపార్శ్వములు విరిగి నెత్తి మీద గూలుననియు, పైనుండి బండలు జారి మీదబడు ననియు, మంచుగడ్డలమీదనుండి దొరలి యాత్రికులు గంగలో బడుదురనియు, భరింప శక్యము గాని చలివల ననే ప్రాణము లెగిరిపోవుననియు జను లాడుకొను కింవదంతులు. ఇట్టివేయగు కారణము లనేకములు గలసి ప్రబలయాత్రాభిలాషులనుగూడ వెనుకంజ వేయించు చుండును. అట్టివారి భ్రమనివారణార్థమే ఈలేఖ వ్రాయుడమైనది. ఇట్టికష్టములు పూర్వకాలమం దెప్పు డైన నుండెనేమో కాని యిప్పు డెంతమాత్రము అట్టివి సంభవించునని యెంచగూడదు. ప్రస్తుతము ప్రభుత్వము వారి పక్షమున పోస్టాఫీసులు, టెలిగ్రాఫ్ఆఫీసులు, ఆస్పత్రులు, పోలీసుస్టేషనులు, నదులమీద సస్పెన్షన్ వంతెనలు, ఇన్స్పెక్షన్ బంగాళాలు మున్నగునవి నిర్మింపబడియున్నవి. జనుల ఆరోగ్యమును, మార్గమందలి పారిశుద్ధ్యమును, వర్తకు లమ్మునట్టి వస్తువుల మంచి చెడుగులను బరీక్షించుటకుగాను యాత్రాకాలమున సాని టరీ ఇన్స్పెక్టర్లు నియోగింపబడుచుందురు. హరిద్వార మునుండి 14 మైళ్లదూరమున హృషీకేశమను మరియొక పవిత్రస్థానము కలదు. అందు కాలీకమలీబాబానామక సాధువు స్థాపించిన మఠ మున్నది. ఈమఠముయొక్క కార్యనిర్వాహకులు ఇందునిమిత్తమే సంగ్రహించిన ధన ముతో మార్గము పొడుగునను గొన్నివిశేషస్థానములందు ధర్మశాలలను, చలివేంద్రలను, ఔషధాలయములను, అభ్యాగతులగు సాధువుల నిమిత్తము అన్నక్షేత్రములను స్థాపించియున్నారు. యాత్రికు లీధర్మశాలలం దెన్ని దినములైన నుండవచ్చును. కాని యిందులకు గాను ఆ మఠమువా రిచ్చు సాంకేతికపుచీట్లను హృషీకేశమునందే వారినుండి తీసికొనవలయును. ఇందునిమిత్తము ధనమును వెచ్చింప నవసరము లేదు. యాత్రికులు శక్త్యనుసా రము మఠమునకు దానరూపముగ నించుక నేమైన నొసంగినజాలును. ఇచ్చినదానికి ఏబదిరెట్లు ఎక్కువ లాభమును వారినుండి పొందవచ్చును. మార్గమధ్యమం దవసరము కలిగిన నుపయోగించుకొనుటకు మందుల సైతము వీరు ఉచితముగ నొసగుదురు. సర్కారువారి యొక్కయు, మఠమువారియొక్కయు నేర్పాటు లిటు లుండ రెండుమూడుమైళ్ల యంతరమున పరిశుభ్రముగ నుండు చట్టీలు నిర్మింపబడియున్నవి. చట్టీలనగా దిగు టకు మకాములని యిదివరకే వ్రాయబడినది. వీనికి పడావులనియు పేరు గలదు. ఈచట్టీలయందు ఒక్కొక్క వణిజుడు ఒక్కొక్క శాలను గట్టుకొని యందొకమూల భోజనపదార్థముల యంగడి పెట్టికొనియుండును. యాత్రికు లేశాలయందు మకాము చేయుదురో దాని యజమానియగు వర్తకునివద్దనే తమకు గావలసిన పదార్థ ములను గొనవలయును. వంటకు గావలసిన పాత్రములు

గూడ వీరినుండియే దొరకును. శుభ్రములగు పాత్రలను దీసికొని భోజనానంతరము వాటిని శుభ్రపరచి యిచ్చి వేయవలయును. ఒకశాలయందు దిగి వేరొక శాలావర్తకునివద్ద నేమియు గొనగూడదు. ఇది యిచటి మర్యాద. ఒకవేళ తెలియక ఎవరైన నట్టిపనిని జేయ నెంచినను ఆ రెండవశాలాధికారి అతని కేమియు నొసంగడు. అంగడులందు సాధారణముగా బియ్యము, గోధుమపిండి, నెయ్యి, పప్పులు, ఉప్పు మిరపకాయలు, బంగాళాదుంపలు దొరకును. శ్రీనగరమువంటి పట్టణములలో నితరశాకములుగూడ కొన్ని దొరకవచ్చును. దాక్షిణాత్యులకు చింతపండు దొరకుట కష్టము. పాలు పెరుగులు కొన్ని చట్టీలయందుమాత్రమే దొరకును. మార్గమంతయు మోదుగు చెట్లతో నిండియుండుటచే మనసునకు వచ్చినయాకుల గోసికొని యిష్టము వచ్చినన్ని విస్తళ్లను గుట్టికొనవచ్చును. కాని కుట్టుపుల్లలను హరిద్వారమందే సేకరించికొనవలయును. బదరీనాథమందు భూర్జపత్రములే విస్తళ్లు.

ఈపైన వచించిన స్థానములు గాక సజ్జనులగువారు నిర్మించిన ధర్మశాలలు చలివేంద్రలు మొదలగునవి ఆయా చట్టీలయందలి పండాల యధీనములలో నున్నవి. వీని యందును దిగి మకాము జేయవచ్చును కాని పండాలలో మెలగుటయందు కడు జాగరూకులై యుండవలయును. ఇవి కాక సేవాసమితివారు ప్రధానస్థానములందు కేంద్రముల నేర్పరచుకొని యాత్రికులకు సమస్తవిధముల దోడ్పడ ప్రయత్నించుచున్నారు. స్వార్థరహితమై హార్దికమై యున్నట్లు దోచినయెడల వీరినుండి సేవగొనుటయు నుచితమే.

జోషీమఠము మొదలుకొని బదరీనాథమువరకు గల మార్గమంతయు జలికాలమున మంచుగడ్డలచే నిండి పోవుటవలన నప్పు డాత్రోవయంతయు మూయబడియుండును. మరల నిది వైశాఖమాసమున గమనార్హమగును. అప్పటికి దారులందు బడియుండు మంచుగడ్డలు వానియంత నవియే కరగిపోవును. అట్లుగానిచో నా దేవాలయముయొక్క సర్వాధికారియగు రావల్ సొంతవ్యయముతో మార్గమునంతటిని బాగుజేయించును. అప్పటికే జోషీమఠమున వేలకొలది యాత్రికులు సమావేశమై కని పెట్టికొనియుందురు.

కాలము మంచిదైనచో హరిద్వారమునుండి బదరీనాథమువరకు వచ్చి మరల హరిద్వారము జేర్చుటకు ఒక మణుగుబరువు మోయుకూలీకి రు ౪౦ మొదలు రు ౫౦ వరకు నీయవలసియుండును. నడువలేని యాత్రికులను మోసికొనిపోవుటకు దండీలు, డోలీలను వాహనము లుండును. ఈవాహనములందలి హెచ్చుతగ్గుల ననుసరించి ప్రతిమనుష్యునకు రు ౫౦ మొదలుకొని రు ౨౦౦ ల వరకు సెలవు చేయవలసియుండును. ఈకూలీలు, డోలీలు మొదలగువాని యేర్పాట్లు హృషీకేశముదగ్గరనున్న మునీ కీ రేతీ నామకస్థలమున నగుచుండును. యాత్రికు లిక్కడనుండియో, లేక హరిద్వారమున బాగుగ నమ్మకముగలవారి తోడ్పాటువనో కూలీల నేర్పాటుచేసికొనవలయును. స్వయముగ నెవనినైన నేర్పరచుకొనినచో మార్గమధ్యమున లేనిపోని కష్టముల నొందవలసివచ్చును. ఇట్టి కూలీవాలీలకును, దానధర్మాదులకును గాక ప్రతిమనుజునకు దినమునకు హీనపక్షము పదియణాలు భోజనమున కగును. శక్తి యున్నచో నింత కెక్కువ ఎంతవ్యయము జేసికొనినను చేసికొనవచ్చును.

జోషీమఠము మొదలుకొని యందును ముఖ్యముగ బదరీనాథమందు జలి యెక్కువగ నుండును. అచట ధరించుటకును, శయనించుటకును గావలసిన వస్త్రముల తోపాటు రెండుకంబళ్లను దప్పక యుంచికొనవలయును. జోషీమఠమున కీవల హరిద్వారమువైపునకు వచ్చినకొలది వేడిమి యెక్కువగుచుండును. ఎండ కాయుచుండెనేని మార్గమం దసహ్యముగ నుండును. భోజనపదార్థము లెక్కడబట్టిన నక్కడ దొరకుచుంటచే వ్యర్థముగ భారము మోసికొనిపోవలసిన యవసరము లేదు.

మరియు యాత్రికు లీనిమ్నలిఖితవిషయములను మనసునం దిడుకొని తదనుసారముగ నడచుకొన ప్రయత్నింపవలయును. అందువలన సాధ్యమైనంతవరకు మార్గ

"బాబూ! నాస్థితి చూడండి, ఒక్క పుస్తకం చదివేవరకుఅయినా నేను బతికి బండ వేసుకుంటానా?" అన్నాడు. పాపం! పండితులు ముఖాలు చిన్నబుచ్చుకొని అంతా ఒకచోట గుమికూడి బాగా ఆలోచించుకొని కొన్ని పేజీల పుస్తకం రాసుకొని రాజుగారివద్దకు బయలుదేరారు. సింహద్వారందగ్గరికి వెళ్లేసరికి మంత్రి ఎదురుగా వచ్చి, "అయ్యా! త్వరగా రండి. రాజుగారి సంగతి తలక్రిందులుగా ఉంది. భూలోకరహస్యం తెలుసుకోవాలనే ఆశ అధికంగా ఉండబట్టి ఆయన ఇంకా జీవించిఉన్నాడు. లేకుంటే ఎప్పుడో ఎగిరేవాడే." అన్నాడు. ఆమాట వినడంతోటి పండితులంతా పరుగుపరుగున రాజుగారి గదిలోకి వెళ్లి తాము రాసితెచ్చిన పుస్తకం చదవడం మొదలెట్టారు. రాజుగారు అది చూసి,

"ఉశ్ అబ్బా! పరలోకప్రయాణసన్నాహంలో ఉన్న నన్ను ఇంకా ఎందుకు విసిగించి చంపుతారు. చాతనైతే మూడుమాటల్లో భూలోకరహస్యం చెప్పి ముగించండి." అన్నాడు. పండితులు గాభరాపడి ఒకరిముఖాలు ఒకరు చూసుకోవడం ప్రారంభించారు. అవసానదశలో రాజుగారి కోరిక తీర్చలేకపోతిమే అని అక్కడ ఉన్నవాళ్లంతా విచారపడ్డారు. అది చూసి రాజుగారి మంచంవద్ద కనిపెట్టుకొనిఉన్న ముసలిదాసి,

"అబ్బే! ఇంతమాత్రానికేనా ఇంత గాభరాపడ్డారు? ఏముంది? గాడిదగుడ్డు. పుట్టు - బ్రతుకు - చావు - ఇంతేకదా భూలోకరహస్యం?" అన్నది. అది విని పండితులు తలలు నేలకు కొట్టుకున్నారు. రాజుగారు నిశ్చింతగా ప్రాణాలు విడిచారు.

కథ కంచానికీ, మనం మంచానికీ.

—వి. ఆర్. ఆర్.

---

## విధి

"రాజు"

ఓపల్లెటూళ్లో ఒకపూజారి. ఆయనకు ఓహంస ఉంది. రోజూ శివుణ్ణి పూజచేసి ఇంటికి వచ్చేసరికి హంస చక్కా— నాట్యమాడుతూండేది. ఒకరోజున పూజారి గుడినుండి వచ్చేసరికి అది నాట్యమాడకుండా విచారంతో ఒకమూల పడుకునిఉంది. ఉంటే పూజారి దాన్ని చూచి కారణం అడిగేడు. అది ఏడుస్తూ, తను ఆఉదయాన్నే నాట్యమాడుతూండగాయమభటులు ఆకాశంమీద పోతూ, 'అయ్యో, ఇది ఇంకా పదిఘడియలసేపేకదా ఆడుకునేది' అని అని పోయారని చెప్పింది.

"అంతేకదా, శివుడు మనవాడే చావుకు భయపడతావేమిటి" అని పూజారి ధైర్యం చెప్పి గుళ్లోకి వెళ్లి శివుని ఓకొంతసేపు ధ్యానించాడుట. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమనగానే పూజారి తనహంసను రక్షించమని వేడుకు

న్నాడు.శివుడు "అది నాచేతులో లేదోయి,పోయి బ్రహ్మా నడుగుదాం రా" అని పూజారిని బ్రహ్మ దగ్గరికి తీసుకొనివెళ్లేడు. అక్కడ బ్రహ్మకు కూడా చెప్పుకొని బతిమాలుకుంటే అది తనచేతులో లేదని, విష్ణువుచేతులో ఉందని చెప్పాడు. అంతే, బ్రహ్మ, శివుడు కలసి పూజారితో విష్ణువుదగ్గరకు వెళ్లేరు. విష్ణువు తనచేత కూడా కాదని చింతించి, యమధర్మరాజు దగ్గరకు వెడదాము అన్నాడు. ఆపైని త్రిమూర్తులు ఆపూజారిని తీసుకొని యముడుదగ్గరకు వెళ్లేరు. త్రిమూర్తులు రాకరాక రావడంచేత యముడు ఏమి ముంచుకువచ్చిందో అని భయపడ్డాడు. పూజారికథ చెప్పి సహాయం చేయుమని త్రిమూర్తులు అన్నారు. ఆయుస్సు ఎంత ఉందో నాకుజ్ఞాపకం లేదు. లెక్కలు వెదికించి చూస్తాను అన్నాడు యముడు చిత్రగుప్తుడు లెక్కలు చూచినాడు. అందులో 'పూజారిహంస త్రిమూర్తులు కలిసేక్షణంలో చచ్చిపోతుంది' అని ఉంది. వాళ్లంతా తెల్లపోయారు: 'త్రిమూర్తులము కూడా విధిని తప్పించలేకపోయాముకదా!'

కథ కంచికీ, మనం ఇంటికీ.

---

## పాత పాటలు

గోపరాజు రాజన్నగారు

౧

తాతా తడిపాతా
నీకోచీగుడ్డ చిల్లు
గోడమీద బల్లి
నువు రాసుకొన్న రాత
నే నేమి చేతును తాత.

౨

చిలకపిట్ట చెల్లామన్నాది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టా నన్నాది
మామ తెచ్చిన మల్లెపువ్వులు ముడువ నన్నాది
మొగుడు తెచ్చిన మొగిలిరేకు పెట్ట నన్నాది
మొగుడుచేత మొట్టికాయలు తింటా నన్నాది.

౩

చింతకాయ బొంతకాయ
చిగురుమామిడికాయ
కోనేటి వంకాయ
కొమ్మనిమ్మనిపండు
జీలుగులు తోటలో
వాలుగులు మెయ్యగా
వంటిపూ రాలగా
తొటాకు దబ్బనం
కోట గట్టించగా
కోటలో వున్నాది
తాంబేలు పిల్ల
మహారాజు కూతురు.

---



అద్భుతభావచిత్రణము

ఏయిలీన్ రిగ్గిన్ అను నర్తకి

ఈమె చతుర యువ యువతి. నర్తనమునను, గానమునను మిగుల ఖ్యాతిని గనినది.

—G. S. A.



ప్రణయకులాయము

క్రొత్తపెండ్లాడిన దంపతులు దీన ప్రవేశింప నున్నారు. ఒక మహావృక్షము క్రింద సుందరమయిన చిన్నవీడు.

—G. S. A.



## కమ్మిపని

కో. నరసింహాచారిగారు

### చిన్న ఉట్టిని చేయుట

కమ్ములతో ననేకవిధములగు ఉపయోగకరములైన వస్తువులను చేయవచ్చును. వాటిలో ఉట్టిని చేయువిధము ఇచ్చట చెప్పబడును. కమ్మిపనికి ముఖ్యముగా కావలసిన పనిముట్టు ఒక పట్టుకారు. పట్టుకారు కమ్మిని వంచుటకును, తెంచుటకును ఉపయోగ పడునదిగా నుండిన బాగు. అట్టి కారును cut plier అందురు (చిత్రము ౧.). కమ్మిని వంచవలెనన్న దానిని కారుయొక్క నోటికొనయందు (చిత్రము ౧, క వద్ద) ఉంచి కారుతో వంచుకొనవచ్చును. కమ్మిని తెంచవలెనన్న దానిని కారుయొక్క కీలుకు సమీపమున (చిత్రము ౧, గ వద్ద) ఉంచి కారును అదిమినయెడల కమ్మి తెగిపోవును.

### ఉట్టిని చేయు విధము

మొట్టమొదట కమ్మియొక్క కొనలను వంచుకొనుట తెలిసికొనవలెను. చిత్రము ౨. లోని అ అను కమ్మిని దీసికొని దాని కొనలను ఆ అనుచోట నుండువిధముగ వంచుకొనవలెను. పిమ్మట కారును చిత్రము ౨. ఆ యందు ర వద్ద పట్టుకొని కొంచెము వెనుకకు వంచినయెడల ఇ వద్ద నుండువిధమున ఏర్పడును. ఇ యందలి కొనల వంపులు ఒకే వాటము (plane) న నున్నవి. అట్లు కాక ఒక కొనయందలి వంపును ఉ వద్ద నుండువిధమున నిలువు వాటమునను, రెండవ కొనయందలి వంపును ఊ వద్ద నుండు విధమున అడ్డవాటమునను కూడ వంచుకొనవచ్చును.

ఆరంగుళముల నిడివి గల కమ్మిని తీసికొని దాని కొనలను ఇ వద్ద నుండువిధముగా వంచుకొనవలెను. పిమ్మట కమ్మి నంతయు జ యందువలె వలయముగా వంచుకొని, కొనలయందలి వంపుల నొకదానిలో నొకటి దూర్చి బిగించవలెను. పిమ్మట ఎనిమిది అంగుళముల కమ్ములను ఆరింటిని దీసికొని వాటి కొనలన్నిటిని ఇ యందువలె వంచుకొనవలెను. తర్వాత ఒక్కొక్క తునుకను చ యందువలె

వంచుకొనవలెను. చ యందలి త ద అను కొనల మధ్యగలదూరము, జ అను వలయములో మూడవభాగము నకు అనగా నన అనుదూరమునకు సమముగా నుండవలెను.




చిత్రము ౪ లో జూపినవిధముగ చ అను కమ్ములను జ అను వలయమునకు బిగించవలెను. ఇట్లు చేయుటలో మొదట మూడు కమ్ములను ఎ, ఏ, ఐ, అనువిధముగ బిగించవలెను, తర్వాత మిగిలిన మూడు కమ్ములను ఒ, ఓ, ఔ, అనుచోటులందు బిగించవలెను. అప్పుడు ల, ల, ల, అను చోటులందు కమ్ములొకదానిపైనొకటిపడును.

జ యందలి వలయమునకన్న కొంచెము పెద్దదగు మరియొక వలయమును చేసికొనవలెను. పిమ్మట చిత్రము ౪ లోని కమ్ములను చిత్రము ౫లోనిరీతిగ పైకి చేరతీసికొని ముందు చేసికొనిన పెద్దవలయమును వంపుకమ్ముల వెలుపల పెట్టుకొని(చిత్రము 3,ప) ల,ల,ల, అనుచోటులందు వంపుకమ్ములను వలయమునకు సన్ననితంతికమ్మితో కట్టవలెను. పిమ్మట చిత్రము౪లో|నుండురీతిగ నొక కమ్మిని వంచుకొని దానికి చిత్రము ౨ లోని ఇ వంటి కమ్ములను మూటిని చిత్రము ౬ నందలి విధముగ బిగించవలెను. ఈమూడుకమ్ములను ఉట్టి యందలి ఎ, ఏ, ఐ, అను మూడు వంపులకు గాని, ఒ, ఓ, ఔ, అను కమ్ములకుగాని చిత్రము 3 నందు వ వద్ద చూపినవిధముగ బిగించవలెను. అపుడు ఉట్టి పూర్తియగును.



---

వంచుకొనవలెను. చ యందలి త ద అను కొనల మధ్యగలదూరము, జ అను వలయములో మూడవభాగము నకు అనగా నన అనుదూరమునకు సమముగా నుండవలెను.




చిత్రము ౨ లో జూపినవిధముగ చ అను కమ్ములను జ అను వలయమునకు బిగించవలెను. ఇట్లు చేయుటలో మొదట మూడు కమ్ములను ఎ, ఏ, ఐ, అనువిధముగ బిగించవలెను, తర్వాత మిగిలిన మూడు కమ్ములను ఒ, ఓ, ఔ, అనుచోటులందు బిగించవలెను. అప్పుడు ల, ల, ల, అను చోటులందు కమ్ములొకదానిపైనొకటిపడును.

జ యందలి వలయమునకన్న కొంచెము పెద్దదగు మరియొక వలయమును చేసికొనవలెను. పిమ్మట చిత్రము ౨ లోని కమ్ములను చిత్రము ౬లోనిరీతిగ పైకి చేరతీసికొని ముందు చేసికొనిన పెద్దవలయమును వంపుకమ్ముల వెలుపల పెట్టుకొని (చిత్రము 3,ప) ల,ల,ల, అనుచోటులందు వంపుకమ్ములను వలయమునకు సన్నని తంతికమ్మితో కట్టవలెను. పిమ్మట చిత్రము౫లో నుండురీతిగ నొక కమ్మిని వంచుకొని దానికి చిత్రము ౨ లోని ఇ వంటి కమ్ములను మూటిని చిత్రము ౪ నందలి విధముగ బిగించవలెను. ఈమూడుకమ్ములను ఉట్టియందలి ఎ, ఏ, ఐ, అను మూడు వంపులకు గాని, ఒ, ఓ, ఔ, అను కమ్ములకుగాని చిత్రము 3 నందు వ వద్ద చూపినవిధముగ బిగించవలెను. అపుడు ఉట్టి పూర్తియగును.



---

౬

శి—నమస్కారము.

గు—దీర్ఘాయు రస్తు! కూరుచుండుము.

శి—శ్రీకుమారప్పగారు వ్రాసిన విషయము లయిపోయినవా? ఇంకను నున్నవా?

గు—ఇఁక లేవు, కాని యింతవఱకును జెప్పిన విషయముల సారమును, కొన్ని హిందూదేశచరిత్రాంశములతోఁ గూర్చి, మనసున కెక్కునట్లు ఆయన మరలఁ జెప్పినారు. కావలయునన్న, ఆసంక్షేపకథనము నా శక్తికొలఁదిఁ దెలుఁగున నీకిప్పుడు వినిపించెదను.

శి—"మనసున కెక్కునట్లు" అని మీరే చెప్పుచున్నారు. విషయము ప్రజాసౌఖ్యమున కాయువుపట్టయిన దేశపాలన మయ్యెను. అక్కఱలే దనువాఁ డెవఁ డుండును? కాని, వేదవేత్త యాశీర్వచనపు పనస చెప్పుచుండఁగా సంభావనకు వచ్చిన నిరక్షరకుక్షిగాఁడు చేతియక్షతలు నలుపుకొనుచు మిన్నక యాయన మొగమువైపు చూచుచుండునట్లు, నేఁటి ప్రసంగములో నేను మాటికిఁ దాళము వైచుకొని యూరక వినుచుండ వలసినవాఁడనే కాఁబోలు.

గు—అ ట్లేల జరుగును? సుతిలేని పాట యుండునా? నాశ్రమ కొంత తగ్గించుటకును, విషయములను మఱింత విస్పష్టముగా నాచేఁ జెప్పించుటకును నడుమనడుమ నీనాలుకయును కొంత యాడుచుండ వలయును.

శి—చిత్తము.

గు—ఒక మహారాజ్యము శీర్ణమై శిథిలమై నశింపఁబోవుచున్నప్పుడు, చుట్టుపట్ల వేచుకొనియుండు విత్తకాములును, రాజ్యకాములును సాధ్యమైనంత యధికారబలమును సంపాదించికొనుట కల్లాడుచుందురు—అనుసత్యము దేశచరిత్రలు మనకు బోధించుచున్నవి.

తదనుసారముగా, కేవల మర్థకాములై యుండిన బ్రిటిష్ ఇండియా కంపెనీవారు, సమయము కనిపట్టి ఢిల్లీచక్రవర్తిసింహాసనము తాము లాగుకొనిరి. అప్పటి పరిస్థితులనుబట్టి ప్రజలపై వేసిన పన్ను లతిభారవంతములుగా నుండి యుండవచ్చును.

శి—ఆపరిస్థితు లేమైయుండును?

గు—దేశమంతయు నశాంతముగా నుండెను. మొగల్రాజ్యసౌధము కూలుటకు సిద్ధముగా నుండి జవ్వాడుచుండెను. మొగల్చక్రవర్తులలోఁ జివరవాఁడు ప్రజాపీడకమైన పరిపాలనము చేసెను. అతని కాలములో సంభవించిన యుద్ధముల కధికముగా ధనము కావలసియుండెను. అందుచేఁ బ్రభువులకుఁ బ్రజలు బరువైన పన్ను లప్పుడు చెల్లించుచుండవచ్చును.

శి—అది ప్రమాణముగాఁ గొని యాంగ్లప్రభువు లట్లే పన్నులు వేసి జనుల బాధించుచున్నారని వెనుకఁ జెప్పినారు.

గు—ఔను; ఆబాధ యిప్పు డధికమైనది. ఏలన:—పన్నులు వసూలుచేయుటలో అసమర్థులగు మొగలులకు పట్టువిడుపు లుండెడివి. ఇఁక శుల్కగ్రహణవిద్యావిశారదులగు మన యాంగ్లేయప్రభువు లొక్కపైసయైనను చెదరిపోకుండ యథావిధిగాఁ బన్నులు వసూలుచేయుచుండుటచే, ఆయపువెుత్తముతోపాటు ప్రజాకష్టమును హెచ్చుచున్నది.

శి—ప్రజల తృప్తియే మాకుఁ గావలయును, అందే మాయానంద మంతయు నున్నది—అనుమాటలు చెప్పుచు మనకోసమే వారు హిందూదేశపరిపాలనభారము వహించుచున్నట్లు చెప్పుదురే. శిశువుల యాస్తి పుచ్చుకొని, దానిని జాగ్రత్తతోఁ జక్కఁగాఁ గాపాడి యభివృద్ధిచేసి, వారికి యుక్తవయస్సు రాఁగానే వారి యాస్తి వారి కినుమడిగా నప్పగించు పరోపకారపరాయణులవలె వ్రాఁతలు వ్రాయుదురే!

స—అవన్నియుఁ దరువాత బయలుదేరిన శ్రీరంగనీతులు. తమ రాజ్యము దృఢముచేసికొనుట కాడిన ప్రౌఢవచనములు. బ్రహ్మాండమంత భారత రాజ్యమును దమ చేతిలో నుంచికొని చప్పరించుచున్న తప్పు దాపుకొనుటకుఁ గల్పించినకారణములు.

శి—అట్లైన, బ్రిటిష్ సామ్రాజ్యనిర్మాతలని పేరుపడిన క్లైవు మున్నగుమహాపురుషులు మనదేశమున కపకారకులే యని చెప్పవలయును గాఁబోలు.

స—సందేహ మేమి? మన కపకారకులు గాని, తమదేశమువారికి మహోపకారకులే.

క్లైవుగారును, వారన్ హేస్టింగ్సుగారును, తదితరులును జేతికందిన దేశధనమంతయుఁ జేఁదిపట్టుకొనిపోయినారు. ఆ యమితధనరాసులు తమవారు భూమియంత్రాదులు గల్పించుకొని సుఖపడుటకు సాధనభూతము లైనవి. అవియే యింగ్లండుయొక్కయు,యూరప్ఖండముయొక్కయు వ్యాపారవ్యాప్తికిని, వర్తకాభివృద్ధికిని ప్రధానకారణము లైనవి. వారి వర్తకవ్యాపారాభివృద్ధితో ఆర్యావర్తవ్యాపారాభ్యుదయమునకు క్షీణదశ ప్రారంభించినది.

అం దాశ్చర్య మేమియు లేదు. ఈస్టిండియా కంపెనీవారు వాణిజ్యముచే డబ్బు గడించుకొనుటకు మొదట మనదేశములోఁ గాలు పెట్టినారుగాని, మనకుఁ బ్రభువులై మనల నుద్ధరించుటకు రాలేదు. అదృష్టవశమునఁ బాలకులైనపిమ్మటఁ గూడ, బ్రతివ్యవహారమునందును తాత్కాలికస్వలాభమునే వారు చూచుకొనుచుండిరిగాని హిందూదేశభావికసౌఖ్యమును దృష్టి నిడుకొని ప్రవర్తింపలేదు. ప్రభుత్వబాహ్యలక్షణము లగపడుచుట కప్పుడప్పుడు మనదేశము బాగించుక పరిగణించినను, అది యింగ్లండుయొక్క దినదినాభివృద్ధికిని, దాని సర్వసర్వంసహాపరిపాలనాభిలాషకును అబాధకముగా నుండునట్లు చూచుకొని మఱి వ్యవహరించెడువారు.

శి—బ్రిటిష్‌వారి యైశ్వర్యోత్కర్ష సాధమునకు మన భారతభూమి నిచ్చెనమెట్టైనదన్నమాట. వారిగ ప్రాజ్యాంతమునఁ బ్రారంభించిన దేశాధఃపతన మట్లే యున్నదన్నమాట.

స—అట్లే యున్నఁ గొంత మేలే. అంతకంత కాచ్యుతి యెక్కువగుచున్నది.

శి—కారణములు?

స—అనేకము లున్నవి. ఇంగ్లండులో యంత్రకర్మాగారము లెక్కువగుచున్నకొలఁదిని, మనదేశము నుండి వానికై ముడిసరకుల యెగుమతులు హెచ్చు కావలసివచ్చినది. ఆ ఫ్యాక్టొరీల పరిపోషణముకై దిగుమతిసరకులపై వేయు టారిఫ్సుంకములు అన్యాయము గా విధింపవలసివచ్చినది. బొంది యొకచోటను డెంద మొకచోటను నుండు పరిపాలనము ప్రజాతృప్తికరము గా నుండఁజాలదు. మనకుఁ బదార్థనష్టియు, వారి కర్థపుష్టియుఁ బ్రస్తుతపరిపాలనఫలములుగాఁ గాన్పించుచున్నవి.

శి—నాకు హిందూదేశమును పాడుచేయవలయునను దురుద్దేశము లేదు. ప్రజాక్షేమముఁ గోరియే పన్నులు వేసి యితరదేశములతో వాణిజ్యవ్యవహారములు నడపుచున్నాము. హిందూదేశమునకుఁ గొంచెము నష్టమును లంకాషైరువారి కించుక లాభమును సంభవించుచున్నయెడల, నవి యానుషంగికముగా వచ్చుచున్నవి గాని మేము బుద్ధిపూర్వకముగాఁ దెచ్చుచుండుటచే వచ్చుట లేదు—అని యాంగ్లప్రభువులో వారిపక్షము వారో చెప్పిన నప్పుడు మీ రేమి చెప్పెదరు?

స—వారు మీరు చెప్పనక్కఱలేదు—ఈ మాటలు మంత్రి మెగ్డానల్డుగారే చెప్పినారు. కాని యవి విశ్వాసపాత్రములుమాత్రము గావు.

చేనిలోఁ జొచ్చి యొకఁడు గోఁగాకులు గోయుచుండఁగాఁ జూచి భూస్వామి వచ్చి యతనిని బట్టుకొని కొట్టఁబోయినాఁడఁట. అంతట నాదారిఁ బోవుచున్న యొకఁ డడ్డుపడి—పోనిమ్ము, వెఱ్ఱివానివలె నున్నాఁడు, వదలిపెట్టుము—అని పలికినాఁడట. "మతిలేనివాఁడైనఁ జేతులు కంచెయాకులమీఁదకిని ఉలవాకులమీఁదికిని

బోక తిన్నగా గోఁగుమారపైకే యేల పోవలెను?" అని పంటకాఁపు ప్రశ్నించినాఁడట. కనుక లాభము తమ దేశమువారికే వచ్చుటయును, దానివలని నష్టము తాము ప్రవేశించి పాలించుచున్న దేశమువారికే కలుగుటయును కాకతాళీయములు గాఁజాలవు.

శి—కాకతాళీయములు గావు, కావలయునని చేయుచున్నవానివలెనే కాన్పించుచున్నవి.

గు—ఔను, సుప్రసిద్ధాంగ్లేయవిశ్వవిద్యాలయములలోఁ జదివి, మేధావంతులని పేరుపడి, కఠినములైన పరీక్షలలో నుత్తీర్ణులై వచ్చి, మనదేశములో కలెక్టరులుగాను, గవర్నరులుగాను పనిచేసినవారు వివేకహీనులయి పొరపాటుపడుచున్నారని చెప్పుటకు వీలుపడదు.

శి—పొరపాటొకయేఁడు రావచ్చును రెండేండ్లు రావచ్చునుగాని, యెల్లకాల మేకరీతిగా సంభవించుచున్నది ప్రమాదజన్య మెట్లగును?

గు—ఒకసారి ప్రమాదములోఁ బడినవా రితరులు చెప్పిన మాటలు విని తరువాతఁ జక్కఁబడుదురు.

అయ్యలారా! దేశావర్థకారులగు నిసుపదారులధికముగా వేసి ప్రజలకుఁ గూడు లేకుండఁ జేయుచున్నారు. పాక్షికపు రెయిలుబాడిగలు వేయుచు స్వదేశవ్యాపారములఁ జంపుచున్నారు. మీదేశపు వణిజులకు మేలుచేయు తలంపుతో దిగుమతిపన్ను లతిలఘువుగా వేసి స్వచ్ఛందవాణిజ్యము సాగించి దేశీయుల కన్యాయము చేయుచున్నారు—అని దేశనాయకులేక గ్రీవముగాఁ జెవినిల్లుకట్టుకొని చిరకాలమునుండి మొఱలు వెట్టుకొనుచున్నప్పటికిని, "ఇవన్నియు నత్యల్పసంఖ్యాకులగు నసంతుష్టవిద్యాప్రజలయొక్కయు, అవాలోచితముగా వారి పక్షమవలంబించి వాదించు ఇంగ్లండులోని కొంద అవివేకులయొక్కయుఁ బ్రలాపము" లని ప్రభువులు నిరసించుచున్నారు గాని యామాటలఁ బాటించుచుండుట లేదు.

శి—మేలుకొని నిద్రించుచున్నవారి నెవరు లేపఁగలరు?

గు—కనుక, ఈపెట్టుబాధలన్నియుఁ బ్రమాదజన్యములని చెప్పి వారి బుద్ధికపకర్ష మొఁదెచ్చుటకంటె "ఎంతబుద్ధిశాలులైనను తమవారిని బాగుచేయుటకై యన్యాయమున కొడిగట్టుకొనకమానరు, అది నైసర్గికము" అని చెప్పి యీదౌర్బల్యమంతయు వారి నీతి కారోపించి చెప్పుట యుచితము.

శి—అర్థలోలుపులగు వర్తకుల బృందమునుండి హిందూదేశపాలనము ఐశ్వర్యతృష్ణగల బ్రిటిష్ప్రజలచేతిలోనికి వచ్చినతరువాత, పరసవాక్యసంయుతములైన శాసనములుదక్క నన్యలాభ మేమియు లేదన్నమాట.

గు—అంతే! రాజు దేవాంశసంభూతుఁ డను విశ్వాసముగల అమాయికప్రజచే ఆశాసనము లవిలంఘనీయములైన దైవశాసనములుగాఁ దలఁపఁబడుచున్నవి. "గొప్పవర్తకలాభము గ్రేట్బ్రిటనునకుఁ గూర్చి యిండియా ధన్యయైనది. అధికమూల్యముతో నామె యమోఘమైన సంరక్షణలాభము సంపాదించుకొని ధన్యతరమైనది." అని యొకరు చెప్పినారు.

శి—చారిత్రవిషయాత్మకమైన యీపునాది చాలును. ముందు ప్రసంగమునకుఁ బోదము.

గు—"బ్రిటిష్ప్రాజ్యప్రయోజనములకై మనము వెచ్చించుచున్న ధన మత్యధికముగా నున్నది; హిందూదేశాభివృద్ధికై చేయు అర్థవ్యయ మత్యల్పముగా నున్నది" అని మెగ్డానల్డుగారు వ్రాసినారు.

రెయిల్లమున్నగువానికిఁ పెద్దపెద్ద మొత్తములు వ్యయించుచున్నారు. దేశపుష్టికరములగు పనులు గావించుటకు వలయు ధనము లేకున్నది. పరిపాలకజాతివారు చేయు మద్యోష్ణములలో నిరాధారులై బాధపడుచుండు పరిపాలితదరిద్రప్రజల నిట్టూర్పులు వినఁబడకున్నవి.

మనదేశమునుండి వసూలుచేసిన సుల్కపుటాదాయములో విశేషభాగము దేశము దాఁటిపోయి విదేశములలో వినియుక్తమై, యచ్చటివారికి ఫలకారి యగుచున్నది. ఈమాట మంత్రిగారే యొప్పుకొని చెప్పుచున్నారు.

ఇంకొక యనర్థము గన్పట్టుచున్నది.

శి—అది యేది?

గు—పన్నుభారము దరిద్రులపై నత్యధికముగాఁ బడుచున్నది; తదితరులపై—ముఖ్యముగా ధనవంతుల పై—మిక్కిలి తేలికగాఁ బడుచున్నది. కడుపు గట్టుకొని కటికదరిద్రుఁడు చెల్లించు రూపాయి, ధనవంతుల విషయోపభోగముల కాధారభూత మగుచున్నది. "ఇది మన హిందూరాజ్యపరిపాలనములోని మహాకలంకము, అతిశీఘ్రముగాఁ దుడిచివైచుకొనవలయు నిచ్చ......" అని సర్ ఏ. కాటన్‌గారు వ్రాసినారు.

శి—బుద్ధిమంతులగు మన ప్రభుత్వమువారు ఈ విషయమున భాగ్యవంతులను చులుకగాఁ బోనిచ్చి బక్కవారగు దరిద్రుల నేల బాధపెట్టుచున్నారో?

గు—దానికి రెండుకారణము లగపడుచున్నవి. ఇండియాలో నుండు బ్రిటిషువా రందఱును ధనవత్కోటిలోఁ జేరినవారు. కనుక ధనవంతులను పన్నులచే బాధించినయెడల, వారికిఁగూడ ఆబాధ తగులక మానదు.

శి—సరియే, రెండవ హేతువు?

గు—అదియే ప్రధాన హేతువు. బ్రిటిష్పరిపాలనము పరపరిపాలనము, విదేశపుమొక్క; అది యింకను వెళ్లుపాఱి లోఁతుగా నాటుకొనలేదు. దాని కెవరో కొందఱి పోషణము కావలయును. ధనాధికులును విద్యాధికులును అగు జను లెవరు నేల పైపొరలనుండియే దాని కాతోడ్పాటు రావలయును. వారికి సమ్మతమైనట్లే శుల్కనిర్ణయసూత్రములు చేయవలెను. సాధారణముగా వీరి కనుకూలములగు పద్ధతులే దేశములో నుండు నాంగ్లేయులకును అనుకూలములుగా నుండును; వీరికి బాధకము లైనవే వారికిని బాధకములుగా నుండును. కనుక నీయుభయుల మాటలును పరిపాలకుల చెవి కెక్కి వారి కాదరణపాత్రము లగుచున్నవి.

మఱియుఁ బరపరిపాలనమువలన సేనావ్యయము మత్యధికముగా నుండును.

శి—ఎందుచేత?

గు—విదేశీయప్రభువులు స్వసంరక్షణార్థము భృతకసైనికుల ననేకుల నేర్పఱుచుకొని వారిని యుద్ధావసరములందును శాంతిసమయములందును గూడ భరించుచుండక తప్పదు. స్వదేశీయులే ప్రభువు లగునెడఁ, గొలఁదిమందికే వేతనము లిచ్చి స్థిరసైనికులఁగాఁ బెట్టుకొని, యాపత్సమయములందుఁ గావలసినంతమందిని ఆప్తులగు నాత్మీయప్రజలనుండి తాత్కాలికయోధులఁగా నెన్నుకొని వారివలన రాష్ట్రరక్షాప్రయోజనములు నెఱవేర్చుకొందురు.

శి—రెయిల్వేలుగూడఁ బ్రజోపకారక మగు తటాకాదినిర్మాణమున కడ్డువచ్చుచున్నవని వెనుకఁ జెప్పినారు; కాని పాపము! అవి కఱవుబాధలు కొంత వఱకు తగ్గించుచున్నట్లున్నవి.

గు—దానికిఁ బ్రత్యుత్తరము వెనుకఁ జెప్పితిని, మఱచి నావు కాఁబోలు.

శి—ఏమని?

గు—రోగముఁ దెచ్చుకొని కుదుర్చుకొనుటకంటె, రోగము రాకుండఁ జేసికొనఁ బ్రయత్నించుట మంచిదని.

అదియుఁ గాక, యెప్పుడో కఱవుకాలములం దుపయోగించునని చెప్పి నిత్యపీడాకరములగు నయోమార్గముల నెవఁడు నెత్తిమీఁదఁ బెట్టుకొనఁజూచును? అది, గాలివానలు వచ్చినప్పుడు ప్రాణసంరక్షణార్థ ముపయోగపడునని యతివ్యయాత్మకమైన నౌకావిశేషము నిర్మించిపెట్టుకొనిన ట్లుండును.

మహానసాధనములుగానైన సర్ ఏ. కాటన్‌గారు ఇండియాలోని రెయిల్వేలను మెచ్చుకొనక—"హిందూదేశమునకు నేఁడు గావలయునవి నీటిబాటలు, వాని ప్రయోజనములు బహుమూల్యసాధ్యములగు రెయిల్వేలు నెఱవేర్పకున్నవి. కాలువలు ద్రవ్వి వానిపైఁ జిన్నపొగ పడవలు నడుపునెడల, నవి చౌకగా నెంతసరకైన నతివేగముతో నొకచోటనుండి యొకచోటికిఁ గొనిపోఁ

గలవు. అట్టికాలువలు త్రవ్వుట కగుఖర్చు, రెయిల్వేలు నిర్మించుటకగు వ్యయములో పెనిమిదవవంతైనఁ గాదు" అని వ్రాసినారు.

"ధనోత్పాదనానుకూలముగా నేర్పాటులు గావింపఁబడుచుండుటలేదు. అదియే హిందూదేశదారిద్ర్యమునకు హేతు వగుచున్నది" అని రష్బ్రూక్విల్యమ్సు గారు సత్యము గనిపట్టి చెప్పినారు.

శి—అట్టి యేర్పాటు లేల చేయకున్నారు?

గు—హాబ్సన్ గారు సెలవిచ్చినట్లు—నాగరకులగు పాశ్చాత్యప్రపంచమువారు, తమకంటె నిమ్నస్థితిలో నుండు సర్వేతరప్రపంచమువారిని అడఁగఁద్రొక్కి యధికారము చెలాయించి తాము బాగుపడుటకే పుట్టినారనియును, తాము ప్రపంచాధిపత్యవైభవములో నుండఁదగు అగ్రవర్ణమువారనియును, తమ సుఖముకై తక్కువారందఱు దాసజనమువలెఁ బాటుపడి భోగపదార్థములు సమకూర్పవలయు ననియును భావించుకొని, వారి రాజ్యాంగతంత్రములు, వారి వాణిజ్యపద్ధతి, వారి నీతి, సమస్తము తదనుగుణముగా నమర్చిపెట్టుకొని ప్రవర్తించుచున్నారు—ఇదియే మనదేశమునకు శుభకరములగు నేర్పాటులు వారు చేయకుండుటకు హేతువుగాఁ జూపట్టుచున్నది.

శి—చాతుర్వర్ణ్యసంక్షోభమునకుఁ దోడు గా శ్వేతవర్ణపీడ యొకటి వచ్చినదన్నమాట. ఇట్లు చెప్పిన దాంగ్లేయులలో నాయన యొక్కఁడేనా? ఆయనవాక్యములకు బలకరముగా మఱియెవరైనఁ జెప్పినారా?

గు—డాక్టర్ రూథర్ఫర్డుగారిట్లు వ్రాసినారు:—"హిందూదేశమునందుఁ గన్పట్టు బ్రిటిష్వరిపాలనపద్ధతి, యొకజాతి మఱియొకజాతిని పీడించి తా బాగుపడు నధమాధమనీతిబాహ్యపద్ధతి."

శి—ఆయనదృష్టిని హిందూదేశదారిద్ర్యహేతువు లేవి?

గు—ఇవి:— "పామరజనులకు విద్య గఱపకుండుట, గ్రామముల శుచిత్వారోగ్యములను గాపాడుచు వానిని పసిగా నుంపకుండుట, దరిద్రజనులను దగుకుటీరములలోఁ బెట్టకుండుట, కుసీదకుల బాధనుండి కృషీవలుల రక్షింపకుండుట, సేద్యకాండ్ర కనుకూలముగా నప్పులిచ్చుకోశీలను స్థాపింపకుండుట, వ్యవసాయమునకుఁ దగు ప్రోత్సాహము గావించి దాని నభివృద్ధిపఱుపకుండుట, దేశీయవృత్తివ్యాపారములను బోషింప నుపేక్షించుట, ట్రామ్వేలు విద్యుద్దీపవ్యాపారములు మున్నగు దేశమందలి పెద్దపనులను లాభాపేక్షతో వచ్చి బ్రిటిష్వారాక్రమించుకొనుట నాఁపకుండుట, లండనువారికి లాభకరముగా నాణకవినిమయప్రచారపు టేర్పాటులు గావించుట మానకుండుట."

శి—పెద్దజాబితా యిచ్చినారే! స్వదేశవర్తకపోషణముకై విదేశవస్తువులమీఁద బరువైన దిగుమతి టారిఫులు వేయుట మంచి దందురుగదా, అట్లు చేసినమాత్రమున, నిండ్లలోఁ బూర్వము మనవారు చేసికొనుచుండెడు చేతిపనులు — చచ్చిపడిపోయినవి — మరల బ్రతికి తలయెత్తునా?

గు—ఎత్తకేమి? పోనీ, యెత్తవే యనుకొందము. ఎత్తకున్నను, స్వదేశయంత్రకర్మాగారము లభివృద్ధినొందవా? అందుఁ బనిచేయుటకుఁ బల్లెలనుండి కొందఱు జనులు రారా? అట్లు వచ్చుటవలనఁ బొలములపై జనసమ్మర్దము తగ్గదా? మిగిలినజనులకుఁ బండినపంటవలనఁ బూర్వముకంటె నెక్కువ తిండి దొరకదా?

శి—ఔను, పంటవలనఁ గొందఱికిని, కూలివలనఁ గొందఱికిని కూడ దొరకఁగలదు.

గు—[illegible]ములవలనఁ బదార్థోత్పాదనశక్తి ప్రజల[illegible]యున్నప్పటికిని, మనజాతి మడియ కింకను జీవింపఁగలిగియుండుట యత్యాశ్చర్యకరముగా నున్నది. అది కేవలము పరమేశ్వరానుగ్రహసూచకము.

శి—అయ్యో! అట్లనుచున్నారేమి?

గు—నేను గాదు, రమేశచంద్రదత్తుగారే చెప్పుచున్నారు. వినుః—"చేతిపనులు చెడఁగొట్టఁబడినవి; కర్షకులపైఁ బన్ను లమితముగాఁ బడినవి; ఆదాయపు

మొత్తములో మూడవవంతు దేశమునుండి పరదేశమున కుఁ బంపఁబడుచున్నది—ఇట్టిస్థితిలోఁ ప్రపంచము లోని యేజాతివారికైనను శాశ్వతదారిద్ర్యమును,మరల మరలవచ్చు కఱవుల బాధలను సంప్రాప్తింపక మానవు. ఆయవ్యయానైసర్గికధర్మములు ఏషియాకును యూరప్పు నకును సమానముగానే యుండును గాని భిన్నముగా నుండఁజాలవు. ఇండియా నేఁడు దరిద్రదేశ మగుటకుఁ అప్రతిహతములైన యాయర్థశాస్త్రనియమములే కారణ ములు. ఇట్టిపరిస్థితులలో ఇండియా యైశ్వర్యవంతమై వర్ధమానమగుచుండునెడల, అది యతిమానుషమైన యద్భుతదైవసంఘటన మగును."

మఱియు—.

శి—ఇంక నెవరైన నట్లు చెప్పిరాయేమి?

గు—సరిగా నట్లు గాదు, ఆభావ మిచ్చు మాటలే మంత్రి మెగ్డానల్డుగా రిట్లు పలికినారు:—"ఏది యెట్లున్నను, మొత్తముమీఁద, మనపై రెండునేరములు ఋజువుపఱచి మోపవచ్చును—1. మన పరిపాలన మమితవ్యయాత్మకము. 2. హిందూదేశమునెడల మనము నీచముగాఁ బ్రవర్తించినాము."

శి—మంత్రిగారి నోటినుండి కడుగాటుమాటలు వచ్చినవే! కాని దారిద్ర్యము! దారిద్ర్యము! అందురు గదా, మనదేశములో మనుష్యుని సగటాదాయ మె ట్లున్నది?

గు—ప్రభుత్వమువారి యాజ్ఞపైఁ దయారు చేయఁబడిన లెక్కలనుబట్టి యిచ్చిన యీక్రిందియంకె లను గనుము:—

| సంవత్సరము | సాలుసరి మనుష్యునికి వచ్చు సగటురాబడి | వస్తువుల ధరలు | పిసలైవసం॥రపు సగటు రాబడి |
|---|---|---|---|
| 1881 | 27 | 100 | 27 |
| 1901 | 30 | 120 | 25 |
| 1921 | 74 | 378 | 19.7 |

శి—ప్రథమదృష్టిని వచ్చుబడి హెచ్చుచున్న ట్లగపడును గాని, దానిని పదార్థమూల్యముల హెచ్చుతో సంప్రతించి చూడఁగా నంతకంతకుఁ బడిపోవుచున్నదని చెప్పక తీఱదు.

గు—ప్రజాపరిపాలనము క్రింద నున్న దేశములో నధికపాలనవ్యయ మభివృద్ధిసూచకమని చెప్పవచ్చును గాని, సరకుల వెలలు హెచ్చిన దనుహేతువు చెప్పి, యున్నతోద్యోగుల వేతనాదుల నెక్కువచేసి వ్యయా ధిక్య మగపఱచు మనదేశములో నట్లనుకొనుటకు వీలు లేదు. సర్వ్యల్యమెహంటరుగారి యీక్రిందిమాటలు విను ము—"పైరాజులుదండెత్తి వచ్చి దేశముపైఁ బడుదురను భయమును బాపినాము; అరాజకత్వవిలంబన విప్లవము లుండునోట్ల నియమనిబంధనములు చేసి, ప్రజలు నిర్భ యముగా శాంతముగా బ్రతుకునట్టి యేర్పాటులు చేసి నాము; యావద్దేశమును పాఠశాలలతోను, న్యాయస్థాన ములతోను, రోడ్లతోను, రెయిల్రోడ్లతోను, కాలువల తోను, నింపి ప్రజావర్గమునకును వాణిజ్యమునకును ప్రోత్సాహము గలిగించినాము — అని చెప్పినఁ బ్రయో జనము లేదు. ప్రజలకుఁ దినుటకుఁ జాలిన తిండి లేన ప్పుడును, మన పరిపాలనవ్యయభారము దేశము భరింపఁ జాలనప్పుడును, అవి యన్నియు వ్యర్థప్రలాపములు."

మఱియొక యన్యాయ మున్నది.

శి—అది యేది?

గు—ప్రజలు చెల్లించు పన్నులనుండి పెద్దపెద్ద వేతనములు పుచ్చుకొని, బుద్ధిమంతులు మంచి లోకజ్ఞ తను వ్యవహారానుభవమును సంపాదించుకొని యుద్యో గములు చాలించుకొనిన పిమ్మట, దేశములోనే యుండి, తమ బుద్ధిబలానుభవబలముల నుపయోగించి తమ తరు వాతివారికి చక్కని యాలోచనలు చెప్పి, దేశపురోభి వృద్ధికిఁ దోడ్పడుట, సర్వలోకసామాన్యసంప్రదాయము.

ఇక మనదేశపుఁ బెద్దయుద్యోగులైన దొరలు హిందూదేశము సొమ్ము తిని, దానితోఁ బరిపాలనాను భవము సంపాదించుకొని, యుద్యోగానంతరము తమజన్మ దమ దేశమునకుఁ బోయి, పెన్షను లనుభవించుచు నట్టఁ

గూరుచుండి, బుద్ధిని వ్యవహారజ్ఞానమును మన దేశక్షేమముకై యుపయోగింపక అన్యదేశాభివృద్ధికై యుపయోగించుచున్నారు. ఇది యన్యాయము గాదా?

శి—ఔను, దురన్యాయమే. మన కీదారిద్ర్యవిముక్తియు ధనప్రాప్తియు నెట్లు సిద్ధించునని పెద్దలగు నర్థశాస్త్రజ్ఞులు చెప్పినారో సెలవిండు.

గు—బ్లంటుగారిట్లు చెప్పినారు :—"రైతులను ప్రస్తుతము పీడించుచున్న యనశనబాధను బోఁగొట్టి, వారి స్థితిని బాగుపఱుచుట శాసనములచేతఁ గాదు. కలకత్తాలోను లండనులోను గూడ నిప్పుడు బలవత్తములై హిందూదేశమునకుఁ బ్రతికూలములై పనిచేయుచున్న స్వహితపరతాదురభిమానములు తొలఁగిపోయినఁ గాని, యాప్రయోజనము నెఱవేఱఁజాలదు. అంత యనర్థమునకు మూలకారణ మాయవ్యయనిర్ధారణము నందలిలోపము గాని శాసననిర్మాణసభాదోషము గాదు. ఆవశ్యకమైన యాయవ్యయసంస్కరణము లేని యితర మార్గము లన్నియు నిష్ఫలములు."

శి—మెగ్డానల్డుమంత్రిగారీవిషయమున నేమైనఁ జెప్పినారా?

గు—ఇట్లు చెప్పినారు :—"బ్రిటిష్‌రాజ్య మిప్పుడిండియామీఁద వేసి దానికై యంటఁగట్టుచున్న వ్యయభారము న్యాయముగాఁ బంచి సరదునెడల, హిందూదేశపాలకులు గొప్పసంస్కారములు ప్రారంభించి దేశభాగ్య మభివృద్ధి నొందింపఁగలరు. అది చాలును; అంతకంటె నెక్కువ దేమియుఁ జేయ నక్కఱలేదు."

శి—కుమారప్పపండితుఁడుగారి యభిప్రాయ మేమి?

గు—హిందూదేశక్షేమమే హృదయమూలం దిడుకొని, యధికారులు తదనుగుణములైన సంకల్పములు చేసికొని, పరిపాలనకృత్యములు సాగించుకొనుచున్నఁ దక్క హిందూదేశపు టాదాయము తత్ప్రజోపయోగకరముగా వినియోగింపఁబడనేరదు. పన్నురూపముగా వచ్చు ప్రతిరూపాయయును ప్రజలయొక్క వస్తూత్పాదనశక్తిని, వారి యుత్సాహక్రియాశక్తులను హెచ్చు చేయుచుండవలెను.

శైశవావస్థలో నున్న దేశీయవ్యాపారములు శుల్కములవలనఁ బరిపోషింపఁబడునప్పుడు, శుల్కగ్రహణముచేత ఆయవ్యయముల కెట్టి హానియుఁ దటస్థింపనప్పుడు, తిండిలేక పస్తుండు ప్రజపై నతివ్యయాత్మకమును, భోగపరాయణమును అగు దేశపరిపాలనమును భరించు భారము పడనప్పుడు, హిందూదేశమాత యొసఁగిన యాతిథ్యమువలనఁ గుబేరులైనవారు దేశపరిపాలనభారవహనమునఁ బాల్గొన నిర్బంధింపఁబడునప్పుడు, పూర్ణప్రతిఫలము ప్రజలకు వచ్చునట్లు హిందూదేశపు టాదాయము వ్యయింపఁబడునప్పుడు, ప్రభుత్వమువారు దరిద్రుల యిక్కట్టులను గనిపట్టి ప్రజాసేవాబుద్ధితో—అది తమ విహితధర్మమని—ఆయిక్కట్టులను దీర్చునప్పుడు, పాలనప్రవాహపథములు దేశక్షేమమునకుఁ బ్రతికూలముగాఁ బ్రసరింపనప్పుడు, ఇటు పోవుదమా? అటు పోవుదమా? అను సందేహము పొడముపట్లనెల్లఁ బరిపాలకులు హిందూదేశక్షేమకరమైన మార్గమునే యెన్నుకొని యవలంబించిపోవునప్పుడు—అప్పుడే, యీరాజ్యవర్తమున కర్థాభివృద్ధి కలుగఁగలదు. ఆయవ్యయనిర్ణయాధికార మంతయుఁ బ్రజల చేతులలోనికి వచ్చినఁ గాని యట్టిపనులు జరుగఁజాలవు. ఈమాటలతోఁ గుమారప్పగారీవిషయమును ముగించినారు. మనముగూడ నేటిప్రసంగ మింతటితో విరమింపఁజేయుదము.

శి—చిత్తము! నమస్కారము!

గు—సుఖీ భవ!

# గంగగోవు

కె. అన్నమరాజశర్మగారు

ఓయి కఠినాత్మ నన్ను కసాయివాని
ఇంటివాకిట బంధింప నెంచినావె
ఏ నొనర్చిన యపకార మేమి గలదు
కసవుచే నీటిచే మను పశువు నగుట.

ఇంతకాలంబుఁ బ్రీతి పాలించి కడకు
ముసలితనమున నట్టేట ముంపఁ దలఁతొ
మృత్యుముఖమునఁ బడ విచారింపఁ గాని
దయయు, ధర్మంబు నొకయింతఁ దలఁపవలదొ.

కండ లుండిన యన్నాళ్లు కౌతుకమున
క్షీరపీయూషధారాభిషేచనమున
నీదు బొట్టల పొట్టల నింపినాను
తలఁపులం దెల్ల నీమేలె తలఁచినాను.

క్షీరములఁ గ్రోలి స్తనములఁ జెండినట్లు,
పున్నెమని పోవ పాపంబు వొలసినట్లు,
కటికవానికి నన్ను విక్రయమొనర్ప
అర్థలోభంబు నీమది నలమికొనెనొ.

పుట్టినింటనె గిట్టఁగ బుద్ధి పొడమి
బడుగుదేహంబుతో నెట్లొ బ్రతికియుంటి
కాని నీచిత్తవృత్తిని గాంచనైతి
తేనెఁ బూసిన కత్తివై తేరినావు.

కొడుకులకుఁ దోడు నే జత కూర్చినాను
దుక్కిటెడ్లను పొలమును దున్నకొఱకు,
పాడిఁ గల నాళ్లు దూడలఁ బాఱఁదోలి
పిదికె నీయాలు కాని నే బెంగఁగొనను.

పూల రువ్విన వారల ఱాల రువ్వఁ
గలదె మానవజాతికిఁ గాక జగతి?
బడుగునై గాఁడి బండల బ్రతుకుచుంట
అది యసహ్యంబె నీకొ దయావిహీన.

ముసలి తలిదండ్రులపయిని విసుగుఁ జెంది
అన్నపానంబు లొసఁగుట వ్యర్థమనుచు
దూరముగఁ బాఱఁదోలెడు దుష్టుఁ డొకఁడె
అన్నివిధముల నీసముఁ డైనవాఁడు!

కండలను గోరువెట్టిన కాలమెల్ల
కామధేనువువలె నన్ను గాచినావు
జవము సత్వమ్ము మెలమెల్ల జాఱిపోవ
ద్వారమున నిల్వ కొఱగాని దాననైతి.

నేఁటితోఁ దీఱె కర్షకా! నీకు నాకు
భౌతికాయాతఋణకర్మబంధనంబు,
తనువునుం బాసి, నా యపత్యములఁ బాసి
పోవుచున్నాను నీలోభబుద్ధికతన.

హాలికా! హాలికా! నీ గృహాంగణమును
దడుపుచున్నాను దుఃఖాశ్రుధార లడర
అంత్యసందేశ మొక్కింత యాలకింపు
మానవత్వంబు కారుణ్యమయమటంచు.

అన్న! సైరికా, నాదు ప్రాణార్పణమున
నైన ననుతాపచిత్తుండ వగుచు ముద్దు
బిడ్డలను నీదుసుతులట్ల ప్రీతిఁ గనుము
కన్నకడుపౌట యింత పల్కంగవలసె.

---

కాలం అతిత్వరితంగా మారిపోతూంది. ఆగర్భశ్రీమంతశబ్దం అనతికాలంలో అంతరించిపోనుంది. బొడ్డున మాణిక్యం, ముక్కున ముత్యం పెట్టుకుని పుట్టే బిడ్డల సంఖ్య మున్ముందు తగ్గిపోయి తుదకు పూర్ణానుస్వారమవుతుంది. ప్రపంచంలోని నాగరక దేశాల్లో వున్న శాసననిర్మాతలందరూ సాంఘికసమస్యలకేసి దృష్టి తిప్పుతున్నారు. చీలికలూ ఎత్తుపల్లములూ వున్న సంఘాన్ని సరిసమానమైన ఒకచట్రంలో అతకడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. స్వాప్నికరాజ్యం (Utopia) అని కొంతకాలం క్రిందటిదాకా తృణీకరించిన లోక సంస్కారణానికే కొంత ఆకృతి కలుగుతూంది. Communism, Socialism మొదలైనవి అర్థము కాని పెనుభూతములు కాక ఆలోచింపవలసిన సమస్యలవుతున్నాయి.

అరాచకం, దౌర్జన్యం, ప్రపంచంలో సంఘం అంతేనీ యేలుతుంది అని కాదు: "అందరిదీ సమస్తమున్నూ; ఎవరిదీ యేదీ కాదు" అనే స్వాతంత్ర్యరహితమైన State Control ఎన్నటికీ ఆచరణీయం కాదు. Cempetition కీ ఉన్నతాశయములకీ తావివ్వని ఆవిధానం చాలా దుర్మార్గమైంది. సాంఘికజీవనంలో ఔన్నత్యం, ప్రజ్ఞకూ ఓరిమికీ కలిగినట్లు సోమరితనానికీ, త్రాగుబోతుదనానికీ యెన్నడూ కలుగనేరదు. "Survival of the fittest" అనగా అర్హతకే అగ్రస్థానం లభించటం సృష్టిలో సహజం.

అయితే ఇప్పుడు రాదగిన సంస్కారణ మెట్లాంటి దంటే: నిర్వ్యాపారులు నిరాఘాటంగా సౌఖ్యజీవనం చేసేటందుకు, పొట్టనిండని పూటబత్తెముతో చావకుండా బ్రతక్కుండా కష్టపడే కూలిజాతిచేత చాకిరీ చేయిస్తూన్న సంఘవిధానం చచ్చిపోవాలి. భూగర్భంలో సజీవంగా పాతుకుపోయి గంటలకొలదీ వెతికిలా పడుక్కుని కష్టించి, జీవితశేషం అంతా క్షయవ్యాధిపీడితులై, వారు ప్రసాదించే రాతిసిబొగ్గు యెవర్ని సుఖపెడుతూంది? అది నిజంగా రాతిసిబొగ్గే! ప్రాణాలకి తిలోదకాలు విడిచి వారు ఆకాశం అంటుతూ నిర్మించే సౌధాల్లో, వారు తెల్లవార్లూ వింజామర్లు పీచితే కాని నిద్రపట్టని సుకుమారులెవరు?—

"ఆగర్భశ్రీమంతులు!"

ఆమాటయే చెపుతూంది, వారు యెంతవరకూ సంఘంలో తమ స్థానాని కర్హులో. పెట్టి పుట్టే డంటారు—వారుపడ్డశ్రమయూవత్తు యేమిటంటే ధనికుల గర్భవాసాన్ని జన్మించటమే! ఆ తల్లిదండ్రుల qualification కూడా అంతే. దినమంతా విలాసగృహాల్లో కాలం వెళ్లబుచ్చలేక ఆవలిస్తూ ప్రక్కబ్బులో చూచినా, యే గుఱ్ఱపుపందెంవద్ద చూచినా హాజరైపోతూ,

కష్టమన్నది యెరగకుండా జీవితం దుర్భరంచేసుకుంటూన్న సోమరితనం ప్రపంచానికీ, సంఘానికీ యేమి వుపకారిగా వుంది?

ఫ్రాన్సుదేశంలోని ప్రజాసంచలనంవల్ల నూటయాభై యేళ్లక్రిందట్ల సంఘచట్టం అంతా మారిపోయింది. రత్నగర్భ యనబడు భూవసతిలో ప్రతిమానవుడికీ హక్కు వుంది. అంతే కాని యేకొద్దిమందికో—వారి సంఖ్య పెద్దదే కానీండి—స్వత్వముండి తక్కినవారికి జేనెడు నేలయైన లేదనుట రాక్షసం. ఒక శతాబ్దినుండి ఫ్రాన్సులో ప్రతివారికీ తగుపాటి భూస్థితి వుంటూంది. భూమి యావత్తు nationalise చేసే రష్యాపద్ధతి కేవలము పాశవం. అంతకంటె దార్జన్య మేదంటే, భూవసతివల్ల ప్రస్తుతం యేర్పడివుండే మూడు తెగలు:— (1) అందు నిమిత్తమగు యేకష్టం పడకుండా ఫలానుభవం పొందే నేలరేడు; (2) అతనినిమిత్తమై భూమిమీద అమలుజరుపుతూ భుక్తశేషం భుజించే పాలికాపు; (3) దేహంలోని సర్వశక్తీ ధారపోసి అందుమీదనే పస్తుపడివుండే పాటకజనం. పదిహేడవశతాబ్దపు ఫ్రాన్సులో యిప్పటిఇంగ్లదేశంలోవలెనే భూవసతి అంతా లెక్కగా కొందరి అధీనమై వుండేది. ఆ భూస్వాముల కానుపూర్విగా ఆవసతులు జన్మస్వత్వమై వుండేవి. వారిపూర్వులు తమ రాజుల కే యుద్ధాలలో చేసిన సహాయానికిగాను ప్రతిఫలంగా ఆ వసతులు లభించేయి. వా రొనర్చిన వీరచర్యలే నేటి మన I. P. C. ప్రకారం అయితే ఆజన్మ ద్వీపాంతరవాసశిక్ష గడించివుండును. అట్లా వసతులు పొందినవారికి కొంతకాలం దాకా బహిరపాయములనుండి దేశాన్ని రక్షించే బాధ్యత వుండేది. అందునిమిత్తమై సైనికదళాలను వారి స్వంతఖర్చుతో తయారుచేసి వుంచేవారు. రానురాను నేల అనుభవిస్తూన్న యీ శ్రీమంతు లందర్నీ ధనప్రాణాపాయం లేకుండా కాపాడటానికయే (Defence) ఖర్చు కూడా జనసామాన్యమే భరించవలసి వచ్చింది. అన్నాతురత దుర్భరమైపోయి, తుదకు సంఘమంతా సంక్షుభిత మైపోయింది.

వోల్టేరు (Voltaire) ఫ్రెంచిదేశమున ఆ నాటి కింకను ప్రసిద్ధికి రాని రాజకీయవేత్త. పదిహేనవ లూయీ (Louis XV) పరిపాలిస్తూన్నరోజు లవి. వోల్టేరు ఒకనాడు నాటకాని కెళ్లేడు; ముందుకున్న బాక్సు ఒకటి ఆక్రమించేడు. తర్వాత ధనాంశసంభూతుడైన లాజనుభూస్వామి (Duke of Lauzan) వచ్చేసరికి, నాటకశాలయజమాని అతివినయపూర్వకంగా "ముందుసీట్లు అన్నీ అమ్ముడుపోయేయి" అని పసిగేడు. మట్టిపురుగుకన్న జన్మతః ఔన్నత్యం లేని వోల్టేరుమీద ఆ భూస్వామికటాక్షం ప్రసరించింది. "వాణ్ణి అవతలికి గెంటెయ్యండి" అన్నా డతను. అలాగు జరగడం అప్పట్లో వింత లేదు. Bastille (జైలు) లోకి గెంటినకంటె నయమే యీప్రయోగమని యెంచి, వోల్టేరు బయటకి వచ్చేసి, లాజనుమీద అభియోగం తెచ్చేడు. కోర్టు విచారణలో లాజనుతరఫులాయరు ఇట్లా

స్తోత్రపాఠం ఆరంభించేడు:—"లాజను అంటే సామాన్యపుగృహస్థులు కారండి. వీరి ముత్తాత లా రోషెల్లు (La Rochelle) కోట ముట్టడించేడు. వీరి తాతగారే (Utrecht) యూట్రెక్టు డచ్చివారివి ౧౫౭ ఫిరంగులు స్వాధీనపర్చుకున్నది.........అలాంటి ప్రభుకోటిలోవారు" —అంటూ యేకరువుపెడుతూవుండగా అర్థోక్తిలోనే వోల్టేరు అన్నాడు, "కోర్టువారు మన్నించాలి; నావాదం యావత్తూ ఆవీరులు మీాద కాదు. ఈనాటికి, నాటకంలో నే డబ్బిచ్చి కొనుక్కున్న బాకునత్తప్ప, జన్మమెత్తి మరియేదీ ముట్టడించియెరగని, యీ లాజను మీాదనే!"

సోమరిభూస్వాముల విషయ మంతా వోల్టేరు చెప్పిన మాటల్లో యిమిడివుంది. రివల్యూషనుకి ఒకశతాబ్దం ముందుగానే మేసిలాన్ (Massilon) అను విజ్ఞుడు వారి భావిపతనం జోస్యంచెప్పేడు. వోల్టేరు, రూసో (Rousseau), పుస్తకాలుకూడా వ్రాసేరు. రూసో వ్రాసిన "Social Contract" చూచి, Idealist యొక్క పిచ్చివ్రాతలని నవ్వుకున్నారు భూస్వాములంతా. కార్లయిలు మోటుగా చెప్పినట్టు, "ఆపుస్తకం రెండవకూర్పునకు భూస్వాముల చర్మమే బైండుకి ఉపయోగించింది." జన్మధనికుల కథఃపతనం వచ్చేసింది. రివల్యూషను మహాప్రవాహంలో నిమ్నోన్నతాలన్నీ నమమట్టమైపోయేయి. అదిమొదలు ఫ్రెంచి కర్షకకుటుంబానికి కళ వచ్చింది. కర్షకుడు తనొక శ్రీరక్తజన్ముడైన డ్యూక్కులా నటించడు. అతని భార్యకు డచ్చెస్సు లాగుండాలనే ఆశయం లేదు. వారూ, వారి పొలమూ, వారిపిల్లలూ, సమస్తం అతిఆనందమయంగా తృప్తిగా కనిపిస్తుంది.

ఇట్టి శాంతిసంతోషవాతావరణం అభివృద్ధిచేసిన వేత్తలలో ప్రథముడు ఎర్నెస్ట్ రెనన్ (Ernest Renan). ఇతడుకూడా వోల్టేరులాగే జలజల పోవు సెలయేటివంటి వచనకావ్యాలు వ్రాసినవాడు. అయినను వోల్టేరువలె మెత్తిపొడుపుమాటల (Satire)తో హృదయములను గాయపర్చే కఠినశీలుడు కాడు. వోల్టేరువ్రాతలవల్ల ప్రపంచం బాగుపడడం లేదు. సంఘమందు ప్రేమ రేకెత్తించినవాడు రెనన్. ఇద్దర్నీకూడా నాస్తికులే అన్నారు యితరులు. కాని న్యాయంగా యిద్దరూ పరమాస్తికులే. "దేవుడంటూ యిదివర కొకడు లేకపోతే, ఒకణ్ణి కనిపెట్టాలి మనం" అన్నాడు వోల్టేరు. రెనన్‌యొక్క దేవుడు పరమదయాళువు. లోకుల అకృత్యములకై వారిని కనికరించి ప్రేమిస్తాడు కాని దేవుడు శిక్షించ డని అతనివిశ్వాసం. పురుషసదృశ మగుచేత, స్త్రీసదృశమగు హృదయం, అయోనిజసదృశమగు వ్రాత రెనన్‌లో మిళితమైనవి. అతని వాక్కులు లోకమునకు క్రొత్త ఉత్తేజమును కలిగించినవి.

ధన మార్జించుట నీవు స్వాధీనపర్చుకుంటకు; అంతే కాని ధనమే నిన్ను పిశాచమువలె ఆవహించుటకు గాదు. "ధనమూల మిదం జగ"

త్తనుట కర్థము చాలా మితమైనది. ధనముచేత లోకములో తీరని వాంఛలు కోటానకోట్లు. తృప్తిమితముగా ధనము భోగ్యము కాని,తృప్తి చెందినపైని ధనముకలవాడు ధనమునకు పాలి కాపు. మురికికాల్వలో క్షిప్తత్రాగి పడిపోయి జోగుతూన్న ఒకదొరగా రన్నారట:—

(If I was the blooming Dook of Westminister, I could—not—be—more—drunk—than—I—am) "నేను చక్రవర్తినైనా యింత కంటె సంతుష్టిగా త్రాగలే"నని. రెనర్ ఉద్బోధించిన ఆర్థికసూత్రానికి ముడిమాట తేల్చిసే డతను.

మానవమాత్రుు డెన్నటికీ సర్వవిధములా సంపూర్ణుడు కాజాలడు. పూర్ణచంద్రుడిలో మచ్చ దాన్ని మరింత ఆకర్షణీయంగా చేస్తూన్నట్టు మానవులలోపము లేలోకంలో ప్రేమకు కారణం కలిగిస్తాయి. విశ్వసౌభ్రాత్రానికి ఆశించే భావియుగంలో ప్రతిదానికీ moderation అనగా మితి యేర్పడాలి. నిజమైన సుఖజీవు లెవరంటే కొలదిలో తృప్తి చెంది వుండే వారే. కలిగివుండుట ధనికత్వం కాదు. ఏపాటి మనము త్యజించి సుఖించగలమో, మన మాపాటి ధనికుల మన్నమాట. పాల తడి లేని రొమ్ముతో తల్లి, యేడుస్తూన్న బిడ్డను తృప్తి యివ్వని లాలన చేస్తూవుండగా, పొరుగున భవనంలో బల్లచుట్టూ కుర్చీలలో కూర్చుని కాలక్షేపంకోసం కాఫీలు త్రాగేమని, మన మనుమలతోనో మునిమనుమలతోనో కొన్నిదశల అనంతరం మనం ముచ్చటిస్తే, వారు మనల్ని మానవజాతిగా భావించరేమో అని నానమ్మకం!

---

# రమ్యసద్గుణపూర! భారతకుమార!

టి. రంగాచార్యులు గారు

మెలమెల్ల దరిఁజేరి మేని గుల్లగఁజేసి కదలని వదలని ఘనపిశాచు
 లమృతరసంబట్టు లాదినిజవిషూపి తుదవిషంబుగ మాఱు దుష్టవృత్తు
లాలు బిడ్డలఁగూడఁ నాపదపాల్చేసి భీతిల్లఁజేయు దుర్జాతు లమిత
ధనరాశినైననుఁ దండుగ పెట్టించి బిచ్చ మెత్తించెడి ముచ్చలగుటఁ
గల్లుసారాయము లను రక్కసులపొంత-కైనఁ బోకుము మఱపుననైన నెపుడు
పోతివేఁ దెలియుము చేటు మూడు ననుచు-రమ్యసద్గుణపూర! భారతకుమార!

---

# హిమాలయతీర్థములు

వేలాల సుబ్బారావుగారు

౧

౧

## బదరీనాథము

దీనిని తెలుగుదేశమునందు సాధారణముగా బదరీనారాయణమని పిలుచుచుందురు. హిమాలయ పర్వతములయందలి యడుగడుగు భూమియు దర్శనీయ మనుటకు సందియము లేదు. కాని సమస్తభారతవర్ష మందలి హిందూమాత్రులకు సేవింపదగిన తీర్థరాజము లిందు కొన్ని కలవు. వానిలో అమరనాథము, కేదార నాథము, బదరీనాథము, గంగోత్రి, యమునోత్రి యను క్షేత్రములు ముఖ్యమైనవి. వీని కేగుటయు మిగుల కష్టమే కాని గమనాగమనములకు కొన్ని సౌకర్యము లేర్పడి యుండుటంజేసి యెట్లో ప్రయాసపడి ఈమీద వచించిన తీర్థములకు మాత్రము నిర్భయముగ బోయి రావచ్చును. వీనియందును బదరీనారాయణమున కేగుట తక్కినవాని కంటె సులభము. కారణ మేమనగా నచటకు బోవు మార్గమం దంతట యాత్రికులు మకాములు జేయుటకు వీలగు స్థానములు దగ్గరదగ్గరగ నేర్పడియున్నవి. ఈ మకాము లచట చట్టీలని పిలువబడుచుండును. బదరీనాథ యాత్రావసరమున సామాన్యముగా మార్గగమనమువలన నలసిన తైర్థికుల నోళ్లనుండి "అగలీ చట్టీ కితనీ దూర్ హై" (ముందువచ్చే చట్టి యెంతదూర మున్నది) అను వాక్యము తరచుగ వినబడుచుండును. మరియు మార్గ మధ్యమున యాత్రికు లప్పుడప్పుడు విశేషించి యెవరైన వచ్చుట సంభవించినచో, "శ్రీ బదరీవిశాలలాల్ జీకీ జయ్", "శ్రీ బదరీనాథజీకీ జయ్," "శ్రీ కేదారనాథస్వామిజీకీ జయ్," "పతితపావనీ కలికలుష నశావనీ శ్రీ గంగామయ్యాకీ జయ్," అని యిటులే పరమేశ్వర నామోచ్చారణసహితముగ నుచ్చైఃస్వరముతో జయ కారముల పలుకుచుందురు. ఇందువలన మనస్సునకుల్లాసమును, మార్గాయాసమున కించుక విశ్రాంతియు లభించిన ట్లుండును.

ఈ బదరీనాథతీర్థము హరిద్వారమునుండి సుమారు నూటయేబది మైళ్లదూరమున, గఢవాల్ జిల్లాలో నీలకంఠ నామక పర్వతపాదతలమున అలకనందానదీ తీరమందు వెలసియున్నది. మరియు నాలుగైదుమైళ్లు పొడవును, రెండుమైళ్లు వెడల్పును గల లోయయం దీక్షేత్ర మున్నదని చెప్పవచ్చును. సముద్రజలోపరిభాగమునుండి యీపట్టణముయొక్క యెత్తు ౧౦,౪౦౦ అడుగులు. కాని బదరీనాథపర్వతాగ్రము ౨౩,౨౧౦ అడుగుల యెత్తు గలిగి, ప్రచండగ్రీష్మఋతుమధ్యకాలమునందైన కరగని హిమానీపటలముల కాకరమై విష్ణుగంగా మున్నగు అలకనందయొక్క ఉపనదులకు జన్మస్థానమై చూపరుల హృదయములకు విస్మయానందముల గలుగజేయుచుండును. ఈశిఖరమే కాదు, ఈలోయకు ప్రాకారాకృతిగ నేర్పడియున్న పర్వతశృంగము లన్నియు నింతయే యెత్తు గలిగి, యిటులే హిమానీ ప్రస్తరములకు నిలయములై యున్నవి. చిన్నచిన్న మొక్కలు తప్ప ఈపర్వతము లన్నియు వృక్షవిహీనములు. కైలాస మానససరోవరములకు బోవుటకు నాలుగు ముఖ్యమార్గములు గలవు. వానిలో నొకటి ౧౮,౦౦౦ అడుగుల ఎత్తు గల మానాఘాటి (Mana Pass) గుండ బోవును. హరిద్వారమునుండి గఢవాల్ జిల్లాలోని శ్రీనగరముమీదుగా మానాఘాటి కేగవలయు నపుడ బదరీనాథముగుండనే పోవలయును. ప్రస్తుతబదరీ క్షేత్రమున కెగువ ౧౦, ౧౨ మైళ్లదూరమున అలకాపురి యుండెనని ప్రసిద్ధి. ఇప్పు డీయలక సకలము ఘనీభూతహిమాచ్ఛాదితమై యున్నది. అలకనందానది యామంచుగడ్డల యడుగుననుండి ప్రవహించుచు కొంత

దూర మీావలకు వచ్చినతరువాత దృష్టిగోచర మగుచుండును. బదరీనారాయణదేవాలయమున కెదుట ఫర్లాంగు దూరమున గంగ నీటి నానుకొని బ్రహ్మకపాలనామకతీర్థమున్నది. ఇచట పిండదాన మొనరించినయెడల పితరులు ముక్తి నొందుటచే పిండదాతలు పితృఋణమునుండియు ముక్తులగుదురనియు జెప్పుదురు. ఇచట పితరులకు పిండము వైచినవారికి మరల మంత్రయుక్తముగ పితృశ్రాద్ధ మొనరింపవలసిన యవసర ముండదు. ఈకారణము లన్నింటిచేత, అనగా బ్రహ్మకపాల, అలకానగర, మానాఘాటీల సన్నికర్షత్వమువలన, నితిహాసగోచరము కాని సమయమందుగూడ నిచట నొక దివ్యస్థాన ముండియుండవచ్చునని యూహించుట కవకాశము కలదు. జోషీమఠస్థాపనానంతరము శ్రీశంకరాచార్యులవారీబదరీనాథమును స్థాపించి సజాతీయుడగు నంబూరిబ్రాహ్మణుడే యచట ప్రధానార్చకుడుగ నుండునియమము నేర్పరచెనని చెప్పుదురు. ఈనియమపాలన మిప్పటికిని జరుగుచునేయున్నది. ఉత్తరమున శంకరాచార్యులవారి పీఠస్థానమగు జోషీమఠమునకును, బదరీనాథమునకును 19 మైళ్లదూర ముండును. చలికాలమున నీ 19 మైళ్లదూరము నీరు గడ్డగట్టుకొనిపోవుటచే గమనాగమనయోగ్యమై యుండదు. ఇప్పుడు బదరీనాథుని యాలయ మున్నచోట ప్రాచీనకాలమునుండియు నెన్నియో కట్టబడినవనియు, నవి యన్నియు బర్వతోర్ధ్వభాగములనుండి దొరలివచ్చు మంచుబండలవలన నాశనమైపోవ ఈదేవాలయము నూతనముగ నిర్మింపబడినదనియు జెప్పుదురు. ఈదేవాలయము మీది గోపురము కొంచె మించుమించుగ జగన్నాథదేవాలయగోపురాకృతిని గలిగియున్నది. కాని యంత ఎత్తును, వెడల్పును గాదు. పైభాగ మంతయు బంగారు నీటిపూతగల రేకుల తాపటము గలిగి రెండుమైళ్లదూరము నుండియే యాత్రికబృందములకు ఉల్లాసము గొలుపుచుండును. బదరీనాథకందరాహ్వాయసరోసరాంతరాళమున అలకనందానదీనామకమృణాలనాళముపై జెన్నొందు సువర్ణసరోజమోయన నీమందిరము భాసిల్లుచుండును.

హరిద్వారమునుండి ఈదివ్యస్థానమున కేగు మార్గమునందలి ప్రాకృతికసౌందర్యమును స్వయముగ జూచి యానందింపవలయునే కాని మరియొకవిధమున దెలిసికొనగోరుట వ్యర్థము. "తలమే బ్రహ్మకునైన నీవగ మహాత్త్వం బెన్న" అని పెద్దన్న యంతటివారె వచించియుండ నిక దక్కినవారలా, ఈప్రదేశముల నిసర్గరామణీయకమును ఉన్నదాని నున్నట్లు పాఠకులకు సాక్షాత్కరింపచేయగలుగుట? ఉత్తమకావ్యములందలి స్వర్గాదుల వర్ణనమును బఠించుతరుణమున మనస్సున కలౌకికానందము కలుగుట వాస్తవము. కాని ఈహిమాలయపర్వతములందలి దివ్యస్థలముల కేగు భాగ్య మబ్బినయెడల సాక్షాత్తు స్వర్గమున చేరినయటులే యాహ్లాదము కలుగును. నిజమునకు వీనికంటె భిన్నమగు స్వర్గము లేదనియే చెప్పవచ్చును. కావుననే ఏభాషాకవులైన గానిండు, వారివారి గ్రంథములందు స్వర్గాదుల వర్ణింపవలసివచ్చినపుడు ఇచటి యీనిసర్గమనోహరములగు పర్వతప్రదేశములనే, యిచటి యీ "యంబరచుంబిశిరస్సరజ్ఝరీపటలముల"నే, ఇచటి యీ కాదంబినీసమలంకృతదేవదారువనాకీర్ణమహీధరోపత్యకలనే, ఇచటి ఈగంధర్వయక్షకిన్నరాది కన్యకానివహ క్రీడాకలాప మంజులసికతాతలంబులనే, ఇచటి ఈసౌరభోపేత నానావర్ణకుసుమసంతానాకీర్యమాణ శాద్వలావృతకందరావళులనే, ఇచటి ఈతటీధ్మాతఘనహిమానీగ్రావసమాక్రాంతజలాశయంబులనే, ఇచటి ఈ యంతర్వాహినీసహగాహంబులనే తనివి దీర చిత్రించివైచిరి. అత్యంతప్రాచీనకాలమునుండియు ఋషి, మహర్షి, దేవ, దేవాంగనాసంసేవితమైన దీపవిత్రస్థలము. శరీరముతో స్వర్గమున కేగదలచినవారు బదరీనాథదర్శనమున కేగిన జాలును. అటుతరువాత స్వర్గమున కేగితిమా లేదా యనునిష్కర్షను వారు స్వయముగనే చేసికొనవచ్చును. ఈయాత్ర గావింపుచున్నంతకాలము ప్రతిదినము నూతనప్రదేశావలోకనంబునను, అనంతరము తదీయస్మరణప్రభావంబునను మనస్సున కవర్ణనీయమగు ఆనందము కలుగుచునేయుండును. అది యటులుండ, భిన్నభిన్న జలవాయుసేవనంబున దినదినము శరీరమం దొకనూతనవిస్ఫూర్తి కలుగును. వివిధదేశాగతయాత్రికజనసమావేశము లందు స్వకీయస్థితిగతుల నితరుల స్థితిగతులతోడ సరిపోల్చిచూచుకొనుట

మం దేవిధమైన కష్టములు పడకుండ యాత్ర గావించుకొని సురక్షితముగ మరల నిల్లు చేరవచ్చును.

సాధ్యమగునంతవరకు కొళాయినీటిని త్రాగవలయును. ప్రతిచట్టియందును ఒకటిరెండు కొళాయి లుండితీరును. మరియు ఊటనీటిని గాని, ధారాప్రవాహజలమును గాని త్రాగవచ్చునుకొని యేగుంటలయందో నిలువయున్న నీటిని ఏమరుపాటుననైన నుపయోగింపగూడదు. వైశాఖమునందే యాత్రకు బయలుదేరినవారు దారియందు ఎండవేడిమివలన భరింపజాలని దాహము జనింప నీరు కనుపడినచోటనెల్ల త్రావుచుందురు. ఇందువలన నుదరశూల పుట్టి జిగటవిరేచనము లారంభమగును. వెంటనే వైద్యము గావించుకొనక ఉపేక్షించినచో నుత్తరోత్తరమున మరింత బాధపడవలసివచ్చును. భోజన మెంత తేలికగ జీర్ణమగునదియైన నంత మంచిది. బాగుగ కాలికి అలవాటుపడిన జోడు మిక్కిలి యవసరము. లేనియెడల కంకరరాలు, కోసురాలతో నిండియుండిన పర్వతమార్గములందు వట్టికాళ్లతో నడచుటచే దెబ్బలు తగిలి, గాయములు పడి నెత్తురు గారుచుండ గుడ్డలను చుట్టుకొని నడువవలసివచ్చును. అట్టి సమయమున నాగాయములకు నీరు తగిలినచో చీముపట్టి ముందు నడక సాగదు. కావున కాలిజోడువిషయమై ముఖ్యముగ జాగ్రత్తను దీసికొనవలయును. ఇవి హరిద్వారమందును, మార్గమధ్యమందలి దేవప్రయాగ మొదలగు పట్టణములందును లభించును. వీనికి తోడు చేతి కర్రలుండవలయును. వెదురుకర్రలైన మంచిది. ఎగుడు దిగుడుమార్గముల నెక్కి దిగునపుడును, గడ్డకట్టిన మంచుమీద నడచునపుడును ఊతకర్రలవలన మంచిసాయము గలుగును. మకాము జేయ నెంచిన చట్టియందు జేరి యించుక విశ్రమించి స్నానము చేయవలయును కాని నడకవలన దేహమున వేడిమి యెక్కి యుండ జెమట యారకపూర్వమే పోయి చన్నీటిలో మునుగుట తగదు. అట్లు చేసినచో వెంటనే పడిసెము, జ్వరము కలుగవచ్చును. ప్రాతఃకాలకృత్యముల నిర్వర్తించుకొని యించుక భుజించి బయలుదేరుట మంచిది. అట్లు గాక నడువ మొదలిడిన కొంత సేపటికి దాహమగుటయు దాని సహించుకొనజాలక నీరు త్రాగుటయు గలుగును. ఇందుమూలమున జీర్ణశక్తి క్షీణించును. ఈపైవిషయములను గణింపక ఇష్టాహారవిహారము లొనరింపగడగినచో వెంటనే నెత్తురుబంకవిరేచనములు, కడుపునొప్పి, స్ఫోటకము, జ్వరము, శిరోవేదనము లోనగు రోగములలో నేదియోయొకటి కలుగును. ఈరోగముల కారణమున యాత్రావసరములందు నొందదగిన సౌఖ్యము లేకపోవ నానావిధయాతనల నందుచు "ఎందులకు వచ్చిన దీయాత్ర దైవమా!" యని తమ్మును, దైవమునుగూడ నిందించుకొనుచు, తుద కేదోవిధమున యాత్రను ముగించుకొని యిల్లుచేరినతరువాతగూడ నారోగమునుండి ముక్తిగానక, చివరకు జీవనయాత్రనే ముగించుకొనిపోవువారును అనేకులు గలరు. జ్ఞానవివేకముల గలిగియుండియు, నుచితరీతి వానినుపయోగించుకొనజాలని మూఢాచారపరాయణులగు స్త్రీపురుషులే తరచుగ నిట్టి యకాలదుర్మరణంబులకు గురియగుచుందురు. కావున యాత్రికులు తినుబండారముల విషయమునను, ఆచరణములందును జాగరూకత గలిగియుండవలయును. దౌర్భాగ్యవశమున యాత్రికు లిట్టిరోగముల పాలగుచో వెంటనే వైద్యము చేసికొనుటకుగాను అవసరములగు నౌషధములను హృషీకేశమందలి మఠమువారే యిచ్చుచుందురు. ఇంటినుండి బయలుదేరునపుడే యీపైన వ్రాసిన రోగముల కుపయోగించు మందుల దగ్గర నుంచుకొనుట మంచిది. ఏమందును లేకపోయిన అమృతధారానామక - ఔషధమునైన తప్పక దగ్గర నుంచుకొనవలయును. దీని నెవరు పట్టిన వారే తయారుచేసికొనవచ్చును. కర్పూరము, వాముపువ్వు, పిప్పర్ మింట్ స్ఫటికములు, ఈ మూడు వస్తువులను సమభాగములుగ దీసికొని యొకసీసాయందుంచినయెడల ద్రవముగ మారును. దీనియం దనేకగుణములు కలవు. అజీర్ణమున కిది రామబాణమువంటిది. మరియు నేమందుతోనైన మేళవించిన నామందు యొక్క గుణమును వృద్ధిబొందించును. ప్రతియాత్రికుడును నీమందుసీసా నొకదాని దగ్గర నుంచుకొని తీరవలయును. మార్గమునపొడుగున పదేసిమైళ్ల యంతరమున సర్కారువారి విశ్రాంతిగృహము లున్నవి. వీనియందు

దిగవలచినవారు గఢ్వాల్ జిల్లా ఇంజనీయరుయొక్కగాని, టిహిరీరాజ్యాధికారులయొక్కగాని యనుమతిని దీసికొని దిగవచ్చును. దినమున కెనిమిది లేక పదిమైళ్లకంటె నెక్కువ ప్రయాణము సలుపుట ఉచితము కాదు. యాత్ర నెటులైన త్వరలో ముగించుకొనవలయునని శక్తికి మించి నడువబోయిన దుఃఖదాయక మగును. ప్రాతఃకాలము పదిగంటలలోపల నెంత నడువగలిగిన నంత మంచిది. సాయంకాలము నడచుట బొత్తిగ గూడదు. ఒకవేళ నడువనెంచినను సూర్యాస్తమానము గాకపూర్వమే ఏదోయొకచట్టీ చేరవలయును. చీకటి పడినవెనుక నడచుట ఎంతమాత్రము తగదు. దొంగలు, జేబులగత్తిరించు దుర్మార్గులు యాత్రికులు ద్రవ్యవంతులైనచో వారు బయలుదేరుస్థలమునుండియే బయలు వెడలి వెన్నంటి ప్రయాణముసలుపుచు సమయము గని పట్టి తమకార్యముల సంపన్నముచేసికొని పోవుచుందురు. యాత్రికు లిట్టిదుష్టుల గనిపట్టి అప్రమత్తులై యుండవలయును. ఎల్లప్పుడీ పర్వతములందు నివాసముచేయువారు ఇట్టి దొంగతనముల కింకను నలవడియుండలేదు. మైదానములందలి వారికంటె వీరికి ధర్మభీతి యెక్కువ. కాని క్రీస్తుశకవింశతిశతాబ్దియందలి యాంగ్లేయు లను మార్వాడీలు పోయగడగిన నాగరికత యను హోలీరంగునుండి యీపర్వతీయు లెంతకాలమువరకు దప్పించుకొని యుందురో తెలియదు. యాత్రికు లేచట్టియందైన దిగి స్నానాదికార్యములనిమిత్త మిటునటు బోయినసమయమున అంగడివారే యా యాత్రికుల సామానులను గనిపట్టి యుందురు. కాని స్వంతమనుష్యు నొకని సామానువద్ద నుంచిపోవుట ఉత్తమము. రొక్కముమాత్ర మెల్లప్పుడు దగ్గర నుంచుకొనవలయును. కొన్ని కొన్ని చట్టీలయందు పూరీ మున్నగునవి యమ్మబడుచుండును. అట్టివాని నుపయోగింపక భోజనమును స్వయముగా సిద్ధపరచికొని దినమున కొక్కపర్యాయము భుజించువారు సాధారణముగా జబ్బుపడరు. రాత్రిపూట దొరకినయెడల పాలు ద్రావియో లేక ఫలాహారమునుసలిపియో గడుపవలయును. జోషీమఠముతరువాత మకాములందు తేనీరువంటి యుష్ణమైన పదార్థమును సేవించవలయును. కుంకుమపువ్వు, లవంగములు, మిరియములు, దాల్చినచెక్క, శొంఠి, ధనియాలు, లోనగువస్తువులను చూర్ణముగావించికొని యుంచికొనినయెడల వీనితో తయారగు కషాయము తేయాకు నీటికంటె నెక్కువగుణము నొసంగును. ఇవన్నియు నిటులుండ యాత్రావసరములందు తైర్థికులు అహింసా, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, భూమిశయనము, ఏకభోజనము, రజస్తమోగుణపదార్థవర్జనము, మొదలగువాని నియమముతో బాలించవలయును. చట్టీలయందు వందలకొలది యాత్రికులు సమావేశ మగుచుందురు. అట్టివారితో సభ్యతాపూర్వకవ్యవహారముల సలుపుచుండవలయును. బదరీనాథయాత్రాఫల మందు సగము అచటికి జేరుటకు పూర్వమే లభించును. మిగిలినది స్వామిదర్శనంబునను, తప్తకుండజలావగాహనంబునను, బ్రహ్మకపాలతీర్థసంసేవనంబునను సంపూర్తి యగును. దేవాలయమందు లోపల మధ్య బదరీనాథుని విగ్రహంబును, కుడిప్రక్కను కుబేరగణాధినాథమూర్తులును గలవు. వామపార్శ్వమున లక్ష్మియు, నరనారాయణవిగ్రహములును గలవు. ఈమల్కమున ఎదురుగ నారదగరుడోద్ధవుల మూర్తు లున్నవి. ఈదేవాలయము నుండి 70, 80 యడుగుల క్రిందుగ నున్న తప్తకుండ జలంబుల స్నాన మొనరించి యాత్రికులు బదరీనారాయణుని దర్శించి కృతకృత్యు లగుదురు. మందిరము లోపలిభాగమున స్థలము చాల ఇరుకుగ నుండును. కావున సావధానముగ స్వామిదర్శనము చేసికొనవలయును. మరియు పూజాకైంకర్యంబుల గావింప నెంచిన ఒకదినము ముందుగనే యేర్పాటులను జేసికొనవలయును. పదివేల యడుగులకంటె నెత్తైన ప్రదేశ మగుటచేతను, మంచు గడ్డలు కరగి వానిమధ్యమునుండి ప్రవహించి వచ్చు జల మగుటచేతను నిచట గంగాస్నాన మొనరించుట కష్టము. కాళ్లుచేతులు కొంకరులు పోవును. కాబట్టి యాత్రికులందరు తప్తకుండమునందే స్నానము చేయుచుందురు. మరియు నీతప్తజలస్నానమున చర్మవ్యాధు లనేకములు నశించును. ఒకే తప్తజలస్రోతస్సునుండి వచ్చు వేడినీటిని చిన్నచిన్న కాలువలద్వారా మూడునాలుగుమార్గముల బ్రవహించునట్లు చేసియున్నారు. అందొక ప్రణాళిక

తప్తకుండమునకును, మరియొకటి స్వామికైంకర్యార్థ ముపయోగింపబడు కుండమునకు, వేరొకటి తిన్నగ గంగలోనికిని ప్రవహించుచుండును. ఈమూడునాళికల నీరు పరిశుద్ధమైనదే కాని తప్తకుండమున జనులు స్నానము చేయుటం జేసి యిది పానార్హము కాదు. తక్కిన యొక్కడినీటినైన ద్రావవచ్చును. ఈతప్తజలము త్రాగుటకు వెగటుగను, ఘనకగను నుండును కాని మూడుదినములు సేవించిన జాలును, ఎట్టి మందాగ్నియైనను బటాపంచలగును. ఈజలమును సేవించుచు కనీసపక్షము 10 దినము లుండిన జాలు, ఎట్టి దుస్సాధ్యరోగమైనను పోవునని చెప్పవచ్చును.

అటుతరువాత యాత్రికుల ముఖ్యకర్తవ్యము బ్రహ్మకపాలముపై శ్రాద్ధము. బ్రహ్మకపాల మనునది బృహదాకారమున నొప్పు పాషాణము. అలకనందాతీరమున ఒడ్డునుండి నీటిలోనికి బోయియున్నది. ఇచట నదీవేగము ప్రచండము. జల మగాధము. ఈబ్రహ్మకపాలము ఎంతలోతునీటిలోనికి దిగియున్నదియు తెలియదు. మూడువైపుల జల మున్నది. ఒడ్డును తగిలియున్న ప్రక్కను హోమాదిక్రియాకలాపనిర్వహణార్థము మంటపము నిర్మింపబడియున్నది. ఈబ్రహ్మకపాలముపై నాసీనులై పితృలోకగతులగువారి కందరకు శ్రాద్ధకర్తలు పిండదాన మొనరించి యావల నాపిండములను గంగలో కలుపుచుందురు. బదరీనారాయణునకు నైవేద్యము పెట్టబడిన అన్నపాత్రమును దీసికొని యందలి యన్నముతో నచటనే బ్రహ్మకపాలముపై పిండదానము గావింపవలయును. వేరువంటకము పనికిరాదు. ఈపాత్రము అర్చకులనుండియే లభించును. కాని కాళ్లకు వులెన్‌స్టాకింగులు, వులెన్ ట్రవుజర్లు, షర్టులు, కోట్లు, వులెన్ మెడపట్టాల గట్టికొని శ్రాద్ధముబెట్టింపవచ్చు పురోహితులవారిం జూచిన ఆంధ్రులకు విస్మయము కలుగక పోదు. కాని యీ శీతలప్రదేశములందలి యాచారమే ఇట్టిది. వెంట నెవరైన స్వదేశపుపురోహితు లేతెంచినచో వారి ద్వారా గాని లేక పుస్తకసాహాయ్యమున స్వయముగ గాని శ్రాద్ధవిధి నిర్వర్తించుకొనగలిగిన మంచిదే. కానిచో నా మాటునెక్కైలవారిచేతనే సకలము సంపన్నము చేయించుకొనవచ్చును. ఈప్రదేశమునుండి నాలుగుమైళ్లు మీదవసుధారానామకనిర్ఝరిణీప్రపాతము లున్నవి. ఇవి మిక్కిలి దర్శనీయములు. కాలిబాట తప్ప మంచిమార్గము లేదు. మధ్య నొకహిమానీనదము (glacier) ను దాటవలసివచ్చును. ఈప్రపాతదర్శనార్థము ప్రాతఃకాలమందే పోవలయును గాని సాయంకాలము కూడదు. ఈప్రదేశములందు సాయంత్రము నాలుగుగంటలకే ప్రొద్దుగూకిన ట్లుండును. దీనికితోడు మేఘములు, పొగమంచు గ్రమ్ముకొనియుండును. ఒకొక్కప్పుడు వర్షము కురియును. ఇందువలన నేమియు గనుపడదు. కావున వసుధారాప్రపాతదర్శనమునకు బోవుటకు ప్రాతఃకాలమే మంచిది. ఇవి గాక బదరికాశ్రమమందు నారదశిల, నృసింహశిల, వరాహశిల, గరుడశిల, కుబేరశిలానామకపంచశిలలును, వహ్ని, ప్రహ్లాద, నారద, కూర్మ, ఋషిగంగానామకపంచతీర్థములును సేవనీయములు. మరియు చరణపాదుకా, శేషనేత్ర, వేదధారా, మాతామూర్తి, వ్యాసగుహ, భీమశిల లనుపేర నొప్పు దర్శనయోగ్యస్థలములును గలవు.

హరిద్వారమునుండి బదరీనాథమువరకు గల చట్టీలపేళ్లును, వాని పరస్పరదూరమును, వానియందలి విశేషములును నీదిగువ పొందుపరచిన పట్టీవలన విశదమగును. ఈప్రాంతములందు సేవాసమితుల నేర్పరచి యాత్రికుల సౌకర్యములకై పాటుపడుచున్న శ్రీబ్రహ్మచారి చక్రధరశర్మగారి చిత్రమునుండి యిందలి చిత్రపటము గైకొనబడినది.

## హరిద్వారమునుండి తిన్నగ బదరీనాథమునకు 183 మైళ్లు

| సంఖ్య | చట్టీపేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము దూరము | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 1 | హరిద్వారము | - | - | ఇది యొక విఖ్యాతమగు తీర్థము. ఇచట ముండన స్నాన పిండదానాదులును, తర్పణములును జరుపబడును. |
| 2 | సత్యనారాయణమందిరము | 8 | 8 | ఇచట సత్యనారాయణమందిరమును, కాలీకమలీబాబానామక సాధువు స్థాపించిన క్షేత్రమును గలవు. |
| 3 | హృషీకేశము (ఋషీకేశము) | 6 | 14 | ఇచట రామచంద్ర, భరతమందిరము లున్నవి. కాలీకమలీ బాబావారి కేంద్రస్థానము. మార్గమందలి వీరి ధర్మశాలలో మకాముచేయుటకును, బీదలగువారికి సదావర్తి దొరకుటకును చీట్లు ఇచటనే యీయబడును. |
| 4 | మునీ కీ రేతీ | 1½ | 15½ | ఇచట టిహిరీనరేశునిశిల్పశాల, వైద్యశాలలు కలవు. యాత్రికులీప్రదేశమందే కూలీలను, డండీలను, డోలీలను గుదుర్చుకొనవలయును. గుర్రములుగూడ నిచటనే దొరకును. మరియు నిచట బ్రహ్మచర్యాశ్రమము, దర్శనమహావిద్యాలయము లనుసంస్థలు గలవు. శత్రుఘ్నునిమందిరము గూడ నున్నది. |
| 5 | లక్ష్మణఝూలా | 1½ | 17 | ఈప్రాంతములం దున్న వంతెన లన్నింటికంటె పెడల్పయిన సస్పెన్షన్ వంతెన ఇచట గంగ కడ్డముగ గట్టబడియున్నది. మరియు లక్ష్మణునిదేవాలయమును, ఒక బ్రహ్మచర్యాశ్రమము, వంతెన దాటినతోడనే కుడిప్రక్కను స్వర్గాశ్రమమును గలవు. ఈ స్వర్గాశ్రమమున కెదురుగ గంగ కీవలి ప్రక్కను శ్రీస్వామి రామతీర్థులవారి యాశ్రమ మున్నది. |
| 6 | గరుడచట్టీ | 2 | 19 | లక్ష్మణఝూలానుండి యిచటివరకు మార్గము సరళమై, నానా వృక్షాకీర్ణమై వనమువలె నుండును. |
| 7 | ఫుల్ వాడీ | 2 | 21 | మనోరంజకమగు సరళమార్గము. |
| 8 | గులర్ చట్టీ | 2 | 23 | ,, |
| 9 | నా ఈ మోహన్ | 3 | 26 | ,, ఇచటనుండి ముందు 4 మైళ్లవరకు ఎగుడుమార్గము. |
| 10 | ఛోటీ బిజ్నీ | 2 | 28 | ,, |
| 11 | బడీ బిజ్నీ | 1 | 29 | ,, |

| సంఖ్య | చట్టీపేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము దూరము | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 12 | కుండ చట్టీ | 3 | 32 | ఇక్కడి జల మత్యంతశీతలమును స్వాదిష్ఠమును, నైయుండును. |
| 13 | బందర్ భేల్ | 3 | 35 | దిగుడుదారి. కొండశిఖరమునుండి గంగయొక్క నీటి మట్టము వరకు దిగవలయును. |
| 14 | మహాదేవ్ | 3 | 38 | సరళమార్గము. మంచిస్థానము. |
| 15 | సేమల్ | 4 | 42 | మార్గము కొంతవరకు సరళము. తరువాత నెగుడు తగులును. |
| 16 | కాండీ | 3 | 45 | ఇచట నొక సదావర్తి యిచ్చు క్షేత్రమును, ఆసుపత్రియు గలవు. |
| 17 | వ్యాసఘట్టము | 4 | 49 | సరళమైన దిగుడుదారి. మరియు నిచటనుండి 36 మైళ్లవరకు సమానమైన మార్గము. ఎగుడుదిగుళ్లు బొత్తుగ లేవు. ఇచట నొక పోస్టాఫీసు ఉన్నది. |
| 18 | ఉమ్రాసూ | 5 | 54 | మంచిస్థానము. |
| 19 | దేవప్రయాగ | 4 | 58 | అలకనందా, భాగీరథీనదుల సంగమందలి మనోహరస్థానము. వెడల్పునందు, వేగమునందు, జలముయొక్క వర్ణమందు రెండును సమానమైన నదులు. ఈరెండును గలియు చోట ప్రవాహముల పరస్పరఘర్షణమువలన వేడిమి జనింప జల మించుక ఉష్ణముగ నుండును. కాని యీరేఖ కీవలగాని యావలగాని చేయి పెట్టిన మంచులో పెట్టినట్లే యుండును. ఇచట యాత్రికులు పిండదానమును, తర్పణమును చేయుదురు. రఘునాథుని మందిరము కలదు. చలికాలమున బదరీనాథుని పండా లందరు నిచటనే యుందురు. బదరీనాథమున కేగు మార్గ మిచట చీలును. గంగోత్రికి బోవు యాత్రికులు భాగీరథీవెంటను, బదరీనారాయణమున కేగువారు అలకనందావెంటను బోవుదురు. |
| 20 | రాణీ బాగ్ | $8\frac{1}{2}$ | $66\frac{1}{2}$ | మంచిస్థానము. |
| 21 | కోట్లా | $1\frac{1}{2}$ | 68 | ఇచట నొక ఇన్స్పెక్షన్ బంగాళా ఉన్నది. |
| 22 | రామ్పూర్ | 2 | 70 | మంచిప్రదేశము. రెండుమైళ్లమీద దేవల్ చారిపాఠశాల ఉన్నది. |
| 23 | బిల్వ కేదార్ | 4 | 74 | ఇచట భిల్లేశ్వర మహాదేవాలయము కలదు. |

| సంఖ్య | చట్టీపేరు. | చట్టీల పరస్పరదూరము, మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము దూరము, మైళ్లు. | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 24 | శ్రీనగరము | 8 | 77 | ఇది గఢవాల్ జిల్లాకేంద్రస్థానము. కాశ్మీరమందలి శ్రీనగరము వలె నిదియు మనోహరమైన లోయయందున్నది. ఒకమారు గంగాప్రవాహమువలన కొట్టుకొనిపోవ నూతనముగ నిర్మింపబడిన దగుటచే బజారులన్నియు దీర్చినట్లుండును. కాని మైదానములందలి పట్టణములలో కలుగు అలజడి యిచ్చట నున్నట్లు గావరాదు. పట్టణమంతయు నిద్రపోవుచున్నటు లుండును. ఇచట సంస్కృతపాఠశాల, కన్యాపాఠశాల, గవర్నమెంట్ హైస్కూలును గలవు. |
| 25 | సుక్రతా | 5 | 82 | సరళమార్గము. |
| 26 | భట్టీసేరా | 2½ | 84½ | ఇక్కడనుండి ముందు ఒక్కమైలు ఎగుడు మార్గము. అనగా ఒక్కమైలుఎత్తు ఎక్కవలయును. |
| 27 | ఛాంతిఖాల్ | 1 | 85½ | ఇచట నొక ఇక్స్పెక్షన్ బంగాళా కలదు. |
| 28 | ఖాంకరా | 2½ | 88 | దిగుడుదారి. మంచిస్థానము. |
| 29 | నర్కోటా | 2½ | 90½ | కొంతదూర మెక్కుడు, మరి కొంతదూరము దిగుడు నైన మార్గము. |
| 30 | గులాబ్ రాయ్ | 3½ | 94 | కొంచె మెగుడుదిగుడైన మార్గము. |
| 31 | రుద్రప్రయాగ | 1 | 95 | ఇచట మందాకిని వచ్చి అలకనందలో గలియును. రుద్రనాథుని మందిరము గలదు. ఇచటనుండి కేదారనాథమునకు బోవుమార్గము చీలును. |
| 32 | శివానందీ | 7 | 102 | సరళమార్గము. |
| 33 | కమేడా | 3½ | 105½ | సరళమార్గము. ఇచ్చట మంచియంగడులు కలవు. |
| 34 | చటుంత పీపల్ | 6 | 111½ | .మంచిస్థానము. పరిపక్వములగు అరటిపండ్లు ఇచట విస్తారముగ దొరకును. |
| 35 | కర్ణప్రయాగ | 4 | 115½ | ఇచటనుండి యొకమార్గము రామనగరమునకును కాఠగోదామునకును బోవును. |
| 36 | జైకండీ | 4½ | 120 | సరళమార్గము. |
| 37 | సంగాసూ | 2 | 122 | ,, |
| 38 | సోనలా | 3 | 125 | ఇచ్చట ఇక్స్పెక్షన్ బంగాళా యొకటి కలదు, |

# హిమాలయ తీర్థములు

బదరీనాథము, కేదారనాథము, గంగోత్రి, యమునోత్రీలకు మార్గముల జూపుపటము



| సంఖ్య | చట్టీపేరు. | చట్టీల పరస్పర దూరము- మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము మైళ్లు. | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 39 | నందప్రయాగ | 3 | 128 | ఇచట నందా అలకనందాల సంగమము. స్నానఘట్టము చాలా దూరమున నున్నది. నిర్మింపబడిన గట్టిఘట్టమేమియు లేదు. రెండు నదులు గలసినచోటు జూచికొని స్నానము చేయవలెను. |
| 40 | చమోలీ | 7 | 135 | ఇది గఢవాల్ జిల్లా తాలూకాలలో నొకటి. రుద్రప్రయాగనుండి చీలి కేదారనాథము పోవువారు ఆదేవుని దర్శించి వెనుకకు దిరిగి బదరీనాథమునకు బోవుటకై యిచటికి వచ్చి యీమార్గములో గలియుదురు. దేవప్రయాగ, శ్రీనగరము దాటినతరువాత నిదియే పెద్దపట్టణము. |
| 41 | మఠ | 2 | 137 | కడు రమణీయమగు ప్రదేశము. ఇచట నొక సుందరమైన తోట కలదు. |
| 42 | సియాళ్ సైణ్ | 3 | 140 | ఇచట మంచియంగడులు కలవు. |
| 43 | హాట్ | 1 | 141 | ఇక్కడినుండి మరల మార్గము ఎగుడు. |
| 44 | పీపల్ కోటి | 2 | 143 | చమోలీతరువాత నిది మంచిపట్టణము. శిలాజతు, చామరములు లోనగు పర్వతప్రదేశములం దుత్పన్నములగు పదార్థము లన్నియు నిచట దొరకును. |
| 45 | గరుడగంగా | 4 | 147 | ఒకవిధమగు రక్షగ దగ్గర నుంచుకొనుటకై యాత్రికు లిచటి నుండి చిన్నచిన్న రాళ్ల నేరి తీసికొనిపోవుదురు. |
| 46 | టంగనీ | 2 | 149 | కొంచెము ఎగుడైన మార్గము. |
| 47 | పాతాలగంగా | 2 | 151 | సరళమైన మార్గము. |
| 48 | గులాబ్ కోటీ | 2 | 153 | ,, |
| 49 | హేలంగ్ | 2 | 155 | ఊర్గమబదరీ యను వేరొకస్థానమునకు బోవువా రిచట నదిని దాటి యాప్రదేశమునకు బోవుదురు. |
| 50 | ఖనోటీ | 1 | 156 | ఇక్కడనుండి అరమైలు అడుగున ధ్యానబదరీనామకక్షేత్ర మున్నది. |
| 51 | జోషీమఠము | 8 | 164 | దీనిని జోతిర్మఠమనియు బిలుచుచుందురు. శ్రీనృసింహ, బదరీనాథ ఆలయములు కలవు. చలికాలమున బదరీనారాయణుని పూజాపురస్కారము లన్నియు నిచటనే జరుగుచుండును. ఉత్తరమున శ్రీశంకరాచార్యులవారు దీనిని స్థాపించిరని చెప్పుదురు. ఇది చమోలీకంటె పెద్దపట్టణము. |

| సంఖ్య | చట్టీపేరు. | చట్టీల పరస్పరమార్గము-మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము దూరము మైళ్లు. | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 52 | విష్ణుప్రయాగ | 2 | 166 | ఇచట ధౌలీగంగా, అలకనందానదుల సంగమ మున్నది. ఇచటినుండి చలి యధికమగుచుబోవును. |
| 53 | ఘాట్ | 4 | 170 | మార్గ మెగుడుదిగుడు. రాత్రికాలమున బొత్తుగ ప్రయాణము చేయగూడదు. ఇచ్చట గంగలోనుండి నీరు మిక్కిలి జాగరూకతతోడ దీసికొనవలయును. నురుగులుగట్టు కెరటములు మహావేగముతో మూడు నాలు గడుగుల ఎత్తు లేచుచుండును. |
| 54 | పాండుకేశ్వర్ | 2½ | 172½ | ఈప్రదేశమందే యోగబదరియు, పాండవుల విగ్రహములును గలవు. ఇచటనుండి ముందుముందు మంచుగడ్డల పారంగములగుండ బోవుచున్నంత చల్లగ నుండును. ఒక్కొక్క లోయయందు దేవదారువృక్షముల గుంపులు మేఘములు శిఖరములపై తాండవమాడుచుండ, కేవల స్వర్గమును దలపించును. |
| 55 | శేషధారా | ½ | 173 | ఇచట నొక వైష్ణవాశ్రమము కలదు. |
| 56 | లామబగడ్ | 2½ | 175½ | ఇచటనుండి హనుమాన్‌చట్టివరకు గలమార్గము మహావికటము. మెట్లుగ దొలువబడిన పాషాణములమీద నెక్కుచు బోవలయును. |
| 57 | హనుమాన్‌చట్టీ | 4 | 179½ | ఇచ్చట హనుమంతుని దేవాలయ మున్నది. ఇచటినుండి బదరీనాథమువరకు నొకటే యెగుడు. మార్గమందు హిమానీనదముల (glaciers) మీదనుండి దాటవలసివచ్చును. కావున బయలుదేరుటకు ముందే మార్గము స్థితిగతుల నడిగి తెలిసికొని మరియు బయలుదేరవలయును. |
| 58 | దేవదేఖిణీ | 3½ | 183 | ఇచటనుండి బదరీనాథుని మందిరదర్శన మగును. |
| 59 | బదరీనాథపురి | ¼ | 183¼ | ఇచటి విషయ మంతయు నింతకు బూర్వమే వ్రాయబడినది. దీనికే విశాలబదరీ యని పేరు. కావుననే "శ్రీబదరీ విశాలలాల్ జీ కిజయ్" అని యాత్రికులు జయకార మొనరింతురు. స్వామిదర్శనమున మానవజన్మము సార్థకమగును. |




డాక్టరు, నిడమర్తి ఈశ్వరప్పగారు

శ్రీకృష్ణపదసరసీరుహద్వితయము మూఁదల మోసి తత్సేవఁ జలుపువాఁడ
నిరతమ్ము భక్తితత్పరత మూనులఁ బోలి వాయు వాదరువుగా బ్రదుకువాఁడ
గాన మెందేని నాఁవీనులం బడినంత మేన్వొంచి తల నూఁచి మెచ్చువాఁడఁ
గనులు వీనులతోడఁ గలిసిన ద్విజుఁడనై శివునికైదండఁ గైసేయువాఁడ
నరుఁడు నాకంటఁ బడకుండ నరునికంట - నేనుఁ బడకుండ నెంతయు నియమ మూని
పాదముల నేల మోపక పరమనిష్ఠ - మేను వంచి తపింతు వాల్మీకి నాదు.

భాగవతగరిష్ఠుఁడనంచుఁ బరమభక్తి - సంబరముతోడ నాగులచవుతినాఁడు
పూలఁ బూజించి పాలుఁ బప్పాలును బెట్టి కొలువరే నన్ను బాణవిద్యలను గాల్చి?
మీర లర్పించుభక్ష్యము లిమ్ముగఁ దలఁచి - యకట వెలికి నాతల వెట్టునంతఁ జిదుక
మొత్తఁజూతురుగద పుణ్యపురుషులార "చంక దుడ్డును శరణార్థి "సార్థకముగ.

ఉరము శిరము నేల నూన మ్రొక్కుదుఁ గాని - యుఱక మిమ్ము నెపుడుఁ గఱవఁ బోను
తోఁకఁ ద్రొక్కునపుడ తోడ్తోన కోపాన - నోడ లెఱుఁగక కాటు నిడుదునేమొ?

చీఁకటులను మీరు చేలాంతరులఁ బట్టి - సద్దుఁ జేయు చేగ సాఁగిపోదుఁ
బగళులందుఁ బుట్టపట్టు వీడక యుందు - నరులు మీఁదుజోలి నా కదేల?

---

# అర్ధాంగి

శ్రీమతి క్రమధాటి జానకీ గిరి గారు

దైవ సృష్టి అత్యంతవిచిత్రము. క్రిమికీటకములు మొదలు అత్యున్నతదశయం దుండు మానవ జాతి సైతము జననమరణములకును, కష్టసుఖములకును అధీనములు.

ఇట్టి విచిత్రసృష్టి కేవలము దైవచైతన్యము తోనూ, మానవధర్మములతోనూ జరుగుచున్నది. దీనికి స్త్రీపురుషులు ప్రధానకర్తలు. ప్రాణికోట్లన్నియూ ఈ జాతిభేదములతో గూడియున్నవనుట సర్వజనవిదితము. ఇందు వీరియొక్కటి లేకున్ననూ సృష్టి జరుగజాలదు. కాన ఇరుతెగలునూ పరిసమానములే.

ఇతరప్రాణుల విషయ మటుంచి జ్ఞానభూషితు లగు మానవుల నెత్తుకొందము. సృష్టికర్తృత్వమునందు మాత్రము స్త్రీపురుషులు పరిసమానులు గాని తదితరము లగు బుద్ధిబలదేహబలమనోబలములయందు పురుషులే ఎక్కువయని కొందరు చెప్పుచున్నారు. ఇది యసమంజసముగ తోచెడి. స్త్రీలయం దెంతమంది ధీవిశారదలగు శారదలు లేరు! రణాంగణమున పురుషులకన్న నెక్కువ శౌర్యసాహసముల చూపించిన వీరాంగన లెందరు లేరు! దుర్జేయమగు అరిషడ్వర్గము నడంచి దివ్యమోక్షపదవి నందిన కాంత లెందరు లేరు! విస్తరభీతిచే వారి పేరుల పేర్కొన నలవిగాకున్నది. ఇం తేందుకు, ఇప్పటి సత్యాగ్రహిణులలో నొక్కొక్క సోదరి ధైర్యోత్సాహముల నెంతేని వర్ణింప వచ్చునే! ఇది మూడ నిష్పక్షపాతియగు భగవంతు డిరుతెగలవారికిని సమస్తగుణసంపదలను సమముగ నొసగియున్నాడు, అని చెప్పవలసియున్నది. ఇంకనూ స్త్రీలయందే కష్టసహనాది గుణాతిశయము లుండుట చూడ స్త్రీలే ఒక్కమెట్టెక్కువ యని కూడ చెప్పదగియున్నప్పుడు ఇరువురును పరిసమాను లనుమాట తప్పులమాట కాదుగదా! ఐనను ఇది ఇట్లేయని దేనిని గాని నిర్ధరించుట కష్టము. ఏలన, లోకము భిన్నరుచులతో నిండియున్నది. ఒక్కొక్కరి యభిప్రాయ మొక్కొక్కవిధము. పశుపక్ష్యాదిజంతువులు స్త్రీజాతినే ఎక్కువగ మాచుచున్న వనియూ, వాటి ప్రేమ నడయుట కెంతయో ప్రాకులాడుచున్న వనియూ తెలియవచ్చుచున్నది. మానవులు జ్ఞానాధికులు గాన వారి నడవడి యీయల్పజాతులకన్న భిన్నముగ నుండుట న్యాయముగదా!

ఇక నీ ఎక్కువతక్కువల వాదము చాలించి ప్రస్తుతమునకు వత్తము. లోకమున స్త్రీపురుషుల యైకమత్యమే సమస్తశుభములకును మూలము. ఇట్టి యైకమత్యము వ్యాపింపజేయ స్త్రీయే సమర్థురాలు. స్త్రీ సృష్టిలో నర్ధాంగి. ఇట్లుండ భారతీయులు తమ కాంతలను లాఘవము చేయుచున్నారనియూ, వారిని తమయూడిగమునకై నిర్మింపబడిన కూలీలుగను, తమపిల్లలను పెంచి పెద్దచేయు దాదులుగను తలచుచున్నారనియూ కొందరి యభిప్రాయము. కాని ఇట్టి దురభిప్రాయము పురుషులందరియందు నున్నదనుట తెలివిమాలినతనము. పురుషులందరు నిట్టి యభిప్రాయముల గల్గియున్న నిక ప్రపంచము తలక్రిందు గావలసినదే.

క్షమాశాలినులని అనాదిగా విఖ్యాతి గాంచిన భారతరమణులు తెలివిలేని ఈమాటల నమ్మి తోకత్రొక్కిన త్రాచులవలె పురుషులపై గినియుటెంతయు అనుచితము. ఇది గాక మానమే భూషణముగా గలిగి, పాతివ్రత్యమే పరమధర్మముగ నెంచు భారతాంగనలు, పాశ్చాత్యాంగనలనవనాగరికతలను, వారి స్వేచ్ఛావిహారములను, వారి స్వాతంత్ర్యములను చూచి దిగ్భ్రాంతి చెందినవారై, వారిచర్యలకు మోహితలై అమూల్యములగు తమయీ పాతివ్రత్యాద్యలంకరణములను దుమపాలి త్రాచుబాములనుగా నెంచుచున్నారు. అక్కటా! ఎంత అజ్ఞానము! అజ్ఞానులని, అల్పములని వేనిని మనము నిర్లక్ష్య

మెలగుచున్నారో, అట్టి పశుపక్ష్యాదులు సహితము ప్రజ్ఞానఘనులని విఱ్ఱవీగు మనుష్యుల నించుకేని యనుకరింప ప్రయత్నింపకున్నవే! అట్టి యజ్ఞానులు, సృష్టికి ప్రభువులని గర్వపడుమానవులు పరిసమానులైన తమతోడి మానవుల మాచి భ్రాంతులగుటా! హైందవసుదతులు పాశ్చాత్యసుందరుల పద్ధతులకు పరవశులగుటా! చైనా కాంతల చేతల చూచి తన్మయులగుటా! తమ సనాతన ధర్మముల ధిక్కరించుటా! తగదు, తగదు.

ఇట్లని పాశ్చాత్యుల పద్ధతులను తప్పులుపట్టుట చాలతప్పు. వారివేషభాషలు వారికి బాగు గాని భారతీయుల కవి పనికిరావు. వారి వేషభాష లవలంబించి యానందించుటకు మారు వారియందుగల సుగుణముల నలవరచుకొనిన నెంతయో లాభము. వారికుండు ఐకమత్యమే వారి నింతవారిని జేసె ననవచ్చును. వారి కార్యధురంధరతయే వారి నింత యున్నతపదవికి తెచ్చియున్నది. మన స్త్రీలలో నైకమత్యము సున్న. కాబట్టి వారియందుండు నీ సద్గుణముల నవలంబించి తమకు స్వాభావికము లగు దయాదాక్షిణ్యాద్యుత్తమగుణములకు మరింత వన్నెబెట్టు టెంతయు నుచితము.

ఇప్పుడు కొందరు స్త్రీలు ఉపన్యాస పీఠముల నెక్కి, ప్రాణనాథులని పేరుపెట్టుకొని ప్రాణములను విసిగించుచున్న పురుషులబారినుండి తప్పించుకొనువరకు సుఖము లేదనియు, ప్రేమయను పేర వీరు తొడిగియుండు నత్యసహ్యమైన యస్వాతంత్ర్యపు శృంఖలను త్రెంపివేయువరకును సుఖము లేదనియు, వివిధములగు వెఱ్ఱిమొఱ్ఱి యుపన్యాసము లిచ్చి, మన భారతకన్యల లేఁబ్రాయంపుమనస్సులను విషప్రాయములగు నిట్టి విషయములచే చెరుచుచుండు టెంతయు శోచనీయము. పూర్వమునుండి అన్నివిధముల ఖ్యాతి గాంచి, శమదమాదిసద్గుణముల కునికిపట్టులని పేరుగాంచిన భారతరమణులు ప్రస్తుతము ఏమియు నెరుగని మూర్ఖురాండ్రవలె, పశువులకంటె జ్ఞానహీనలై ఇతరుల యాచారవ్యవహారముల ననుసరింప దేవులాడుచుండు టెంతయు ననుచితము. భారతరమణి పతి కర్ధాంగికద! అగ్నిసాక్షిగ చెట్టబట్టిన ధర్మపత్నిగద! ఆమె పతికి కష్టసుఖములందును, ధర్మాధర్మవిచారములందును, వేయేల, సర్వకాలసర్వావస్థలయందును తోడునీడై మెలగవలసినది. భారతాంగన అనాదిగా నర్ధాంగీనామమున కర్హురాలు. ఇట్టి సహధర్మచారిణికన్న పురుషున కాప్తు లెవ్వరు? కావనే సుడీ

'కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ,
రూపేచ లక్ష్మీ, క్షమయా ధరిత్రీ,
భోజ్యేషు మాతా, శయనేషు రంభా,
షడ్ధర్మయుక్తా కులధర్మపత్నీ.'

యనువార్యవచనము సర్వజనాదరణీయముగ విలసిల్లుచున్నది.

పురుషుడు పుట్టినదాదిగ పరమపద మొందువరకును, పిడపగూడ స్త్రీలనడుమనే యున్నాడు. మోక్షకాంత స్త్రీయేగద. విద్యాధిదేవత వాణి స్త్రీరూపమున బరగుచున్నది. విద్యాసహాయమున నార్జింపబడు భాగ్యము స్త్రీరూపధారిణియై లక్ష్మియనుపేర బ్రకాశించుచున్నది. జన్మదాత్రియై సకలభోగప్రదయగు భూమి 'భారతమాత' యను పేర స్త్రీరూపమున విలసిల్లుచున్నది. కాన పురుషుడు మాతృస్వరూపయగు స్త్రీజాతి నన్నివిధముల గౌరవించుచున్నాడనియే చెప్పవలెను.

భారతదేశమున స్త్రీ లస్వతంత్రులనుట ఒప్పుకొనవలసినదే. స్త్రీ పురుషాజ్ఞానువర్తిని. వీరు విద్యనేర్చి బాగుపడినను, నేర్వక చెడినను ఆ కీర్త్యపకీర్తులు పురుషులకే చెల్లును కాని వీరి కేమాత్ర మంటవు. ఏలన స్త్రీ పురుషుని సమ్మతి లేనిదే ఏపనిగాని చేయజాలదు. విద్యావిషయమున తగినంత శ్రద్ధవహించి వారికి సద్విద్య నొసగి అర్ధాంగమును ప్రకాశింపజేయుట పురుషునికి ధర్మము. లేనిచో,

ఉ. ఇల బురుషుండు శాస్త్రముల
నెంతటి నేర్పరియైన నేమి పెం
పలరిన నీతిసాహసము
లందిన నేమి, సువిద్య లేక మే

నలవడనట్టి మందమతి
యోషతి భార్యగ నబ్బెనేని యా
వెలత నశింప జేయు పతి
నేర్పుల నీతుల సాహసంబులన్.

అని నట్లగును. ఆహా! ఉగ్గుపాలనుండి కుమారుడు విద్యావంతుడు, బుద్ధిమంతుడు గావలెనని అష్టకష్టములుపడి అంతటివానిగ జేసిన తల్లిదండ్రుల కష్టమంతేయు నిన్న లేక మొన్న వచ్చిన యొక మందమతి సహవాసముచే బూడిదలో బోసిన పన్నీటివలె వ్యర్థమగు నని చెప్పుచున్నాముకదా! ఇట్లని తెలిసియూ, పురుషులు స్త్రీలు చదివిన చెడెద రను దురూహల గలిగి బుద్ధితో పాటు తమ కీర్తులనుకూడ పోగొట్టుకొనుచున్నారు.

వీరి యూహలకు తగినట్టులే నేటికాలమున కొన్ని కారణములు పైతము గలిగి మరింత కలవర పెట్టుచున్నవి. ఇప్పుడు కొందరు బాలికలు ఆంగ్లవిద్య నభ్యసింప భర్తల ప్రార్థించి పాఠశాలల ప్రవేశించుచున్నారనియు, బడిచేరిన కొలదిమాసములలోనే వింతమార్పులుచెంది భర్తల నిరాకరించుచున్నారనియు చెప్పుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయమగు విషయము. విద్యలో నాంధ్రమేమి, ఆంగ్లమేమి, సంస్కృతమేమి, అన్నియు నొకటేకదా! ఇచ్చట నుదయించిన సూర్యుడు తెల్లగను, అచ్చట నుదయించిన సూర్యుడు నల్లగను నుండుననుటెంతయు సంభావ్యము? అట్లే ఆంధ్రము చదివిన పతివ్రత లగుటయు ఆంగ్లము చదివిన పాషండు లగుటయు చాలవింతగ నున్నది. వారు మనభాష నేర్పినంతనే మన పద్ధతుల నేర్పుచున్నారా, లేదే!

ఇవంతయు వీరి పిచ్చియూహలు. ఆంగ్లవిద్య నేర్వగానే మగలను, మగవాళ్లను నిర్లక్ష్యము చేసి ధిక్కరించినచే గాని యావిద్య పూర్తిగ వచ్చినట్లు కాదను వింతయభిప్రాయమును వీరు గలిగియున్నారని తోచుచున్నది. పాపము! 'గతానుగతికో లోకః' యన్నట్లైన తెయో బుద్ధిహీనురాలైన కాంత ఎరువుకు తెచ్చుకొని కులికిన యాయసహ్యపునడక నంద రవలంబించుటా! 'కాకినడక మరచిపోయె, హంసనడక రాకపోయె'నన్నట్లగును రంటిరయే. విద్య నేర్పినకొలది వినయాదిసద్గుణములు హెచ్చునని యుండ ఇది యేమి టీతలక్రిందులు! అచ్చట నాకాశమున కంటక, ఇచ్చట భూమికి నంటక నడుమ త్రిశంకుస్వర్గానుభవములు. విద్య నేర్పినందుల కిదియా ఫలము? అర్థము చేసికొనక చేయుపనుల ఫల మిది. ఇది కాదు నేర్వతగినవిద్య. తన్ను తా దెలుసుకొను విద్య నేర్వతగు, తన సోదరీసోదరుల హితమును కాంక్షించు విద్య నేర్వతగు., తనదేశౌన్నత్యము గెంచి యుప్పొంగి తత్సేవాశక్తిని గల్గించు సద్విద్య నేర్వతగు గాని స్త్రీలు విద్య కనర్హులని పురుషులచే ననిపించుటయే! లేక కూపస్థమండూకముల భంగి ఏవేళ చూచిన వంటయని, ఇల్లని, పిల్లలని, దానికన్న వేరొక టెరుగక తాము విసిగి, తమభర్తలను దుఃఖపెట్టి, తమ పిల్లలను చెరిపి భారతదేశపు స్త్రీలు శుద్ధ-అనాగరికలని దేశమునకే అపఖ్యాతి తెచ్చు టుచితమా! అట్లు గాక విద్యయొక్క ఘనత నెరిగి సరిగ నర్థము చేసుకొన్నచో స్వభావసిద్ధమైన తమ క్షమాశాంతిదయాదాక్షిణ్యాది సద్గుణములకు మరింత శోభ జేకూర్చి కుందనంబున నదిమిన మాణిక్యమును బోలి తమభర్తల విద్యాదిఘనతలను ప్రకాశింపజేసినవారై, తమ పుత్రపుత్రికారత్నములను విద్యాధికులుగను, జ్ఞానసంపన్నులుగను, దేశోద్ధారకులుగను, చేయ సమర్థ లౌదు రనుటకు సందియ మేమి?

శివాజిమహారాజును, 'నెపోలియన్ బోనోపార్టి' యను ఫ్రెంచి యోధుడును, 'అయ్యా మీరింత గొప్పవా రెట్లయితి' రన 'మాతల్లి వలన' నని చెప్పిరట. కాన మన భారతాంగనలు మంచితల్లులు, మంచిఇల్లాండ్రు, దేశభక్తలు, ఈశభక్తలు కావలసినందున సద్విద్య బడయుట ఆత్యావశ్యకము. సద్విద్య గలకాంతయే అర్థాంగి యనుటకు కర్హురాలు. మూర్ఖురాలును పతి కర్థాంగియే, అతని సంపాదనము ననుభవించుటకు, అతని పాపములను హెచ్చించుటకు. ఇట్లుండుటకన్న భారతరమణి అనంగయగుట యుత్తమము.

అట్లెన్నిటికిని గాకుండుగాక! భారతరమణి తనయథార్థస్థానగౌరవమును తా తెలుసుకొనుగాక!

# విస్మృత హృది

జనమంచి కామేశ్వరరావుగారు

విసపుతమముల దారి
కొసరించు నిశ లెల్ల
గర్జించి నుసియ్యమ్యె;
దెసలెల్ల పులకింప
మసకమసకలు రేపె.

పులుకుపులుకున చూచు
మినుకు మినుకున మెరయు
తారలే తమసులో
దాగిపోయిన వపుడు.

పురి విప్పి నృత్యాలు
సలిపేటి మొయిళులే
మొరపెట్టి మొరపెట్టి
మ్రోగిపోయినవపుడు.

కదలాడు జవరాలి
కరములో కాంతుడై
మెరపు కన్నెలవలపు
కౌగిళ్ల నభ ముండె.

ఆకాశసికతాల
నవయు శోకతమస్సు
కురిసినది కురిసినది
లోకాల ముంచినది.

శోకంపు కూర్కులో
చిటిలి రాలిన నాదు
పాషాణ హృది జాలు
భయదపాథో రాశి
మిళితమైనాదపుడు.
శోకంపు కళికవై,
తిమిరాల క్రాంతివై,
యిరులచెర విడిపోయి
చిరువెలుగు రూపమై,
నెలవంక చలువనే
మైపూత పూసికొని,
ప్రేమ జొంపాలనే
శిఖలో నిమిడ్చికొని,—
వలిపెంపు వెన్నెలే!
మురిపెంపు నవ్వులే!
చిద్రుపలై ప్రిదులగా
రాగరేఖల తేలి
తేలి వచ్చితి వీవు.
నీ
వదనవిశ్రుత వచన
వ్యజనానిలాలలో
నా
కలలతారక లన్ని
జలజలా రాలినవి
కాంతులై కురిసినవి
మేనంత మెరసినవి
అంతే,
నాహృదయాన
ప్రేమాల పుంజమై
నీరూపు విరిసినది.

---



## నర్తకి 'పావ్లవా'

కొత్తా రామమోహనశాస్త్రిగారు

మహానర్తకి 'పావ్లవా' అస్తమించెను. రష్యను 'బాలెట్'న్నా పరిసమాప్త మొందినది. 'మేడమ్ కర్సా' 'పావ్లవా'స్థానమునకు వచ్చెను. కాని అసమానయగు 'పావ్లవా' లేని లోటు తీరదాయె. నర్తకీ పావ్లవా తానొనర్చిన నాట్యమునకంటెను, ఆనాట్యసృష్టియందలి రచనావైదగ్ధ్యముకన్నను మించు నొక మహావ్యక్తి. అనేకవత్సరములు మానవజాతియెదుట నర్తనసలిపి మానవహృదయమును చూరగొనిన యీామె యీానాడు దేవలోకమున పరలోకవాసుల నానందింప వెడలిన దేమొ!

'బాలెట్' నాట్యమనగా అనేకనర్తకులొకచో చేరి క్రమరీతి నొక కథావిధానమును ప్రదర్శించుచు చూపరుల కండ్లయెదుట అసాధారణమగు మూర్తి రచనను చూపుట. ఇందు శాస్త్ర మెక్కువ. కావున విమర్శకులు దీనిని intellectualగా పరిగణించిరి. కాని 'పావ్లవా'యొక్క 'బాలెట్' నాట్యమునకు romantic వాసన యెక్కువ. పూర్తిగ intellectual గాదనుట నిక్కువము.

'మేడమ్ పావ్లవా' 1885-వ సంవత్సరమున 31 వ జనవరి జనన మొందెను. పదియవయేటనే 'యింపీరియల్ బాలెట్ స్కూలు'న చేరి శిక్ష నొందెను. ఈమె నాట్యములలో 'మృత్యుముఖరాయంచ' (చిత్రము 2) మిక్కిలి మిన్న, మరియు మిక్కిలి ఆకర్షణీయము నగుట అందరిచేతను మిక్కిలి హర్షించబడెడిది. నాట్యమున రససృష్టి ప్రాణము వంటిది. అట్లగుట ఆమె తన నాట్యమున బహువిధరససృష్టినే ముఖ్యముగ చూపెడిది. పూర్వసంప్రదాయముల మీాద నాధారపడి బాగోగుల విమర్శించు నాచారరీత్యా ప్రజ్ఞ మొదటిదిగను, కల్పనాసృష్టి రెండవదిగను విమర్శకులు పరిగణించు చుండుటచేత, 'పావ్లవా' నాట్యాచారముల పాలించుచు కల్పనా వైదగ్ధ్యమునకు, రససృష్టికి ప్రాముఖ్య మిచ్చుచు తన దేశమగు

# నర్తకి 'పావ్లవా' చిత్రములు



౧. నర్తకి 'పావ్లవా'



౨. మృత్యుముఖ రాయంచ



౩. 'వింత వేణునాదము'నందలిది



౪. దేవతాస్త్రీ



౫. Chrysanthemum

రష్యాయందు అభినయించి, అక్కడి వారలచే సంప్రదాయవిరుద్ధమని తలంచబడుటచే రష్యా దేశమును వదలవలసి వచ్చెను.

ముఖము, శరీరము, పాదములు, హస్తములు—వీటితో కూడిన అభినయముచేత రూపసృష్టి నొనర్చుట 'బాలెట్'నాట్యమున నూతనము, పూర్వసంప్రదాయవిరుద్ధమును అయియున్నది.

'ఫోకిన్' (Fokine) అను నాట్యాచార్యుడు ఈమెతో వనవిహారము సల్పుచు నీమె వనమందు హంసరీతి నున్నటులు ఒకనాడు ఆయన మనస్సునకు తోచెనని తన యనుభవమును చెప్పెను. 'పావ్లవా' తన ఆంగికవ్యతిరిక్తమగు మెక్సికన్ దేశపు, తూర్పుదేశపునాట్యమందలి గాఢాభిమానముచే ఆరీతి ననుకరించ ప్రయత్నించెడిది. ఈమెనాట్యమందు Bacchanale యొక్క ముఖ్యమగు పట్టు అయియున్నది. ఇదియు ఆమె Type న కంత సరిపోయినది గాదు. కాని అందలి మరణావస్థయొక్క విషాద పరిణతిఘట్టము ఈమెయొక్క అద్భుతాభినయముచే Bacchanale కు లేని ప్రాముఖ్యము వచ్చెను.

ఒకకథావిషయము ననేకవిధముల త్రిప్పి త్రిప్పి ప్రస్తావనచేసి రససృష్టి యొనర్చుట యొకటి. ఒక ముఖ్యఘట్టమును విశదీకరించుచు త్వరితగతి స్వాభావికత చూపుచు రససిద్ధి నొనర్చుట మరియొకటి. 'పావ్లవా'నాట్యము రెండవది. అందుచేతనే తా నేరుకొని, అభినయించి, భావప్రకటనాంత్యస్థానమును చూపి ప్రపంచ ఖ్యాతినొందినపట్టులు'మృత్యుముఖరాయంచ', 'కాలిఫోర్నియా యందలి గంజాపుష్పము' 'అడవితుమ్మెద' వసంతఋతువున జలజలరాలు ఆకులు'(చిత్రము 5) అయియున్నవి. 'వసంతఋతువున రాలుఆకులు' అనుగీతము ఈమెరచించినదే. Chrysanthemum వృక్షమందు అన్నియు రాలిపోగా మిగిలిన చివరిపుష్పము యొక్క సుడిగాలి తాకుడునకు కదలి తాళలేక క్రింద పడును. ఒకకవి ఆరాలిన పుష్పము చేతితో తీసి రాలిపోయిన పుష్పపత్రముల చూచి చేతితోనిమిరి ముద్దిడును. గాలి వీచి ఆపుష్పము మరల క్రింద పడును. మరల దానిని తీసికొని fountain దగ్గరకు తీసికొనివెళ్లి, అక్కడి నాచు ప్రదేశమున దాని నుంచి కొంచెము దూరమున నొకరాతిమీద కూర్చొని తన కవిత నాలాపించు చుండును. మరియొక మారు సుడిగాలి వచ్చి ఆకులతో ఈపుష్పముకూడ యెగిరి ఇంకొకచోట పడును. ఇట్టిసమయమున నొక వనజాక్షి ఆకవియెదుటికి వచ్చెను. అప్పు డాకవి యీ పుష్పమునంగతి తలపకయే ఆమెతో వెడలిపోవును. ఈ పుష్పమో, పండుటాకుల మధ్య పడి సూర్యాతపమునకు ఎండిపోయి నశించిపోవును. ఇందు Chrysanthemum పుష్పము 'పావ్లవా' అభినయించును.

మంచు తెట్టెలు—క్రిష్టమస్ పండుగలో ఇవ్వబడిన బహుమతులలో అడకత్తి యొకటి. దానిని స్పృశించగనే యొక అప్సరస్త్రీ బయటికి

వచ్చెను. ఎదుట మంచుతెట్టెల బరువునకు వంగిన వృక్షము. క్రిస్టమస్ చలికాలపు దేవతాస్త్రీ నాట్యము సల్పును (చిత్రము 4.

(చిత్రము 5) 'వింతవేణువాదము' అనుగీత మునందలి యొకఘట్టము.

'ఆనా పావ్లవా' 'జెచెటీ' దగ్గర క్రమశిక్షణ బడసెను. ఆకాలమందలి ముఖ్యనటు లందరును ఈయనదగ్గర శిక్షణ బడసినవారలే. ఈమెను చూడగనే యీామెవైఖరి యందలి అనన్యత గోచరించెనట.

'జెచెటీ' దగ్గర అనేకులు నాట్యాభ్యసన మొనర్చుచు-టచే ఆయనకు తీరిక యుండెడిది గాదు. కనుక వార లందరు ఇచ్చు ధనము తా నొకర్తే యిచ్చుచు మూడు వత్సరములు ప్రత్యేకశిక్ష పొందెను.

"నాట్యశాస్త్ర సంప్రదాయరీతులు అందలి సమస్యలు మొదలగునవి మాత్రమే నేర్పగలిగి నవి నేర్పితిని. ఆమె నాట్యమందలి రసస్పష్టి, స్వరకల్పనములు, భావప్రకటన ఆమె సొంతమే" యని 'జెచెటీ' వ్రాకుచ్చెను.

పావ్లవా 'ప్యారిస్'నగరమందు 1909-వ సంవత్సరమున Diaghilen నటులలో నాయి కగా చేరెను. ఒకసంవత్సరముతర్వాత తాను కొందరిని తయారు చేసికొని లండను నందలి 'పాలెస్' నాట్యమందిరమున ప్రదర్శన మిచ్చెను. ఇంత కొకవత్సరము మునుపే 'కొలీసియమ్' థియేటరునందు 'కర్సలీనా 'యు 'నిజిన్సికీ'యు 'ఉష్ణపక్షి' నాట్యము సల్పిరి. 'యిసాడరా డన్కను' 'మాడ్ ఆలెను', 'లీడా కియూస్ట్' అను సుప్రసిద్ధనటులు లండను నగర మున నాట్యప్రదర్శనము లిచ్చి ప్రజల హృదయ ముల చూరగొని 'బాలెట్' నృత్యమం దొక యపూర్వవాంఛ కలిగించిరి. అట్టి యదనున ఈమె వచ్చుట తటస్థించెను. ఈసారి నూతన విధమున నర్తనసలిపి ప్రపంచఖ్యాతి నొందెను. 'హెకరు' అను కవిసార్వభౌముడు 'లండనున పావ్లవా' అనుగీతమును రచించెను. ఆయన రచన లన్నిటిలోను ఇది మిన్నయట! మరియు ప్రఖ్యాతినికూడ సమకూర్చెను.

1913-వ సంవత్సరములో అమెరికాదేశ మందు పర్యటనము సలిపి ఆరునెలలలో నూట నలుబదిచోట్ల తన నాట్యకళ ప్రదర్శించెను. అటుల తాను ఈసంవత్సరము 22 జనవరి చని పోవువరకు నాట్యము చేయుచునే యుండెను. 1929 జనవరి మాసమున మనదేశమునకు వచ్చి కలకత్తాయందు ప్రదర్శించెను. హిందూ దేశపు నల్దిక్కులనుండియు ఆ ప్రదర్శనమున కరుదెంచిరి.

మహానర్తకీ పావ్లవా హంసరూపమున చని పోవుట అభినయించెను. కాని తాను చనిపోవు నపుడు నిజమును గ్రహింపదాయె.

తరువాత ఆమెయొక్క నాట్యసభా ప్రద ర్శనమున యథారీతిగనే హంసవాద్యముమధ్య యవనిక రంగమున లేచెను. వెలుతురు రంగ

మధ్యమున పడెను. సరోవరమధ్య నున్న మ్రోగుచున్నటుల యుండెను. ఆనాట్యసభ fountain నుండి నీటితుంపురులు పడి ప్రవాహ వారివ్విధి అమరసిద్ధి నొందిన హంసరాజుములు గట్టి పారుచునేయున్నవి. కాని హంస 'పాల్లవా' ఆత్మశాంతి కొరకు ప్రార్థించి జోర్ధేది! అని భూనభోంతరాళముల మారు హోరు లొలవర్చి ధన్యు లయిరి.

---

## శల్యసారథ్యము

జి. జాషువగారు

ఆ హిమస్తములకు నొయ్యారంబు నేర్పించు వలపుఁబిల్లనఁగ్రోవి పాటకాఁడు
పసితనంబునయందు పడగపాముల నెక్కి చిందులాడిన గొల్లచిన్నవాఁడు
పదియారువేల గోపస్త్రీలతోఁ గూడి యపవాదుబూనని యందగాఁడు
లోకాంతమున మఱ్ఱియాకుఁ దెప్పం దేలి తలదాఁచుకొన్న చిత్రస్వరూపి
భాసురములైన తన చేరెఁడేసికనుల-మచ్చుఁజల్లెడు వేలుపు మాంత్రికుండు
తొడరి విజయునియరదంబు దోలుచుండె-కాంచి విల్లందుకొనుము భాస్కరకుమార!

ములుకులు నీధనుస్సున విముక్తములై చని, కృష్ణమూర్తికిన్
వలఁగొని యావల న్నరునిపైఁ గసిబూనుట, దుస్తరంబుగా
దలఁప విదేటి వెఱ్ఱి? భుజదర్పము వెన్నుని ముందు సాగునే
మలపుడు నారథంబు? యనుమానముఁ దోచె జయంబు కర్ణుఁడా?

వ్యయమైపోయిన యమ్ముల న్మరలఁ గూర్పం దక్షమైయున్న, య
క్షయతూణీరములిచ్చి పార్థుఁడు శరాసారంబు గుప్పించినన్
జయ మాదేవుఁ డెఱుంగు గుఱ్ఱములపై, నాపై, భవత్సేనపై
దయజూపించుట కూపిరాడఁగలదా? దౌర్భాగ్యధానుష్కుఁడా!

తూలినపందివై, హరుఁ డెదుర్కొని రేఁచిన గ్రుద్దులాటకు
స్తీల, బలిష్ఠుఁడై, కలుఁకుఁ దేలినవాఁడు మహేంద్రసూతి యా

శూలికి గుండెలే దలెనిఁ జూడ నెగాదిగ, యుద్ధభూమిలో
రాలఁదలంచితే? పరశురాముని శిష్యుఁడవన్న బిఱ్ఱునన్

ఖాండవము నర్జునుఁడు కాల్చు కాలమందు-పరుగులెత్తిన మునలిసర్పమును వింటఁ
దొడిగినాఁడవు, భళిభళీ! విడువవలవ-దబ్జనాభుఁడు గరుడవాహనుఁడు సుమ్మ.

బలవంతుండగు శౌరి, రోషము రగుల్పన్ బార్థుడుం గెంపుచూ
పుల వేగంబునఁ దూపులన్నడిపి నీమూర్ధంబు ఖండింపఁడే?
తలపై శాపము లాడు నీకు నొక యుద్ధంబేలఁ? నీరక్తమున్
బాలయున్ గాకులు గ్రద్దలున్ గుడుచునేమో! నేడు సూతాత్మజా!

ఇలకున్ గ్రుంగె రథంబు చక్ర మిపు డేదీ? నీకు గత్యంతరం
బలుక న్నీ ప్రతిపక్షి గాండివధరుండై, చెండుచున్నాఁడు నీ
బలమున్ గాలము లేదు స్యందనము లేవందీసికొ మ్మేటికీ
తలపోఁత ల్మరణంబు వేఁడుకొనరాదా? కర్ణ! భీభత్సునిన్.

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము

—మేనేజరు, 'భారతి.'

# అనంతవర్మ సిరిపురపు శాసనము

మండ నరసింహంగారు

ఈ శాసనము శ్రీకాకుళమున కెనిమిది మైళ్లదూరమున నున్న సిరిపుర మను గ్రామమున నున్న చెరువులో మన్ను త్రవ్వుచుండగా దొరకినది. దీనిని మ. రా. రా. శ్రీ పాణంగిపల్లి వరహాలు పంతులుగారు పరిశోధింపుమని నాకు దయతో నొసంగిరి. ఈ శాసనము చెరువులో మన్ను త్రవ్వు కూలివానికి దొరకినదనియు, నద్దాని నాగ్రామ మందలి యొక్క పురోహితునకు వాడు చూపెననియు, నాపురోహితు డది దేవతలచే లిఖింపబడినదని తలంచి భక్తితో జూచుచుండెననియు, కార్యాంతరమున నా ప్రియస్నేహితులు శ్రీవరహాలుపంతులుగా రచటి కేగ నీ పురోహితు డీశాసనమును వారికి జూపుటయు, వారిది పూర్వరాజశాసనమై యుండనోపునని తలంచి దానిని బుచ్చుకొని పూర్వ లిపులను పరిశోధించుటయం దభిమానము గలుగుటచే నాకద్దాని నొసగుటయు నీ విధముగ నీ శాసనము నాకు లభ్యమైనది.

రెండు రాగిరేకులపై శాసనము చెక్కబడినది. మొదటిరేకు మొదటిప్రక్క లిపి లేదు. ఇది పుస్తకమున కట్టవలె లోపలి లిపిని కాపాడుట కేర్పాటు. రెండవ రేకునకు రెండువైపుల లిపి కలదు. రెండవవైపు లిపిని కాపాడుటకు మరియొక రే కుంచబడలేదు. ఈ రెండు రేకులును రాగితో చేయబడిన యొక కడియముచే గ్రుచ్చబడి, కడియము చివరలు రెండును కూడినచోట రాగిపోతపై రాజముద్రికచే నంధింపబడినవి. రాజముద్ర స్పష్టముగా కనబడుట లేదు. అరుగుదల లేకపోయినను పోతపోయబడిన రాగి నునుపుగా నుండనందున ముద్రపై నున్న యక్షరాదికములు స్పష్టముగా లేవు. రేకుల నిడివి 7 అం. వెడల్పు 2.7 అం. లిపి ప్రతిబింబమును తీయుటకై కడియమును తెగగొట్టవలసి వచ్చినది. రేకులలో మొదటిదికొంచెము పలుచగను, రెండవది దళ మెక్కువ కలదిగను చేయబడినవి. మొదటి రేకున లిపి యొకప్రక్కనే యుండుటచే యారేకు పలుచగా చేయబడి యుండవచ్చును. రెండవరేకు కూడ నట్లే చేయబడిన చెక్కబడినలిపి వెనుకప్రక్కకు కూడ ఉబ్బి చదువుట కవకాశ ముండదు గాన దళముగా చేయబడినది. రేకులయంచులు లోనికి సాగగొట్టబడుటచే నొక రేకున కొకటి రాపాడకుండుటయే గాక లిపిని కూడ సంరక్షించును.'

## లిపి

పుట కారేసి పంక్తులచొప్పున మొత్తము పదునెనిమిదిపంక్తులలో నీ శాసన మంతయు నిమిడియున్నది. శాసనమును చెక్కిన లేఖకుడు తనపే రచటను చెప్పుకొనలేదు కాని

యక్షరములు మాత్రము మిక్కిలి పొంకము గను, పంక్తులు ముత్యాలకోవ వలె నుండుటచే బాగుగ నారితేరిన మంచి 'మునద్దీ'యని చెప్ప వచ్చును. అక్షరములన్నియు లోతుగ చెక్కబడి, బహుకాలమైనను క్షేమమాత్రము శిథిలము గాక స్పష్టముగా నున్నది.

అక్షరము లన్నియు బ్రాహ్మీలిపిని వ్రాయ బడి యున్నవి. చాలుక్య రాజగు హస్తివర్మచే నొసగబడిన శాసనపులిపికన్న పురాతనపు లిపి యని యక్షరముల తీరును, పొంకమును బట్టి యూహింపవచ్చును. బిందు వక్కడక్కడ నుప యోగించినను అనేకస్థలముల బిందువునకు బదు లనునాసికాక్షరమే వ్రాయబడినది. 'వర్మ' మొదలగు రేఫ వాడుక చేయబడిన చోట ద్విత్వాక్షరమును, వలపలగిలకయు చెక్కబడి నవి. లేఖకదోషములు లేకపోలేదు. మొదటి దళము రెండవపంక్తిలో 'భూహిరణ్య' అను చోట 'ణ్య' చెక్కుట మరచి తరువాత హంస పాదముంచి దిగువను చిన్న యక్షరముగా 'ణ్య' ను చెక్కెను. ఈరీతిగనే 'యోజన యోజనా' యని రెండుసారులు 'యోజన' శబ్దమును చెక్కినను తిరిగి కొట్టివేయక యట్లే యుంచెను. మిగిలినపొరపాటులు మూలము దిగువను అంకెలు వేసి చూపబడినవి.

భాష

శాసనమంతయు సంస్కృతమున వ్రాయ బడినది. ప్రాకృతచ్ఛాయలెచ్చటను గానరావు. తెలుగుగాని తదితరదేశభాషలుగాని శాసన మందు ప్రయోగింపబడలేదు. అశోకుడు మొద లగు పురాతనరాజుల శాసనములు ప్రాకృత మున రచింపబడినను మన శాసనముకూడ క్రీస్తుశకారంభకాలమునాటి దైనను ప్రాకృతము గానరాకుండుట యొక్క విశేషము. వ్యాకరణ విశేషములు మూలమునుండి పాఠకులు సుల భముగ తెలిసికొనగలరు గాన వివరింపబడ లేదు.

ప్రాముఖ్యము

తామ్రశాసనములు దేశమందనేకములు గానవచ్చుచున్నవి. అవి యన్నియు నేరాజుల చేతనో బ్రాహ్మణాదుల కొసంగబడినదానపత్ర ములు. ఇదియుకూడ నట్టిదే. కాని యొక విశే షము. క్రీస్తుశకమారంభమున కీవలావల నొక శతాబ్దములో తామ్రశాసనములు లభింప కున్నవి. శిలాశాసనము లనేకములు గాన వచ్చుచున్నవి. దేశమంతయు నాకాలమున బౌద్ధాక్రాంతమగుటచే హైందవసంప్రదాయ ముల ననుసరించి యేలురాజులును, తత్సంప్ర దాయముల ననుసరించు ప్రజలును నాకాలమున గలరని రుజువు చేయుటకు మన శాసన మొక సాక్షిగ నున్నది. కళింగదేశ మేలిన రాజుల కందరకు మహేంద్రగిరిపై నున్న గోకర్ణేశ్వర స్వామి కులదైవతమని తరువాతి శాసనములు చెప్పుచుండ నాగిరియు నా దేవతయు ప్రసక్తి యే నిచట గానరాకపోవుటచే మనశాసనకర్త యగు రాజు గోకర్ణేశ్వరాలయనిర్మాణమునకు పూర్వుడని రూఢిగ చెప్పగలము. తరువాతి

కళింగచక్రవర్తులు వారికులము గంగవంశపు క్షత్రియులని ప్రగల్భముగ చెప్పుచుండ నీశాసన కర్త యీప్రశంసయే చేయకపోవుటచే నప్పటికి క్షత్రియులలో వేర్వేరు శాఖ లుత్పన్నములు కాలేదని మన మూహింప వచ్చును. ఎనిమిది తొమ్మిదిశతాబ్దములనాటి కళింగచక్రవర్తులు తమ గోత్ర మాత్రేయమని చెప్పిరి గాని వీరే గోత్రమువారో శాసనము చెప్పలేదు.

క్షత్రియులలో నంతశ్శాఖ లనేకములు పురాణములలోను, శాసనములలోను గాన వచ్చుచున్నవి. సూర్యచంద్రవంశములు పురాణప్రసిద్ధములు. అగ్ని, గంగ, గాంగ చాళుక్య మొదలగు వంశములు శాసనప్రసిద్ధములు. పాశ్చాత్యసిద్ధాంతముల ప్రకారము మన భారతదేశమందలి పురాణేతిహాసములన్నియు బౌద్ధమతమును నిర్మూలించి యార్యసాంప్రదాయికమగు హిందూమతమును స్థాపించుటకై నిర్మింపబడినవని నమ్మకము. అట్టి యూహయే నిజమగునెడల బౌద్ధమతము హీనదశకు క్రీ. వె. మూడునాల్గు శతాబ్దములకు గాని రాలేదు. అందుచే భారతపురాణేతిహాసములు కూడ నాకాలముననే యారంభింపబడినవని యూహించవచ్చును. అట్టియూహ స్థిరమైనపుడు క్రీ. వె. ప్రథమశతాబ్దమున మన దేశమున పురాణములు లేనేలేవని చెప్పవలయును. బౌద్ధనిర్మూలనమునకు రాజావలంబన మున్నగాని సాధ్యము కాదు. అందుచే రాజులను మున్ముందు వశపరచుకొనిన గాని యాకార్యము జరుగదు. కావున క్షత్రియవంశీకులలో గొందరికి సూర్యుడును, కొందరికి చంద్రుడును, మరి కొందరకు నగ్నియు నిట్లు దేవతలు వారికి మూలపురుషులుగ నారోపించి వారికి నిజముగ లేని దేవత్వ మారోపించుటచే వారు నిజమని నమ్మికొనిరో లేక స్తుతులకు వశమయిరో బౌద్ధనిర్మూలనమునకు బూనుకొని యుందురనియప్పటి పండితులు భావించి పురాణరచనకు బూని యుందురు. మన శాసనమం దీరాజులు తమ వంశము గంగవంశమని చెప్పుకొనకపోవుటచే వీరలు పురాణకాలమునకు ముందువా రని యూహింపవచ్చును.

శాసనరచన యంతయు ధర్మశాస్త్రానుసార ముండినటుల మూలము చదివిన బోధపడును. తొలుత కొన్ని శాసనము లున్నగాని ధర్మశాస్త్రములు పుట్టనేరవు. తరువాత పుట్టిన శాసనములు ధర్మశాస్త్రము ననుసరించి యుండును. ఇది కాక శాసన మెంత క్లుప్తముగ నున్న నయ్యది యంత పురాతనమని చరిత్రకారుల యభిప్రాయము. పురాతన శాసనములలో వంశావళి యధికముగ నుండదు. ఆడంబరము కానరాదు. అమానుషమైన చర్యలు, పౌరాణికగాథలు నుండవు. భాష ప్రౌఢముగ నుండక సామాన్యజనులకు సుబోధముగ నుండును. స్తుతులు అరుదు. ఇట్టిలక్షణము లన్ని మన ప్రస్తుతశాసనమున నుండుటచే కూడ నిది పురాతనమైన దనియు, క్రీ. వె. మొదటిశతాబ్ది దనియు నూహించవచ్చును. ఈయూహకు శాసనములో నిచ్చిన కాలము గూడ తోడ్పడుచున్నది: శాసనమం దగ్రహార

దానకాల మిట్లు చెప్పబడినది. "అష్టాశ్శక సంఖ్యాభ్యః మహాశ్వయుజ సంవత్సరే మాఘ మాసపౌర్ణమాస్యా" మని చెప్పబడినది. అనగా శకసంవత్సరము ఎనిమిది కాగా మహాశ్వయుజ సంవత్సర మాఘపౌర్ణమివాడు దానమీయబడిన ట్లూహించ వచ్చును. శాకాబ్దమునకు 78 కలిపిన క్రీస్తుశకమువచ్చును కాబట్టి ఇది 78 + 8 అనగా క్రీ. శ. 86 వ సంవత్సరమున నొసగ బడినదని చెప్పవచ్చును.

ఇక సంవత్సరమును చెప్పుటలో మహాశ్వయుజసంవత్సరమని చెప్పబడినది. కాల గణనము మనదేశమున ననేకమానములచే చేయఃబడుచున్నది. చాంద్రమానము, సౌర మానము, సావనమానము, బార్హస్పత్య మానము, గురూదయమానము మొదలగు మానములు వాడబడుచున్నవి.

వీనిలో చాంద్రమానము మిక్కిలి పురాతనము. సౌరమానము యవనుల (గ్రీకుల) నుండి భారతీయులు నేర్చిరని యొక పాశ్చాత్య పండితుని యభిప్రాయము. ప్రభవాదిసంవత్సరముల గణన మనదేశమున క్రీ. శ. ఎనిమిది తొమ్మిది శతాబ్దములవరకు లేదని బర్నెలు దొరగారి యభిప్రాయము. ఉత్తరాదిని బార్హస్పత్యమానమును, దక్షిణాదిని చాంద్రమానమును, నీరెంటికిని పన్నెండువత్సరములు తారతమ్యమనియు జ్యోతిషజ్ఞానము గలవారికి తెలియును. దేశమందు సర్వేసర్వత్ర వాడుక నిమిత్తము గురూదయాబ్దమానము గ్రాహ్యము ఈమానములో మాసములనామములే సంవత్సరములకును గలవు. తొమ్మిది పదిశతాబ్దములనాటి కలింగచక్రవర్తులు తమశాసనములలో ప్రభవాదిసంవత్సరముల నామమును, చాంద్రమాననామము, మేషాదిలగ్నము మొదలగువానిని వారి దానకాలమును తెలుపుటకు వాడిరి. కాని మనశాసనమున నయ్యవి కానరావు. బహుశా ఆకాలమునకు మేషాదిరాసులును, ప్రభవాదిసంవత్సరములును జ్యోతిషశాస్త్రమున చేరకపోయి యుండవచ్చును. అందుచే నప్పటి ప్రచారమందున్న గురూదయాబ్దమున మాత్రము కాలము చెప్పబడినదని యూహింపవచ్చును. ఇట్లు కాలమును చెప్పుటకూడ శాసనము పురాతనమని తెలుపుటకు కారణమగుచున్నది. ఇట్లు కాలమును దెలుపు నితరశాసనము లింతవరకు మనకు గానరాకున్నవి. దీనివలనగూడ నీశాసనము ప్రాముఖ్యమును బడయుచున్నది.

రా జ వం శా వ ళి

ఈభాగము శాసనమందు సూక్ష్మముగ వర్ణింపబడినది. దానముచేసినరాజు, నతని తండ్రియు తాతయు మాత్రము చెప్పబడిరి. గుణవర్మ యనువాడు తాతయు, మూలపురుషుడును. అతని కొడుకు ప్రభంజనవర్మ. వాని కొడుకు కలింగాధిపతియగు అనంతవర్మ. ఈతని ముఖ్యపట్నము దేవపురము. ఈ దేవపుర మెచ్చటనున్నదో తెలియదు. తరువాతి కలింగ చక్రవర్తులకు వీరు మూలపురుషులైనటుల

వారు చెప్పకపోవుటచేత వీరి వంశము వేరని భావించవలెను.

ప్రతిగ్రహీతలు

యజనయాజనాధ్యయనా ధ్యాపన దాన ప్రతిగ్రహనిరతులును,ఆత్రేయ గోత్రచరులును అగు బ్రాహ్మణులకు ఖరపురియను గ్రామమున్ను, పట్టణములోని భాగములో తమ తల్లి వలన వినిర్గతమైన భాగమున్ను అగ్రహారముగా నేర్పాటుచేసి సర్వకరపరిహారముగా నీయబడినది. ఖరపురి యిదివరకే యగ్రహారముగా నీయబడినది. ఇప్పుడు పట్టణములోని భాగమున్ను అగ్రహారముపై పన్ను తొలగించి యదియుకూడ నీయబడినది.

శాసనాంశము

"జయప్రదమైన దేవపురము రాజధానిగా గలిగినట్టియు, దానధర్మాభిరతుడును అగు గుణవర్మకు కొడుకు మహారాజప్రభంజన వర్మ. ఈతని కొడుకు నయవినయసత్యశౌచాచారత్యాగౌదార్యదాక్షిణ్య ఉత్సాహసత్య సంపత్తి గలిగి స్వభుజవిక్రమోపార్జితభూప్రజాహితరతుడును, పరమమాహేశ్వరుడును, మాతాపితృపాదానుధ్యాతుడును, కలింగాధిపతియు నగు అనంతవర్మ 'నందాపురము'న కుటుంబినులను సమావేశముచేసి యిట్లాజ్ఞాపించుచున్నాడు: "పూర్వమే యగ్రహారముగా నీయబడిన ఖరపురియను గ్రామమును మాతల్లి సమ్మతితో నిదివరకు పన్ను చెల్లించుచుండు ఖరపురిగ్రామమును పన్నులన్నియు పరిహరించి యాగ్రామమును పట్టణభాగములో మాతల్లివలన వినిర్గమింపబడిన భాగమున్ను కలిపి అగ్రహారముగా చేసి దానిని ఆత్రేయ గోత్రజులును, యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహనిరతులును నగు బ్రాహ్మణులకు శాలివాహనశకము ఎనిమిది సంవత్సరములు కాగా మహాశ్వయుజసంవత్సర మాఘమాస పౌర్ణమినాడు నా పుణ్యాయుర్యశము లభివృద్ధి నిమిత్తము ఉదకపూర్వకముగా దానము చేయుచున్నాను. ఈ యగ్రహారమాచంద్రార్కకాల ముండునట్లు ప్రతిష్ఠ చేయబడినది. ఈరీతిగా నివ్వబడిన గ్రామము నుండి వచ్చుఫలమును ప్రతిగ్రహీతలకు నాదరణపూర్వకముగా చెందింపవలెను. ఇది నా యాజ్ఞ. ఉత్తరకాలమందు వచ్చు భావిరాజులీ ధర్మదానమును పాలింపవలెను."

ముగింపు

ఈ శాసనమును పరిశోధించి నాకు గోచరించిన రీతిని పాఠమును నిర్ణయించితిని. శాసన పరిశోధకులగు పాఠకులును, చరిత్రనిర్మాణదక్షులగు జ్ఞానాధికులును పరిశీలించి పరికింతురుగాక.

# మూలము

1 వ దళము, 2 వ పుట



మూలమున ( ) కుండలీకరణములయందలి యక్షరములు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సవరించినవి.
(‘భారతి’ సంపాదకుడు.)

1. ఓం[1] స్వస్తివిజయ దేవపురా ద్వాసిష్ట(ష్టి) విపులామలస[2]కల చన్ద్రిమసా (సో)
2. విభ్రభూహిరణ్య గోసహస్రాద్యనేక దానధర్మ్మాభిరతస్య శక్తిత్రయో
3. పచితరాజ్య సంప్పదస్య అత్యు[3]తామల శరచ్చన్ద్రి చన్ద్రికావదాతోరు
4. యశస(శ్రీ) మహారాజ గుణవర్మ్మణః ఆత్మజన్మ నోనేకగుణగణా·
5. భ్యలంకృతస్య(శ్రీ)మా[4]ం మహారాజు(జ) ప్రభ[5]జ్జనవర్మ్మణః సూనున్నా(ణ్ణా) యవినయ
6. సత్యశౌచాచారత్యాగాదార్య్య దాక్షిణ్యోత్సాహ సత్వసంప్పత్తే (నో)(?) స్వభుజ

---

1. సుడివంటి గుర్తువలన ‘ఓం’ అనునది తెలియజేయబడినది. 2. ‘పకల’ అని మూలము. ‘సకల’ అని మార్చిన యర్థమగును. 3. “త్యు” బదులుగా “త్యం” అని యుంచిన యర్థమగును. 4. “మాం”, దీర్ఘ మనవసరము. 5. ‘భ’కు ప్రక్కను బిందువు వ్రాయుటలేదు.

2 వ దళము, 1 వ పుట

7.
9.
12.



7. వి(క్ర)మోపార్జిత భూగ(ప్ర)జాహితరతో పరమమాహేశ్వరమాతాపి
8. తృపాదానుధ్యాతో శ్రీకలిఙ్గాధిపతి రనన్తవర్మాణణ్డా[1] పరేన్యమ
9. వేతాంకుటుమ్బిన స్సమాజ్ఞాపయ స్యే(స్త్యే)షః పూర్వ్వమేవా(గ్ర)హారః ఖరపురి
10. మదమ్బనమ[2]త్యః కరగ(ప్ర)దః తేభ్యచ(ప)వన్న ఇదానీ మస్మాభిః పుణ్యాయుయ్యశ
11. [3]షసామభివృద్ధయే యజన యాజన [4]యాజనాధ్యయన ధ్యాపనదానగ (ప్ర)తి
12. (గ్ర)హనిరతేభ్యో [5]ఆ(త్రే)[6]గో(త్ర) చరణేభ్యో (బ్రా)హ్మణేభ్యః అష్టాశ్శత సంఖ్యభ్య(ః)[7]

1. 'ణ్డా' బదులు 'పు' అనిన యర్థమగును. 2. 'మ్బన' బదులు 'మ్మ' యుండిన యర్థమగును. 3. 'ష' కు బదులు 'శ' యుండవలయును. 4. 'యాజనా' రెండుసారులు పొరపాటున చెక్కబడినది. 5. 'ఆ' ఈయక్షరము స్పష్టముగా లేదు. 6. '(త్రే' తరవాత 'య' ఉండవలయును. 7. '8' ఈఅంక ఆరుగుదలచే స్పష్టముగాలేదు.

2 వ దళము, 2 వ పుట




13. మహాశ్వయుజే సంవ్వత్సరేమాఘమాస పౌర్ణ్ణమాస్యా ఉదకపూర్వ్వం కృత్వ

14. సర్వ్వకరపరిహారేణ (రై) పరిహృత్యఖరపు రిన్బ(మ)(?)మదమ్బ విసర్గ్గత

15. వత్తనభాగవినిర్గ్గతంచ్చకృత్వా ఆచన్ద్రార్క్కకాలక ప్రతిష్టమగ్ర

16. హారంకృత్వావిధిద(వ) స్సంప్రదత్తః ఇత్యవగమ్య గ్రామఫలము

17. పనీయ సర్వ్వాదరేణవచనక ప్రేషణోపస్థానం కర్త్తవ్యమితి

18. ఆజ్ఞా అప్యుత్తరకాలభావిరాజభిశ్చధర్మ్మదాన స్యానుపాలనే.

---



మదరాసు పెన్సిలు కర్మాగారము

(Madras Pencil Factory)

కడచిన నెల చివరదినములలో నొకనాడు మధ్యాహ్నానంతర మీ కర్మాగారమునకు బోవ నయినది. కర్మాగారము నెలకొనియున్న ప్రదేశ మంత దర్శనీయము కాకున్నను కర్మాగారము ప్రవేశించినంతనే వెలుపలిసంగతు లన్నియు విస్మృతిపథమును జెంది మనసున నొకవిధమయిన యానందము జనియించును. ఏల? అది దేశీయసంస్థ; అంతే కాదు, ఆంధ్ర సంస్థ. దీని యధిపతులు వి. పెరుమాళ్లు శెట్టి అందు నన్ను వారు ఆంధ్రులు; ఇందు పెన్సిలు నిర్మాణకళాప్రవీణులు (Expert) శ్రీ మల్లాది సుబ్బారావుపంతులు గారు ఆంధ్రులు; సీసపు కడ్డీలు చేయుటకు వలసిన నల్లసీసపు రాయి (Graphite), బంక మన్ను ఆంధ్రమండలము నందు (గోదావరిజిల్లాలో) లభించునవి; కర్మాగారమున తయారగు పెన్సిళులు సుప్రసిద్ధము లగు ఫేబరు పెన్సిళులను తల దన్నునట్టివి. ఇట్టి వాతావరణ మానందసంధాయకము కాదా!

కర్మాగారము ప్రతిష్ఠితమయి పదిపండ్రెండేడు లగుచున్నది. దీనికయి వ్యయించిన ధనము లక్షలకొలది. ముడిసరకుల నుండి అనుదినము వందలకొలది గ్రోసుల పెన్సిళ్లు- నానా విధములవి-తయారగుటకు వలసిన యంత్ర సాధనము లీకర్మాగారమున గలవు. ఇంకను పరిశ్రమ నభివృద్ధిచేయ తగిన పరికరములు సమకూర్ప బడుచున్నవి. పెన్సిళ్లు గుణమునను, పనితనమునను ప్రశంసార్హములుగ నున్నవి.

ఇట్టులయ్యు దేశీయుల ప్రోత్సాహము చాలినంత—తుదకాంధ్రదేశమున నేని—లేనట్టు చూపట్టుచున్నది. "దేశీయపరిశ్రమలు లేక, దేశాభివృద్ధి లే"దను నార్పు లుపన్యాస వేదికల పైననే; వ్రాతలు పత్రికలోననే; కాని కార్యరూపమును దాల్చుటలేదు. ఇక పరిశ్రమాభివృద్ధి, తన్మూలమున దేశాభివృద్ధి యెట్లు కాగలదు? కాజాలదు.

మంచి పెన్సిళులు మనకు మనవారే చేసి యిచ్చుచుండ వానిని కాదని వైదేశికములకయి

పరువిడుట పనికిమాలినపని, లజ్జాకరము, మహాపచారము. పరిశ్రమలను పోషింతుమను ప్రభుత్వమువారును, దేశాభివృద్ధి నాకాంక్షించు దేశీయులును ఈపరిశ్రమను పోషించి చిరస్థాయిగ నెలకొనజేయ వలెను. ముఖ్యముగ ఆంధ్రులు, శపథము చేసినట్లు, సర్వాంధ్రమగుసీకర్మాగారముపెన్సిళ్లనే యుపయోగించుట తత్యావశ్యకము. —భారతి.

---

## భారతస్వాతంత్ర్యసుభాషితములు

౧. సంపూర్ణస్వేచ్ఛాయుతమగు పౌరస్వత్వము లేని రాజ్యాంగసంస్కరణములు శవమున కొనర్చెడి వస్త్రాలంకారములవంటివి. వివిధవర్ణవసనముల సింగారించుకొని కళేబరముగ నుంటకంటె, పనికిరాని చేలికల గట్టికొనినవైనను, స్వాతంత్ర్యవాయువుల పీల్చుచు స్వేచ్ఛగ జీవించుట మంచిదికదా!

—మోతీలాల్ నెహ్రూ.

౨. బ్రిటిషువారు హిందూదేశపు పాఠశాలలో నేర్పిన తప్పు చరిత్రయే, హిందూమహమ్మదీయభేదములకు కారణము. —మౌలానా మహమ్మదాలి.

౩. ఏనాగరకప్రభుత్వమును పాలితుల ఇచ్ఛకు భిన్నముగ పరిపాలన నెరపజాలదు.

—వల్లభభాయ్ పటేల్.

౪. బహిష్కరణము ఏదో యొకరూపమున ప్రపంచమునగల ప్రతిదేశమునందలి ఆర్థికనిర్మాణమునను స్థిరరూపమున నెలయుచున్నది. “రక్షణ” యన నేమి? ఇది యొక విధము బహిష్కరణమే కదా!

—రామలింగారెడ్డి.

౫. మన నిరంకుశనిర్బంధపరంపరలచే ఉక్కిరిబిక్కిరియై, మనలాఠీప్రయోగములచే శరీరమంతయు గాయపడి, తన నాయకశిఖామణులను బంధించిన కారాగారకుడ్యములపై దృష్టి నిగిడ్చియున్న భారతదేశము, ఇట్టివిషాదకరమగు విషమపరిస్థితులలో మనము దేనిని దాచి, బిగబట్టుచున్నామో, దానిమీదనే తన మనమును కేంద్రీకరించుచున్నది. —బ్రెయిల్సుఫర్డు.

౬. ఒకజాతిని మరొకజాతి పరిపాలించుచో ఇద్దరును సౌఖ్యమూరు లనుదురు. పాలితులు తమ పతితభాగ్యమునుగూర్చి స్మరించుచు కలగుచుందురు. పాలకులు, పాలితు లెప్పుడు స్వతంత్రులగుదురో యను భయముతో హృదయవేదన నందుచుందురు. —బుద్ధుడు.

౭. ‘నీతిఆచరణసూత్రమును సార్వజనీన మొనర్పుము. ఏలన, నీకు మంచియని తోచినది ఇతరులకు కూడ మంచియని నీవు భావింపవలె’ నని కాంటుమహాశయుడు చెప్పియున్నాడు. దేశభక్తి సిద్ధాంతమునుండి నిన్ను నీవు మినహాయించుకొన్నచో అందరకును ఆయవకాశము నీయవలెను గదా? అప్పు డిక దేశభక్తి యేది?

—రెడ్డి.

౮. హైంసవస్వాతంత్ర్యసమరమహోదారతను ప్రపంచమంతయు నంగీకరించినది. మానవచరిత్ర, రాజకీయములలోకూడ నైతికబలము నంగీకరింపవలె ననెడి స్థితికి వచ్చినదని భారతదేశము నిరూపించినది.

—రవీంద్రనాథటాగూర్.

౯. ‘స్వదేశి’ దేశభక్తికి పర్యాయపదము. దీని మూలముననే కృశించుచున్న చేతిపనులను పునరుద్ధరింపవలెను. బుద్ధిపూర్వకముగ స్వదేశీవస్తువునకు బదులు విదేశీవస్తువు నుపయోగించెడివాడు, తన మాతృభూమికి ఘోరాపచార మొనర్చినట్లే. —ఆచార్య పి. సి. రే.

౧౦. భారతీయులకు మనము స్వాతంత్ర్యసౌఖ్యమునుగూర్చి తెలిపియుంటిమి. ఇప్పుడు మనలోకొందరు గాంధిమతమును రూపుమాపవలె నని ఆందోళనపడుట ఆశ్చర్యకరముగ నున్నది. ఇట్లగుచో మన ఆంగ్లవాఙ్మయ మేమగును? స్వాతంత్ర్యవాఙ్మయమును తొలగించినచో మనవాఙ్మయమున నిక మిగులున దేమి?

—సర్ ఇసాక్ ఫుట్.

౧౧. నైతికబల మున్నగాని ఏ ప్రభుత్వమును దృఢముగ నుండదు. బలప్రయోగము ప్రభుత్వమునకు బలమును హెచ్చించుటకు మారు తగ్గించుచుండును. ప్రజాభిప్రాయవిరుద్ధముగ, ఎంత అధికబలప్రయోగ మొనర్చిన అదియంత నిస్సారము, నిరుపయోగమగును.

—వెడ్జివుడ్డు బెన్.

—వడ్లమూడి గోపాలకృష్ణమూర్తి.

---

## గ్రంథచౌర్యము

'భాషాభిమాని' యొకరు ౮-౮-౧౯౩౧ నాటి కృష్ణాపత్రికయం దిట్లు వ్రాసిరి:

"ఆంధ్రభాషలో నవలలు, నాటకములు, కథలు, కావ్యములు, గీతములు, గేయములు నేడు ఎక్కువగా ప్రచురింపబడుట ముదావహమే! ఐనను ఇందు స్వతంత్రరచనలు కొలదిగా నుండుట విషాదకరము. అవసరమైన గ్రంథములకంటె అనవసరగ్రంథములు ఎక్కువైపోవుచున్నవి. కాని వెలకు పుస్తకములను కొనువారు కొలదిమంది మాత్రమే యున్నారు. నిష్ప్రయోజనము పుస్తకములు కొన్ని అచ్చొత్తించి ఒకటి రెండురూపాయల వెల పుస్తకముమీద వేసి వేడకు పావలాకు రైళ్లలో అమ్ముచున్నారు. గ్రంథముల వెల ఆమాత్రమే యుండునను నభిప్రాయమును సాధారణ జనులకు గల్గించుచున్నారు. అందుచేత సత్కవులు తమ అమూల్యగ్రంథములను గూడ అట్టివెలలకే పోకడ పెట్టుకొనవలసి వచ్చుచున్నది. తెనుగు గ్రంథకర్తలకు రాజాశ్రయమా లేదు. పాఠకుల దృష్టియా తేర చదువు పైననే ఉన్నది. ఇక సద్గ్రంథప్రచురణ మెంతటి కష్టసాధ్యమో!

ఇప్పుడు తెనుగులో ప్రచురించుచున్న పెక్కు గ్రంథములు ఏ ఇంగ్లీషు గ్రంథమునకో, యే బంగాళీ గ్రంథమునకో, యే హిందీగ్రంథమునకో, యే మరాటీ గ్రంథమునకో, అనువాదములు. తల, తోక, మధ్య మధ్య కొన్ని పంక్తులు స్వతంత్రరచనములు. ఈ స్వతంత్రరచనములు కొన్ని అనువాదగ్రంథ మనువిషయమును మఱుగుపఱచి కృత్రిమగౌరవమును పొందుచున్నారు. మూలగ్రంథము పేరు నుదాహరించిన గౌరవభంగమా?

కొందఱు వేరొక యన్యభాషలో నొకవిషయముమీద వ్రాయబడిన కొన్నిపుస్తకములను చదివి యొక పుస్తకమును వ్రాసి తనగ్రంథములో ఆ గ్రంథకర్తలకు కృతజ్ఞతయైనను దెల్పరు. కొన్ని కొన్ని పుటలనే అనువాదము చేసినట్లు కనబడుచుండినను సరే! ఇంతకంటె కృతఘ్నత యేమున్నది?

కొందఱు ప్రాతపత్రికా సంపుటములలోని వ్యాసములను కొన్నికొన్ని పంక్తులు మార్పుచేసి తమ పేరులతో ప్రకటించుకొనుచున్నారు. పీనలుకోదు ఇందుకేమి చెప్పునో?

గుజరాతినుండి అనువదించి హిందినుండి అనియో, కన్నడమునుండి అనువదించి ఇంగ్లీషునుండిఅనియో వ్రాసికొనువారు కొందఱు. బాగుగా వచ్చినభాషకంటె బాగుగా రాని భాషలో మంచి ప్రావీణ్య మున్నటుల నటింతురు. ఏలకో బాగుగా బోధపడుట లేదు.

తెనుగు దేశములో వెంకటపార్వతీశ్వరకవులు సుప్రసిద్ధులుగదా! షేక్స్పియరు రచించిన 'కామిడీఆఫ్ ఎరర్సు' అనునాటకమును ఈశ్వరచంద్రవిద్యాసాగరులు వంగభాషలోనికి అనువాదము చేసిరి. వెంకటపార్వతీశ్వరకవులు వంగభాషనుండి తెనిగించినటుల విద్యాసాగరునిపుస్తకము దగ్గఱ పెట్టుకొని చూచినచో స్పష్టముగ కనబడును. విద్యాసాగరు డుంచిన పాత్రల పేరులనే వీరును ఉంచినారు. వంగభాషలో ఆగ్రంథము పేరు 'భ్రాంతివిలాసము'. తెనుగులోను అంతియే. పైన మాత్రము ఇంగ్లీషు ననుసరించి అని వ్రాసినారు. విద్యాసాగరుని పేరు నుదాహరించుట న్యాయము కాదా!

ఒకరు ఒకగీతమును వ్రాసిన పెక్కురు ఆగీతభావమునే తీసికొని శబ్దముల మార్పుచేసి గీతముల వ్రాయుచున్నారు. అటుల వ్రాయుటలో తొలుతటిదానికంటె తరువాత వ్రాసినది అనుకరణమైనను ఏవిధముగ నైన

గుణసమృద్ధియున్న మంచిదే. అప్పుడుకూడ మూలగీతమును పేర్కొనుట న్యాయముకాదా? ఎట్లైనను తాను అనుభవించియో ఊహించియో అనువదించియో వ్రాసినవాడు శ్లాఘింపదగినవాడు. గ్రంథచౌర్యము భావచౌర్యము చేసినవారు నిరసింపదగినవారు. మూలగ్రంథము నుదాహరించిన చౌర్య మణిపించుకొనదుగదా!

ఈమధ్య కొన్ని యేండ్లనుండి ఒకే భావముతో గూడిన ఒక ఫక్కీగీతము కొలది మార్పులతో అప్పుడప్పుడు పత్రికలలో చదువుచుంటిని. ఆ పద్యఫక్కీ, ఆ భావము నన్నెంతో ఆకర్షించుచుండెడిది. ఈ మధ్య సమదర్శిని నూతన సంవత్సరాది సంచిక వచ్చినప్పుడు రాజమహేంద్రవరములో పండితకవియగు నొక మిత్రునియింటివద్ద నుంటిని. ఆసంచికలో విజయపార్థసారథిగారు రచించిన 'భాగస్వాములు' అను గీతములను చదివి ఆ మిత్రునితో ఈగీతములఫక్కీయందలి భావము ఎంత హృదయాకర్షణాకరముగ నున్నదో చూచినారా అంటిని. 'చూచితిని, కాంగ్రెసుపత్రిక కూడ ఆగీతమును మెచ్చుకొన్న'దని సాహితీసంపుటము నొకదానిని తీసి అందు పూర్వమెప్పుడో ప్రకటింపబడ్డ 'కాపుపెండ్లి' అనుగీతమును చదువుమని యిచ్చెను. రచయిత నిజనామము నం దుంచక గీతానందు డను గుప్తనామ ముంచుకొనెను.

నేను ఆగీతములను చదివి తన్మయుడ నైతిని. ఆ గీతముల రచనావిధానము— అందలి శైలి— కన్నుల యెదుట మాటలాడునట్లుండు ఆ భావుకత్వము— పల్లెటూరి మానవప్రకృతుల సహజస్వభావవర్ణనము—కథలోని యున్నతభావము నా తన్మయత్వమునకు గారణములు.

'కాపుపెండ్లి'లోని గీతఫక్కీకిని కథావిధానమునకును వర్ణనములకును, 'భాగస్వాములు' అను గీతఫక్కీకిని కథావిధానమునకును వర్ణనలకును అంతగా భేదము కనబడలేదు. సమాసములు కూడ కొన్ని అందులో నున్నవే యిందులో నున్నవి. నామిత్రునితో కథను ఈ విధముగా ఏల మార్పు చేసినాడో, కాపు పెండ్లిలోని భావసౌందర్యము రసవిజృంభణము కవితాప్రాగల్భ్యము ఇందులో దీనికొని రాలేక అపజయము నొందినాడేమి? ఆ గీతానందుడు ఈవిజయపార్థసారథిగారు కాదా అంటిని. నా మిత్రుడు గీతానందుడు వేఱొక కవీశ్వరు డని, ఆ కవీశ్వరుని ప్రతిభను, రసజ్ఞతను, సౌందర్యోపాసకత్వమును స్తుతించెను. నే నాశ్చర్యము నొందితిని. విజయపార్థసారథిగారు గీతానందుని కాపుపెండ్లి ననుసరించి యని వ్రాసికొనకపోవుటేలకో తెలియకున్నది.

అంతట భారతి ప్రాతసంచికనుదీసి రుక్మిణి అను పేరుతో వ్రాయబడియున్న పద్యములలో గీతానందుని వాక్యములు దొర్లియుండుటజూపి యిట్టివి నేడు సర్వసాధారణ మనెను. నేను విషాదాశ్చర్యముల నొందితిని. జుగుప్సాకరము లైన యిట్టి కార్యములను మానుట ఉచితము.

పురాతనకవులు పిల్లమునసుచరిత్రములు సృష్టించినను ఇతరశక్తులు తక్కువైనను వారు పండితులనియైన వారి గ్రంథములవలన దెలియుచున్నది. ఇప్పుడు పెక్కురకు పాండిత్యము సున్నయైనను మోసపుకీర్తియందు మాత్రము అభిలాష మిక్కుటము.

మోస మెంతకాలము దాగియుండును? లేనిశక్తి యున్నదని ఆపాదించుకొనువాడు తప్పక నష్టపడును. కనుక నట్టి అకార్యములకు దొరక కష్టించి సద్గ్రంథపఠనము చేసియు పండితులయొద్ద నేర్చుకొనియు స్వశక్తిపై నాధారపడ పాఠకులను హెచ్చరించుచున్నాను."

చాలినంత సంస్కార ముండి యుత్తమగ్రంథములను రచియించువా రుత్తములు. ఉన్నసంస్కారముతో సామాన్యగ్రంథములను రచియించువారు మధ్యములు. సంస్కారమే లేక నీరసగ్రంథములను రచియించి వాఙ్మయమును పాడుచేయువా రధములు. 'భాషాభిమాని' పేర్కొనినట్లు పేరైన నెత్తక

ఒరులగ్రంథములందలిభాగముల, నున్నరీతిని, ముచ్చిలించి గ్రంథముల నింపి, తమపేరున వానిని వెలయించి గ్రంథకర్తృతాగౌరవము నాకాంక్షించు మహనీయులు 'తే కే న జానీ మహే'అను భర్తృహరిసూక్తిని జ్ఞప్తికి దెచ్చు చున్నారు.

---

## జప్లిను రైలు



జర్మనిలో బెర్లిను-హాంబర్గుస్టేషనులమధ్య క్రొత్త రకపు రైలుబండి గంటకు నూటయిరువది మైళ్లవంతున నడచునది.

---

## త్రిలింగలోని 'భారతిచిత్ర విమర్శ'

త్రిలింగపత్రిక (౧౭-౮-౩౧ నాటిది) యందు శ్రీ వి. ఆర్. స్వామిశాస్త్రిగారు "భారతిచిత్రవిమర్శ" అను పేరున నొక అధిక్షేపగర్భితమగు విమర్శ నిట్లు ప్రకటించినారు:

"జ్యేష్ఠమాసపుభారతిలో రెండు విచిత్రచిత్రములు గలవు. అందొకటి భారతమతసంప్రదాయము— ఈచిత్రము గంభీరభావభరితమై చిత్రకారుని ప్రతిభను చాటుచున్నది. భరతదేశమున గల ఎల్లమతములకును మూలపురుషులు, లౌకికపురుషులేననియు, హిందూమతమునకు మాత్రము పురాణపురుషుడగుపరమేశ్వరుడే మూలపురుషుడనియు:- కావుననే హిందూమతము తక్కినమతములకంటె సర్వవిధముల నుత్తమమనియు, పవిత్రమనియు, అనాదియనియు, శాశ్వతమనియు, నా చిత్రము వ్యక్తముచేయుచున్నది. ఇట్టిచిత్రము నూహించి, రచించిన శ్రీయుత పి. యస్. వెంకట్రావుగారు ప్రశంసాపాత్రులే గాని ఈశ్వరచిత్రమును వ్రాయుటలో వారు కొండంత తప్పు చేసినారు. పాపము ఆయనగారు, అర్ధనారీశ్వరచిత్రమును సంకల్పించివ్రాయుటలో కుడివైపు పార్వతిగను, ఎడమవైపు పరమేశ్వరునిగను వ్రాసినారు. ఇది విపరీతము. ఇంతకును రావుగారిది పొరబాటు, దానికేమి గాని, 'పారిజాతపరిమళోల్లాసము'నందును నెరసులు నెమకునేర్పరి 'భారతి' యీమాత్రముగ్రహింపకపోవుట వింత- ఎజెంగిరో ప్రకటించితి ననుము కాబోలు, అనుచో, తప్పులతడకలను పేలుయుటకా తా నవతరించినది? అని నే నడుగనా అప్పుడు?

ఇక రెండవచిత్రము పేరు — పఞ్చముఖదైవము. కాని దాని కుండునది ముఖమొక్కటియే, బాహువులు మాత్ర మాఱున్నవి. ఆఱుచేతుల చిత్రమునకు పఞ్చముఖదైవమని పేరుపెట్టిన 'భారతి' ప్రతిభ నేమని కొనియాడవచ్చును?

'భారతి' ఇట్టి ప్రమాదములకు లోనగుట వింత గాదా? 'తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు విశ్వదాభి

రామ వినుర వేమ' యన్న మహాత్ముడు చిరస్మరణీయుడు గదా."

"భారతమతసంచయ" చిత్రమున హిందూమతమును వ్యక్తపరుచునది హరిహర చిత్రముగాని అర్ధనారీశ్వర చిత్రము కాదు. హిందూమతము హరిహరాత్మక మగుట నది తెలియజేయును. ఇపుడు విపరీతమగు శాస్త్రి గారివాదము పరాస్తమయినది.

స్థూలదృష్టికి గోచరించు నీ విషయము శాస్త్రిగారి సూక్ష్మదృష్టికి గోచరింపలేదేల? 'పారిజాతపరిమళోల్లా'సాతిరేకమున నాసూక్ష్మ దృష్టియు లోపించియుండెనోటు! విషయమును జక్కగా బరిశీలించి, తత్త్వమును తెలిసి పదపడి యందలి గుణదోషములను విమర్శిం చుట వివేకము.

షణ్ముఖదైవము—ఇట 'భుజ'శబ్దము నకు మారు 'ముఖ'శబ్దము ముద్రితమగుట పొరపాటని పసుబాపలకు సైతము తెలియును; అయినను దానినేని గుర్తించి తెలిపిన శాస్త్రి గారియెడ భారతి యెంతయు కృతజత గలిగి యుండును. —భారతి.

* * *

## భారతీ చిత్రవిమర్శ

ప్రజోత్పత్తి సం. శ్రావణశుద్ధచతుర్థి సోమవారపు త్రిలింగపత్రిక 3-వ పుటలో శ్రీ వి. ఆర్. స్వామి శాస్త్రిగారు తమ సహజశాస్త్రజ్ఞత్వమును జూపుచు గావించిన భారతీచిత్రవిమర్శ కడువిచిత్రముగ నున్నది. పి. యస్. వెంకటరావుగారు వ్రాసిన "భారతమతసంచయము" అను రాయలసీమ చిత్రలేఖనమును పొగడుచు క్రిందికి బడద్రోయు నుద్దేశ్యమును గనుపరుచుచు, శాస్త్రి గారు తామే తలక్రిందయినారు. ఈవిమర్శ రాయలసీమ ద్వేషభరితమై, భారతీపరిచయ విముఖమై శాస్త్రిగారి సర్వతోముఖ సామరస్యమును జాటుచున్నది. సామాన్య దృష్టితో దిలకించియుండిన భారతమతసంచయగత హరి హరులను పార్వతీపరమేశ్వరులుగ పొరబడి యుండరు. ఏమియీదివ్యదృష్టి? శాస్త్రిగారిఅద్వైతాభిమానము చిత్ర గతస్త్రీపురుషవ్యక్తిపరిజ్ఞానమునుగూడా నశింపజేసినదే. అయ్యో ఏమనవచ్చును? పరమేశ్వరుని దక్షిణభాగము నందున్న హరి పార్వతిఅయినచో, సీమంతము (పాపట) ఏమయ్యెనో పాపము! ఊర్ధ్వపుండ్రమును కుంకుమగా భావించియుందురేమో! నిరంజన విగ్రహమునకు అంజన మేలయని తలచిరేమో! ఆధునిక కాంతలకువలె నాసాభరణము పార్వతికిని లేదని భావించి యుందురా? స్త్రీ పురుష కంఠవిభేద విచారము ద్వైతులకే విడిచియుందురు! ఇక విశాలభుజాంతరాళమును దృష్టిదోషముచే ఉత్తుంగకుచకుంభసుంభితమని భ్రమపడియుందురు. ఇక నేమున్నది? పీతాంబరము పట్టుచీర యయ్యెను. స్త్రీ పురుషపరిధాన భేదజ్ఞాన మంతర్ధానమయ్యెను. ఔరా పొరపాట్లు! హరి గౌరియగునా యని ఎన్నిమార్లు భావించినను—ద్వైతులనుగాబోలు—మా కట్టి యద్వైత జ్ఞానము గలుగకయున్నది. పార్వతియనియే పొరబడిరి పో—అలుమగలు, తల్లిదండ్రులు, అత్తమామలు, పార్వతీ పరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు అను మొదలగు వాడుకలచే పార్వకాలికమగు స్త్రీగౌరవమును జూచిన చిత్రకారులకు పార్వతిని కుడితట్టు వ్రాయునుద్దేశము కలిగియుండకూడదా? ఇదంతయు శాస్త్రిగారికి కలిగిన యూహలకు తెరచాటు. పొరపాటు కాదుసుమా? తలపెట్టిన కార్యమును చక్కగా నిర్వహించుచున్న భారతి ఈశాస్త్రిగారి యవకతవకలను ఇంతకుముందే గ్రహించక యుండునా? గ్రహించకయున్న నేపడుగక విడుతునా?

బుక్కపట్టం అణ్ణయాచార్యులు.

గాంధిగారు సృష్టించిన రాటము




---

## పీఠికాపురము

శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు

(సంస్కృత పారసీ కాంగ్లే యాచ్ఛాంధ్ర చతుర్భాషానీసము)

సంస్కృతము

భ్రాజతే కుక్కు-టేశ్వర మాధవాలయా-భ్యాం ఘనాహూఢసౌధాంత రేణ

పార్శి

హాసిల్ హామీహ జహాఁ తాజ్ సమూ నబి - హిమ్మ త్మ్మసాపిర్చి హీ రిసాల (?)

ఇంగ్లీషు

రావు సూర్యారావు రాజాబహాదు ర్ది - చారిటబ్రిలూ ల్ప్రెజింట్సు ఎ క్రావి

తెలుగు

చదువులపుట్టిల్లు చల్వతెమ్మెరజల్లు - మేల్నోల్లు పొగడిక మీరఁజెల్లు
మేటిపంటలటెంకి కల్మిమెడలంకి
బెస్టు టౌ నిన్గోదావరీ యీస్ట్ ది సీజె
మబ్లగ పీ ర్వ జవాఁ జవాల్ మీ ర్జనాన
పీఠికాపుర మేవ త్రివిష్టప మిహా.

---

## బలవంతుడ నని గర్వింపకుము





లెప్టినెంటు పి. గోపాల కృష్ణయ్యగారు



పచ్చయప్పకాలేజి వ్యాయామవిద్యాడైరక్టరు అగు లెప్టినెంటు పి. గోపాలకృష్ణయ్య, బి. ఏ. ఎఫ్. ఆర్. ఇ. యస్. (లండను) గారు యూరోపుఖండములో వ్యాయామవిద్యాపద్ధతులను పరిశీలించుటకుగాను యీ నెల 23-వ తేదిన "ఎస్. ఎస్. ఎంబాయసీ" స్టీమరు మీద మద్రాసు రేవు విడిచిరి.

వీరు ముఖ్యముగా జర్మనీ, స్వీడను దేశములను దర్శించి, అచ్చటి విశ్వవిద్యాలయములలో అనుసరింపబడుచున్న వ్యాయామవిద్యాపద్ధతులను పరిశీలించెదరు.

పిమ్మట వీరు అమెరికా సంయుక్తరాష్ట్రములను దర్శించి, అచ్చటి విశ్వవిద్యాలయములలో అనుసరింపబడుచున్న వ్యాయామవిద్యాపద్ధతులనుకూడ పరిశీలించెదరు. న్యూయార్కు నగరమందు కొలంబియా విశ్వవిద్యాలయములో ఒక సంవత్సరకాలము ఉన్నత వ్యాయామవిద్యను పొందెదరు. కొలంబియా విశ్వవిద్యాలయములో ఉన్నత వ్యాయామవిద్యను పొందుటకు చేర్చుకొబడిన మొట్టమొదటి భారతీయు డితడే. వీరు న్యూయార్కు విశ్వవిద్యాలయమునుండి ఉన్నత అర్థశాస్త్రములో పి. హెచ్. డి. డిగ్రీనికూడ పొందెదరు.

లెప్టినెంటు గోపాలకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయ సైనికదళములో కింగ్సు కమిషను ఆఫీసరుగానున్నారు. ఈ రాజధానిలో బాలభటోద్యమమునందు పాల్గొనియున్నారు. వీరు గుంటూరుజిల్లాలో మర్యాదగల తెలగకుటుంబమునకు చెందినవారు. చాలకాలము గుంటూరు మునిసిపలు చైర్మనుగాను, గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షులుగాను, గుంటూరు ఏ. ఇ. ఏ. ఎం. కాలేజి వైస్ ప్రిన్సిపాలుగాను పనిచేసియుండిన రా. బ. పి. వెంకటకృష్ణయ్య నాయుడుగారి తృతీయ

పుత్రులు. మరియు, మద్రాసు మెడికలుకాలేజి అసిస్టెంటు ప్రొఫెసరుపదవినుండి విరమించిన రా. సా. డా. ఎస్. పి. రామస్వామినాయుడుగారి మనుమలు.

—— —ఆంధ్రపత్రిక.

డి. సుబ్రహ్మణ్యంగారు, యం. ఏ.




లండనులోని అక్చ్యురీసు ఇన్‌స్టిట్యూటునందు ప్రథమపరీక్షయందు విజయము గాంచిరి. ఇప్పటి కాంధ్రులలో నీ పరీక్షయందు జయముగన్నవారు వీరొకరే.

వి. పి. చౌదరిగారు




వీరిది గుంటూరు. లండనులో బి. కాం. డిగ్రీని బడసి, విద్లండు బ్యాంకులో ఏడాదికాలము అక్కౌంటెంటుపని నేర్చుకొని వచ్చినారు.




శ్రీమతి రాధాబాయి కర్నడుగారు




సంయుక్తగాడసారస్వతసంఘమున బి. ఏ. పరీక్ష యందు కృతార్థురా లయిన మొదటి యువతి.

---

శ్రీమతి చిన్నిలక్ష్మమ్మగారు




ఈమె అనంతపురంజిల్లా విద్యాసంఘమునకు సభ్యురాలుగా నియమింపబడెను.

---




మదరాసు విశ్వవిద్యాలయమున నీ సంవత్సరము పట్టములను బడసిన నారీమణులు




## పల్లెటూరి కథలు

శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు వ్రాసి ప్రచురించిన "పల్లెటూరి కథలు" అను గ్రంథముతో "తెనుగుచిన్నకథ"కు ఒక క్రొత్త దృక్పథమును, క్రొత్త సందేశమును, క్రొత్తరంగమును చిక్కినవని చదువరులు గ్రహించకపోరు. ఇదివరలో తెనుగుపత్రికలలోను, మాస-ఉగాదిసంచికలలోను ప్రచురింపబడుచుండు చిన్నకథల లోని యంశము మోహోదయమగుచున్న నవయువకయువతీజనంబుల యుద్రేకములును, ఆందోళనములును, సంఘపుకట్టుబాట్లలో కొన్నిచోటుల ప్రాకిన దురాచారములయొక్క దూషణలును, స్వేచ్ఛవలె కనిపించు స్వైరవిహారపరతంత్రతలును, విలాసములును, వైరాగ్యములును, మరణములును మొదలగు సద్భుతములు (romances) మాత్రమే అయి యుండెడిది. చిన్నకథయొక్క సంకల్పమును, సార్థక్యమును ఇదియే యని కొందరును, ఇంతియే యని కొందరును తలచియుండుటలో నాశ్చర్యము లేదు. చిన్నకథను మాసీమాడవములో ముందు దానినే పఠించి, ఆశృంగారమును, ఆవిలాసమును, ఆవైరాగ్యమును అనుభవించి దానిని విడిచిపెట్టుట పాఠకుల కలవాటైపోయినది.

ఇట్టి ఆంధ్రసారస్వతలోకమున నీ గ్రంథమును ప్రచురించి ఇంతకంటె: సొగసైన మనోహరమైన దిశకు ఈ"చిన్నకథ" మాడగల దన్న సంగతిని గ్రంథకర్త ప్రత్యక్షముగ ఋజువుచేసినాడు. ఇతను తొలుదొల్త చేసినపని నవయౌవనమాత్రాంతమగు మోహామును, దాని పరిణామములను మాత్రమే కథలకు ప్రప్రధానాంశముగ జేయుట మాని, లోకవ్యవహారములను, సంసారకష్టసుఖములను ప్రప్రధానాంశముగ జేసినాడు. పిదప మోహాపరతంత్రులును, శరీరసౌందర్యోపాసకులును నగు నవయౌవనుల ప్రధానపాత్రలుగ జేయుట మాని సంసార కష్టసుఖములు శరీరమునకు నాటి క్రిందుమీదులు పడుచున్న గృహస్థులను, గేస్తురాండ్రను ప్రధానపాత్రలుగా జేసినాడు. ఈచిత్రించుటలోనే ఆలోపములు మాయమై సుగుణములు వృద్ధిచెంది, అన్యోన్యత కుదిరి సంసారములు చక్కబడు మార్గములను సూచించినాడు. అయినను గ్రంథము భయపెట్టి నీతిబోధనలుచేయు శిక్షాస్మృతివలె గాక, సుఖసల్లాపములు సలుపుచు సూనృతమార్గమున నడిపించు సుహృత్తమునివలె సహవాసయోగ్యమై ప్రీతిదాయకమై యుండుట గ్రంథకర్తయొక్క రచనాచమత్కృతిని చాటుచున్నది.

ఇక కథలలోని కొన్ని ప్రధానాంశముల బరిశీలింతము. గ్రామప్రజలయొక్క మొట్టమొదటి యిబ్బంది ఉద్యోగస్థుల రాయిడి. ఒక ముసలాయన చెప్పినట్లు, "ఇప్పటి మునసబుకరణాలకు - పెద్దచిన్న తారతమ్యము లేకుండా ఏమిచేస్తానో చూడు నీసంగతి కనుక్కుంటాను- అనే బెదిరింపులతో యేడిపించుకు తింటూ" వుండడము పరిపాటి. ఒకవూరికరణం "లచ్చయ్య క్రొత్తలోగిటి అరుగులు ఆక్రమణముచేశాడు." అని పైకి వ్రాసి రెవిన్యూఇనస్పెక్టరుకు బాగా భోజనము పెట్టి కొలిపించి స్థిరపరచి, తహస్సీల్దారునోటీసు అమలుజరిపించి వెంటనే యింటిచూరూ అరుగులూ కొట్టేసుకోవడమో, లేకుంటే నెలకు పదిహేనురూపాయల చొప్పున అపరాధం కడు

తూ సివిలు- క్రిమినలు చర్యలకు లోబడడమో జరిగేట్లు చేయించాడు. అప్పారుమునసబే అంజయ్యపాలము గట్టుకొట్టి తనపాలములో చేర్చుకొని ఏమయ్యా అంటే రెండు నువ్వులబస్తాలు అతని గడ్డికుప్పలో దాచి అతని మీద చోరీకేసుపెట్టి మూడుమాసములు కఠినశిక్ష వేయించాడు. వూళ్లో వెట్టివాణ్ణీ-చాకలివాణ్ణీ, వడ్రపు పని చేసే బసవలింగాన్ని ఏమర్రా దొంగసాక్ష్యమిచ్చినారని పెద్దమనిషి కొండయ్య అడిగితే, "లేదు బాబయ్యా గ్రామనౌకరీకి భంగం వస్తుందని మీకు తెలియదా"యని వాళ్ల జవాబు. గ్రామమునసబుకరణా లంటే పట్టణములోని వారి పైఉద్యోగములకు లంచము లిప్పించుచు తాము తింటూ ప్రజలను హింసించు లోటులని అర్థము. మరోమునసబు వెంకటసామిచేత అయిదురూపాయీలు లంచ మిప్పిస్తేనే కాని ఒక ఓవర్సీలుకొత్వాల్ మావూరు కదలలేదు. ఇది గ్రామాధికారుల స్థితి.

ఇక వీరి పైఅధికారులనగా పట్టణములో వుండే రెవిన్యూఇనస్పెక్టరులు, పోలీసుఇనస్పెక్టరులు, మేజస్ట్రేటులు, రిజిస్ట్రారులు. ఓవర్సీలుమాట చెప్పనక్కర లేదు. రెవిన్యూఇనస్పెక్టరేది ఆక్రమణమంటే అది ఆక్రమణము. పోలీసుఇనస్పెక్టరెవరిని దొంగంటే వాడు దొంగ. మేజస్ట్రేటు కెటు మొగమాట ముంటే అటు తీర్పు. రిజిస్ట్రారు గారి కియ్యవలసిన ప్రయివేటుఫీజు ముట్టకుంటే "మూడు గంటలైపోయింది. అవతలకు.పో" ఓవర్సీలుకు ౫౦రూపాయిలిస్తే నీరు వచ్చే సదుపాయం వీలైతే చేస్తాడు. అన్ని తోవలూ సర్కారువే. ఆతోవంట బండి వెడితే జరిమానా. ఓవర్సీలుకు లంచమిస్తేనే కాని అది తప్పదు. పట్టణములో ఇత్తడిచెంబు పట్టుకుంటే న్యూసెన్సుకేసు.

ఈఉద్యోగస్థులు రిటైరైనాకాని వీళ్ల పీడ పోదు. ఏమంటే అపుడు వీరు బెంచిమేజస్ట్రేటు లౌతారు. పై ఉద్యోగస్థులందరూ అన్ని డిపార్టుమెంటులవాళ్లూ ఒకళ్ల కొకళ్లు చుట్టాలో, స్నేహితులో ఔతారు. అందుచేత ఒకడికి వచ్చే లంచము ఇంకొక డెన్నడూ తప్పించడు.

వీరి కెక్కడికక్కడే వుల్ఫాలు కావాలి. రెవిన్యూ ఇనస్పెక్టరు వగైరాలు వస్తే కరణంగారింట విందులు. పోలీసు ఇనస్పెక్టరులు, మేజస్ట్రేటులు వస్తే మునసబు గారింట కోళ్లూ గొర్రెలూ కొట్టి భోజనాలు. పోలీసు వాళ్లు అనగానే యేకార్యైనా ఆపేసి అందులో కూర్చొని చార్జి యెగవేయవచ్చు. డిప్యూటీ కలెక్టరుగారి కుమారుడికంటే మేస్టరులు మార్కులు దిద్ది పేసు చేయవలసినదే. మైలుకూలీ ఓవర్సీలుదగ్గరకు పనివుండి వచ్చాడురా అంటే వాళ్ల ఆవులకు గడ్డివేసి కుడితి తాగించనిదే వెళ్లకూడదు. లంచాలు దిట్టముగా ముట్టిపోతే ఆక్రమణాలు లేవు, దొంగతనాలు లేవు, సర్కారురోడ్డుమీద బళ్లు తోలడాలు లేవు. అంతా రామరాజ్యమే.

పల్లెటూళ్లలో రెండవఅంశము చిలిపిజట్టీలు. తొమ్మిదేండ్ల చంద్రమ్మ నడుస్తున్నపుడు ఏడేళ్ల నరసమ్మ పరికిణీమీద బురద పడితే నరసమ్మతల్లి చంద్రమ్మను మోదీసింది. చంద్రమ్మతల్లి నరసమ్మను తిట్టింది. నరసమ్మతల్లి జగడానికి వచ్చింది. ఎవరింట్లో మగవాళ్లు ఆయింట్లో ఆడవాళ్లతరఫు. ఎవరిచుట్టాల వాళ్లు వాళ్ల తరఫు. నాలుగురోజు లిదో అలికిడి.

మూడవఅంశము సహవాసము, పల్లెటూరి కుర్రవాళ్లు చెడిపోవడమున్నూ. వెంకయ్యకొడుకు పురుషోత్తాన్ని చూచి చదువుకొని జ్ఞానం సంపాదించేవా రెవరూ లేరు కాని, కోటయ్యకొడుకు రామనాథమును చూచి క్రాంపిం గుంచుకుంటకు, అపకతవకగా నాలు గింగ్లీషు ముక్కలు పేలిందుకు, కళ్లజోళ్లూ, మేజాబల్లలూ, చేతికర్రలు, కొనిందుకు ఇంట్లోవస్తువు లెత్తుకపోయి భోగమువాళ్ల కిచ్చేటందుకు సత్యంలాటి కుర్రవాళ్లనేకులు సిద్ధము.

నాలుగవఅంశము పల్లెటూళ్లవాళ్లు పడేబందుగలు. పాపయ్య పెళ్లిసరకులు కొందమని యిల్లు బయలుదేరితే రెండురూపాయిలు పుచ్చుకొన్న టిక్కెట్ల మేష్టరు రూపాయిపావులా టిక్కెట్టిచ్చి చిల్లర లేదని తక్కిన ముప్పావలా వుంచేసుకొన్నాడు. ఇత్తడి చెంబు పట్టుకుంటే పట్టణంలో బెంచిమేజస్ట్రేటు రెండు రూపాయీలు జరిమానా వేశాడు. పట్టుబట్టలకీ, జరిబట్టలకీ, బంగారానికీ, లైటులకీ, సెంటులకీ

సుమారు ఎనిమిదివందల రూపాయలు ఖర్చు అయినవి. ఇంటికి వచ్చి చూచుకుంటే పట్టుబట్టలు బరంపురానివి కాక అల్కా చీవాలి అయినవి. జరీ రాగిదయిపోయింది. అత్తరువులు పులుసుకంపు. పెట్రోలులైటు మేంటిలు తసులకింది. అరిశేమలాంటిరుకు వత్తెక్కలేదు. బత్తీలలో అంతా దగే అన్నాడు పాపయ్య మామగారు. అయినా రోజుల్ని బట్టి నడవా లన్నాడు గోపాలం.

అయినా పల్లెటూళ్లనుగురించి మనము బొత్తిగా నిరాశపడవక్కరలేదు. ధ్వజస్తంభముచుట్టూ చేరే పెద్దలలో కొండయ్యలాంటివాళ్లు కొందరిని ధర్మంగా ప్రవర్తించలేరా అని అడమాయించగలరు. లచ్చయ్యలాంటివాళ్లు దాటిపోయేవాళ్లకి వీలుగా వుండేటందుకు రోడ్డు కాలువ కలసే మొగలో చిన్న సత్రం కట్టించబూనుకుంటున్నారు. వెంకయ్య యేటా వైశాఖమాసంలో తనయింట పురాణం చదివించడం మామూలుంది. "ఇంతకీ,మనలోమనకి నీతీ జాతీ లేకపోవడం, అందుకు తోడు మనలో అస్థైర్యం కలగడాన్ని బట్టీ, నేను మన యీస్థితికి వచ్చా"మని చీవాట్లు పెట్టిందుకు శాస్త్రిలాగు ధైర్యంగా నిలబడగలిగేవా ళ్లున్నారు. కరణం యింటికి వేళకి ఎవడు వచ్చినా లేదనకుండా అన్నం పెడతాడు. పురుషోత్తంలాటివాళ్లు బి. యే. పేసయికూడా బానిసవృత్తిలో చేరక దేశసేవ చెయ్యాలనే కోరికతో ప్రజాసేవక సంఘంలో చేరుతున్నారు. అయినదానికీ కానిదానికీ యింతడబ్బు పెట్టడం పూర్వసంప్రదాయం కాదనే పెద్దలున్నారు. చింతగింజ లాడుకుంటూన్న చిన్నపిల్లలకోసం గుంజాలు తెంపుకుని దెబ్బలాడుకుంటోన్న పెద్దవాళ్లందరూ వాళ్లలో వాళ్లే సిగ్గుపడుతున్నారు. తిన్నగా ప్రవర్తించనివాళ్లకి దేముడే శాస్తి చేస్తా డనడానికి,మునసబు కూతురు ముండమోయడం, కరణం కూతుర్ని అల్లుడు వదిలివేయడమే సాక్ష్యాలు.

ఈవిధముగా పల్లెటూళ్లతాలూకు కొన్నిచాయలు తీసి గ్రంథకర్త చిత్రించి ప్రచురించినాడు.ఇట్టి వసంతములైన ఛాయ లాగ్రామములపై నున్నవి. అవి గ్రహించి ముద్రించగల చిత్రకారు లవసరమై యున్నారు. ఈగ్రంథకర్త తాను రచియించినంత మేరలో పొందినవిజయమును తా నింకను పెక్కుకథలు వ్రాయుటకు ప్రోత్సాహముగా గైకొని తనకృషిని కొనసాగించునుగాక యని కోరుచున్నాను.

గరిమెళ్ల సత్యనారాయణ, బి. యే.

---

## గ్రామపునర్నిర్మాణవ్యాసములు

గ్రంథకర్త: అన్నంరాజు శ్రీరాములుగారు, స్టోనుహౌసుపేట, నెల్లూరు. వెల రు. ౧-౦-౧.

దేశమునం దెచ్చట జూచినను గ్రామపునర్నిర్మాణావశ్యకతనుగురించి ప్రతివారును ఉద్ఘోషించుచున్న వర్తమానకాలమున, అదనున కందిన వర్షమువలె నీగ్రంథమెంతయు పండిత పామరజనోపయోగకరము కాగలదు. గ్రంథకర్తయగు అన్నంరాజు శ్రీరాములుగారు భారతీయ గ్రామజీవనసౌఖ్యమును విచ్ఛిన్నమొనర్చిన కాలప్రవాహమునకు గురియైన కుటుంబమునం దుద్భవించి, పూర్వము తమకుటుంబమును పాడిపంటలతో తులదూగ జేసిన ప్రదేశము లిపుడు దూషరక్షేత్రములై యుండుట కన్నులార గాంచి పరితపించుచున్న జానపదుడు.అందుచే స్వానుభవపూర్వకములగు నీవ్యాసములయందలి విషయములు భారతీయగ్రామసీమలకు తొల్లింటి సౌభాగ్యస్థితిని సమకూర్పదలపెట్టువారల కెక్కుడు చేదోడువాదోడు గాగలవని వేరుగ చెప్పనక్కరలేదు. గ్రంథనామము సూచించునటుల, ఇది ఒక్కవ్యాసరూపకమగు గ్రంథము గాదు. గ్రంథకర్త అపుడపుడు రచించి వార్తాపత్రికలయందు ప్రకటించిన వ్యాసఖండములకు సుస్థిరరూపము నొసగ సంకల్పించి, మరికొన్నిటి చేర్చి మొత్తము ౪౫ వ్యాసముల నీగ్రంథరూపమున ప్రకటించిరి.

గ్రామముల అభివృద్ధి గ్రామవాసుల ప్రయత్నములపైననే యాధారపడి యున్నదని గ్రంథకర్త నిశ్చితాభిప్రాయము. ఇందుకుగాను వారిలో సత్యము, అన్యోన్యప్రేమ, ఐకమత్యము, ధర్మము నెలకొనవలెను.

అవి నశించుటచేతనే మన గ్రామములు శిథిలమయ్యెను. గ్రామాభ్యుదయమును తిరిగి ఆపువాదులపై నిర్మించి నప్పుడే చిరస్థాయిత నందగలదని గ్రంథకర్త తెలుపుచు, ఇంచుమించు నైతికసంస్కారము పైననే భారమంతయు వైచెను. అట్టి నైతికౌన్నత్యమును సాధించి, ఐక్యముతో జీవించుచు, గ్రామనిధి నేర్పరచుకొని, తమ గ్రామములం దవసరమగు ౧. గ్రామపారిశుద్ధ్యము ౨. వైద్యాలయములు మున్నగు సౌకర్యముల గల్గించుకొని గ్రామజీవితమును సౌఖ్యావహముగ నొనర్చుకొనవలెనని ఈగ్రంథమునందలి ప్రధానాశయము. కాని, ప్రాచీన గ్రామజీవితముయొక్క చరిత్రాత్మకమగు స్వరూపమును, నిర్మాణమును, ప్రాచీనరాజ్యాంగనిర్మాణమునందు గ్రామముల కొసగబడిన స్థానము, సాంఘిక జీవితస్వభావము, గృహపరిశ్రమలు, మొదలగునవి ఆకాలపు గ్రామసౌఖ్యమునకు చాల దోడ్పడెననుట నిర్వివాదము. ఈవిషయముగుసంస్కరణలు ప్రస్తుతము ప్రజాసామాన్యమున కతీతముగ నున్నవని కాబోలును, గ్రంథకర్త ఆవిషయచర్చను వదలి, స్వయంసాహాయ్యముచే సాధింపనగు విషయములకు మాత్రమే తమవ్యాసముల వినియోగించిరి. వీరు సూచించిన కార్యక్రమమును నెరవేర్చినయెడల గ్రామజీవిత మిప్పటికంటె నెక్కు డాకర్షకమై యుండు ననుటకు సందియము లేదు. అపుడు గ్రామములకు చక్కని తపాలాసౌకర్యము లుండును. పాఠశాలలు, వైద్యశాలలు, పఠనాలయములు ఏర్పడును. దొంగతనము లుండవు. గ్రామములు చాల పరిశుభ్రముగ నుండును. గ్రామస్థులు విద్యావంతులై, విద్యాధికుల కిప్పటికంటె సన్నిహిత పరిచయార్హు లయ్యెదరు. కాని ఈ మహాకార్యముల నన్నిటిని సాధించుటకు వలయు ఆర్థికసంపత్తి నెటుల సంపాదింపదగునో, సమగ్రముగ చర్చించియుండినచో గ్రామపునర్నిర్మాణసమస్యను పరిష్కరించుటకు చాల సహాయకరముగ నుండెడిది. అట్టిది లేనిచో నివి కేవలము సదాశయములుగ మాత్రమే యుండగలవు. శ్రీరాములు గారు గ్రామపునర్నిర్మాణబాధ్యతను విద్యాధికులపై నిడిరి. ఇది సహజమే. కాని విద్యాధికులు గ్రామసీమలకు జని, వ్యవసాయవృత్తి నవలంబింపవలెననియు, విద్యాధికులలో వ్యాపించియున్న నిరుద్యోగసమస్యను తొలగించుట కది చాలవరకు తోడ్పడగలదనియు వారు తెలిపిన అభిప్రాయములు వెంటనే అంగీకరింపబడజాలవని తోచుచున్నది. ఇప్పటికే వ్యవసాయవృత్తి క్రిక్కిరిసి యుండగా, వ్యవసాయము రైతులకు లాభకరముగ నుండుట లేదని గ్రంథకర్తయే వేరొకచో నంగీకరించుచుండగా, విద్యాధికు లావృత్తిని స్వీకరించుటవలన దేశమునకు గాని, వారికి గాని ఎట్టి ప్రయోజనమును గలుగునటుల కన్పింపదు. ఈవ్యాసములయం దిటులనే వివాదాస్పదములగు విషయములును, ఎల్లరచేతను అంగీకరింపబడజాలని అభిప్రాయములును పెక్కు లున్నను, మొత్తముమీద గ్రామపునర్నిర్మాణాభిలాషులకును, గ్రామజీవితము నెక్కుడు సౌఖ్యప్రదముగ నొనర్చుకొనగోరు జానపదులకును ఉపయోగకరములగు విషయములగలిగి, పఠనయోగ్యముగ నున్నదనుటకు సందియము లేదు.

మో. కృ.

---

## గృహ విచ్ఛిత్తి

గ్రంథకర్త: శ్రీయుత రాయసం కృష్ణమూర్తి గారు. ప్రకాశకులు:— సరస్వతీ గ్రంథమాలవారు. కాకరపఱ్ఱు, తణుకుతాలూకా, పశ్చిమగోదావరి జిల్లా. వెల ౧-౮-౦.

ఇది యొక సాంఘిక నవల యనిపించుకొనగలదు. ఎంతయు నీతిదాయకమైనది. లోకోక్తులు ఎన్నియో కలవు. సంఘమున కెంతయో లోకజ్ఞానమును కలుగజేయునవిగ నున్నవి. ఇందు వృద్ధవివాహానర్థములు ప్రతిబింబించుచున్నవి. వార్ధక్యమున పెండ్లి జేసికొన్న పురుషులు తమ పడుచుభార్యలను సంతృప్తిపరచుటకు పడు అగచాట్లను, అంతగా వా రగచాట్లు పడుచున్నను పడుచుదనంపు సతులు వృద్ధపతులను జూచి రోయుదు, నిరసించుచు వక్రమార్గములను బట్టుటయు, తమ కుటిలప్రవర్తనమును తమభర్తలకు తెలుపుదు రను భయముతో భర్తల చుట్టములను త్రుటిలో నిస్సంకోచముగ గడతేర్చునదియు, అదియుం జాలక తమ వక్రమార్గ

మునకు భర్తలు అడ్డురాకుండ మందులుపెట్టి మతిని పోగొట్టుటయు, తమ విటులతో అనర్గళముగ సంచరించుటకు భర్తలప్రథమకళత్రము తాలూకు కుమార్తెలు గాని పుత్రులు గాని, తదితరులు, మరదండ్రు, సోదరు లున్న వారిపై నిందలను కల్పించి వారిని వెడలగొట్టించునదియు, పురుషులు తమ ప్రథమకళత్రము చనిపోవునప్పుడు తాను మరల పరిణయమాడనని ఘోరప్రమాణముల నొనర్చి భార్యపోయిన ౧౩ వ దినముననే దారుణముగ ఆఘోర ప్రమాణములను మంట గల్పి తమ తుచ్ఛసుఖంబునే అపేక్షించి పిల్లలగతినైన యోచింపక మరల వివాహమాడుటయు చక్కగ దెలుపబడినవి. శైలి సులభము. కాని భాషాదోషములు పెక్కులు గానబడుచున్నవి.

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.

---

## లవంగలత

ఇదియొక సాంఘికనవల. హిందీభాష నుండి అనువాదము. అను: కోనూరి రంగయ్యగారు, నర్సాపురము, పశ్చిమగోదావరిజిల్లా. చందాదారులకు వెల రు. ౧. ఇతరులకు రు. ౧-౮-౦.

భారతస్త్రీలకు యూరపు అమెరికాదేశ స్త్రీలకు గల స్వాతంత్ర్యము నొసగుచో అయ్యది సర్వదా హానికరంబని ఈనవల వ్యక్తీకరించుచున్నది. మన ఆధునిక సంస్కర్తలు స్త్రీలు బాగుగ నాంగ్లభాష నభ్యసించి, విశ్వవిద్యాలయమందలి డిగ్రీలను పొంది, పాశ్చాత్య పరిధానములవంటి దుస్తులను ధరించి, పరపురుషులతో నెవరైనను సరే - చేత చేయి కలపి గాలిషికారున కేగవలయు ననియు, దానివలన తప్పేమియు లేదనియు ననుచున్నారు. కాని ఇట్టి ఆచారమువలన విపత్పరంపరలు వాటిల్లునని లవంగలతచారిత్రమే చాటుచున్నది. ఇట్లని స్త్రీలకు ఆంగ్లభాషను నేర్పరాదని యభిప్రాయము కాదు. లోకవార్తలన్నిటిని గ్రహించి సంఘమున కుపకరించు విషయములను అన్యదేశీయులనుండి నేర్చుకొనుటకు ఆంగ్లభాషావిద్యాభ్యాసమే గాక ఇతరదేశీయభాషలనుగూడ స్త్రీలు అభ్యసించుటనసరము. కాని ఏవిద్యనైనను సముచితరీతిని నేర్చుకొనుట ముఖ్యము. హద్దుమీరి యుండరాదనియే యభిప్రాయము కాని వేరొండు కాదు.

బ్రహ్మసమాజమతస్థుల ఆచారములవలన ఘటిల్లెడి అనర్థములను, లవంగలతచరిత్రమే చాటుచు[illegible] పాఠకులయందు లభించు [illegible] శిక్షణదృష్టి [illegible] వ్యర్థాడంబర[illegible]ముగల సంస్కరణ [illegible] తగులొ[illegible]న్నచో స్త్రీల[illegible] గల [illegible]ము మున్నగు సద్గుణములు అంతరించుననుట తథ్యము. మరియు స్త్రీలు మితిమీరి స్వాతంత్ర్యప్రియ లగుచో ఆపదలను, మానసికక్లేశములను అనుభవించవలసివచ్చు నన్నచో ఆశ్చర్యమొందనక్కరలేదు. దీనికి నిదర్శనము ఇటీవల కొందరు మనసోదరీమణులు పొందుచున్న వివాహవిచ్ఛేదపు చట్టమే. ఇట్టి విపత్తులన్నిటికిని ఈ నవలయందు చెప్పబడిన లవంగలత గురి అయ్యెను. ఆమె స్వీయచారిత్రము తోడిసోదరీమణులకు గుణపాఠముగ నుండునట్లు తెలుపబడెను. శీలసంవర్ధనము మానినీమణుల ప్రథమకర్తవ్యము. జనసామాన్యమందు దేశనిపుణతను విస్తరింపచేయదలంచిన, శీలము లేనిదే యది సఫలీకృతము గాజాల దనువిషయమునకు లవంగలతయే ప్రమాణము.

స్త్రీ ఎంతవిదుషీమణి అయినను ఇంగ్లాండునందు పరీక్షోత్తీర్ణయయి ఎన్ని డిగ్రీలను సంపాదించియుండినను, శీలాభావ మెన్నటికిని సుయశమును చేకూర్పజాలదనుటకు మన లవంగలతయే తార్కాణము.

లవంగలత తండ్రి బ్రహ్మసమాజమతస్థుడు. తల్లి హిందూమతసంప్రదాయిని. లవంగలతవిషయమై దంపతులకు భిన్నాభిప్రాయము లేర్పడెను. లవంగలతకు గరపెడి విద్యాపద్ధతి ఆమె జననికి రుచించెడిది కాదు. బాలురకుపయుక్తంబగు శిక్షణపద్ధతి ననుసరించుట బాలికలకు విద్యగరపుట వారి భవిష్యజ్జీవితమునకు హితకరముగాజాలదని ఆమెతల్లి పలుమారు తన భర్తకు (లవంగలత జనకునకు) సూచించుచుండెను. కాని లవంగలత జనకు డామెమాటలను పెడచెవిని బెట్టెను. తుదకు ప్రాయశ్చిత్తమైనపిదప పశ్చాత్తప్తు డాయెను. గృహిణి

మాటను ద్రోసిపుచ్చినందులకు శాస్తి అయినదనుకొనెను. పురుషులపద్ధతి ననుసరించి స్త్రీలకు శిక్షాప్రదాన మొనరించిన వారియందలి లజ్జావినయశీలాద్యుత్తమప్రకృతి గుణము లడుగంటిపోవును. కావున గృహిణీపదమునకు సర్వదా యోగ్యంబగు శిక్షణమే వారి కొసంగవలయు నను నీతిని లవంగలత చరిత్రము వెల్లడిచేయుచున్నది.

లవంగలత జనకుడు బ్రహ్మసామాజికు డగుటచే తన పుత్రికను ఒకయాదర్శపు శిక్షితస్వాతంత్ర్యప్రియగ నొనరించుటకు ప్రయత్నించుటచే ఆమె కిట్టి సంకట మేర్పడెను. అట్లొనర్పకున్నచో ఇట్టి దుస్థితి చేకూరెడిదిగాదు. అతడు పశ్చాత్తాపమును జూపినపుడు మనహృదయము కరగకమానదు. అతని పశ్చాత్తాపము ఇతరులకు గుణపాఠముగ నుండగలదు.

కాలపరిమితిలేని ప్రౌఢవివాహమువలన హానియే కాక లాభమిసుమంతయు లేదని లవంగలత స్వీయచరిత్ర చాటుచున్నది.

ఈనవల ఎంతయు నీతిదాయకమైనది. ప్రతి సోదరీమణియు పఠింపవలసినది. ఇట్టినవలలను పాఠశాలయందు పఠనీయగ్రంథముగ నియమించుచో ఆవిదలకు ఆంగ్లభాషావిద్యాభ్యాసమును గావించినను విపత్తు వాటిల్లదు. వారు అప్రమత్తులై శీలమును సదా కాపాడుకొనుచుందురు. వక్రమార్గమును ద్రొక్కనొల్లరు.

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.

---

## నీతికథారత్నావళి

క్రౌను ౧ సైజు. పుటలు ౯౬. వెల ౧౨ అ.

గ్రంథకర్త: అనిపెద్ది జగన్నాథశాస్త్రిలుగారు, ఆంధ్రపండితులు, బోర్డుహైస్కూలు, కొవ్వూరు.

ఇందు నీతులను గరపు పదునెనిమిది కథలు గలవు. కొన్ని పౌరాణికకథలు, కొన్ని నానుడికథలు. ప్రతికథలోని నీతిని సూత్రప్రాయముగ కథాప్రారంభంబున పద్యరూపమున బొందించినారు. కథనము హృదయంగమము. రచనము నిర్దుష్టము, సుగమము. ఇది మూడునాలుగుఫారముల విద్యార్థులు చదువదగినది. పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘమువారు దీనిని పాఠ్యగ్రంథకోటిలో జేర్చినారు. ఇక పాఠశాలాధికారులు దీనిని తమపాఠశాలల విద్యార్థుల కందజేయజూడవలెను.

ఇందు కొన్ని యచ్చుతప్పులు గలవు. మరల నచ్చొత్తునపుడు దీనిని నిర్దుష్టముగ నచ్చొత్తింతురుగాక. ఈ చిన్నిపుస్తకము వెల పండ్రెండణా లగుట మిక్కిలి యన్యాయ్యము. రెండువందల పేజీలుగల డిమ్మిసైజు కార్తీకమాహాత్మ్యము వెల ఒకరూపాయమాత్రమేనట. (అట్టలోపైపు మాడుడు). అన్నిట దానిలో సగమేని లేని దీనివెలమాత్రము పండ్రెండణాలట! ఎంతవెల పెట్టినను బాఠ్యగ్రంథము గాన కొనక తప్పదని కాబోలు నింతవెల పెట్టిరి! సగమువెల తగ్గించుట న్యాయ్యము.

---

## భావతరంగములు

క్రౌను ౧ సైజు. ౧౫ పు. వెల విడిప్రతి ౧ అ.

గ్రంథకర్త: కల్లూరు అహోబలరావుగారు.

ఈగ్రంథము బళ్లారియందలి శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలలోని ద్వితీయపుష్పము. ఈ గ్రంథమాలలో సంవత్సరమునకు మూడుపుస్తకములు వెలువడుచుండును. సంవత్సరచందా బళ్లారివారికి ఒకరూపాయియు, ఇతరప్రదేశములవారికి ఒకరూపాయ నాలుగణాలును. గ్రంథకర్తచే 'ఆరుసంవత్సరముల నుండియు నప్పుడప్పుడు వ్రాసిపెట్టబడిన పద్యావళులే, యిప్పటికి 'భావతరంగములు' అను గ్రంథరూపమును దాల్చినవట. ఇం దిరువదియారు ఖండకావ్యము లున్నవి. ఈ కవి—ఎటులో యీ గ్రంథమును ప్రకటించి గ్రంథకర్త యనిపించుకొనెను గాని—మరల గ్రంథరచనమునకు మొదలిడక గ్రంథపఠనమును లెస్స గావింపవలసి యున్నాడని యీగ్రంథము తెలుపుచున్నది. మంచిపాండిత్యమును కొలంత సంపాదించి పదపడి గ్రంథకరణమునకు దొరకొనవచ్చును. ఈయూహ కుపబలకము లయిన యీ క్రింది గ్రంథోదాహృతభాగములను గననగును:

"జానకీముఖపద్మతేసెలఁగ్రోలు, తు
మ్మెదవంటివాడు; అమ్మేటివాఁడు" ప్రు. ౩.
"వెలయు సరయూనదీనీటఁ బ్రీతితోడ" ప్రు. ౭.
"భక్త లేవేళ నీకథల్ ప్రతిష్ఠలాన" ప్రు. ౯.
"పాపపుంజవిభంజ వాడిఖడ్గముగదా" ప్రు. ౧౧.
"అటుల వేంచేయుట, మున్నే" ప్రు. ౨౦.
రొటులో నాగారిఅలిసి మరునానాడుఁగా.
"మఱచిన వలపులు చివురఁగా" ప్రు. ౨౭.

ఇట్టివి ఎన్నివలసిన వన్ని కలవు పుస్తకము నిండు గ. ఈగ్రంథమాల సద్గ్రంథప్రకటనము గావించుచు చిరంజీవినియై వెలయుగాత!

---

## వివేకానందస్వామి జీవితము

(ప్రథమభాగము)

గ్రంథకర్త: బులుసు వెంకటేశ్వర్లుగారు, విలాసము, బులుసు వెంకట శ్రీరామమూర్తి గారు, కాకినాడ. డెమ్మిసైజు ౨౫౮ పుటలు. వెల రు.౧.

శ్రీ వివేకానందునిచరిత్రము 'ఆంగ్లమున ౨,౦౦౦ పుటలలో పంచఖండముల కవసరమగుకీతిని వ్రాయఁబడి నది. అందలి ముఖ్యవిషయములు గ్రహింపఁబడి, ఆంధ్రావని కనుగుణముగా నొకించుక స్వతంత్రముగా నిందు వ్రాయఁబడినది......ఇందు వివేకానందజనన మారంభమై, ప్రపంచమతమహాసభ కరుగు ప్రయత్నమువఱకు వర్ణింపఁబడినది.'

వీరారాధనపరత్వము పొంగులుదేఱుధోరణితో గ్రంథకర్త యిది చాలప్రశంసార్హముగ రచించినాడు. ఇట్టికార్యమునకు తన అర్హతనుగూడ పెక్కుతావుల ప్రకటించుకొన్నాడు.

శైలి చాల ధారాళముగను, పెద్దసమాసములు తరుచైనను, సుబోధమై అర్థవంతముగను ఉన్నది. కాని యింకను సులభశైలి వాడినచో గ్రంథము సర్వజనమునకు యోగ్యమై యొప్పును. నిజమునకు, అందందు దొరలినదోషములు సమాసమునెడ మఱక్కువ పడలినచో తొలగియుండెడివి. అఱసున్నయు తఱచు అసందర్భముగ వాడబడియున్నది. విషయమునకు భంగకరము కాని దయ్యు, భాషాభిజ్ఞులకిది అతిప్రసంగియై అడ్డువచ్చును. తక్కినభాగములుగూడ త్వరలో వెలువడుటకు ఆంధ్ర జనము తగు నాదరము చూపదగును.

---

## సర్వోదయము

క్రౌను ౧౬ సైజు; ప్రు. ౭౬. వెల రు. ౦-౨-౦.

అనువాదకుడు: బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

ఈ చిన్నిపొత్తము మానవాదర్శగ్రంథమండలి ౮-వ పుష్పము. ప్రాజ్ఞుడు, ఆంగ్లమహాకవియు నగు 'జాన్ రస్కిను' గారు రచియించిన అంటు ది లాస్టు (Unto the Last) అను గ్రంథముయొక్క సారమును శ్రీ గాంధిమహాత్ముడు తొలుత గుజరాతిభాషను వ్రాసిరి. ఆ గుజరాతిమూలమున కనువాద మిది. "నైతిక నియమపాలనమందే మానవజాతికల్యాణము కలదని యిందు సమర్థింపబడినది."

అనువాదకుని రచనానైపుణి యాంధ్రలోకమెఱుగనిది కాదు. అక్షరాస్యులగు నాంధ్రు లెల్లరు దీనిని చదివి నీతిపరులయి సర్వమానవకల్యాణమునకు దోడ్పడుదురుగాక!

---

## ౧. పశువ్రణచికిత్స

క్రౌను ౮ సైజు; ప్రు. ౮౪. వెల ౮ అ.

## ౨. పశునేత్ర చికిత్స

క్రౌను ౮ ప్రు, సైజు; ప్రు. ౬౪. వెల ౮ అ.

గ్రంథద్వయరచయిత: యేలెశ్ల శ్రీరాములు చౌదరిగారు, అంగలూరు (పోస్టు) కృష్ణాజిల్లా.

ఈరెండుగ్రంథములు పశువైద్యగ్రంథనిలయమున ద్వితీయతృతీయపుష్పములు.

వీనిలో మొదటిగ్రంథమున పశువుల వ్రణములు, వాపులు, కీళ్లనొప్పులు, గాయములు, విషప్రయోగములు, కాలుటచే నగుపుండ్లు మున్నగువాని లక్షణములు, వానిని మానుపుటకు దగునౌషధములు చేరుకొనబడినవి.

రెండవగ్రంథము మొదటిభాగమున పశుపోషణాదికమున మనదేశమునకును, విదేశములకును గల యంతరమును, పశువుల దేహనిర్మాణవిధానమును వివరించబడెను. రెండవభాగమున పశునేత్రరోగముల లక్షణములు, వానిని వారించదగు నౌషధములు చేర్కొనబడినవి.

గ్రంథకర్తకుగల శాస్త్రానుభవసాన్నుభవఫలము లీయీగ్రంథములు. ఇట్టి యమూల్యగ్రంథములను రచియించి తెలుగునాటిరైతుల కుపకార మొనరించిన గ్రంథకర్త యభినందనార్హుడు.

ఆంధ్రకర్షకబృంద మీగ్రంథములవలని ప్రయోజనమును బడసి కృతార్థ మగుమగాక!

---

మా రు తి

క్రౌను ౧ సైజు: పుటలు ౪౫. అచ్చు ముచ్చటగా నున్నది. వెల ౪ అ.

గ్రంథకర్త: మోచర్ల రామకృష్ణయ్యగారు, ప్లీడరు, నెల్లూరు.

ఇది 'మారుతీ' యను మకుటముగల వృత్తశతకము. ప్రాచీనశతకములను దలపించు నీ 'లఘుకృతి' యాంజనేయస్తుత్యాత్మకము: రచనము సంస్కృతశబ్దభూయిష్ఠమయి ప్రౌఢముగ నున్నది. శతకగ్రంథసహజము లగు శబ్దార్థముల పునఃపునరుక్తులు దీనను గలవు.

పద్యపూరణాదికమునకయి యనావశ్యకశబ్దాడంబరమును గానవచ్చెడిని, చూడుడు:

'......సమిద్విహారనిపుణ
ప్రస్ఫీతదోస్సారగ
ర్వోద్యద్దానవదుర్దశాపికునవా
లోలోర్ధ్వధ్ధతీ! ......' ప. ౨౨.

'నిరంకుశసదాశుంకీభవద్విక్రమశ్రీ' ప. ౪౦.
'పవిత్రసతీమతల్లి' ప. ౪౫.
'ఉద్ఘటమహోవాలాగ్రముల్' ప. ౬౦.
'...మరుత్స్వమప్యద మ
నోజవప్రాంచితకాంచవాద్రివి
స్ఫూర్తి మదుజ్జ్వలాకృతి!' ప. ౬౧.
'ప్రశస్తయుష్మద్వతులభ్రాజద్యశస్స్ఫూర్తి' ప. ౭౦.
'సుస్థిరయుష్మన్మహనీయధైర్యము' ప. ౭౮.
'భవదీయనిష్కళంక విస్ఫూర్జల్లసద్దివ్యరూపము' ప. ౯౭.

ఇట్టి శబ్దాడంబరము నేటికాలమున మెప్పుగాంచునది కాదు.

మఱియు నసాధారణశబ్దప్రయోగములును గలవు, చూడుడు:

'బర్హిశ్శుష్మ', 'వస్త్యము' ప. ౩౦.
'సాంపరాయిక' ప. ౩౪.
'సాంయుగీనము' ప. ౪౮.
'కారవేయులు', 'విజయనము'—ప. ౫౯.
'అరిష్టతాతి' ప. ౬౧.
'వరివస్యిత', 'శివతాతి' ప. ౬౭.
'బృందిష్ఠ' ప. ౯౦.

ఇట్టు లయ్యును పద్యములు కుంటువడక ధారాళముగా నడచుచున్నవి. మచ్చున కొకపద్యము:

ఉ. 'మాయలమారులౌ చెనటి
మానిసిడిండులతోడఁ బోరి, శో
భాయతమూర్తివై, దశర
థాత్మజునిన్ విలసన్మహాజయ
శ్రీయుతుఁ జేసినట్టి నినుఁ
జేరి యనారతముల్ భజించినన్
శ్రేయము లెన్ని లేనియును
జేకుఱకుండునటయ్య? మారుతీ!'

ఈకవి ముమ్ముందును చక్కని గ్రంథములను రచించి యాంధ్రవాణీసమారాధనము గావించుమగాక!

---

## వ్రతకోశము

(రెండవభాగము)

డెమ్మిసైజు, పుటలు ౧౭౨, వెల రు. ౧-౦-౦

ప్రకాశకులు: కనుపర్తి మార్కండేయశర్మగారు, స్వధర్మప్రకాశినీ సంపాదకులు, బృందావనము, పూనమల్లి హైరోడ్డు, కీలుపాకు, మదరాసు.

ఈ భరతఖండమున చిరకాలము నుండియు వ్రతములెన్నియో ఆచరణలో నున్నవి. వ్రతములు పుణ్యసంధాయకములు. అవి యనంతములు, పలుతెరగులు. కొన్ని కాలప్రవాహమున బడి యంతరించినను పెక్కులు ఇప్పటికిని మనవారి యాచరణయందున్నవి. ఈవ్రతములవిషయము నెరుగకయే కొందఱు వ్రతముల నాచరించుచున్నారు. విషయము నెరింగి యాచరించిన వ్రతాచరణము విశేషఫలప్రదము.

మరియు నేవ్రతము లేయేదినములందు చేయవలయునో, ఎన్ని రోజులు చేయవలయునో మొదలగు నంశములను ఎరిగియుండుట యవసరము. ఈ యంశములనే ప్రకృతగ్రంథము వివరింపజాలియున్నది. ఈ రెండవ భాగమునందు 'చైత్రాది మాసక్రమముగ ఆయాధర్మశాస్త్రగ్రంథములందు విధించిన దాదాపు ౧౬౦౦ వ్రతములు' పేర్కొనబడియున్నవి.

ప్రకాశకులు త్వరలో రెండవ భాగమును గూడ ప్రకటించి ఆస్తికుల కృతజ్ఞతకు పాత్రులగుదురుగాక!

---

## ప్రణయచాంచల్యము

శ్రీఆంధ్రప్రచారిణీగ్రంథమాల, పిఠాపురము.

గ్రంథకర్త:—శ్రీయుత వేదమల్ల రామచంద్రరావుగారు, యం. ఏ., బి. యల్., న్యాయవాది, బందరు.

డెమ్మిసైజు: పుటలు ౨౮౫. వెల ౧-౮-౧.

'ప్రణయచాంచల్యము' సాంఘిక నవల. గ్రంథకర్తగారు కొన్ని సంవత్సరముల క్రితము 'శుభాదర్శము' యను సాంఘికనవలను రచించియుండిరి.

మనోనిశ్చయము లేని యొక యాంధ్రయువకుని జీవితమే యీ 'ప్రణయచాంచల్యము' నందలి కథాంశము. కథానాయకుడగు అచ్యుతరావు, క్రైస్తవయువతి యగు మాణిక్యమ్మయొక్క పవిత్రమును, గాఢమును నగు ప్రేమను స్థైర్యముగ స్వీకరించి, యామెను పరిణయమాడక, తన తలిదండ్రుల కిష్టమగు వివాహసంబంధమునకే యియ్యకొనును. తనకు వివాహము జరిగియుండుట నా ప్రేమమయియగు క్రైస్తవబాలికకు తెలియనీయక, యామె ప్రేమను నిరాకరింపజాలనివాడై యామెను రహస్యముగ విదేశమునం దుద్వాహమగును. కొన్ని వత్సరములకు పిమ్మట నిజస్థితి నెరింగి, మాణిక్యమ్మ తన భర్త తన్న చంచలప్రేమతో ప్రేమింపవందులకు చిత్తసంక్షోభము నొంది విషాదమరణము నొందును. ఆమె మరణించిన పిమ్మట నచ్యుతరావు కొంతకాలము సన్యసించినను, చివరకు మొదటిభార్యతో నానందప్రదమగు సంసారయాత్రను ప్రారంభించును. ఈరీతిని కథ యంతము నొందుట కథానాయకునిపై నాగ్రహము కలుగజేయును. కాని, యాతని చిత్తస్థైర్యశూన్యతయే యిందును నవగతంబై, వెనుకటి యాతని జీవితమునకు సరిపోయియే యున్నది.

ఈనవలయందలి కథ మనోరంజకమై, గ్రంథకర్తగారి ప్రపంచానుభవమును చక్కగ ప్రదర్శింపుచున్నది. భాషాశైలి చక్కగ నున్నది. వర్ణనాదులు ప్రశంసనీయములు. కథ ఆంధ్రదేశమును, పంజాబును రంగస్థలముగ గలిగియున్నది.

స. చం. శా.

---

## వావిళ్ల వాచకపుస్తకము

(ఏడవతరగతి)

క్రౌను ౧ సైజు; పుటలు ౧౫౮. వెల రు. ౦-౬-౦.

గ్రంథకర్త: జయంతి గంగన్న పంతులుగారు, బి.ఏ., బి.యల్.

ఈవాచకసంచయ ముత్తమశ్రేణికి జెందినదని యీవరకే చెప్పఁబడెను. కావున దీని గుణములను గూర్చి ప్రత్యేకించి చెప్పవలసినది లేదు. కాని రచనము కొంత శిథిలముగ నున్నది. తరగతికి జాలినది కాదు. ఇందలి "'గ్రహమండలము', 'కాగితము', 'ముద్రాయంత్రము', 'ఆవిరియంత్రము' అనుపాఠములు మ-రా-శ్రీ, శేరం వేంకటాచలపతిగారు వ్రాసియిచ్చిరి." అని పీఠిక యందు గలదు. ఆపాఠములు చదువ పెక్కుసందేహములు గలుగుచున్నవి. విషయము సరిగా నున్నట్లు కానరాదు. ఉదా:

"నీళ్లయనుగున హిమవచ్ఛిలలేర్పడుచుండును." పు. 18.

'జంగమహిమవచ్ఛిలములు.' పు. 19.

హిమవచ్ఛిలలు అనగా 'మంచుకలరాళ్లు' అని అర్థము. ఇక్కడ హిమము పేరి గడ్డలుకట్టి శిలలవలె నగు నను నర్థము కావలెను.

'రసశాస్త్రపారీణులు' పు. 48.

రసాయనశాస్త్రపారీణు లనవలయును.

'పుస్తకపత్రసమపరిమితములుగా ముక్కలు చేయుదురు' పు. 50.

ఎన్నియో సైజుల పుస్తకములు కలవుకదా! ఏ సైజుపుస్తకములని యిక్కడ అర్థము?

'గదుల పెట్టెలయందలి సీసపుముక్కలపైఁ జెక్కఁబడియున్న యక్షరములు దీసి' పు. 63.

'అక్షరములు చెక్కబడియున్న సీసపుముక్కలను దీసి' అని యుండవలెను.

"పుస్తకపత్రపరిమితు లనేకప్రమాణములై యుండును. పూర్ణచ్ఛదము 13½ × 17 అంగుళము లున్నచో నది వ్రాతకాగితము (Foolscap) నకు సమానముగా నుండును; 15 × 20 అంగుళము లున్న నది వాచక (Crown) ప్రమాణము; 17½ × 22½ అంగుళము లున్న నది మధ్యము (Demy) ప్రమాణము. ఒక్కొకటావు మూఁడుమారులు నడిమికి మడతలు పెట్టిన యెనిమిది పత్రములు, బదునాఱు పేజిలును వచ్చును. పదునాఱు పేజిలుగలసి యొకఖండ (Forme) మగును. ప్రతిఖండారంభమునను ఖండసంఖ్య ముద్రింపఁబడియుండును. దీని వలన నట్ట కట్టువారికి పని సులభమగును." పు. 64.

ఈ పేరా మరియు గోలగా నున్నది.

పునర్ముద్రణమున శైలియు, ఈ పాఠములును సంస్కరింపబడునుగాక!

---

### భారతేతిహాసములు

ఒకటవ భాగము, క్రౌను ౮ సైజు; పు. ౮౪.

వెల రు. ౦-౮-౦.

రచయిత్రి: శ్రీమతి జూలూరి తులశమ్మగారు, శ్రీ పిఠాపురము మహారాణివారి గోషాస్కూలు ఉపాధ్యాయ. అవక్రీతుడు, ఉదంకుడు, గరుత్మంతుడు, జరత్కారుడు, కపోతము, నాడీజంఘుడు అను నారు భారతకథ లిందు గలవు. కథనము, రచనము సరసముగ నున్నది. దీనికి ఎనిమిదణాలు వెల అధికము.

---

### సుబోధరామచరితమ్

రాయల్ ౧౬ పుటల సైజు, పు. ౫౬. వెల ౬ అ.

సంస్కృతశ్లోకాత్మక మగు నీ చిన్నిపొత్తము మైనారువాసి వైద్యనాథశాస్త్రిగారి దుహిత శ్రీమతి బాలాంబికచే రచితము. ఈమె బాల్యముండే మాతాపితరుల యనుగ్రహమున సంస్కృతవిద్య నభ్యసించి తత్ఫలితముగ పవిత్రమగు రామచరితము నిర్విఘ్నమున రచింపజాలినది. శైలి సరళము. భావ నిర్దుష్టము. గ్రంథమునకు శ్రీ మహామహోపాధ్యాయ, కుప్పుస్వామి శాస్త్రిగారి తొలిపలుకు గలదు.

పుస్తకములుదొరకుచోటు:—వి. శివరాజుఅయ్యర్, 'శ్రీకంఠవిలాస్' మనక్కాల్, లాల్గుడి పోస్టు, (తిరుచినాపల్లి).

---

## FLUTE TUNES

## ఫ్లూట్ ట్యూన్స్

గ్రంథకర్త: వి. యస్. ధూమకేతు గారు. ప్రకాశకులు: ది ఆనంద ఎకాడెమీ, మచిలీపట్టణము. క్రౌను సైజు ౪౩ పుటలు. వెల రు. ౧.

ఇంతకు మున్ను 'సిలుఎత్స్' (*Silhouttes*), 'మూన్ బీమ్స్' (***Moon Beams***) అను ఆంగ్లకావ్య సంపుటములు రచించి యీకవి భారతమునందే కాక విదేశములందును మెప్పు దెచ్చుకొనెను. ఈ సంపుటమందలి 'The Songseller' అను కావ్యము లండను, మైతర్ ప్రెస్‌వారి 'అంతర్జాతీయ కవితాభండారమున ప్రశస్త కావ్యములలో చేర్చుకోబడ్డది. ఈసంపుటమున ఈయన కళాచాతుర్యము పూర్వమునకంటె పురోగతి చూపుచున్నది. అందమగు భావనకు ఉచితమగు ఇంపగు పదాల కూర్పు ఈ కవిత కొక లక్షణము. నిజమునకు సాధారణభావములు సహా రచనామార్దవమున సురక్షితము లగుచున్నవి. ఇందు 'చల్ మోహనరంగ' అను పాటకపు పాటకును, నాలుగు త్యాగరాజకీర్తనలకును కావించిన తర్జుమా సహజరచనవలె నొప్పుచున్నది. 'ది స్ప్రింగ్', 'ది కాన్‌ట్రాస్ట్' మున్నగు కావ్యములు సవిలాసములగు పాటలు. 'ది చాలెంజ్', 'గార్డన్' మున్నగునవి కవి మనసులోతులను వివరించుచు మెచ్చదగియున్నవి.

'The Wizard wind-babies...

..............................

Harp within the vineyard of memory's ward
The limerick of a long-forgotten love
And gift to errant-fancy its pinions of fire!'

* * *

'—*Naver lay the rapture down* —

..............................

Cease not song-bird, thy glowing carol—
Some-where, perhaps in the muse's grove
Some radiant rose of beauty wakes to life!'

* * *

'A crawling worm trod
Is sacrilege to God!'

* * *

'Why dost thou life's guerdon seek
When life itself remains unlived!

..............................

Pursue it thou with pilgrim step!

..............................

One tinkling touch of time
Showers glory's golden sheaves on thee—
For life is a lovely lyric sung
By the celestial piper with hush and swell!'

ఇట్టివి కవి మనసు చివురింపులకును, చెయిమగ్గురింపులకును నిదర్శనము లగుచుండ, ఎద కదలించు 'హంపిశిథిలములు'వంటి విషయము ఊయింపులకు సులభముగ లొంగనిదై ఒక పరిమితత్వమును చూప పాల్పడినది. ఈ కవితయందు Alliteration (యమకము) అను అలంకారము ఎక్కువగౌరవమున వర్తించినది. కాని యిట్టివి విన్నుమై నిలువక, జయాపజయముగ వభివృద్ధి చేపడుట నిశ్చయమని ఈ ఉత్సాహికి గల సంస్కారమును, సామగ్రియు వెల్లడించును.

కొం. జ.

---

## ఆంధ్రవైద్యసమ్మేళనపత్రిక

## దశమవార్షిక సంచిక (?)

క్రౌను ౪ సైజు; పుటలు ౧౩౭. వెల చందాదారులకు: రు. ౦-౧౦-౦, ఇతరులకు: రు. ౧-౦-౦.

సంపాదకుడు: వేటూరి శంకరశాస్త్రి గారు, ఏ. యం. ఏ. సి., ముక్త్యాల, కృష్ణాజిల్లా.

'ఆంధ్రవైద్యమండలి' పదియేండ్లనుండి ప్రకటించుచున్న 'ఆంధ్రవైద్యసమ్మేళనపత్రిక' దాశవార్షిక సంచిక యిది.

ఆంగ్లవైద్యవిద్యావ్యాపనమువలన నాంధ్రదేశమున నాయుర్వేదముయొక్క ప్రఖ్యాతిప్రయోజనములు క్రమముగా తరుగజొచ్చినవి. శ్రీమాన్ పండిత దీక్షిత గోపాలాచార్యులుగారట్టి యాయుర్వేదమును పునరుజ్జీవింప గావించిన మహత్తరప్రయత్నము లనంతములు. తదాది నాయుర్వేదాభిమానులును పలువు రడతెగనికృషి సలిపిరి. ఏతత్ఫలముగ వైద్యవిద్యాలయములు పెక్కు లాంధ్రదేశమున నెలకొనినవి. వందలకొలది జనులు వైద్యవిద్యను బడసి వైద్యులగుచున్నారు. 'సర్వము నాంగ్లము' గాగోరు ప్రభుత్వమువారు తొలుత నాయుర్వేదమును ద్వేషించినను తరువాత దేశీయుల నిర్బంధమును పురస్కరించుకొని చెన్నపురమున నొక వైద్యపాఠశాలను, నచ్చటచ్చట కొన్ని వైద్యాలయములను స్థాపించినారు. ఆయుర్వేదముతోపా టాంగ్లవైద్యపద్ధతులు పాఠశాలయందు బోధింపబడుచున్నవి. ఇది సవతితల్లిప్రేమ* కాని, సొంతతల్లి ప్రేమకాదు. ఎటులయిన నేమి? ఆయుర్వేదము నేడు మరల వైద్యవిజ్ఞానము నొందురులకు దెలుపుకొనజాలుదురు. తలయెత్తుచున్నది. ఆయుర్వేదవైద్యులు నొకింత పరువు ప్రతిష్ఠలను గాంచుచున్నారు. కాని కావలసినదానిలో శతాంశము కాలేదు. కావున దేశీయులు, ప్రభుత్వమువారు నీయాయుర్వేదమునెడ సత్యంతాదరాభిమానములు గలిగి తగిన సాహాయ్యము నొసరించి దీనిని చక్కగా వ్యాపింపజేయవలసి యున్నారు.

వైద్యపత్రికలును ఆయుర్వేదప్రచారమునకు దోడుపడును. వానిమూలమున వివిధప్రాంతముల వైద్యవిద్వాంసులు తాము ప్రత్యేకము గడించుకొను కావున పదేండ్లనుండి ప్రకటితమగుచున్న 'ఆంధ్రవైద్య సమ్మేళన' పత్రికవలన నిట్టిప్రయోజనము సమకూరియుండునని వేరుగ చెప్ప బనిలేదు. ఈదాశవార్షిక సంచికయు నట్టిప్రయోజనమునే సమకూర్పగలదు.

ఈసంచికయం దనుభవజ్ఞులగు వైద్యవిద్యాధికులు రచియించిన యమూల్యవ్యాసములు పెక్కుగలవు. 'ఆంధ్ర వైద్యమండలిచరిత్ర' మండలిప్రారంభమునుండి గాంచిన

---

* ఈ పాఠశాలనుగూర్చి యిట్లు తెలియవచ్చుచున్నది: ఈ పాఠశాలయందు రానురాను ఆయుర్వేదమునకు ప్రాముఖ్యము తొరవడుచున్నది. ఆంగ్ల వైద్యవిధానములను నేర్పుటయందే యనుదినము నయిదింట మూడుపంతుల కాలము వ్యయ మగుచున్నది. చరక సుశ్రుతాదిగ్రంథములు పాఠ్యగ్రంథములు గాకపోయినవి. నిదానగ్రంథమున జ్వరనిదానము మాత్రమే నేర్పబడుచున్నది. పాఠము లాంగ్లమున బోధింపబడుచున్నవి. ఔషధముల చేయుపద్ధతుల నేర్పి విద్యార్థులచేత నౌషధములు చేయించుటలేదు. నాలుగు సంవత్సరము లభ్యాసము, ఒక సంవత్సర మాచరణము; క్రమముగ నీ రైదేండ్లు విజయము గన్నవారికి L. I. M. పట్ట మొసగబడుచున్నది. వీరి కిటు లాయుర్వేదమునను, అటు లాంగ్లవైద్యమునను పరిపూర్ణమైన సామర్థ్య ముండదు. వీరు రోగములను సరిగ గుర్తింపజాలరు. రోగములకు దగిన మందులను నిశ్చయింపజాలరు. మందులను స్వయముగ చేసికొనజాలరు. వీరికే ప్రభుత్వవైద్యాలయములయందును, స్థానిక వైద్యాలయములయందును నుద్యోగము లీవలెను. కాని, ఇతర దేశీయవైద్యశాలలయందు వైద్యమును చక్కగా నభ్యసించి సామర్థ్యమును గడించి పట్టభద్రు లయినవారికి ఈయబడవు. వారు పనికిరానివారు. ఇట్టిస్థితుల నిక నీ పాఠశాలలు క్రమముగ నంతరింపగలవను భీతి గలుగకమానదు. దేశీయు లను నాయుర్వేదాభిమానులు పెక్కు సంవత్సరములకాలమునుండి యాయుర్వేదాభివృద్ధికొరకయి కావించిన ప్రయత్నము లన్నియు విఫలము లగును. అంత నాయుర్వేదమునకు మున్నటి దుస్థితి ప్రాప్తించగలదు.—ఇది సవతితల్లిప్రేమ కాక ఏ మగును?

కావున నాయుర్వేదాభిమానులు, ఆయుర్వేదపాఠశాలల యధిపతులు, వైద్యవిద్వాంసులు మున్నగువారాయుర్వేదమునకు రానున్న యీదుస్థితి తొలగుటకు దగిన సంస్కరణములను ప్రభుత్వమువారికి సూచించి, ఆ సంస్కరణముల నాచరణమునకు దెప్పించుటకయి గట్టి ప్రయత్నములు సలుపవలసియున్నారు. ఇప్పటికే ఈవిషయమున 'మద్రాసు ఆయుర్వేదసభ'వారు నడుము గట్టి ప్రయత్నించుచున్నా రని తెలియవచ్చుచున్నది. ఇది శుభసూచకము.

క్రమాభివృద్ధిని తెలుపును. 'మధువు', 'సాంక్రామిక రోగములు', 'అశోక ద్రవ్యగుణము', 'అశోకము - నర మామిడి' అనువ్యాసములు వ్యాసకర్తల యమూల్యపరిశోధనములకు నిదర్శనములయి రోగముల తత్త్వమును, వస్తువులతత్త్వమును చక్కగ దెలుపుచున్నవి. 'ఆయుర్వేదాంగశారీరము' తద్వైశిష్ట్యమును చాటుచున్నది. 'మహాఫలితానుభూతచికిత్సలు' అనువ్యాసము ప్రజాసామాన్యము స్వయముగ చేసికొని యుపయోగింపదగిన యౌషధయోగములను వివరించుచున్నది. ఈయోగములు వ్యాసకర్త్రీమతిఅనుభవసిద్ధము లని వ్యాసవాక్యమే తెలుపుచున్నది. 'ద్వితీయవాగ్భటుడు', 'భారతఖండము వైద్యమునకు పుట్టినిల్లు' అను ననువాదవ్యాసములు, 'వైద్య శాసనములు' అనువ్యాసము వైద్యవాఙ్మయచరిత్రను, ప్రాశస్త్యమును చాటుచున్నవి. వైద్యశాస్త్రమునకు సంబంధించినవ్యాసములు మఱికొన్నియు గలవు. 'ఆయుర్వేదవైద్యపట్టభద్రులు': ఇందు ఆంధ్రదేశము నందు వివిధవైద్యసంస్థలలో వైద్యశిక్షణమును బడసి, కృతార్థులై వైద్యవృత్తియందు చరించెడివారి పట్టిక ౧౯౦౫-వ సంవత్సరము మొదలుకొని గలదు. వీరు రమారమి యిప్పటికి మూడువందలకు మించియుందురు. ఈసంఖ్య తక్కువే అయినను సత్వరాభివృద్ధి నందునను నాశ గలదు.

'ధన్వంతరి' త్రివర్ణచిత్ర మీసంచికకు ముఖాలంకారము. శ్రీ వైద్యరత్న, పండిత, డి. గోపాలాచార్యులవారి త్రివర్ణచిత్రము సంచిక కపూర్వశోభను గలిగించుచున్నది. ఇక వైద్యశిఖామణులయు, వైద్యవిద్యాభిమానులయు, వైద్యవిద్యాపోషకులయు, వైద్యాలయములయు చిత్రములు, ఏకవర్ణకములు, పెక్కుగలవు.

'నివేదనము'న సంపాదకులు ఔషధనిర్మాణవిషయమునుగూర్చి యిట్లు నుడివిరి :

"ఆంధ్రదేశమున ఆయుర్వేదౌషధ విక్రయశాలలు త్వరితముగా నభివృద్ధిజెందుచున్నవి. ఇట్టివి అభివృద్ధి నొందినకొలది మోసపుమందులు రొక్కునుచున్నవి. ఈ అభివృద్ధి మంచికో, చెడుకో చెప్ప వీలు లేకున్నది. ఆయుర్వేదౌషధముల విషయమున నూతనముగా తయారయినచ్చు దేశీయవైద్యులు అనుసరింపరాని ఒక పద్ధతిని పాటించుచున్నారు. పాశ్చాత్య వ్యామోహ పీడితులై, తాము స్వయముగా నౌషధములు తయారుచేసుకోజాలక ఒకవేళ చేసుకోగలిగినను అట్టిపని గౌరవహీనముగా దలంచి ఔషధములకొరకు విక్రయశాలలకు పరుగులెత్తుచున్నారు. ఇట్టిపద్ధతి ఆర్థికముగగూడ వైద్యునకే నష్టము గలిగించుచున్నది. ప్రతిదేశీయవైద్యుడును తాను స్వయముగా సాధ్యమైనంతవరకు ఔషధములను నిర్దుష్టముగా తయారుచేసుకోవలెను. తనవల్ల సులభముగా తయారు కాజాలని యౌషధములకే విక్రయశాలలకు ఆర్డర్లు ఇయ్యవలెను. స్థానికసంఘములు, యిట్టిపద్ధతిని యికముందు ప్రోత్సహింపరాదు."

మఱియు ఆరోగ్యప్రచారమును గూర్చి యిట్లు నుడివిరి :

"ముఖ్యముగా ఆరోగ్యప్రచారము విరివిగా సాగవలయును. రోగము వచ్చినతరువాత చికిత్సించుటయే వైద్యునియొక్క పనిగా దలంపరాదు. వ్యాధి నివారణోపాయములు, మనశాస్త్రపద్ధతి ననుసరించి రొక్కువగా ప్రజలకు బోధించి వానిని అనుసరించునట్లు చేయవలసిన బాధ్యత ఆయుర్వేదజ్ఞులందు గలదు. ఈ విషయమై 'నాసందేశము' అను శీర్షికను శ్రీమ గ్రత్న, ఆచంట లక్ష్మీపతిగారు వైద్యులకర్తవ్యమును బోధించియున్నారు."

ఈ సదుపదేశముల నాంధ్రదేశీయవైద్యు లెల్లరు నాచరణలోనికి దెచ్చుకొనవలెను.

వైద్యవిద్యాభివృద్ధియందుగల యభినివేశమును పురస్కరించికొని వ్యయప్రయాసముల కోర్చి యీ సంచికను ప్రకటించిన మండలివారికి ధన్యవాదములు.

ఇందొక పెద్దలోపము, చాల వ్యాసములలో తప్పులు విపరీతముగా నిలిచినవి. 'నాపరోక్షమున ముద్రణము జరుగవలసివచ్చుటచేత, ప్రూఫులు దిద్దనే కుదిరినది కాదు. ఇం దనేకలోపము లుండవచ్చును. [ఏల?—ఉన్నవి] ప్రాజ్ఞులు సరిపరుచుకొందురు గాక'

అని సంపాదకులు సెలవిచ్చినారు. వైద్యవిషయము నిర్దుష్టము కాకున్న నపాయకరము కాదా! కావున నిర్దుష్టముగ నుండ జూడవలసిన బాధ్యత సంపాదకులకు గలదు.

---

## సమదర్శిని

### ప్రజోత్పత్తి యుగాదిసంచిక

క్రౌను ౮ సైజు; పు. ౧౩౦. వెల చందాదారులకు రు. ౧-౦-౦. ఇతరులకు రు. ౧-౮-౦.

సంపాదకులు: శ్రీయుత రావుసాహేబు పింజల సుబ్రహ్మణ్యము శెట్టిగారు, యం. యల్. సి. ఇది సమదర్శిని ప్రకటించుకొనిన నాలవయుగాదిసంచిక. సంచిక సుందరముగ నున్నది. ప్రస్తావన హాస్య మయ్యును వివిధవిషయసంగ్రహమయి భావసంపదను, రచనాసౌందర్యమునను ఒప్పారి పఠనయోగ్యముగ నున్నది. ఇందు విద్యాధికులను నాంధ్రమహాశయులు చిన గద్య పద్య వ్యాసములు పెక్కు గలవు.

వానియందు 'కవిరాజుగీతాలు' ఆనాటి తెలుగు వారల తెగువతనము నుద్ఘోషించుచు తెలుగునాటి నేటి యువతీ యువకుల యుల్లముల నుత్సాహమును జనియింపజేయునవి.

'రౌండుటేబిల్ సమావేశము' అను వ్యాసమున రాజ్యాధికారము హైందవప్రజాయత్తమగుటకు పూర్వము భద్రపరచుకొనవలసిన కొన్ని ఆర్థికసంబంధము లయిన కట్టుదిట్టములను గూర్చి చర్చింపబడెను. వర్తకము, మారకపుకేటు, ప్రభుత్వఋణము మున్నగువాని విషయమున నాకట్టుదిట్టములు. ఇవి ఇండియాకు లాభకారులు కానంతవరకు మొగమోటమి లేక సంస్కరణములను నిరాకరించవలెనని వ్యాసకర్త హెచ్చరించుచున్నారు.

'రాజ్యాంగసంస్కరణములు' అను వ్యాసము సంస్కరణము లెట్టు లుండిన లాభకరములు అను విషయమును సంగ్రహముగ వివరించుచున్నది.

'ఖద్దరు' వ్యాసకర్త ఇందు ఖద్దరు నుపయోగించుటవలన భారతదేశమునకు గలుగు లాభపరంపరలను సప్రమాణముగా నచ్చునట్లు చెప్పినారు. దీని ననుసరించి దేశీయులు ఖద్దరునే ధరించి సత్వరస్వరాజ్యప్రాప్తికి తోడ్పడగలుగుదురు.

'సప్తర్షి మండలము-పూర్వఫల్గుని' విష్ణుపురాణమున కల్యాదియందు మఘానక్షత్రమున నున్నట్లు పేర్కొనబడిన సప్తర్షి మండల మిప్పుడు పూర్వఫల్గునీ నక్షత్రమున నుండుటను సప్రమాణముగ ధ్రువపరచుచున్నది.

'దీపావళి' భావగర్భితమగు గేయరచనము.

'విజయవిలాస విమర్శనము' ప్రాచీనపద్ధతి ననుసరించి కొట్టిన పిండిని దంచినట్టు లున్నది.

'అకాలవర్షము' అనువాద మయ్యు స్వతంత్ర రచన ననిపించుచు సుందరముగ నున్నది.

'రామమోహనరాయలవారు విగ్రహారాధకులు గారా!' అను వ్యాసము రామమోహనరాయలు విగ్రహారాధకులే యని సహేతుకముగ నిరూపించుచున్నది.

'నాలుగునాటకాంగములు' కవి, పరిషత్తు, ఇతివృత్తము, నటకులు అనునవి యా నాలుగంగములనియు, అందు నేటిపరిషత్తు (ప్రేక్షకులు) నాటకకళావినాశనమునకు గారణ మగుచున్నదనియు వ్యాసకర్త యభిప్రాయము. ఇది సత్యము. ఈ లోపము తీరనంతవరకు నాటకకళ యభివృద్ధి నందజాలదు.

ఇట్లు స్థాలీపులాకన్యాయము ననుసరించి కొన్ని మాత్ర మిట పేర్కొనబడినవి. ఇవియు, ఇంకను నీసంచికయందుగల వ్యాసములును ఆంధ్రుల విజ్ఞానసంపద్వికాసమునకు నిదర్శనము లయి పాఠకులకు విజ్ఞానాభివృద్ధిని గావింపగలవు.

ఈసంచికయందలి నాలుగు త్రివర్ణచిత్రములలో మహాత్మునిచిత్రము, 'ప్రణయపరిరంభము' పేర్కొనదగినవి. మఱియు కొందరు బ్రాహ్మణేతర నాయకులయు, కొందరు మొదటి-రౌండుటేబిలు-సభా ప్రతినిధు

లయు, కొందరు వ్యాసకర్తలయు ఏకవర్ణచిత్రములు పరిమితసంఖ్యాకములు గలవు.

సమదర్శిని ప్రకటించిన నాలుగుసంచికలు నొకదానికన్న నింకొకటి మిన్నగ నుండుట యెన్నదగినది.

---

పూ ల గు త్తి

త్రైమాసికపత్రిక. ఇది మొట్టమొదటి సంచిక: ఆగష్టు, '౩౧.

సంపాదకులు: పూండిపెద్ది వెంకటరమణయ్యగారు, రాజాం, విశాఖపట్టంజిల్లా. పత్రికసైజు డబిల్ క్రౌను. సం. చందా రూ. ౨. విడిసంచిక అ. ౮. ఈసంచికయందు ౭౬ పుటలు గలవు. పైదరుపేటు కాగితము. పొందిక బాగున్నది. ఇందలి ౧౫ వ్యాసములును సంపాదకులు వ్రాసినవే. రచన యందు రుచియున్నను, ఆద్యంతము నొక్కరిదే యగుటవలన, ఎంతరకరకము లున్నను, నవనవాభిలాషము నిలుపుట కష్టము. రచయిత దేశము నభిమానమును చూచుకొన్నవా డైనచో, ఆయన రచనల సంపుటముగా ఇది ఆదరము పడయ వచ్చును; కాని పత్రికగా జయ మొందుటకు పలువుర రచనలు—వ్యాసముల విషయమునకే కాని రచయితల విషయమునను రకము మార్చి—ప్రకటించుచు, దేశము ప్రతిభను ప్రతిబింబింపజేయుట ఆవశ్యకము. ఆవశ్యకము లయ్యు, మంచిపత్రిక లరుదైన యీకాలమున, ఇంత అందమగు ప్రయత్నము ఈతగుపద్ధతుల నడచిన, దేశమున కింకను గొప్ప సంపద యగును.

ఇందు రమ్యములగు పద్యములు, పాటలు, కథలు మున్నగునవి కలవు. ప్రకృతిప్రేమ, మంజులశైలి, లలితభావన వీరిరచనయందు కానవగును.

ఈక్రొత్తపత్రిక సర్వజనసమాదృతమై తప్పక వర్ధిల్లదగును.

---

గ్రంథస్వీకారము

మణిద్వీపము

(ఆంధ్రతాత్పర్యసహితము)

డెమ్మి, పుటలు ౧౪౫, వెల రు ౩.

కర్త:—జమ్ములమడక సూర్యనారాయణశాస్త్రి గారు.

ప్రకాశకులు—లలితా గ్రంథమాల, రామారావుపేట, కాకినాడ.

---

హరిశ్చంద్రోపాఖ్యానము

(మూడాశ్వాసముల పద్యకావ్యము)

డెమ్మి, పుటలు ౧౧౬, వెల తెలియదు.

రచయిత:—కవిసింహ, పోకూరి కాశీపతిగారు, బోదిలవీడు (గుంటూరు).

---

సునీతిశతకము

(ఆదిలక్ష్మీమహారాజ్ఞీయము)

డెమ్మి, పుటలు ౨౪, వెల తెలియదు. పై వారే దీనికిని రచయిత.

---

శివలీల

(అయిదంకముల నాటకము)

డెమ్మిసైజు, పుటలు ౧౧౧. వెల రు ౧.

కర్త:—కవితావినోద, నిడుమర్తి ఈశ్వరప్పగారు, బి. ఏ., శ్రీకాకుళం (గంజాం).

---

కాశీసారము

జగద్గురు శంకరభగవత్పాదాచార్యకృతి కనువాదము.

డెమ్మిసైజు, పుటలు ౧౬, వెల ౦-౩-౦.

అనువాదకుడు: మక్కపాటి వేంకటరత్నకవి గారు, అనమనమూరు అగ్రహారం, ఒంగోలుతాలూకా.

---

### శ్రీసరస్వతీశతకము

క్రౌను ౧౬ పుటలసైజు, పుటలు ౬౩, వెల రెండణాలు.

రచయిత్రి:—చేబ్రోలు సరస్వతీదేవిగారు, గవర్నర్ (రాజభవనము), మిార్జాపురముఎస్టేటు, నూజవీడు.

---

### రఘునాథ్

(అయిదంకముల నాటకము)

క్రౌనుసైజు, పుటలు ౧౨౬. వెల రు ౧.

కర్త:—ఊటుకూరు సత్యనారాయణరావుగారు.

ప్రకాశకులు:— సారస్వతచంద్రికా గ్రంథమాల, ఆగ్లపాడు, గంపలగూడెం పోస్టు (కృష్ణా).

---

### ౧. ప్రతిబింబములు (కథానకములు)

క్రౌను, పుటలు ౨౧౦. వెల రు ౧.

### ౨. ఏకోదరులు (నవల)

క్రౌను, పుటలు ౧౧౦. వెల ౦-౮-౦. రెంటికిని కర్త: ముక్కపాటి నరసింహశాస్త్రిగారు, పిఠాపురము.

---

### దశకుమారచరితమ్

(పూర్వపీఠికా మాత్రమ్)

పదదీపికావ్యాఖ్యాన, ఆంగ్లానువాద, వివరణ సహితము. క్రౌనుసైజులో ౮+౬౮+౫౧+౪౫ పుటలు. వెల తెలియదు.

ప్రకాశకులు:—వి. రామస్వామిశాస్త్రిలు అండు సన్సు, ౨౮౨, ఎస్ప్లనేడు, చెన్నపురి.

---

### సంస్కృతం ఉన్మత్తరాఘవము

(భాస్కరకృతికి తెనుగు)

క్రౌనుసైజు, పుటలు ౨౮, వెల నాలుగణాలు.

అనువాదకుడు :— ఆకిలి శ్రీరామశర్మ గారు, ముత్తుకూరు (నెల్లూరు).

---

### Our duties to the Hindu Widows

(హిందూ వితంతువులపట్ల మనవిధులు)

కర్త: 'ది క్రిస్టాన్' ('సన్యాసి'). ప్రకాశకులు: సరస్వతీసంఘము, ౨౮, పిడారియారుకోవెలవీథి, జి. టి. మద్రాసు. క్రౌను: ౩౨ పుటలు. వెల ౧. అ.

---

### Thy self thy Doctor

(Medical Science Simplified)

గ్రంథకర్త. ప్రకాశకులు పైవారే.

క్రౌను, పుటలు ౧౦౪, వెల ౦-౮-౦.

---

### కల్యాణి (మాసపత్రిక)

మొదటి సంచిక: శ్రావణము. రాయల్ సైజు. ఈ సంచిక ౩౨ పుటలు. సంవత్సరచందా రు. ౨-౦-౦. సంపాదకులు, ప్రకాశకులు:— గంటి-సూర్యనారాయణశాస్త్రిగారు, తపాలా పెట్టె నెం ౧౧౦, మదరాసు.

---

### ఆంధ్రప్రభ

(క్రొత్త తెలుగు మాసపత్రిక)

మొదటి రెండుసంచికలు వెలువడినవి. డెమ్మిసైజు; సంచిక ఒకటికి దాదాపు ౩౦ పుటలు గలవు. సంవత్సరపు చందా ఒకరూపాయ.

సంపాదకులు: మద్దూరి శ్రీరామమూర్తిగారు, సూర్యారావుపేట, కాకినాడ.

---

### స్వదేశి

క్రొత్తమాసపత్రిక: మొట్టమొదటి సంచిక: ఆగస్టు '౩౧.

సంపాదకులు: మద్దూరి శ్రీరామశాస్త్రిగారు, రాజమండ్రి. డబల్ డెమ్మిసైజు: (ఈసంచిక) ౧౨ పుటలు. సం. చందా: రు. ౧-౮-౦. విడిపత్రిక అ. ౨. ఇది ఇంకను సంస్కృతిగల పద్ధతులపై నడపిన బాగుండును.

---

### హిందూతియులాజికల్ హైస్కూలు పత్రిక

### చెన్నపురి (జూలై సంచిక)

మూడుమాసముల కొకసారి వెలువడు పత్రిక. వ్యాసములు ఇంగ్లీషు, తెలుగు, అరవము — మూడు భాషలలో కలవు.

# సాభిప్రాయ విశేషములు

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే.

ప్రపంచప్రవృత్తియం దన్నిసందర్భములం దును మహాసంరంభము ప్రవర్ధమానం బగుచు ప్రపంచపరిస్థితులు భయసంభ్రమములను గలుగఁజేయుచున్నవి. మతములు మాయ మగుచున్నవి; రాజ్యాంగములు భగ్నము లగుచున్నవి; సాంఘికవ్యవస్థలు సన్నగిలుచున్నవి; ఆర్థికసిద్ధాంతములు తారు మారగుచున్నవి; వృత్తులు మారుచున్నవి; సకల పరిశ్రమలును నవీనలక్ష్యమును నభిలషించుచున్నవి. ప్రపంచప్రవృత్తియందు చిరకాలము ప్రతిష్ఠను బడసిన బలదేవతకును, ధనదేవతకును, జ్ఞానదేవతకును పదచ్యుతి గలుగఁజేసి మానవత్వమును ప్రతిష్ఠించుటకు విశ్వమునం దంతటను ధర్మసంరంభము ప్రవర్ధమానం బగుచున్నది. ప్రపంచవ్యాప్తమైన ధర్మసంరంభమునందు ధర్మసంస్థాపనమునకు ధర్మలక్ష్యమును, ధర్మనిరీక్షణమును, ధర్మసాధనమును నిర్ణయించుటయును, నిరూపించుటయును దుఃఖభూయిష్ఠమును, దురారాధ్యమును, దుర్లభమును నగుచున్నది.

* * * *

జీవయాత్రకు ఫలమైన సుఖప్రాప్తి కాదికాలమునుండియును ధర్మసంరంభము ప్రవర్ధమానం బగుచు సాధనసాధ్యంబులు దేశకాలపాత్రానురూపముగను పరిణామమును బొందుచున్నవి. సుసాధన కాధారరహితములైన సాధనములు, సాధ్యములు మానవధర్మసంస్థాపనమునకు నిరర్థకము లగుచున్నవి. జీవయాత్రయందు పురుషార్థమునకు, పరమార్థమైన శాంతికి బదులు సంరంభము, పరార్థమునకు బదులు స్వార్థము, త్యాగమునకు బదులు భోగము, ప్రేమకు బదులు ద్వేషము, సాహచర్యమునకు బదులు వైరము, పర్యాప్తములై ధర్మారాధనము దురారాధ్యమగుచున్నది. ప్రపంచవ్యాప్తమైన వైవిధీభావమును సమన్వయము చేయుటకు మహర్షులు, మతస్థాపకులు, కవులు, గాయకులు, ధీరులు, వీరులు, భక్తులు, యోగులు, జ్ఞానులు, కార్మికులు, తత్త్వజ్ఞులు నిర్ణయించిన సాధనసాధ్యములు పూర్ణయోగస్వరూపమును దాల్చవలసిన పరిస్థితులు వర్తమానసంధిసమయమునం దాసన్నములై నవయుగనిర్మా

ణము నభిలషించుచున్నవి. మహానుభావులు వ్యక్తుల మోక్షమునకై నిర్ణయించిన సాధన సాధ్యములను జాతుల మోక్షమునకును మానవకల్యాణమునకును వినియోగించుటకు వివిధజాతులును విశ్వప్రయత్నములను జేయుచున్నవిధమును ప్రపంచపరిస్థితులు సర్వత్ర విశదము చేయుచున్నవి. స్వార్థపరాయణులకు విశ్వవ్యాప్తమైన మహాపరివర్తనము భయసంభ్రమములకు గారణంబైనను నలంఘనీయమని ప్రపంచపరిస్థితులు సహస్రముఖములను బోధించుచున్నను నీపరమార్థమును గ్రహింపకుండుట సంతాపకరముగ నున్నది.

మతాభిమానులు, ధనాభిమానులు, సామ్రాజ్యాభిమానులు, కులాభిమానులు, పాండిత్యాభిమానులు, అధికారాభిమానులు మొదలగుస్వాభిమానపరాయణులుధర్మవ్యాజమునను వారి శక్తిసామర్థ్యములను పరమార్థప్రాప్తికిగాకను స్వార్థారాధనమునకు వినియోగించుట ప్రపంచమునందు పరమానర్థములకు మూలమగుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యాభిమానులు, అమెరికాధనాభిమానులు, ఫ్రాన్సు స్వార్థాభిమానులు స్వార్థారాధనపరాఙ్ముఖులై పరార్థాభిముఖులు గావలసిన యవసరమును వారు గ్రహించుట ప్రపంచశాంతికిని, ఆత్మసంరక్షణమునకును పరమసాధనము గాగలదు. మానవధర్మసంరంభమునందు సామ్రాజ్యధనాధికారప్రమత్తములైన గ్రేటుబ్రిటను ఫ్రాన్సు అమెరికా మొదలగు దేశములసంయోగము సంరంభమును భయంకరముచేయగలవిధమును గతించిన ఐరోపా మహాసంగ్రామము విశదముచేసినది. అపారమైన సంపదలు ప్రపంచవ్యాప్తమైన దేశములు స్వప్రయోజనములు పరమానర్థములకు వినియోగపడగల విధమును సంగ్రామానంతరము ప్రపంచ మనుభవించుచున్న దుఃఖవేదన విశదము చేయుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యాంతర్భాగము లందును, ముఖ్యముగాను గ్రేటుబ్రిటనునందును ప్రబలిన నిరుద్యోగనిర్వ్యాపార సమస్యలును, నశాంతియును ప్రపంచమునందు సంపన్నులకును, కార్మికులకును ప్రవర్ధమానంబగుచున్న సంరంభమునకు దృష్టాంతములుగ నున్నవి.

* * * *

ఆంగ్లేయసామ్రాజ్య లక్ష్యము

ఆంగ్లేయులకు సామ్రాజ్యలక్ష్యము స్వప్రయోజనములందువలెను ధర్మప్రయోజనములందు లగ్నము గానివిధమును రాజ్యాంగోదంతము విశదము చేయుచున్నది. రాజ్యాధికారమును లేబరుపక్షము వహించినను, లిబరలుపక్షము వహించినను, కన్సర్వేటివుపక్షము వహించినను వారిలక్ష్యము స్వప్రయోజనమునందువలెను పరార్థమునందు లగ్నము గాదని సైమనుకమిషను వ్యవహారములు విస్పష్టము చేసినవి. రౌండుటేబిల్ వ్యవహారములు స్వార్థపరాయణత్వమునందును, పరపీడనమునందును వివిధపక్షములవారును నేకము గాగల విధమును పరాధీనరాజ్యాంగవ్యవహారములు విస్పష్టముచేయుచున్నవి. ఆవిషయమునే ఇటీవల గ్రేటుబ్రిటనునందేర్పడిన సంయుక్తమంత్రి

వర్గవిధానమును తెల్లముచేయుచున్నది. రామ్సె మాక్డొనాల్డుగారు వారి యౌన్నత్యమునకు కారకులైన స్వపక్షానుచరులను విసర్జించి పరపక్షముతో జేరుటయును, మంత్రిపదవిని స్వీకరించుటయును ఆంగ్లేయరాజ్యాంగమునకు మూలశక్తిని విశదముచేయుచున్నది. మాక్డొనాల్డుగారి ప్రవర్తనము "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనెడి ధర్మమునకు మహావ్యాఖ్యానముగ నున్నది. కార్మికపక్షము చిరకాలము కష్టపరంపరల ననుభవించి గడించిన ప్రతిష్ఠ నంతను మాక్డొనాల్డుగారి ప్రవర్తనము నిరర్థకము చేసినది. ధనరాజ్యాధికారసంరంభమునందు కార్మికపక్షము పడసిన విజయమును పక్షనాయకుడు మాక్డొనాల్డుగారు దేశప్రయోజనముల కైనను నిర్మూలము చేయుట స్వపక్షమునకును, స్వధర్మమునకును విరుద్ధమని యంగీకరింపవలసి యున్నది. ధనరాజ్యాధికారసంరక్షణభారమును నిర్వహింపవలసిన బాధ్యత కన్సర్వేటివుపక్షముమీదను గలదు గాని లేబరుపక్షముమీదను లేదు. లేబరుపక్షనాయకునకు రాజ్యాధికారనిర్వహణము దుస్తరమైనపుడు రాజ్యాధికారము నితరపక్షములవశము చేయుటయును తా నధికారమును విసర్జించుటయును ధర్మము. ఇటులు చేయుటకు బదులు పరపక్షధర్మనిర్వహణమునకు మాక్డొనాల్డుగారు నాయకత్వమును బూనుకొనుట తాత్కాలికప్రయోజనముల కుపయోగ మైనను గ్రేటుబ్రిటనునందును, విదేశములందును తీవ్రసంరంభమునకును, పరివర్తనమునకును సాధనభూత మగుట సహజము. రామ్సె మాక్డొనాల్డుగారు ప్రధానామాత్యుడుగను, ఫిలిపు స్నోడనుగారు కోశాధికారిగను నేర్పడినను, రాజ్యాధికార మంతయును బాల్డువిను పక్షాధీనమైన విధమును నుద్యోగములు, రాజ్యనీతి, కన్సర్వేటివుపక్ష ప్రాబల్యము, కార్మికపక్షప్రతిఘటనము విస్పష్టము చేయుచున్నవి. నూతనమంత్రివర్గమునందు గల 50 ఉద్యోగులందును లేబరుపక్షమువారు 8, లిబరలుపక్షమువారు 11, కన్సర్వేటివుపక్షమువారు 31 ఉద్యోగులు గలరు. ఈ యుద్యోగనిర్ణయములు మాక్డొనాల్డుగారి స్వపక్షవిఘాతమునకును, ప్రతిపక్షప్రాబల్యమునకును నిదర్శనములు. సంయుక్తమంత్రివర్గమునకు ప్రయోజన మార్థికపరిస్థితులం దాదాయవ్యయములను సమర్థించుట యని మాక్డొనాల్డుగారు ప్రకటించిరి. కన్సర్వేటివుపక్షమువారు తాము స్వయముగాను చేయజాలని పనిని లేబరుపక్షనాయకునిద్వారా చేయించుట వారి రాజ్యనీతికి నిదర్శనముగ నున్నది. ప్రపంచమునం దంతటను సాంఘికపరివర్తనము పర్యాప్తంబగుచున్న సమయమునందు గ్రేటుబ్రిటనునందు ధనాధికారమును సంరక్షించుటకు జేసెడు ప్రయత్నములు గ్రేటుబ్రిటనుకును, బ్రిటిషుసామ్రాజ్యమునకును, ప్రపంచమునకును ప్రయోజనకరములు గాజాలవు. సంయుక్తరాజ్యాంగమునలనను విదేశములందు గ్రేటుబ్రిటనుకు అప్పుపుట్టినను స్వదేశమునందు భిన్న

పక్షములందు సంక్షోభము గలుగుటయును, లేబరుపక్షమునం దుద్రేకము ప్రబలుటయును సహజము. బ్రిటిషుప్రభుత్వము భారతరాజ్యాంగముపట్లను సహజముగను చూపెడి నిరసన నిరంకుశభావములు సంయుక్తప్రభుత్వమునందు సర్ సామ్యుయలు హోరుగారి యధికారము క్రిందను స్థిరతరము లగుటయును సహజము. ప్రపంచపరిస్థితులును, గాంధిమహాత్ముని సాన్నిధ్యమును రౌండుటేబిలు సమావేశమును ప్రయోజనకరము చేయుటకు భగవదనుగ్రహము గలుగుగాక!

* * * * *

ప్రపంచము - నవయుగధర్మము

నవయుగలక్ష్యమైన మానవధర్మనిర్వాహణము తీవ్రగతిని ప్రపంచమునం దంతటను వ్యాపించుచున్న విధమును రుష్యా చీనా హిందూస్థాన దేశముల పరిస్థితులు విశదము చేయుచున్నవి. ప్రపంచమునందు గల ప్రజలలో సగము ప్రజ లీ మూడు దేశములందును గలరు. రుష్యాయందు మతరాజకీయార్థికసాంఘికపరివర్తన మతివేగమునను ప్రవర్ధమానం బగుచు, ప్రపంచవ్యాప్తములైన యాచారవ్యవహారములు మానవధర్మవికాసమున కేర్పడిన వనియును, మానవుడు సంస్థల రక్షణ వికాసముల కేర్పడలేదనియును రుజువు చేయుచున్నది. రుష్యాయందు మతగురువులు, భూస్వాములు, ధనస్వాములు, రాజ్యాధికారులు వారిప్రతిష్ఠలను గోల్పోయిరి. ధనధాన్యములు, భూములు, పరిశ్రమలు, రాజ్యాధికారము ప్రజాయత్తము లైనవి. ధర్మనిర్ణయాధికారము మతగురువులనుండి ప్రజలకు సంక్రమించినది. జనులకు దురాశ దుర్లభమైనది. ప్రజలకు దేశమునందును, ధర్మమునందును, సౌఖ్యమునందును, సంపదలందును నవీన లక్ష్యము గలుగుచున్నది. రుష్యాప్రభుత్వము నిర్ణయించిన పంచవర్షవిధానము పరమ ప్రయోజనమును గలుగజేయుచున్నది. సుఖజీవయాత్రకు సాధనభూతములైన వివిధపరిశ్రమలను వికసింపజేయుటకు ప్రజలు వారి శక్త్యుత్సాహములను వినియోగించుచున్నారు. ప్రజలన్నవస్త్రములకును, విద్యావినోదములకును తడవుకొనవలసిన యవసరము లేకను జీవయాత్రను గడపుచున్నారు. శిక్షాస్మృతినుండి మరణదండనమును తీసివేసినను దేశద్రోహులు ఘోరమైన మరణదండనమునకు గురియగుచున్నారు. రుష్యాయందు ప్రవర్ధమానం బగుచున్న సాంఘికపరివర్తనము ప్రపంచమునం దంతటను ప్రజాలక్ష్యము నాకర్షించుచు ప్రజాహృదయమునందు సాంఘికపరివర్తనాంకురములను నాటుచున్నది. ప్రపంచప్రవృత్తియందు విషయోపభోగములందు సంతృప్తి గలుగుట యసంభవమని నిత్యజీవితానుభవము సకలజనులకును విశదము చేయుచున్నది. రుష్యారాజ్యాంగములు సకలజనులకును జాతి, మత, స్థితి, కులాదిభేదములు లేకను సమానావకాశములను గల్పించుటకు జేయుచున్న నిర్ణయములు సమాదరణీయములైనను భిన్నసంస్కారములు గల ప్రజల

యందు సమానావకాశములు, సమానప్రయోజనమును గలుగజేయజాలవు. పాశ్చాత్యవిజ్ఞాన సంస్కారమునకు పరిణామమైన రుష్యా సోవిటు విధానము లోకకల్యాణమునకు సమకూర్చగల పరమప్రయోజనమును కాలము వ్యక్తముచేయవలసియున్నది.

రుష్యా యవలంబించిన పంచవర్షవిధానమును చీనా దేశప్రభుత్వము దశవర్షవిధానముగ నవలంబించుచున్నది. నలువదికోట్ల చీనాప్రజ లపరిమితమైన వస్తునిర్మాణమునకు బూనుకొనునపుడు ప్రపంచమునకు సంప్రాప్తము గాగల యార్థిక సంరంభము దురూహ్యము. రుష్యా చీనా దేశములందు ప్రజలు కర్మేంద్రియసాధ్యములైన పరిశ్రమలందును యంత్రదేవతను ప్రతిష్ఠించినపుడు వర్తమాన సమయమునందు సంక్షోభమునకు మూలమైన నిరుద్యోగసమస్య నూరురెట్లధికముగను ప్రపంచమును బాధించుట సంభవము. నిర్మాణప్రవృత్తియందు వివిధ దేశములు చూపుచున్న అహమహమిక సంక్షోభమునకువలెను శాంతికి సాధనము గాజాలదని లోకానుభవము విశదముచేయుచున్నను సంకుచితమైన స్వార్థపరత్వము నవీనమార్గావలంబనమునకు ప్రతిబంధకముగ నున్నది. ప్రపంచలక్ష్యమును నిర్మాణవిధానమునుండి వినియోగమార్గమునందు లగ్నము చేయవలసిన యవసరమును ప్రపంచావృతమైన దురవస్థ విశదము చేయుచున్నది. వివిధ దేశములందును ముడివస్తువులును, నిర్మాణపదార్థములును కొనువారు లేకను నిలిచియున్నవి. ఈపదార్థములు వినియోగపడగల సాధన మవసరము గాని వినియోగదుర్లభమైన పదార్థముల యపరిమిత నిర్మాణము స్వదేశమునకును, విదేశములకును ప్రయోజనకరము గాదు. ప్రపంచ మభిలషించునది సహకార వినియోగములు గాని ప్రచండ స్పర్ధానిర్మాణములుగావు. రుష్యా చీనా దేశము లవలంబించుచున్న నిర్మాణప్రయోగము మానవధర్మసంస్థాపనకు సంకల్పింపబడినను విషయోపభోగలక్ష్యమైన ఫలముమాత్రము ప్రతికూలముగ నుండుట సహజము. మానవధర్మాభ్యుదయమునకు విషయోపభోగసామర్థ్యము ప్రమాణముగను గ్రహింపబడునపుడు భిన్నమైన ఫలము గలుగుటయును నసంభవము. మతబోధకులు, అర్థశాస్త్రజ్ఞులు, సంఘాభిమానులు, రాజ్యనీతిజ్ఞులు, యంత్రోపకరణ నిర్మాతలు మున్నగు ధర్మాధికారులు వారిలక్ష్యమును బాహ్యసాధనములనుండి అభ్యంతరసాధనములకును, భోగమునుండి త్యాగమునకును, ప్రవృత్తినుండి నివృత్తికిని, సాంఖ్యమునుండి యోగమునకును ప్రవర్తింపజేయుట మానవధర్మాభ్యుదయమునకు సాధనము గాగలదు. గాంధిమహాత్ముడు మానవధర్మాభ్యుదయమునకై స్వదేశమునందు జేయుచున్న బాహ్యాభ్యంతరసాధనములు మానవధర్మ సంస్థాపనమునకు వినియోగపడగల విధమును ప్రాజ్ఞులు పరిగ్రహించుట శ్రేయస్కరము.

* * * *

గాంధిమహాత్ముడు - మానవధర్మము

అఖండమైన ధర్మము దేశకాలపాత్రావరణములందు ఖండరూపములను గోచరంబగుచు భయసంభ్రమములకు గారణం బగుచున్నది. నైమిత్తికములైన స్వధర్మపరధర్మములు నిత్యమైన ధర్మమునకు కళంకము నాపాదించుచున్నవి. సంకుచితము లైన మతధర్మములు, సాంఘికధర్మములు, రాజకీయధర్మములు, ఆర్థికధర్మములు ధర్మాధికార వ్యాజమునను గలుగజేసిన దుఃఖానుభవము ప్రపంచేతిహాసములందు దుఃఖాధ్యాయముగ నున్నది. ధర్మము నిత్యమైనను కాలావరణమునందు సనాతననవీనరూపములను గోచరంబగుచు సంరంభమునకు సాధనం బగుచున్నటులు సాహచర్యమునకు సాధనము గాకున్నది. కాలావరణమునం దనవరతమును నవీనము సనాతనం బగుచున్నను, కాలాభిమానులు ధర్మస్వభావమును విస్మరించుటయును, ధర్మస్వరూపముల సంస్మరించుటయును పరమానర్థములకు మూలమగుచున్నది. ఓ ధర్మదేవతా! నీ పవిత్రనామసంస్మరణమును జేయుచు నెంత యపవిత్రఘోరకార్యములు సంప్రాప్తము లగుచున్నవి! మతాచారవ్యవహారములు ధర్మమూలమైన లోకయాత్రయందు సనాతననవీనధర్మరూపములను గలుగజేయుచున్న సంక్షోభము దారుణముగ నున్నది.

ధర్మాత్ముడైన గాంధిమహాత్మునకు ఖండములైన ధర్మావరణములు దుఃఖదాయకములైనవి. దరిద్రనారాయణులు, నిమ్నజాతులు, పారతంత్ర్యము, పరావలంబనము, నిస్సహాయత్వము దుఃఖోద్వేగమునకు మూలములైనవి. బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతలు ఉపదేశించెడి పరమార్థము మిథ్యారూపమును దాల్చినది. సిద్ధాంతమునందు బ్రహ్మత్వము, వ్యవహారమునందు పశుత్వము జీవయాత్రకు లక్షణము లైనవి. 'తత్త్వమసి, సర్వం ఖల్విదం బ్రహ్మ, శివోఽహమ్' మొదలగు మహావాక్యార్థములు నిత్యజీవనమునందు నిరర్థకములైనవి. దుఃఖమయమైన భారతీయనిత్యజీవనమును సుఖదాయకము చేయుటకు గాంధిమహాత్ము డుపక్రమణము చేసిన నిర్మాణకార్యవిధానము ఫలప్రదమగుచున్నది. మోహగ్రస్తమైన భారతీయహృదయమునందు సంస్మృతి గలిగి ప్రత్యభిజ్ఞాన ముదయించినది. గాంధిమహాత్ము డుపక్రమించిన నిర్మాణకార్యవిధానమునందును, సత్యాగ్రహ ప్రస్థానమునందును భారతీయసంస్కారమును, ప్రత్యభిజ్ఞానమును సువ్యక్తములైనవి. గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానమునందు ప్రాచ్యపాశ్చాత్యసంస్కారములు సమ్మేళనము నొందినవి. సాంఖ్యయోగము, కర్మయోగము సత్యాగ్రహమునందు సమన్వయమును బొందినవి. అఖండమైన ధర్మము నిత్యమైన సత్యాహింసా ధర్మములందు గోచరంబగుచు ధర్మసంస్థాపనమునకు సాధనంబుగ నున్నది. గాంధిమహాత్ముని దండిప్రస్థానము సత్యాగ్రహప్రతిభను లోకమునకు సువ్యక్తము చేసి

నది. మారణసాధనములు, లాఠిప్రయోగములు, నిర్బంధశాసనములు, దౌర్జన్యములు సత్యాగ్రహమును భేదింపజాలని విధమును సత్యాగ్రహావిజయము విస్పష్టము చేసినది. భారతీయవిజ్ఞానసంస్కారములు సత్యాగ్రహప్రస్థానమునకు దగియున్న విధమును గత సంవత్సరమునందు సంప్రాప్తమైన శాంతిసమరవిజయము విశదముచేయుచున్నది. సత్యాగ్రహసమరమునకు నాయకుడైన గాంధిమహాత్ముడు కాంగ్రెసుపక్షమునను పూర్ణస్వరాజ్యసంపాదనమునకు రాయబారమును నడుపుటకు సకలవిధములను దగియున్న విధమును మహాత్ముని సత్యప్రవర్తనము చాటుచున్నది.

గాంధిమహాత్ముని లండనుయాత్ర ప్రపంచేతిహాసములందు దివ్యేతిహాసముగ నుండగలదు. నిరంకుశాధికారులు కల్పించిన విఘ్నపరంపరల నతిక్రమించుటయందే గాంధిమహాత్ముని మాహాత్మ్యము సువ్యక్తమగుచున్నది. నిరంకుశాధికారదేవతలు దేశమునందంతటను గాంధి-ఇర్విను ఒడంబడికకు గలుగజేయుచున్న ప్రతిఘటనములు కోపోద్రేకములకు గారణంబులైనను గాంధిమహాత్ముడు చూపిన సహన మద్భుతముగ నున్నది. నిరంకుశాధికారవర్గమునకు హృదయపరివర్తనము గలుగలేదని దేశవ్యవహారములు విస్పష్టము చేయుచున్నను గాంధిమహాత్ముడు స్వధర్మనిర్వహణమునకు బూనుకొనుట శ్రేయస్కరముగ నున్నది. ధర్మాత్ములు విఘ్నపరంపరలు సంప్రాప్తమైనను ప్రారంభములను పరిత్యజింపని విధమును మహాత్ముని ప్రవర్తనము విశదము చేయుచున్నది. బ్రిటీషురాజ్యాంగపరిస్థితులం దాశాకాంతులు గనుపడకపోయినను స్వధర్మనిర్వహణమును జేయుటకు గాంధిమహాత్ముడుపూనిన ధర్మసంకల్ప మాశాజనకముగ నున్నది. గాంధిమహాత్మునిసరళస్వభావము, సాధుప్రవృత్తి, సత్యసంధత్వము, త్యాగశీలము భారతీయప్రాతినిధ్యమున కనిర్వచనీయమైన యధికారమును గలుగజేయుచున్నవి. గాంధిమహాత్ముని సంకల్పమును వారి ధర్మసందేశము విశదము చేయుచున్నవి.

“విదేశీయుల సంరక్షకత్వమునుండియును, దాస్యమునుండియును, భారతదేశమును తప్పింపగల రాజ్యాంగవిధానమును బడయుటకు నేను సర్వశక్తులను వినియోగించెదను: (1) అవసరమైనచో పొరపాటులను చేయుటకుగూడ నా దేశమునకు స్వాతంత్ర్యము చేకూరవలెను. (2) భారతదేశపరిపాలనమున నిరుపేదలకుగూడ స్థాన ముండవలెను. పాలకసంఘమున వారిమాట చెల్లుబడి కావలెను. ఇది నాదేశ మను భావము మనఃపూర్వకముగా ప్రతిభారతీయునకును కలుగవలెను. (3) అగ్రవర్ణము అంత్యవర్ణము అను భేద మెంతమాత్రము నుండగూడదు. (4) అన్ని మతములవారును సంఘములవారును సమరససోదరభావములతో కలసి మెలసి యుండవలెను. (5) అస్పృశ్యతకును, మద్యపానమునకును అవకాశ మెంతమాత్రము నుండగూడదు. (6) పురుషులకు గల హక్కు లన్నియును స్త్రీలకుగూడ నుండవలెను. (7) ఇతరదేశములవా రందరితోను భారతీయులు మైత్రి గలిగియుందురు. ఇతరదేశములవారి ధనమును భారతీయు లపేక్షింపరు. భారతదేశమందలి ధనమును ఇతరదేశములవా రపహరించుటకు భారతీయు లవకాశము నియ్యరు. కాన భారతదేశమున సైన్యము ఎంత తక్కువగా నుండుట కవకాశము కలదో అంత తక్కువగానే యుండవలెను. (8) అక్షరజ్ఞానశూన్య

లను కోట్లకొలది సామాన్యప్రజలకు ఇతరసంఘముల వలన నష్టము కలుగునెడల తప్ప అన్ని సంఘములును విదేశీయములైనను, స్వదేశీయములైనను అత్యధికముగా గౌరవింపబడవలెను. (9) విదేశీయులు స్వదేశీయులు అను భేద మెంతమాత్రము నుండగూడదు.

నేను కలలలో చూచుచున్న భావిభారతదేశ స్వరాజ్యస్వరూప మిదియే. దీనికొరకే నేను రౌండు టేబిలుసభలో సకలశక్తులను వినియోగించెదను. నా ప్రయత్నము విఫలము కావచ్చును గాని నేను నా సిద్ధాంతములను తప్పకుండవలెననియును కాంగ్రెసువారి విశ్వాసమునకు ద్రోహుడను కావలెననియును కోరునెడల యింతకంటె తక్కువచేయుటకుదానితో నెంతమాత్రమును సంతృప్తి నొందజాలను."

గాంధిమహాత్ముని సందేశము భారతీయ స్వరాజ్యసందేశముగను నిర్దేశింపబడినను వారి సందేశము విశ్వజనీనమైన ధర్మసందేశము, శాంతిసందేశము, సత్యసందేశము, అహింసా సందేశము, ఆధ్యాత్మికసందేశము. భాగ్యభోగారాధనము, ఆయుధధారణము, పరాక్రమణము, స్వాభిమానము, బాహ్యాడంబరము, యంత్రారాధనము, చాణక్యనీతి లక్ష్యములైన పాశ్చాత్యప్రపంచమునకు దిగంబరుని ధర్మసందేశమునందు, శాంతిసందేశమునందు, కింగ్సులి మందిర నివాసమునందు సత్యసందేశమునందు విశ్వాసము గలుగుట దుర్లభము. బ్రిటిషు రాజ్యనీతిజ్ఞులును, పాశ్చాత్యపండితులును దుఃఖవేదన ననుభవించుచున్న ప్రపంచమునందు సుఖశాంతులనుస్థాపించుటకు గాంధిమహాత్ముని సత్యాగ్రహసందేశమునందలి పరమార్థమును గ్రహించి శాంతిస్థాపనమును జేయుదురుగాత!

భారతీయసౌభాగ్యమున కాత్మార్పణము చేయుచున్న గాంధిమహాత్ముని సందేశమును పాలించి భారతీయులు కామితార్థములను బడయుదురుగాత!

"నేను భారతదేశమునకు దినదినము దూరముగా పోవుచున్నాను గాన నేను భారతీయులకీ విజ్ఞప్తిని పంపగోరెదను.

నేను విదేశములలో నున్నప్పుడు దేశీయులందరు అహింసావిధానమునే సమగ్రముగా ననుసరించుచుండ గోరెదను. అస్పృశ్యతను నిర్మూలించుట, మద్యపానమును రూపుమాపుట, విదేశవస్త్రములను బహిష్కరించుట, నిషావస్తువులను (డ్రగ్సు) పరిత్యజించుట యీ నాలుగువిధము లగు నిర్మాణవిధానమును దేశీయులందరును కొనసాగింపవలెను. ప్రజలలో నైకమత్యము కలిగింపవలెను. గ్రామములలో గృహపరిశ్రమలను ముఖ్యముగా నూలువడుకుటను వృద్ధినొందింపవలెను. క్రమముగా అధికారము తమచేతులలోనుండి భారతీయుల చేతులలోనికి పోవుట నిశ్చయము అని ఆంగ్లేయులు ప్రభుత్వోద్యోగులును యితరులునుగూడ గ్రహించియున్నచో వారు కాంగ్రెసువారియందును కాంగ్రెసునందును విశ్వాస ముంచవలె నని నేను కోరెదను."

గాంధిమహాత్ముని సందేశమునందలి పరమార్థమును పాలించుటకు నిరంకుశాధికారులును, ప్రజలును పనిబూని శాంతిని రక్షించి కామితార్థములను బడయుటకు భగవంతు డనుగ్రహించుగాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra PatrikaPress, No.7, Thambu Chetty St., Madras,